1931 APRIL





# సచిత్ర మాసప...

ప్రతి చాంద్ర మా...

609

ప్రతి సంచికయు ...

చందా సం॥ర-కి ... -0

మా... ...-0.

స్టాంపులను పంపిన నే ... బడును, ఉచితముగ పంపబడదు.

మాదిరిపత్రిక తెప్పించుకొన్నతర్వాత చందాదార్లుగ చేరువారు ఆసొమ్మును మినహాయించుకొని తక్కిన సొమ్ము మాత్రము పంపవచ్చును.

ప్రకటన ధరలు:—

ఒకనెలకు మాత్రము సాధారణ పుట 1-కి రూ 30-0-0

సాధారణపుట $\frac{1}{2}$ కి రూ. 15-0-0; సాధారణపుట $\frac{1}{4}$ కి రూ. 8-0 0

6 నెలలకు అంతకుపైన సాధారణపుట 1-కి నెలకు 1-కి రూ. 25-0-0

నెలకు $\frac{1}{2}$-కి, రూ. 12-0-0; నెలకు $\frac{1}{4}$-కి, రూ. 7-0-0

మేనేజరు, "భారతి"

తపాలపెట్టె నెంబరు 212, మదరాసు.

---

## చిత్రములు



---

# భారతి

సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు
కా. నాగేశ్వరరావు

సంపుటము ౮. సంచిక ౯.

ఆంధ్రపత్రికా ముద్రాలయము — మద్రాసు.

౧౯౩౧

# ప్రజాపతి సంవత్సరము

పి. చిదంబరశాస్త్రిగారు శతావధాని

ఇల గలయంతకాలమును నింపెసలారెడి దేశశాంతి నీ
వలన ఘటిల్లుఁగాక జనవల్లభులెల్లరుగూడ నీ కళా
కలనముచేత మానసవికాసము గాంతురుగాక నీవు మా
గళములు [illegible] విప్పుదుగాక ప్రజాపతివర్ష రాజమా!

ధనముగలట్టివారలకు ద్రవ్యమదాంధత రూపుమాపి ని
ర్ధనులకుఁ బాపకార్య పరతంత్రత వాటిలకుండఁ జేసి నీ
కెన యగు వత్సరంబు మును నెన్నఁడు లేదను సుప్రసిద్ధి గై
కొనుటకుముందె మా నతులు గొమ్ము ప్రజాపతివర్ష రాజమా!

నీవు గలంతకాలమును నిచ్చలు భారతదేశమెల్ల వి
ద్యావిభవంబుతోడ ధన ధాన్య సమృద్ధులతోడ నెందునుల్
లీవి వహించునట్లు గమనించుచు నేలుకొనంగదమ్మ ధా
త్రీవలయంబుఁ బ్రాకృతిభంగితిఁ బ్రజాపతివర్ష రాజమా!

ధర్మము కూలిపోయె భరతక్షితి సత్త్వము మాసిపోయె స
త్కర్మములెల్ల నొక్కపరి దగ్ధములాయె దురాగతంబులై
నర్మిలి హెచ్చె నీ యభినవాబ్దమునం దను నింద లేక నీ
వార్మి వహించి యేలుకొను ముర్వి ప్రజాపతివర్ష రాజమా!

ధనమునకంటె ధర్మము ప్రధానముగాఁగొని పుణ్యభూమియం
చనెడు ప్రసిద్ధి గన్న భరతావని నేలు సదృష్టరేఖ నీ
కొనరెను గాన నీ పనికి యోగ్యములైన గుణంబు లన్నియుక్
ఘనముగ నీకుఁ జేకుఱెడుఁగాక ప్రజాపతివర్ష రాజమా!

అంతరమందునుండు మద మాఁగని వేగిరపాటుకాని నీ
చెంతలఁజేరి యజ్ఞులకుఁ జెప్పెడిచోప్వనఁ జెప్ప నేల నీ
వింతకుఁబూర్వమం దెఱుఁగవే భరతావని నేలు మార్గముల్
స్వాంతమునం దలంపు మొకసారి ప్రజాపతివర్ష రాజమా!

---

# ఉగాది నవరత్న హారము

వెదురుమూడి వెంకటకృష్ణరావుగారు, బి. ఏ.

శ్రీ లీలా మృదు మందహాసవిలసత్ప్రేమామృతాంశుప్రభా
జాలాంచద్వదనా! అజేయ! సకలస్వాతంత్ర్యభాగ్యాధిపా!
కాలాత్మా! శ్రిత దీన జీవచయ రక్షాదక్ష! నారాయణా!
చాలున్ భూ ప్రసవార్తి! కావు మిఁక నీ సత్య ప్రజోత్పత్తిచే!

శ్రీపతివంట! ఏవైపుఁ జూచెదమన్న శుష్కదారిద్ర్య సంక్షోభమేమి?
జ్ఞానకాంతివంట! ఏకోనకేఁగ, మదమోహ మయయౌ నజ్ఞానతిమిరమేమి?
ఆనందనిధివంట! ఏనేఁ గాంచిన దీన జీవన దుఃఖ దృశ్యమేమి?
అమృతత్వసుఖివంట! అరసియే దెసఁజూడ ఘోర మారణ రుజా ఘోషణమేమి?
సత్యమూర్తివంట! ఎటను మోసం బిదేమి?-శాంతమూర్తివంట! ఎటను సమరమేమి?
పల్కు లింకేల, భువిని భవత్ప్రభుతయె-నందియుంబయ్యె! లోకైకచక్రవర్తి!

నిట్టూర్పు కాదు! క్షోణీసాధ్వి నాసలఁ గ్రాలు నగ్నిగిరుల గాడ్పుగాని!
తనుకంప మదికాదు! ఘన శైలకుచభేదకంబగు భూకంప కలనగాని!
దీనారవముకాదు! నేనోళ్ల నీ కుర్వి బంపెడు నాహారవంబుగాని!
నీరు కాదది! మేదినీకాంత కనులంటగారెడు హృద్రక్తధారగాని!
ధృతిగతులుదప్పి క్షితి యిట్టి నెతనుఁ గుంద-తగదు! తగదోయి! నీయట్టి ధర్మపతికి
సతినిఁ జూచి చూడనటుల్ మసలుచునుంట,-రక్షితాపన్న! సత్యపరాక్రమధన!

స్వీయరాజ్యసతీ ప్రజాశ్రేణి విడిచి,-స్వసుఖలోలురౌ నేటి లుబ్ధ ప్రభువుల
సాటివాఁడవేనంట! తండ్రి! సైపఁజాల-జనులు నిన్నాడు దూఱుల! చాలుఁ జాలు!

లెమ్ము! లెమ్ము! వేగమ మా మనమ్ములెల్ల-సంస్కరించి, ప్రజోత్పత్తి జగతిపైని
స్వర్భువనయోగ్య శాంతిరాజ్యంబు నిలుపు-సరణిఁ జూడుమన్నా! దీనజన శరణ్య!

కొండలెత్తుటకాదు! కోదండమూని-చండవైరులఁ జెండాడ భండనముల
జేయుమనలేదు! రవ్వంత చెల్మియుంచి,-జన్మజనని, మమ్ము తలచితె చాలునయ్య!

శిలలకైన చైతన్యంపుఁ జెలువ మిచ్చి,-కుబ్జలనయిన మోహనాంగులుగఁ దీర్చి,
మర్త్యు లమరులై పొల్పొంద మార్పజాలు-నేర్పరీ! మా మతుల దిద్ద నీ కదెంత!

దేవతలకుఁ బంచాగముల్ దెలుప నెవడు-వీడటంచు నన్ గిన్కతోఁ జూడవలదు;
తండ్రి యపయశం బోపని తనయుఁడ నయి-లోకవాదులఁ జెప్పితి నీకు దేవ!

నీదు చేదోడు విడి నిల్వనేరనుసుమ!-మాటలా? వచ్చి రానివి! మేటికరుణ
నీ యుగాదివాంఛను దయసేయుమన్న! ప్రేమశక్తిప్రపూర్ణ! శ్రీరామ కృష్ణ!




చెన్నపట్టణము, ఏప్రిల్ ౧౯౩౧

సంపుటము ౮ ప్రజోత్పత్తి సంవత్సరము చైత్రమాసము సంఖ్య ౪


## శ్రీసూక్తిసుధానిధి


వేంకట పార్వతీశ్వరకవులు


(శ్రుతి వీథి)

ఆవేగతరంగము

౧

వీనులవిందుగా విన్పింపలేదఁటే సరసమోహన పాంచజన్యరవళి?
కన్నులు చల్లగాఁ గాన్పింపలేదఁటే జయవైభవానంతచక్రదీప్తి?
కాయ ముప్పొంగఁగాఁ గదయంగలేదఁటే కమనీయ ఖగరాజ గమనలీల?
ఎదఁ బుల్కరింపఁగా నెలమింపలేదఁటే సుందరవదనారవిందశోభ?
నిగమనిత్యోత్సవానంద నినద మదిగో!-నా మనసుగొన్న నా ప్రాణనాథుఁ డున్న
దివ్యతిరుపేర కిఁకఁ బోక తీరదమ్మ !-ఆఁగవలదమ్మ ! యింక న న్నమ్మలార !

౨

అలికచలార! సారెకిటు లాడెద రూఱట లేక నా వెతల్
దెలియక గాక; కమ్మవిరిదేనియసోనలఁ బూవుఁగోనలన్
జెలఁగు తిరుప్పురిం గొలువు సేసిన శ్రీశుని కావి మోవితే
నెల చవిఁ జొక్కి క్రమ్మఱదు నెమ్మది యెమ్మెయి; నేమి సేయుదున్?

౩

శ్రీవత్సకాంతులఁ జిక్కి రాకున్నదో? సురభిళవనమాలఁ జూచి రాదో?
దర సుదర్శనలీలఁ దవిలి రాకున్నదో? కర్ణకుండలశోభఁ గాంచి రాదో?
అధరబింబామృతం బాని రాకున్నదో? వనజాయతాక్షుల వదలి రాదో?
వదనేందుచంద్రికల్ వలచి రాకున్నదో? మాణిక్యమకుటంబు మరగి రాదో?
శ్రీపతికిఁ జిక్కి నామది సిగ్గు దక్కి-మరలి రాకున్న దివి యేటిమాటలమ్మ!
దివ్యతిరుపేర కేఁగఁ బోక తీరదమ్మ!-ఆఁగవలదమ్మ! యింక నన్నమ్మలార!

౪

నా చెల్వంబు హరించి చన్న హరి వెన్నాడించి సామోక్తులన్
యాచింపం జని నా మనం బతనిపాదాబ్జంబులం జిక్కి యం
దే చైతన్యము దక్కి సొక్కె; నిఁక మీ రేమన్న నేమైన నే
నా చిత్తాబ్జవిహారి వీడఁ; జెలులారా! నన్నుఁ బోనీయరే!

౫

శకటముఁ దన్ని, పూతనను జంపి, వృషంబును గూల్చి, మద్దులం
బెకలిచి వచ్చి నేఁడు తిరుపేర వసించినయట్టి స్వామి నే
వకు మరు లొంది కుంది గరువమ్మును శీలముఁ జంపుకొన్న నా
కిఁకఁ బరచింత లేల? భయ మేల? ప్రబోధము లేల? నెచ్చెలీ!

౬

ముందట నిల్చియున్ జలదమోహనగాత్రుఁడు పక్కనుండెఁ; నా
కందక యుండెఁ; నాసలు మహాంబుధులై నను ముంచుచుండె నో
యిందునిభాస్యలార! బ్రదు కేర్పడఁ దేర్పఁదలంతురేని గో
విందుఁడు గొల్వు సేయు తిరుపేరకుఁ బోవఁగఁ ద్రోవఁ జూపరే!

౭

నెచ్చెలులార! ప్రాణవిభునిం గన నామన సేఁగి క్రమ్మఱన్
వచ్చుటకాడ లేదు; వలువంకలఁ జూచుచు యున్నె; నిచ్చమై
వచ్చునొ? రాదొ? తెల్పఁగలవారిని, బిల్చెడివారి నైన నే
నెచ్చటఁ గాన; నచ్చటికి బోఁగడిదానఁ; బనేమి నా కిటన్?

౮

అన్నవలార! నేను బరమాత్మునిపేర రచించియున్న నా
చిన్నికృతుల్ పఠించి నను శ్రీహరి ప్రేయసిఁగాఁ దలంచి మీ
రన్నది యాదిగా మనసునం దొక యాన జనించి వృద్ధియై
మిన్నను, మన్ను, సాంద్రముల మేరలు మీఱె నిఁకేమి సేయుదున్?

౯

పంతము కాక నా పడెడుపాటులు బోటులు మీ రెఱుంగరే!
స్వాంతము నన్నుఁ బాసి చనినప్పుడు తాలిమి దూలి యున్న నా
చెంతల మూఁగి యే దిటవు చెప్పఁగఁ జూచెద రమ్మ? యింక నా
చింతలు దీఱ, శ్రీహరిని జేరఁ దిరుప్పరి కేఁగనీయరే!

౧౦

తిరుపురదివ్యమందిరు యుధిష్ఠిరవైభవసుప్రతిష్ఠు సు
స్థిరు జగదేకరక్షకు విచిత్రచరిత్రుఁ బయోదగాత్రు సుం
దరదరచక్రహస్తు సుమనఃప్రభు మద్విభుఁ బట్టి తేఱఁగాఁ
బురవనసీమలం గలసి పోయెదఁ; బోయిన సిగ్గిఁ కేటికిన్?

## చింతామణి సూచన

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

'సంస్కారార్థో నియమః'

ఆను సూత్రముతో గొప్ప భాషా సంప్రదాయ రహస్యమును నన్నయ సూచించినాఁడు. ప్రజకు వాడుకబాసలో గ్రామ్యములును, గ్రాంథికములు నగు పదములు వచ్చియుండును. వారు తిరమైన గ్రాంథికభాషా సృష్టి సేయునప్పుడు గ్రామ్యములను జేరనీయక గ్రాన్థికపదములనే వాడినచోఁ బ్రాయిక నిత్యప్రయోగరూపమైనట్టియు, సంకేతిత సుప్రసిద్ధ పదభూయిష్ఠమైనట్టియు, రసాత్మక వాగ్రూపమైనట్టియు, విశ్వశ్రేయస్సాధనమైన గ్రాంథిక భాష నిర్దోషమై పరిశుద్ధి వహించియుండు నని శబ్దానుశాసనాదుల యానాఁటి యాశయము. ఇట్టి నియమమును జేయునది వ్యాకరణమే. వ్యాకరణము రానివాఁడు తనకు సాజముగఁ బుట్టినప్పటినుండియు వచ్చిన బాసలో నిది హేయమనియు, నిది యుపాదేయమనియు వేఱు పఱచుకోలేఁడు కదా.

కాని వస్తాడు, తెస్తాడు మున్నగునవి చేరినఁ బాత్తముల కపరిశుద్ధి యెట్లు వచ్చునో మనము ప్రత్యక్షముగఁ జూడఁజాలకున్నాము.

ఇయ్యెడ దండి మొదలగు ప్రాచీనాలంకారికులచేతను, నన్నయగారిచేతను వాడఁబడిన గ్రామ్యశబ్దము మనకుఁ గొంతవఱకుఁ బనికి వచ్చుచున్నది.

'నిష్ఠ్యూతోద్గీర్ణవాంతాది
గౌణవృత్తి వ్యపాశ్రయమ్,
అతిసుందర మన్యత్ర
గ్రామ్యకక్ష్యాం విగాహతే.'
అని దండి వ్రాసె.

ఇచ్చట గ్రామ్యపద మనబడుదానియందు జుగుప్సితాది శబ్దములవలెఁ బ్రవర్తించెడివి.

'కామం సర్వోప్యలంకారో
రస మర్థే నిషించతి,
తథా ప్యగ్రామ్యతై వైనం
భారం వహతి భూయసా.'

ఇచ్చటను జుగుప్సితార్థముగనే గ్రామ్యపదము వాడఁబడినది. పైపెచ్చు దీనిని రసస్ఫూర్తి ప్రతిబంధమనియు దండి వక్కాణించెను.

ఇది యెల్ల రూఢ్యర్థమే కాని యోగబలమున నింతయర్థము రానేరదు. యౌగికార్థమీపదమునకు గ్రామములోని దని. నిరూఢ లక్షణచే వచ్చెడియర్థము ప్రసిద్ధమై శక్యార్థమును జంపివేసినది. కుశలదంతురాది శబ్దములిట్టివే. దీనివలనఁ జరిత్రము మాత్రము కొంత తెలుచున్నది. గ్రామములోనివారు పౌరుల కన్నఁ దీసిపోయియుందురు. కాన జానపదులు మాటాడు మోటబాసను నాగరికులేవగించుకొనుచువచ్చి యుందురు. గ్రామీణులు కూడ

తెలుఁగు బలిసినకొలఁది, తెలివి మించినకొలఁది తాముకూడ నాగరిక వేషభాషలను గైకొను చుండ్రు. కాని స్వీయగ్రామ్యతానైచ్య నిరాకరణముకై పాటుపడరు. 'గతానుగతికో లోకో' యనునట్లు పోవుచుండు లోకయాత్రా ప్రవాహమున కెదురీదఁ గలవాఁడు లక్షకొక్కఁడు గదా. అట్లు నాగరిక వేషభాషానుకరణ పరాయణు లగువారికి రాజునుగన్న కన్నుల మగనిఁ జూచిన మొట్టబుద్ధి యైన దన్నట్లు, బీదసాదల మోటబాస రుచించునా? అట్లు క్రమముగఁ దక్కువవారు మాటాడు బాస గ్రామ్యమై జుగుప్సితమగుటచే గౌణమర్యాదచే జుగుప్సితము లైన వెల్ల గ్రామ్యములని వ్యవహరింపఁబడుచు వచ్చినవి. దండి గ్రామ్యములని చెప్పినవి కొన్ని ఉమ్మి, కక్కు మొదలైనవి స్వరూపముచేత నే యసహ్యించుకోఁదగినవి. కొన్ని పల్లెటూళ్లలో నాగరిక మెఱుఁగని వారిమాటలు కనుక హీనులు మాటాడిన వస్తాను, పోతాను ప్రభృతి పదంబులు గ్రామ్యము లగుచు హేయము లైనవి. ఇంగిలీషు ప్రభుభాష కానఁగదా రాని వారుకూడ దానిని గొప్పకై మాటాడఁబోదురు. దొరలపంట్లములను హిందువు లేల వేసికొందురు? వారు పింజగోచుల నేల పెట్టరు? కాన వేషభాషల గొప్ప ధర్తలను, వ్యవహర్తలను బట్టియే వచ్చును. తద్భవములెల్ల నట్టివారి నోటఁ బుట్టి పాత్రములఁ గై సేయుచున్న వే.

'సోఽర్థ స్తద్వ్యక్తి సామర్థ్య యోగీ శబ్దశ్చకశ్చన' యని యానందవర్ధనాచార్యులు సెల విచ్చినవిధమున రసభావోద్రేకవ్యంజకమ్ములైన కతమున వీడరానివిగ మహాకవికటాక్ష భాజనములై కొన్ని పదాలు వానిభాగ్యవశమున గ్రంథమున కలంకారము లైనవి. అట్టి యదృష్టము లేని కొన్నిపదాలు పుట్టినవి పుట్టినట్లే నిలిచిపోయినవి. ఇప్పు డా మాటలు వస్తాడు మున్నగునవి శిష్టాగ్రేసరుల నోళ్లఁ మఱివేళల సైతము నాట్యమాడు చున్నను, మొదట వచ్చిన గ్రామ్య మను వెంగిలి పేరు* బ్రాహ్మణశ్రమణ కన్యాయమున వానిని వదలక వేధించుకొని తినుచున్నది.

ఇట్లు గ్రామ్యభాష యొక్క హేయత చాలవఱకు వ్యవహర్తలతక్కువదనముచేత నే వచ్చినదని యూహింపవచ్చును.

అట్టి గ్రామ్యభాష నుపయోగించిన సారస్యము చెడుననుటయు యుక్తివిరుద్ధము కాదు.

'శబ్దేపి గ్రామ్యతాఽస్త్యేవ
సా సభ్యేతర కీర్తనాత్,
యథాయకారాదిపదం
రత్యుత్సవ నిరూపణే.'

అని దండి.

గ్రామ్యపుమాటలు వినుటతోడనే అనుకార్యులు, నీచవేషభాషలు కలవారు మనమనసునకుఁ బొడకట్టుదురు. గుణాలంకారాదిచమత్కార విశిష్టపద ప్రతిపాద్యములయి రమణీ

* బ్రాహ్మణుఁడు బౌద్ధులలోఁ గలసినను బ్రాహ్మణశ్రమణకుఁ డనిడివారట. ఇప్పుడు బ్రాహ్మణులం దెవరైనవారు క్రైస్తవు లయినను వెనుకటి కులములతో వాడఁబడుచుందు రందురు.

యములగు ద్రవ్యగుణక్రియల భావనచే సిద్ధింప వలసినదని యభినవగుప్తపాదాచార్య ప్రభృతులచేఁ జాటఁబడుచుండు రస మసహ్యించుకొనఁబడుచుండెడి యనుకార్యుల భావనచే నెట్టు సహృదయుల సిద్ధించును? నీచజాతులవారికి మాత్రము భావములు, రాగాదులు లేవా? అవి పావనములు కావా? అందురు. భావము తెచ్చటఁ గల్గినను బవిత్రములే కాని బూతులు తిట్టుకొనునప్పుడు కూడ నాయికా నాయకులును, శృంగారచేష్టలును దోఁచుచుండును. అంతమాత్రమున నచ్చట రసము సిద్ధించు ననుట గలదా?

కేవల విభావాదులే కాక విభావాదులను దెల్పెడు పదములును జుగుప్సావహములు కాక గుణాలంకారరీతులచే రమణీయములును, సముచితములును గావలెను. ప్రసంగములు మోటుగ నుండఁగూడదు. ద్రవ్యగుణక్రియలును మనోజ్ఞములు కావలెను. అట్టి కావ్యముల వలననే రసములు నిష్పన్నము లగునని రసవేత్తల సిద్ధాంతము. చూడుఁడు:

'కన్యే కామయ మానం మాం
న త్వం కామయసే కథం.'

ఈశ్లోకమున నర్థము గ్రామ్యము కాన రసము గల్గదని చెప్పి,

'కామం కందర్పచండాలో
మయి వామాక్షి! నిర్దయః,
త్వయి నిర్మత్సరో దిష్ట్యా...'

అను శ్లోకమును రసవదలంకారమున కుదాహరణము చేయఁబడెను. మొదటిశ్లోకమున విభావాదులు లేవనియు, రెండవశ్లోకమునఁ గలవనియుఁ జెప్పవలనుపడదుకదా. ఇఁక భేదమేమి? అందర్థము చేటలోవెలఁగకాయలవలెఁ గన్పట్టి మోటదై రసస్ఫూర్తిని జెడఁగొట్టినది. రెండవ పద్యము నాతిగూఢమై ధ్వనిమూలమునఁ గన్పట్టుచు హృద్యమై రసమును బోషించినది. కావున, గ్రామ్యములై యసహ్యించుకొనఁ దగినమాటలు, నర్థములును రసప్రతిబంధకములని యొప్పుకోవలెను. కాని యొకమాట మిగిలియున్నది. ఎప్పుడో అసహ్యించుకోఁదగినవై వ్యవహర్తలనుబట్టియో, వాని యభాగ్యమునుబట్టియో ఉండును గాక. ఇప్పుడు పెద్దల వాడుకలోనికి రాఁ నోచుకొనియు వస్తాదు ప్రభృతుల కేల హేయత? అని.

దానికి వేరుసమాధానము తోఁపదు గాని యొకప్పుడు హేయములని వదలఁబడి చిరకాలమునుండి కవులయాదరమునకుఁ బాత్రములు గాని కతమున నవి నీచపాత్ర సాహచర్య నియమము గలిగి జుగుప్సాచిహ్నములుగఁ దోఁచి నీచాతినీచవ్యక్తులనే మన కన్నులఁ గట్టినట్లు చూపును. దాన రసభంగ మందురు. వాచ్యవాచకములయం దమావశ్యకము కానిచో అభినవకవితలలోఁగూడ పండువెన్నెలలను, ఇసుకతిన్నెలను, తీగలను, కోయిలలను, చిల్కలను, చివుళ్లను ఏల వర్ణింతురు? పెద్దనాదులు "తావుల్ క్రేవల"; "తనశృంగార"; ఇత్యాది పద్యముల నిట్టేల రమణీయ వస్తుసృష్టి నొనర్చిరి! నాగజెముళ్లు, పెంపుడుకలతుట్టెలు, పేడకుప్పలు, గుడ్డపీలికలు, చీపురుకట్టలు, శ్మశానములు, పాశ

దొడ్లు మున్నగువానిని బద్యములలో వర్ణించి తమ గ్రంథములకు వన్నె తెచ్చుకోరాదా? అందఱకును రమణీయవస్తుసామగ్రియే సారస్య నిదానము. చూడుఁడు: 'రమణీయార్థప్రతిపాదక శ్శబ్దః కావ్యః' అని పండితరాయ లనెను.

రమణీయవస్తు జాతము స్వతస్సిద్ధముగఁ గథలో లేనపుడు కొందఱు కవులు ప్రౌఢోక్తులతో నతిశయోక్తిమూలమున నౌపచారికమర్యాద ననుసరించి శబ్దమాత్రవేద్య వస్తువుల నందముగ సృష్టించుకొని వర్ణించి తాము తనిసి పాఠకులం దనుపుదురు. ఈ మార్గమున భవభూతి, మురారి ప్రభృతులు మార్గదర్శకులు. వారినుడికారములఁద్రావి యానందాకాశమున విహరించు వాగ్విదులుం బెక్కురు గలరు.

రససిద్ధి రసికునిబట్టి యుండును. గ్రామ్యభాష యెవ రసహ్యించుకొనరో యెవ రట్టి మాటల వాడుకతో నుందురో వారి కాగ్రామ్యభాష కబ్బములచే రసము గల్గుటకుఁ బ్రతిబంధకము లేదు ఫ్యాక్టరీ కూలీలు, పడవల వాండ్రును, బండ్లు నెట్టువారును బూతుమాటల కీర్తనలను ఒడుపుగాఁ బాడుకొనుచు నానందాంబుధిమగ్నులై మేనులు మరచి తమ శ్రమ నెఱుఁగని స్థితిలో నుండి యెంతెంత లేసి భారపు పనులనేని జేయుదురు. వారికి రసానుభూతి లేనిచో శ్రమ తత్కాలమున వారి కేల కనబడదు?

ఆమాటలు పౌరులకును, గ్రామముల లోని పెద్దమనుష్యులకును అసహ్యించుకోఁ బడునవిగ నుండు. అట్లు లేవగించుకొనుచున్న వారి డెందములకు నిర్మల రసానుభవ మెట్లు కలుగు? ఏ రేమాటల నసహ్యించుకొనరో అట్టి బాసతో వీరికి రసము సిద్ధించు.

ఇంతకన్న గొప్పనాగరికులు ప్రభువులు మున్నగువారికి సామాన్యపౌరుల వేషములును జుగుప్సావహములే. కావుననే మన కవులు ప్రౌఢోక్తులనైన నెల్లవారికి నచ్చు గొప్పపాత్ర లనే విభావాదులుగా సృజించి రాజాధిరాజులకును రసానుభవము కల్గునట్లు కబ్బముల నల్లిరి. అట్టిశైలి నిప్పటివారు నాయికానాయకులు గొప్పయింట్లవారే కావలెనా? పల్లెల పిల్లలు పనికిరారా? అని యీసడించుచున్నారు. అనుకార్యులు పెద్దతరగతివారైన చిన్నతరగతివారి రసోదయమునకు భంగ ముండదు. అనుకార్యులు చిన్నతరగతివారైనఁ బెద్దతరగతివారికి రసానుభవము దుర్లభము కావచ్చు. ఏలయన అనుకార్యుల వేషభాషలు తమకు నచ్చక యేవగించుకొనుచుండు కావ్యపాఠకులకుఁ గాని, నాటకద్రష్టలకుఁ గాని లౌకికతాత్కాలిక జుగుప్స యలౌకికరసానందానుభవమునకుఁ బ్రతిబంధకము కాదా?

'చతుర్వర్గ ఫలప్రాప్తిః సుఖాదల్పధియామపి'

అనుచో సాహిత్యదర్పణము కావ్యనాటకాదులు సుకుమారమతులగు రాజకుమారాదులకే యని చెప్పెడిని. అట్టియెడ నధికారులగువారికే సరసప్రబంధము లుపయోగింపనగును. కాని, ప్రభుసమ్మితవాఙ్మయముచేతను, మిత్రసమ్మిత గ్రంథమండలిచేతను వినేయులగు

లాటియధికారుల కీకావ్యనాటకాదుల వినయాభాన మేల?

చిన్నతరగతి జనుల రసానుభవమునకుఁ జిన్నతరగతి యనుకార్యులకథ లుపయోగించుటయుఁ, గొన్ని చుట్టుప్రావలు మొదలైనవి లేనిచోఁ బెద్దతరగతి సహృదయులకుఁగూడ నవి రంజకము లగుటయుఁ గలదు. కాన లోకసహజప్రకృతిలోల మగు రసికహృదయమును దన్నుట కట్టి కథలతో సైతము పుస్తకములు సృజింపఁబడుట యుక్తమే యైనను బ్రాచీనకవులు సర్వసామాన్యముగా రసోదయమునకు గొప్ప పాత్రలనే యనుకార్యులఁ జేసి పాత్రముల మొత్తముల వెలార్చుటయు నవిచారకార్యము కాదు.

---

# మహాత్ము దివ్యమహిమ

త్రిపురాన వేంకట సూర్యప్రసాదరావు దొరగారు

అభవం ధర్మరతస్సైవ యజ్ఞాతం భాస్కరాన్వయే,
రామాహ్వయం పరం బ్రహ్మ ధ్యాయేఽహం శ్రేయసే సదా.

సత్యము శౌచముం దయయు సర్వసమత్వము శాంతి స్వార్థరా
హిత్యము ధర్మబుద్ధి భువనైకహితాచరణంబు సాధుసాం
గత్యము నిత్యతుష్టియు వికారవిదూరవిచారదృష్టి ని
ర్వ్యత్యయచిత్తవృత్తి గలవారు మహాత్ములు గారె యెయ్యెడన్.

పటుబంధములఁ బాపి ప్రజకు స్వేచ్ఛ యొసంగఁ దా బంధనములలోఁ దగులుకొనియెఁ
గడు బీదజనులయాఁకటిచిచ్చు చల్లార్ప వలసి తా నిరశనవ్రతముఁ బూనె
ననద లౌలోకులయసహాయతఁ దలంగ నసహాయయుక్తిఁ దా నధిగమించె
నూలుపోఁగులను గొంతులు గోయుపని మాన్ప నూలుపోఁగులకుఁ దా నూలుకొనియె
వాఁడిములుతోడ ముల్లు పుచ్చువలనో లేక-విసము వోసి మృత్యువుఁ బాపువెరవొ యెంత
వింత గొల్పెడు నహహా రవ్వంత యైనఁ-దెలియఁగా వచ్చునె మహాత్ముదివ్యమహిమ.

తన స్వార్థమును బరార్థము వీడు టది యెట్టిస్వారాజ్యవిభవమో చాటి చెప్పెఁ
దన తెచ్చికోలు పేదఱికం బరసి చూడ నెంతయైశ్వర్యమో యెఱుకపఱచెఁ
దనగోఁచిపాఁత రాయనికనం బన నెట్టిపీతాంబరత్వమో పేర్మిఁ దెలిపెఁ
దన మౌనముద్ర యెంతటిసమస్యాపూర్తివివరణంబో చక్క వెల్లడించెఁ
దనదు జీవితమే నిదర్శనము చేసి-లేమిలోఁ గల్మిఁ గల్మిలో లేమిఁ జూపె
వింత గొల్పెడు నహహా గోరంతయైనఁ దెలియఁగా వచ్చునె మహాత్ముదివ్యమహిమ.

ప్రబలహింసాకార్యపరులదౌర్జన్యంబుఁ బ్రతిఘటింప నహింసఁ బాదుకొలిపి
యన్యతైకవాదులయాక్రమంబు లడంప ననఘ మౌ సత్యాగ్రహము వహించి
యదయచిత్తులకుపకృత్యుదయమ్ములఁ గరంప నతిదయామయవృత్తి ననువుపఱచి
విప్లవకారులవిక్షోభ మడగింపఁ బరమప్రశాంతిసంపత్తిఁ దాల్చి
తన్మహాత్ముఁడు నతితీక్ష్ణతరశతార-ధార కెదు రొడ్డు నేర్పరితనముఁ జూపె
వింత గొల్పెడు నహహ కాసంతయైనఁ-దెలియఁగా వచ్చునె మహాత్ముదివ్యమహిమ.

కోరి ముప్పదిమూఁడుకోట్ల హైందవు లెల్లఁ దననోటిమాట వేదముగఁ దలఁప
నదుపదేశార్థమై జగ మెల్లఁ దనవంక నేకాగ్రదృష్టి నత్యార్తిఁ జూడఁ
బటుబలోదగ్రులౌ పగవారును దమంతఁ దన చెల్మికై తహతహలు వడఁగ
ధరఁ బేర్వడిన మహాపురుషు లందఱుఁ గూడఁ దనయుద్యమము మెచ్చి యనుసరింపఁ
గలిని గృతయుగధర్మముల్ నిలుపుతనదు-మతము సర్వలోకైకసమ్మతముఁ జేసె
వింత గొల్పెడు నహహ యొక్కింతయైనఁ-దెలియఁగా వచ్చునె మహాత్ముదివ్యమహిమ.

కాదంబరీరసగ్రహణలోలత చేత మత్తా వహించి మై మఱచుఁ జగముఁ
బరదేశజనవేషభాషానుకృతి చేత స్వత్వసంపత్తిఁ గోల్పడిన జగము
నస్పృశ్యభావజోషానురోధమ్ము చే నాత్మగౌరవదూరమైన జగము
వైదేశవస్త్రాదివస్తుమోహమ్ము చేఁ గడు లేమిఁ బొరసి కృశించిన జగము
మేలుకొలిపి కర్తవ్యపుంగీలు దెలిపి-దాస్యముక్తికిఁ దగిన రాదారిఁ జూపె
వింత గొల్పెడు నహహ గవ్వంతయైనఁ-దెలియఁగా వచ్చునె మహాత్ముదివ్యమహిమ.

తన బోసినవ్వులోఁ గనవచ్చునటె భారతాంబికాననమందహాసరుచులు
తన వింతపూన్కిలోఁ గనవచ్చునటె జగత్కావ్యార్థనూతనాధ్యాయరచన

తననోటిమాటలోఁ గనవచ్చునటె సర్వభారతీయులభావిభాగ్యగరిమ
తనవాఁడిచూపులోఁ గనవచ్చునటె మహాలోకావనైకవివేకపటిమ
జగతియం దింతటియపూర్వసంఘటనము-లెందుఁ గంటిమొ వింటిమొ యింతదనుక
వింత గొల్పు నహహా చిన్నమంతయైనఁ-దెలియఁగావచ్చునె మహాత్ముదివ్యమహిమ.

జనజీవనద మైనతనచేతిరాట్నంపుఁజక్రమే వైష్ణవచక్ర మేమొ
విన నింపు నింపెడు తన త్రిప్పుచరకాస్వనమె పాంచజన్యనినాద మేమొ
యనయమ్మును గడంకఁ దనయేకునచ్చంపుటేకులే వజ్రంపుమేకు లేమొ
తకిలీని జేపట్టి తనతీయునూలుదారమ్ములే కంఠపాశమ్ము లేమొ
ధర్మవిజయార్థమై నియంత యయి శాంతి-సంగరమ్ము సడపుతాన శౌరి యేమొ
వింత గొల్పు నహహా పిసమంత యైనఁ-దెలియఁగావచ్చునె మహాత్ముదివ్యమహిమ.

సత్యాగ్రహామహాస్త్రశక్తి మార్కొనలేక కాల్బలమ్ములు చాఁపకట్టువడియె
సత్యాగ్రహామహాస్త్రశక్తి డీకొనలేక గుఱ్ఱంపుదళములు గుంటుపడియె
సత్యాగ్రహామహాస్త్రశక్తికిఁ జరి గాక మరఫిరంగులు బైసి మాలిపోయె
సత్యాగ్రహామహాస్త్రశక్తికిం బ్రతి గాక వైమానికదళమ్ము వాసి చెడియె
ఆత్మశక్తికిఁ బశుబలం బఖిలగతులఁ-గ్రిందగుట సూప నవతార మొందె నేమొ
వింత గొల్పు నహహా యిసుమంతయైనఁ-దెలియఁగావచ్చునె మహాత్ముదివ్యమహిమ.

మాక్రీస్తు ప్రభవించె మగుడ భారతభూమి నని క్రైస్తవులు గొల్వ నభిలషింప
మాబుద్ధుఁ డుదయించె మగుడ సీభరతోర్వి ననుచు బౌద్ధజనంబు లర్థిఁ బొగడ
మామహమ్మదు పుట్టె మగుడ నిక్కడ నంచు నెలమి మహమ్మదీయులు భజింప
మాకృష్ణుఁడు జనించె మగుడ నియ్యెడ నంచు భారతీయులు భక్తిఁ బ్రస్తుతింప
నీతఁ డవతారపురుషుఁ డన్ ఖ్యాతిఁ బొంది-యఖిలలోకకళ్యాణార్థి యయ్యె నెంత
వింత గొల్పెడు నహహా యావంతయైనఁ-దెలియఁగావచ్చునె మహాత్ముదివ్యమహిమ.

ధర్మవిప్లవంబు ధరఁ గల్గునపు డెల్ల-యుగయుగమునఁ బుట్టుచుండు ననుచు
గీతలందుఁ దొల్లి కృష్ణుండు పలుకఁడే-యదియ యేమొ నేఁటియుదియుఁ గూడ.

---

విద్వాన్ జి. జె. సోమయాజిగారు M. A., L. T.

## 3 మాళవికాగ్నిమిత్రము.

౧

కాళిదాసునిచే వ్రాయఁబడినవని విమర్శకులు విశ్వసించుచున్న గ్రంథములలో మాళవికాగ్నిమిత్రమొకటి. దీని నామధేయమును బట్టియే యిద్దాని మాళవికాగ్నిమిత్రులను గురించి వ్రాయఁబడినదని తెలియుచున్నది. 'మాళవికాగ్నిమిత్రము' అను పదమునకు వివరణమెట్లనఁగా మాళవికా చ అగ్నిమిత్రశ్చ మాళవికాగ్నిమిత్రౌ, తావధికృత్య కృతో గ్రంథః మాళవికాగ్నిమిత్రమ్' అనిగాని మాళవికయా సహితః అగ్నిమిత్రః మాళవికాగ్నిమిత్రః తమధికృత్య కృతో గ్రంథః మాళవికాగ్నిమిత్రమ్' అనిగాని చెప్పవచ్చును.

కాళిదాసరచితములని చెప్పఁబడుచున్న తక్కిన రెండురూపకములలోవలెఁ గాక దీనిలోఁ గథ చరిత్రాత్మకమైనది. విక్రమోర్వశీయమునందును, నభిజ్ఞానశాకుంతలమునందును గల కథలను పురాణములనుండి గ్రహించి కవి రూపకానుగుణములగు మార్పులనొనరించి యా గ్రంథములను రచియించెను. చారిత్రకపురుషుల కథలను గ్రహియించి రూపకములను రచియించు నభ్యాసము సంస్కృత సాహిత్యమునందు విశేషముగా లేదు. ఆంగ్లమునందు నాటకములనురచించి విఖ్యాతిఁగాంచిన షేక్స్పియరు మహాకవి వ్రాసినవానిలో ననేకములు చరిత్రాత్మకకథాయుక్తములగుట సుప్రసిద్ధము. చరిత్రాత్మకములగు నవలలు నాటకములు, దేశమునందలి పూర్వస్థితిని సజీవముగాఁ బాఠకులకుఁ బ్రదర్శించుటకు సమర్థములు గావున నిట్టి చరిత్రాత్మకమగు కథను గ్రహియించి రూపకమును రచియించుటచేఁ గాళిదాసుఁడెంతయుఁ బ్రశంసార్హుఁడు. దేశచరిత్రమును నిర్ణయించుపట్ల నీమాళవికాగ్నిమిత్రమును బ్రమాణగ్రంథముగాఁ జారిత్రకపరిశోధకులు గ్రహించుచున్నారు.

౨

ఈరూపకమునం దైదంకములు గలవు. ప్రథమాంకమునఁ గవి యిష్టదేవతాప్రార్థనమొనరించి ప్రస్తావనాంగమునఁ దన నామాదులఁ దెలిపెను. తరువాతఁ గల మిశ్రవిష్కంభకమునందు వచ్చు నిరువురు పరిచారికల మాటలమున మాళవికయను నామముగల యొక యువతి గణదాసుఁడను నాట్యాచార్యునికడ నృత్యశిక్షనభ్యాసము చేయుట కంపఁబడినదనియును, మహిషియగు ధారిణి కొఱకై సర్పముద్రాంగుళీయకమొండు చేయింపఁబడినదనియును, రాజుగారి కంటఁబడకుండ నీమాళవికను ధారిణి రక్షించుచున్నను నామె నిసర్గమనోహరమగు నాకృతి రాజుగారిచే నొకచిత్రఫలకమునందుఁ దిలకింపఁబడి యాతని కామోద్రేకమునకుఁ గారణమయ్యెననియును నాపయిని ధారిణి మాళవికను మిక్కిలి జాగరూకతతోఁ గాపాడుచుండెననియును, దెలియవచ్చుచున్నది. తరువాత నా పరిచారికలలో నొకతెయగు బకులావలిక నాట్యాచార్యుఁడగు గణదాసునితో నొనరించిన సంభాషణమును బట్టి మాళవిక మిక్కిలి బుద్ధిశాలినియనియును, రాజగు నగ్నిమిత్రునకుఁ బ్రియురాలగు నిరావతి నల్పకాలములోనే మించఁగలదనియును, నర్మదానదీతీరమున నున్న దుర్గమునకుఁ బాలకుఁడును రాణియగు ధారిణికిఁ దనకంటెఁ దక్కువకులమునఁ బుట్టిన సవతితమ్ముఁడును నగు వీరసేనునిచే మాళవిక సేవకురాలుగాఁ బంపఁబడినదనియును, నాయమ రూపాదులచే మిన్నయగు వంశసంజాతగాఁ దెలుపుచున్నదనియును, ఫలితమగు నాట్యవిశేషమునం దప్పుడే సమర్థురాలయి పంచాంగాభినయాత్మకమగు నొక నాట్యవిశేషము నభ్యసించుచున్నదనియును దెలియవచ్చుచున్నది. అనంతరమగ్నిమిత్రునకును నమాత్యుఁడగు వాహతకునకును జరిగిన సంభాషణమును బట్టి రాజ్యవిషయములగు కొన్ని పూర్వసమాచార

ములు తెలియవచ్చుచున్నవి. విదర్భదేశమునకుఁ బ్రభువగు యజ్ఞసేనుని శ్యాలకుఁడు మౌర్యమంత్రి, యగ్నిమిత్రునిచేఁ జెరయందుంపఁబడెను. దీనికిఁ బ్రతీకారముగా యజ్ఞసేనుఁడు నిజజ్ఞాతియును, నగ్నిమిత్రునకుఁ బ్రియుఁడును, దనచెల్లెలి నగ్నిమిత్రునకిచ్చి యాతనితో సంబంధమును గల్పించుకొన నూహించుచున్నవాఁడును నగు మాధవసేను నోడించి యాతనిని గారాగారమునం దుంచఁగా నగ్నిమిత్రుఁడు కోపోద్దీపితుఁడయి మాధవసేనుని విడువవలసినదని యజ్ఞసేనునకుఁ గమ్మనంపఁగా నాతఁడు దనశ్యాలకుండగు మౌర్యసచివు నగ్నిమిత్రుఁడు విడిచిపుచ్చినచే యట్టి విడుదల సంగతమగునని మారు వ్రాసిపంపఁగా నతఁడు దండతాడితభుజంగము భాతి మండిపడి యజ్ఞసేనుని నోడించి యాతనిరాజ్యమును వశమొనరించుకొనుటకుఁ దనసేనానినిఁ బంచుటకుఁ త్తరువొసంగెను. మనకథాభాగమునకుఁ బూర్వస్థితములగు నయియంశములన్నియుఁ గాళిదాసుఁడు నయిసంభాషణములవలనఁ దెలిపి ప్రకృతకథాభిధానమును జరిపించుటకుపక్రమించెను. మాళవికను జిత్రమునందు దర్శించిన దాదిగనగ్నిమిత్రుఁడామెను జూడవలయునని కౌతూహలముగలవాఁడయి యట్టి సన్నివేశమును గల్పించుటకయి విదూషకునిఁ గోరఁగా నాతఁడు నాట్యాచార్యులగు గణదాసునకును హరదత్తునకును విద్యావిషయకమగు నొక గొప్పవివాదమును బుట్టించి యొకరితో నొకరు మచ్చరించునట్లు చేయఁగా వారిరువురును దమకుఁగల వివాదమునుదీర్ప నగ్నిమిత్రునిఁ బ్రార్థించిరి. రాజునకును రాణికిని మాననీయురాలగు నొక పరివ్రాజిక రాజగృహమునందుండఁగా నామె నీ పండితుల వివాదమును దీర్ప వారిర్వురును నియమించిరి. నాట్యాచార్యుల పరీక్షాకాలమున రాణియును బరివ్రాజికయును సభాస్థానమునందుఁ గూరుచుండిరి. పరివ్రాజికి గూడ నెట్టెటులో విదూషకుని మంత్రమునకుఁ దోడయి యీ యుభయుల నాట్యమును నింతకుమున్నే చూచితినిగావున వీరిశిష్యుల నాట్యమును జూడవలయునని చెప్పెను. ఈ పద్ధతి రాణికేమాత్రము నిష్టములేకుండుటచే నట్లు జరుగకుండఁ జేయుటకుఁ బ్రయత్నముఁజేసెనుగాని యామెకాశ్రితుఁడగు గణదాసునికిఁ గల స్వపాండిత్యప్రకటనా కౌతూహలముచేఁ దనప్రయత్నమును సాగించుకొనలేకపోయెను. హరదత్త గణదాసుల శిష్యులు స్వల్పభూషణములతో నస్వల్పవస్త్రములతో వచ్చి నాట్యము సేయవలయునని నియమించి రాజును బరివ్రాజికయు ధారిణియు నాట్యశాలకుఁ బోయిరి.

రెండవ యంకమున గణదాసుని శిష్యురాలగు మాళవిక నయిప్రకారము తన నైపుణ్యమును జూపుట కరుదెంచి ఛలితమను నాట్యవిశేషమును బ్రదర్శింప మొదలిడెను. అగ్నిమిత్రుఁడా సుందరిరూపమును గనులఁ గ్రోలుచుఁ దన్మయుఁడై యుండెను. మాళవికయు శృంగారరసోద్దీపకమగు నొకశ్లోకమును జదివి తాను నగ్నిమిత్రునిపయి వలచుకొనియున్నదనునట్లభినయించుటచే నాతఁడెంతయు సంతసించెను. విదూషకుఁడు వివిధోపాయములచే మాళవిక యక్కడ నుండవలసిన కాలమును బొడిగించుటకుఁ బ్రయత్నించి రాజునకానందమునుగూర్చెను. నాట్యప్రదర్శనానంతరమున విదూషకుఁడు రాజహస్తమునుండి కటకమును గ్రహించి మాళవిక కొసంగుటకుఁ బ్రయత్నించుచుండఁగా రాణియగు ధారిణి కోపించి యాతని నాపనిగుండి నివారించి శిష్యసహితముగా సభనుండి వెడలిపోవలసినదని గణదాసున కాజ్ఞాపించెను. హరదత్తుఁడు తన శిష్యప్రదర్శనమును దిలకింపవలసినదని ప్రార్థించుచుండఁగాఁ బంబ్రెండు గంటలు కొట్టుటచే భోజనకాలమతిక్రమించినదనియును హరదత్తశిష్య పరీక్ష మరునాఁడు జరుగుననియును జెప్పి యానాటి కాతని వెడలిపొమ్మనిచెప్పిరి. చిత్రగత మాళవికా దర్శనముచే నగ్నిమిత్రుని హృదయసీమను నాటంబడిన ప్రేమబీజమామె వైశారద్యమును బరీక్షించుటచే వృద్ధింగాంచి మొలకలెత్తెను. మదనసాయకహతుఁడగు తానింకమాళవికా సంయోగమును బొందక యూరటఁ బొందఁజాలనని విదూషకునికిఁ జెప్పి తల్లాభమునకొఱకయి యాతని సాహాయ్యమొనరింప వేఁడుకొనఁగా నాతఁడు ప్రయత్నింతునని చెప్పి రాజును దనమనస్సునందలి యాబలాటమును వెలిపుచ్చక జాగరూకతతో నుండవలసినదని హెచ్చరించెను.

మూఁడవయంకమునకాదినున్న ప్రవేశకమునందు, విద్యావిషయములో పారదత్త గణదాసు లిరువురును సమానులయ్యు శిష్యపై శారద్యముచే గణదాసుఁడధికుండని నిర్ణయింపఁబడినదనియును, మాళవికాగ్ని మిత్రులిరువురును బరస్పరానురాగముతో నున్నారనియును క్రీడావనమునందలి తపనీయాశోకము వసంతకాల మారంభమయ్యును బుష్పింపకుండుటచే దానికి దోహదంబగు స్త్రీపాదఘాతమావశ్యకమనియును దెలియఁజేయఁబడినది. అగ్నిమిత్రుఁడు మరుశరములచే నొంపఁబడిన వాఁడయి కాలము నెట్లు గడపుటయో యోజింగకుండు సమయమున నిరావతితోఁగూడి సాయంకాలమున డోలోత్సవము ననుభవింతునని చెప్పినమాటను విదూషకుఁడాతనిస్మృతికిఁ దెచ్చెను. ఆసమయమునందుఁ దాననుభవించుచున్న మనో వేదనతో నిరావతిఁగలసికొనుట యసంభవమని రాజు బదులుచెప్పఁగా విదూషకుఁ డీసూలమున సంతోషపరిచయము నొక్కసారిగా భంగపఱుపరాదని యుపదేశించి రాజును గేళీవనమునకుఁ గొంపోయెను. ఇట్లుండఁ దపనీయాశోకంబునకుఁ బాదఘాతంబు నొసంగుటకు, దోలాపరిభ్రష్టయగుట పరుజనరణయగు ధారిణి యసమర్థురాలయి యాకార్యంబునకు మాళవికను బంపుచు నామె చరణనివాసంజేసి యశోక మయిదుదినములలోఁ బుష్పించెనేని నభీష్టవరంబొం డొసంగెదనని చెప్పెను. మాళవికయు వకుళావళికాసహితయయి ధారిణి ధరించు పాదకటకంబుల గ్రహియించి చెలిచే నలంకరింపఁబడినయి కార్యమునకై కేళీవనమున కరుగుదెంచెను. ఈసందర్భమున రాజు విదూషకునిఁగూడి యొకపాదమాటునఁ గూరుచుండి తనప్రియురాలింజూచుచు నామెకును వకుళావళికకును జరుగు సంభాషణమును వినుచు దానినిబట్టి తనపై మాళవికకుఁ బ్రేమగలదని యెఱిఁగి యాటలూరుచుండెను. ఇరావతి నిపుణికయను తనసఖితోఁగూడి డోలాధిరోహణంబుసేయ నచ్చటికేగ దెంచి రాజునుంగానక యేపాదమాటుననో దాగియుండునని యూహించి యక్కడనే వేచియుండెను. మాళవిక యశోకపాదపంబును దనపదహతిం బొసంగించి రాజప్రేమంబునుదలపోయుచున్న సమయంబున నాతఁడు బయటికివచ్చి మాళవికకుఁ బాదపముతాకుడుచే గాలికినొప్పితగులలేదుగదా యని ప్రశ్నించి యట్టిపాదహతిచేఁ దన్ను గౌరవింపవలసినదిగాఁగోరెను. ఈయుదంతమును గనిపెట్టుచున్న యిరావతి (రాజు రెండవభార్య) కోపోద్దీపితయై వెడలివచ్చి పురుషులు కుటిలస్వభావులని నిందింపఁదొడంగెను. ఇరావతి యాగ్రహంబునకు భయపడి యొక్కటితో మాళవికయు వకుళావళికయుఁ బారిపోయిరి. తనకు సంభవించిన యవస్థను దెలిసికొని యగ్నిమిత్రుఁడు 'నీకొఱకై వచ్చి నిన్నుఁగానక వినోదంబునొకింత సల్పుచున్నాను' అని చెప్పి యిరావతిననునయింపఁ జూచెనుగాని పాదగ్రహణమునరించిన రాజును నిరాకరించి యామె వెడలిపోయెను. విదూషకుఁడు ధైర్యముఁజెప్పఁగా నగ్నిమిత్రుడాతనిఁగూడి భవనమునకు మరలిపోయెను.

నాల్గవయంకమునందు మాళవికనుఁగలసికొనఁజాలక పరితపించుచున్న యగ్నిమిత్రుఁడు ప్రవేశించును. ఇరావతిచేఁ బురికొల్పఁబడినదియై ధారిణి మాళవికను వకుళావళికను భూగృహంబున బందీకృతలంజేసి యాకారమ రక్షించు మాధవికకుఁ దన యంగుళీయక దర్శనంబునఁగాని వారినివిడువరాదని యానతిచ్చెనని విదూషకుఁడు రాజునకు నివేదించును. ఇఁకమాళవికను గలసికొనుట యెట్లని రాజు చింతించుచుండ విదూషకుఁ డొక్కయుపాయమునాతనికిని బ్రతీహారిణియగు జయసేనకును జెప్పఁగా రాజునుపాయానుసారముగా ధారిణీగృహంబున కామె స్వాస్థ్యమును గనుఁగొనవలయునని వెడలెను. విదూషకుఁడు రాజ్ఞీ దర్శనార్థము పోవునప్పుడొక వస్తువును బహుమానార్థముఁ గొంపోవనెంచి దానిని వెదకుచుఁబోయెను. పాదరుజచేఁ బర్యంకాసీనయైయున్న ధారిణికడకగ్నిమిత్రుఁ డరిగిన కొంతసేపటికి విదూషకుండేడ్చుచు నచ్చోటికరుగుదెంచి రాజ్ఞీ బహుమానార్థము పూవులవెదుకంబోయి సర్పదష్టుఁడనయితినని చెప్పెను. రాజాజ్ఞపై విషవైద్యునకీసమాచారముఁ దెలియనంపఁగా నాతఁడు విదూషకుండనకడకే దీసికొనిరావలసినదని చెప్పెను. విదూషకుఁ డచ్చటికేగిన కొంతసేపటికి జయసేన యరుగుదెంచి విదూషకుని పాముకాటునకుఁ బ్రతిక్రియ చేయుటకుదకుంభవిధానముచే

౧౮౭౬ వ సం. జెర్మను భాషలో నొక పరివర్తనమును ప్రొఫెసరు వీబరుగారు ప్రచురించిరి. భారతదేశములో నున్న వ్రాతప్రతులసాహాయ్యమున 'పండిత్' గారీగ్రంథము ౧౮౭౯ వ సం.లో నచ్చొత్తించిదాని యుపోద్ఘాతమున మాళవికాగ్నిమిత్రకర్తృత్వమునుగుఱించి చర్చించి యిది కాళిదాసకృతమనియే సిద్ధాంతమొనరించిరి. అంతటితో నీవివాదము ముగిసినది.

విల్సనుగారు తమ యభిప్రాయమును సమర్థించుకొనుటకుఁ జెప్పిన ముఖ్యకారణములు మూఁడు.

I మాళవికాగ్నిమిత్రమునందలి పద్యములందుఁ గాళిదాసుని యితరనాటకములలోఁ గల మాధుర్యము లేదు.

II మాళవికాగ్నిమిత్రమునందలి కల్పనలును భావములును దక్కిన రెండు నాటకములయందున్నవాని యంతటి యుత్తమములుగా లేవు.

III ఈ నాటకమున చిత్రింపఁబడిన సంఘస్థితి నైతికదూరమై ధర్మభ్రష్టమై యున్నది గావున నిది కాళిదాసుని కాలమునందలిస్థితియని చెప్పుటకేమాత్రము వీలు లేదు.

పైవిషయములను ఖండించి మాళవికాగ్నిమిత్రమునకును దక్కిన రెండు నాటకములకును సమానకర్తృత్వమును నిరూపించుటకుఁ దగిన యుక్తులను 'పండిత్' గారు తమ యుపోద్ఘాతమునందిచ్చిరి. పైసంశయమును నిర్ధారణమొనరించుటకుఁ వారియుక్తులు సరిపోవునను నభిప్రాయముతో వానిసారమునే నా యభిప్రాయములతోఁ గలిపి యీక్రింద నిచ్చుచున్నాను.

మాళవికాగ్నిమిత్రమునందలి పద్యములలో మిగిలిన రెండు నాటకముల యందలి పద్యములలో నున్న యంతటి మాధుర్యము లేదని చెప్పు విల్సను గారి వాక్యముల యభిప్రాయము సువ్యక్తముకాదు. సంస్కృతవృత్తముల లక్షణ మింగ్లీషువృత్తముల లక్షణమువలె నడిసినప్పుడు మాత్రాధిక్యమునుగాని మాత్రాన్యూనతనుగాని యొప్పుకొనునదిగాదు. కాళిదాసుఁడు తక్కిన రెండు రూపకములలోను వాడిన వృత్తములవంటివానినే యీరూపకమునందును వాడియున్నాఁడు. ఇఁకఁ బద్యములయందలి పదబంధమును గుఱించియుఁ, బ్రసాదాదిగుణములను గుఱించియును నీగ్రంథత్రయమునందును భేదమేమియును గన్పించుట లేదని చదివినవారికిఁ దెలియకపోదు. ఇఁక నా గ్రంథములలోని పద్యములలో నున్న మాధుర్యము (Melody) మాళవికాగ్నిమిత్రమునందు లేదని చెప్పు యుక్తి గ్రంథమున కన్యకర్తృత్వము సాధించుటలో మిక్కిలియు బలహీనమనియు నట్టిభేదమొక్క కవి వ్రాసిన గ్రంథములయందే యాతని బాల్యప్రౌఢావస్థలంబట్టి కన్పించుచుండునసియును ఋతుసంహార వ్యాసమున సంపూర్ణముగాఁ జర్చించితిమిగావున నిఁక నాపని నిప్పుడు నారంభింప నావశ్యకత లేదు.

ఇఁక మాళవికాగ్నిమిత్రమునందలి కల్పనలు మొ. తక్కిన రెండునాటకములలోని వాని యంతటి యుత్తమములుగా లేవను రెండవయుక్తిలోఁ గొంత సత్యమున్నదని విమర్శకులందఱును నొప్పుకొనిరిగాని దానికి వీబరుగారీక్రిందరీతిని సమాధానముఁ జెప్పుచున్నారు. "—both rest upon a mythical back ground, and consequently bear a more magnificient and ideal character: the Malavikagnimitra portrays the life in the court of a historic prince and consequently the bare actuality, with its self made,and therefore scanty concerns." అనఁగాఁ దక్కిన రెండు రూపకములయందలి కథావిధానమునందును పౌరాణిక విషయములు మూలమున నాహ్లాదకరములగు సన్నివేశములను గల్పించుటకవకాశమొక్కువ యున్నదనియును మాళవికాగ్నిమిత్రమునందలి చరిత్రాత్మకమగు కథయందట్టి సన్నివేశములను గల్పించుటకంతగా వీలు లేదనియు నభిప్రాయము.

దుష్యంత పురూరవసుల కథలయందువలెనే యగ్నిమిత్రుని కథయందును గవి తన ప్రతిభాబలమున నద్భుత సన్నివేశములను గల్పింపనగుననియును బూర్వకాలిక రాజసభకు సంబంధించిన చరిత్రము నందును నట్టి యుపకాశములకు లోటు లేదనియును పౌరాణికగాథ కానట్టి

మాలతీమాధవమునందుఁ జక్కని సన్నివేశములను నాశ్చర్యజనకములుగాఁ గవి కల్పించియున్నాఁడనియును నాకారణమున వీబరుగారితోఁ దామీ విషయమున నేకీభవింపఁ జాలమనియును 'పండిత్' గారు వ్రాసిరి. కాని వీబరుగారు వ్రాసిన యుక్తిలోఁగూడఁ గొంతమట్టునకు నిజమున్నదని మా యభిప్రాయము. మిగిలిన రెండు రూపకములయందును గవి స్వర్గమర్త్యలోకములకు సంబంధమును గూర్చి మిక్కిలి యద్భుతములగు సన్నివేశములను గల్పింపఁగలిగెను. అట్లు విమానముల నెక్కించుటకు గాని యతిమానుషములగు చర్యలను నిర్మించుటకుఁ గాని యీకథ యందవకాశము గావరాదు. తక్కిన నాటకములయందుఁ గల తపోవనవర్ణనములవంటి వర్ణనములకునుగూడ నిందవకాశము లేదు. మాలతీమాధవమునందు భవభూతి యఘోరఘంటునియొక్కయుఁ గపాలకుండలయొక్కయు చరిత్రమును గూర్చి నాటకమునకు వన్నె పెట్టఁగలిగెనా లేదా యని పండిత్ గారు ప్రశ్నింపవచ్చును, గాని మాలతీమాధవకథకును మాళవికాగ్నిమిత్రకథకును భేదము లేకపోలేదు. ఒకటి కల్పితము. రెండవది చరిత్రాత్మకము, కవికాలమునకుఁ జాలసమీపమున నుండిన రాజచరిత్రము విషయముగాఁ గలది. ఇట్టికథలోఁ గవి యధికములగు నతిమానుషచర్యలను గల్పించినయెడలఁ బ్రేక్షకులకుఁ జక్కని నమ్మిక కలుగుట కవకాశము లేదుగదా! ఇంతకును దచ్చరిత్రము తనకే చక్కఁగాఁ దెలిసినవిషయమగుట నంసంగతికల్పనలను జేయుటకుఁగూడఁ గవి సాహసింపలేకపోయి యుండవచ్చును. కావున దానెంచుకొనినకథ కవియొక్క ప్రతిభకు విశృంఖలముగాఁ బరుగెత్తుట కవకాశమునొసంగినది గాదనుటలోఁ గొంత సత్యమున్నదనక తప్పదు. 'పండిత్'గా రూహించినట్లు కాళిదాసుఁ డీపుస్తకమునుగూడ ఋతుసంహారమువలెనే ప్రౌఢావస్థ రాక మున్దే రచియించెనని యూహించుటలో మేమును నేకీభవించుచున్నాము గావునఁ దనరూపకమునకుఁ దగిన కథ నెంచుకొనుటలోఁ గవి చక్కఁగాఁ దన సామర్థ్యమును వినియోగింపఁజాలకపోయెనని మా యభిప్రాయము. ఈనాటకము బాల్యావస్థయందు వ్రాయఁబడెననుట కాధారములేమున్నవో మున్ముందుఁ జర్చింతుము.

ఇఁక విల్సనుగారు చెప్పిన మూఁడవకారణముగూడ సమంజసముగాఁ గన్పట్టుటలేదు. ఒకరాజునకు ననేకభార్యలుండుటయు నప్పుడుగూడ వాతఁడు క్రొత్తఁగా వివాహములాడుటకుఁ బ్రయత్నించుటయు హిందూదేశమున సర్వరాజసాధారణమగు విషయముగావున దానిని గాంచి విల్సనుగారు చెప్పిన యభిప్రాయమున మనము దరఁబుద్ధి నుంచఁ గక్కఱలేదు. విల్సనుగారి మతమునఁ గాళిదాసుని రూపకములగు తక్కిన రెండిటియందును గూడ రాజులు భార్యాయుక్తులయ్యుఁదిరిగి వివాహములను జేసికొని యున్నారనుట సత్యమే గదా!

ఇఁకఁ గాళిదాసునిదే యీ కావ్యమనుటకును నియ్యది నాటకముల మూఁడిటిలో మొదట వ్రాయఁబడెనదనియును నూహించుటకుఁ దగినయుక్తుల నిచ్చుచున్నాను. ప్రస్తావనయందు మాళవికాగ్నిమిత్రము కాళిదాసవిరచితమని వ్రాయంబడినది. దానినెవ్వరును హిందూదేశములో నెప్పుడు నమ్మకుండినట్లుగాని దానికి విరుద్ధములగుకథలు వాడుకలో నున్నట్లుగాని వినరాలేదు. కావున నెందేనికారణమో యుండినంగాని మనము కావ్యకర్తృత్వమును శంకించుట కవకాశము లేదుగదా! ఇంతియగాక గ్రంథమునందలి కల్పనలు మొదలగువానిని బరీక్షించినను బయియభిప్రాయమే వేటతెల్లమగుచున్నది. గ్రంథాదిని బారిపార్శ్వకునకును సూత్రధారునకును జరిగిన సంభాషణమునఁబట్టి ప్రథితయశస్కులగు భాససౌమిల్లకవిపుత్రాదులుండఁగా వారికావ్యములనుమాని వర్తమానకవియగు కాళిదాసునిరూపకమును బ్రయోగించుట యందేమి యభిప్రాయమను ప్రశ్న లేవదీయంబడి సమాధానమచ్చటనే యొసంగంబడెను.

పారి. మా తావత్, ప్రథితయశసాంభాససౌమిల్లకవిపుత్రాదీనాం ప్రబంధానతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య క్రియాయాం కథం పరిషదో బహుమానః.

సూత్ర. అయి వివేకవిశ్రాంత మభిహితమ్. పశ్య

పురాణమిత్యేవ నసాధు సర్వం, నచాపికావ్యం నవమిత్యవద్యమ్, సంతః పరీక్ష్యాన్యతరద్భజంతే, మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః.

# వివాహములందు

## మా వెండిసామానులు సరియైన బహుమానము

మంచి వెండిసామానులే బహూకరించుటకు తగినవి. అప్పటమైన వెండితో చేయబడి, సురాజ్‌మల్‌వారి ముద్రగల సామానులు, పనివారిచతురతను గన్పరచునని పెక్కుమంది చేత గుర్తింపబడినది.

"నాకు మీరు తయారుచేసియిచ్చిన వెండిగిన్నె, సాసరు, నాకెంతో తృప్తికరముగానున్నవని చెప్పుటకు సంతసించుచున్నాను. అవి పనివారినైపుణ్యతను వెల్లడించుచున్నవి.

*        *        *        *

న్యాయమును, నమ్మికయును గల బంగారు వెండిసామానులు కావలసినవారికి, మద్రాసు వాస్తవ్యులగు సురాజ్‌మల్ లల్లూభాయ్‌వారిని హృదయపూర్వకముగా సిఫార్సుచేయుచున్నాను. వారు మంచిపనితనముగల వస్తువులు జేయుటయేగాక, సరసమగు ధరలకుకూడ యిచ్చుచున్నారు. (సం) సి. యం. ఈచిను."

మా పనితనమును కొనియాడుచు మాకొసంగబడిన అనేక ప్రశంసాపత్రికలలో నిదియొకటి.

ప్రవీణులగు పనివారలచే అప్పటమగు లోహముచే [illegible] చేయబడుచున్నవి.

మాచేత తయారుచేయబడిన ప్రతివస్తువుయును, మంచితూకమును, పరస్పరసంబంధానుగుణమును, సాటిలేనిపనితనమును గలిగియున్నదని మీరే తెలిసికొనగలరు.

మా సామానులు, మీ గృహముల సౌందర్యమును, గౌరవమును పెంపొందించును.

మా స్టాకులు చాలా గొప్పవి. మీకేదికావలసినను దొరకును. వివాహ సమయములలో బహూకరించుటకు, మీరు కోరుకొనునట్టి అందమైన వస్తువులు గలవు. వాటి అందచందములను జూచి సంతోషింపుడు.

# సురాజ్ మల్ లల్లూభాయి అండ్ కో.,

సీమకమలముల పర్తకులు, నగల పర్తకులు,

బంగారు, వెండి సామానుల తయారుచేయువారు

**313, ఎస్ప్లనేడ్, మద్రాసు.**

బ్రాంచి:—రాకు ఫోర్టు గేట్, తిరుచినాపల్లి.

ఏజన్సీ:—ఇన్నీస్ ట్యాంకురోడ్, ట్యాంకురోడ్, కాకినాడ.

# ౪౫-వ అఖిలభారత జాతీయమహాసభా చిత్రములు

## కరాచి, ౧౯౩౧



శ్రీ డా. చోయిత్‌రాం పి. గిద్వానీగారు
స్వాగతసమితి అధ్యక్షులు



శ్రీ సర్దార్ వల్లభభాయి పటేలుగారు
సభాధ్యక్షులు

న్మధుకరహతాః' అను దానికినిఁగల సాదృశ్యము స్పష్టముగదా!

(2) మూఁడవ యంకమునందు మదనబాధను బొందుచు నగ్నిమిత్రుఁడు మన్మథునిగుఱించి పలుకు మాటలకును దుష్యంతుఁడును నట్టి సందర్భమున మన్మథుని గుఱించి పలుకుమాటలకును మిక్కిలి సాదృశ్యము గలదు.

మా. II. 17. భగవన్ సంకల్పయోనే, ప్రతిబంధవత్స్వపివిమ రయేవ్వభినివేశ్య తథా ప్రహరసి యథా జనోఽయం కాలాంతరక్షమో న భవతి| సవిస్మయమ్॥ క్వరుజాహృదయప్రమాథినీ| క్వచ తే విశ్వసనీయ మాయుధమ్ మృదుతీక్ష్ణతరం యదుచ్యతే| తదిదం మన్మథదృశ్యతేత్వయి.

శా. III. 55. భగవన్కుసుమాయుధ, త్వయా చంద్రమసాచ విశ్వసనీయాభ్యామతి సంధీయతే కామిజనసార్థః| కుతః. శ్లో. తవకుసుమశరత్వం శీతరశ్మిత్వమిందోః ద్వయమిదమయథార్థం దృశ్యతే మద్విధేషు| విసృజతి హిమగర్భైరగ్నిమిందుర్మయూఖైస్త్వమపి కుసుమబాణాన్వజ్రసారీకరోషి. భగవన్ కామదేవ, న తే మయ్యనుక్రోశః. మదనబాధాం నిరూప్య. కుతస్తేకుసుమాయుధస్యసతస్తైక్ష్ణ్యమేతత్.

స్వభావముచే మృదువైనను సారవంతమైనదని చెప్పు క్రిందివాక్యమునుగూడ నీసందర్భమునఁ బరికింపవగును. కు. సం. 5 సర్గ. 19 శ్లో. ధ్రువం వపుఃకాంచనపద్మనిర్మితం మృదుప్రకృత్యాచ ససారమేవచ| సాధారణముగా రెండుసార్లు చశబ్దమునుజేర్చి భిన్నస్వభావముగల వస్తువులనుఁ జేర్కొనుట కాళిదాసుని కావ్యములయందుఁ గన్పట్టుచున్నది.

శా. II. 52. క్వవయం క్వపరోక్షమన్మథో మృగశాబైస్సమమేధితో జనః, పరిహాసవిజల్పితం సఖే పరమార్థేన న గృహ్యతాం వచః.

శా. I. 10. క్వబత హరిణకానాం జీవితంచాతిలోలమ్, క్వచనిశితనిపాతా వజ్రసారాశ్శరాస్తే.

రఘు. I. 2. క్వ సూర్యప్రభవో వంశః క్వచాల్పవిషయామతిః.

మే. I. ధూమజ్యోతిస్సలిలమరుతాం సన్నిపాతః క్వమేఘః, సందేశార్థాః క్వపటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః.

(3) అగ్నిమిత్రుఁడు రెండవ యంకమున నృత్యము చేయుచున్న మాళవికరూపమును గాంచి యిట్లనుకొనుచున్నాఁడు. రాజా-(ఆత్మగతమ్) అహో సర్వాస్వవస్థాసు చారుతా శోభాంపుష్యతి. మా. II. 20.

అభిజ్ఞానశాకుంతలమునందును రాజు వల్కలధారిణి యగు శకుంతలనుగాంచి

సరసిజమనువిద్ధం శైవలేనాపిరమ్యం, మలినమపిహిమాంశోర్లక్ష్మ లక్ష్మీంతనోతి, ఇయమధికమనోజ్ఞా వల్కలేనాపితన్వీ కిమివహిమధురాణాం మండనంనాకృతీనాం.

కు. V. 9. నషట్పదశ్రేణిభిరేవ పంకజం సశైవలాసంగమపి ప్రకాశతే.

శా. IV. అహో సర్వాస్వవస్థాసు రమణీయత్వమాకృతివిశేషాణామ్.

(4) ఒకచో సమావేశమగు మాళవికాగ్నిమిత్రుల విడిచి పోవునప్పుడు విదూషకుఁడు వకుళావళికను బిలుచుటయందును శకుంతలాదుష్యంతులుం గూడియున్నపుడు చెలికత్తెలువారినివిడిచి వెడలుటకును దెలుపునట్టి కారణములు సమములయియున్నవి.

మా. IV. 126. విదూషకః-(పరిక్రమ్యససంభ్రమమ్) వకుళావళికే ఏష బాలాశోకవృక్షస్యపల్లవాని లంఘయతి హరిణః.

శా. III. ప్రియంవదా, సదృష్టిక్షేపమ్, అనసూయే యథైష ఇతో దత్తదృష్టిరుత్సుకో మృగపోతకో మాతరమన్విష్యతి. ఇత్యుభే ప్రస్థితే.

(5) మాళవికాగ్నిమిత్రమునందలి నాల్గవయంకములో విదూషకుఁడు సర్పములనిన భయపడువాఁడని తెలుపఁబడినది.

శా. IV. 158. ఇమం భుజంగభీరుకం బ్రహ్మబంధుం అనేన భుజంగకుటిలేన దండకాష్ఠేన స్తంభాంతరితా భూత్వా భీషయిష్యామి.

విక్ర. II. అవిదగ్ధః! కిన్నేతత్ భుజంగనిర్మోకః? భూర్జపత్రగతోయ మక్షరవిన్యాసః.

విక్రమోర్వశీయవాక్యములందును శైలీ చ్ఛాయ గ్రహియింపఁబడినదనుట స్పష్టము.

ఇట్టి భావసాదృశ్యములను శబ్దసాదృశ్యములను ననేకములను 'పండిత్'గారు తమ యుపోద్ఘాతమునందుఁ జూపియున్నారు. అయ్యవిమాత్రమే గాక యట్టి సాదృశ్యముల నంతముగాఁబఠియించువారికిఁగన్పట్టకతప్పదు. వాని నన్నిటిని నుదాహరించుట గ్రంథవిస్తరభీతిచే మానినాఁడను. మాళవికాగ్నిమిత్రము శాకుంతలాది కృతికర్తచేతనే వ్రాయంబడిన దనుటకుఁ బయిసాదృశ్యములతో పాటుగాఁ గృత్యాదియం దొనరింపఁబడిన యిష్టదేవతాస్తుతియును సాహాయ్యముగు మున్నది. ఈవిషయమును మొదటి వ్యాసమునందు విపులముగాఁ జర్చించియున్నాను.

మాళవికాగ్నిమిత్రము త్తమరూపకమయ్యును గాళిదాస నియితరరూపకములతో మాత్రమీడు గాదని చెప్పనగునని మును పే తెలిపియున్నాము. ఈకృతిని వ్రాయునప్పుడు కాళిదాసునకింకను కథారచనా విధానమునందు సామర్థ్యము పెంపొందలేదనుట శాకుంతలాది కృతులకును దీనికిని గలభేదమును బరీక్షించినఁ దేలఁగలదు.

(1) కథ నెంచుకొనుటలోఁ గాళిదాసుఁడు తక్కిన రెంటియందును మాళవికాగ్నిమిత్రకథ నెంచుకొనునప్పటికంటె నెక్కువ సామర్థ్యమును జూపియున్నాఁడని మునుపే చెప్పియుంటిమి.

(2) మాళవికాగ్నిమిత్రకథయందు రంగమెప్పుడును నగ్నిమిత్రునిపట్టణమును దాటలేదు. కథాంశములన్నియును నాతని సభయందును నంతఃపురమునందును నుద్యానమునందును జరిగినవిగాని కవి యన్యస్థలమునకు రంగమును మార్చలేదు. ఇతరస్థలములజరిగిన కథావిషయముల నన్నిటిని పాత్రలచేతనే కవి చెప్పించెను. విక్రమోర్వశీయమునందుఁ బురూరవసుఁడును నూర్వశియు

స్వస్థానములనుండి చలించుట సంభవించెను. మొట్టమొదట సూర్యోపస్థానార్థము పురూరవసుఁడు వెడలుట జరిగెను. ఆకాశవీధి నూర్వశీరక్షణము జరిగినది. రెండవయంకమునందు రాజనగరము రంగస్థానము. మూఁడవయంకమున దేవలోకమునందలి భరతశిష్యులను గవి ప్రవేశింపఁజేసి వారివలన నప్పటిసమాచారమును దెలియఁజేయును. నాల్గవయంకమునందు రంగస్థానముగా గంధమాదనపర్వత సమీపమునను మందాకినీపులినతలంబులను నవప్రదేశములను గవి చూపించియున్నాఁడు. విరహాతురుండగు పురూరవసుఁడు వ్యస్తుఁడై యక్కడనే తిరుగుచుండును. అయిదవయంకమున దిరిగి రంగస్థలము పురూరవసుని పట్టణమగు ప్రతిష్ఠాననగరము. ఇట్లు విక్రమోర్వశీయమునందును నింతకంటె నెక్కుడు శాకుంతలమునందును జలనమును గవి చూపించియున్నాఁడు. ఇట్లు కథయందును పాత్రములయందును జలనమును గల్పించుట కవియొక్క శక్తికిఁగల పరిణతావస్థను సూచించుచున్నది. ఇట్టిచలనము మాళవికాగ్ని మిత్రమునందుఁ జాలఁదక్కువగానున్నది.

(3) పురూరవసుఁడు భాగీరథీతీరమునఁ దన ప్రియురాలికొఱకుఁ బరివించినప్పుడు గలుగు విప్రలంభము నంతటి గాఢమైన విప్రలంభమును మాళవికాగ్నిమిత్రమునందుఁ గవి చూపింపలేక పోయెను. విక్రమోర్వశీయముకంటెను నభిజ్ఞానశాకుంతలమునందు మఱియు గాఢముగా విప్రలంభమును బోషింపఁగలిగెను. ఇంటికి వచ్చి తన భార్యనని చెప్పుకొనిన గర్భిణియగు తరుణిని నిరాకరించి తనిగదా యను పశ్చాత్తాపముచే దుష్యంతుని విరహానలము మఱింత ప్రజ్వరిల్లినది. నిర్దోషయును నిరాధారయునగు నారీరత్నము సభయందుఁ బెనిమిటిచేతను సోదరకల్పుఁడగు శార్ఙ్గరవునిచేతను దిరస్కరింపఁబడునప్పుడు సభ్యులమనంబులకుఁ గలుగు నావేగమును వర్ణింపఁదరము గాదు. కావున మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము, అభిజ్ఞానశాకుంతలము, అను మూఁడు రూపకములను బరీక్షించునెడల వానిలోని, రసపోషణరీతులును, సన్నివేశకల్పనాచాతుర్యమును మొదటిదానికంటె రెండవదానియందును, రెండవదానికంటె మూఁడవదానియం

డను నధికముగా నున్నవనుట నిర్వివాదాంశము. ఇదియు కవియొక్క ప్రతిభాపరిణతికిని గళాపరిణతికిని నిజమైన ఫలముగాని వేఱొండుకాదు. ఈవిషయమును రెండవ వ్యాసములోఁ గొంతసఱకుదాహరించి షేక్స్పియరు యొక్క కళాపరిణతితోఁగలిపి పరీక్షించితిని.

[కాళిదాసుని కళను జర్చించు వ్యాసములలో నియ్యది విపులముగా వివరింపఁ బడును.]

పై వాగమునుబట్టి మాళవికాగ్నిమిత్రము కాళిదాసకృతమే యనియును నయ్యది తత్కృతరూపకములలోఁ బ్రథమ గ్రంథమనియును నిశ్చయింపనగునుగదా!

౪

ఈరూపకమునందు వస్తువు చారిత్రికమనుట తప్పదానిలో నెంతవఱకుఁ జరిత్రాంశమున్నది, యెంతవఱకుఁ గల్పనయున్నది యనువిషయముచేఁ జక్కఁగా నిర్ణయించుటకు మనకాకాలమునాటి చరిత్రమును దెల్పు బలమగు నితరాధారములులేవు. ఆకాలమును సంబంధించిన చరిత్రమును గనుఁగొనుటకుఁ జారిత్రకులు శాసనములను, బురాణములను మాళవికాగ్నిమిత్రమును నాధారములుగా గ్రహియించుటచే నందును నిందలి యంశములే చెప్పఁబడుచున్నవి. కావున నీపుస్తకమునే యొక యాధారముగా గ్రహించిన చారిత్రకుల వ్రాఁతలనుబట్టి దీనిని విమర్శింపరాదు. పుష్యమిత్రుఁడు సుంగవంశమునకు మూలపురుషుఁడనియు మౌర్యవంశమునకుఁ దుదిపురుషుఁడగు బృహద్రథునికడ సేనానాయకుఁడుగానుండి యాతనిఁ జెఱఁబెట్టి రాజ్యము నపహరించుననియును నాతని యనంతరమాతని వంశజులు రాజ్యముఁ జేయుదురనియు నీనపురాణములోని భవిష్యద్రాజేతిహాసములలో నీయఁబడినది. మత్స్యవాయు పురాణములును, భాగవతమును, బ్రహ్మాండపురాణమును నీవిషయముఁ గొంచె మించుమించుగ నొక్కరీతిగనే చెప్పుచున్నవి.

మత్స్యపురాణము. ఆనందాశ్రమ సంస్కృతగ్రంథావళి 54 వ ప్రచురణము. పుట 553 అ. 272.

శ్లో. ఇత్యేతే దశమౌర్యాస్తు యేభోక్ష్యంతివసుంధరామ్,
సప్తత్రింశచ్ఛతంపూర్ణం తేభ్యః శుంగాన్ గమిష్యతి.
పుష్యమిత్రస్తు సేనానీరుద్ధృత్య స బృహద్రథాన్,
కారయిష్యతి వై రాజ్యం షట్త్రింశత్తు సమా నృపః,
భవితాఽపి వసుజ్యేష్ఠః సప్తవర్షాణి వై నృపః,
వసుమిత్రస్తథాభావ్యో దశవర్షాణి వై తతః.

వాయుపురాణము. ఆనందాశ్రమగ్రంథావళి. 49 వ ప్రచురణము. పుట 883 ఆశ్వాసము. 99.

శ్లో. బృహదశ్వ స్సప్తవర్షాణి సప్తవై భవితా నృపః,
ఇత్యేతే యేనవభూపా యే భోక్ష్యంతి వసుంధరామ్.
సప్తత్రింశచ్ఛతం పూర్ణం తేభ్యః శుంగాన్ గమిష్యతి,
పుష్యమిత్రస్తుసేనానీ రుద్ధృత్యవై బృహద్రథమ్.
కారయిష్యతి వై రాజ్యంసమాష్షష్టిం సదైవతు,
పుష్యమిత్రసుతాశ్చాష్టౌ భవిష్యంతి సమానృపాః.
భవితాచాపి తజ్జ్యేష్ఠః సప్తవర్షాణి వైతతః,
వసుమిత్రః సతోభావ్యో దశవర్షాణి పార్థివః.

పయి వాక్యములనుబట్టి సంగ్రహముగ పురిచే స్థాపింపఁబడిన మౌర్యవంశము బృహద్రథునితో (బృహదశ్వుఁడు?) నంతమందుననియు నాయన సేనానాయకుఁడగు పుష్యమిత్రుఁడాతనిని సంహరించి ముప్పదియాఱు సంవత్సరములు పాలించుననియును దెలియుచున్నది గదా! పయి లెక్కప్రకారము పుష్యమిత్రుని రాజ్యకాలము క్రీ. పూ 184 వ సంవత్సరముతో నారంభించుననని నిశ్చయింపనగును. పురాణములుచెప్పిన పయియంశమునే బాణుఁడు తనహర్ష చరిత్రమునందును జెప్పెను "ప్రతిజ్ఞాదుర్బలంచ బలదర్శన వ్యపదేశ దర్శితాశేష సైన్యః సేనానీరనార్యో మౌర్యం బృహద్రథంపిపేష పుష్యమిత్రః స్వామినమ్."

ఈ పుష్యమిత్రుఁడు పాటలీపుత్రమునే రాజధానిగాఁ జేసికొని రాజ్యమును బాలించెను. ఈతని కుమారుఁడగు నగ్నిమిత్రుఁడు తండ్రి జీవించియుండఁగా 'విదిశా' పట్టణమునఁ దండ్రిక్రింద సామంతరాజుగాఁ బరిపాలించుచుండెను. ఈపట్టణము ప్రస్తుతము 'సింధియా' వారిచేఁ బరిపాలింపఁబడుచున్న రాష్ట్రమునందుఁ బ్రవహించు 'బేత్వా' నదీతీరమున 'భిల్సా' అను నామముతో వెలయుచున్న పట్టణముతో నభిన్నమయినది. పుష్యమిత్రుని

రాజ్యము దక్షిణమున నర్మదానదీతీరమువఱకును వ్యాపించియున్నదని తెలియనగును. "అస్తిదేవ్యావర్ణావరో భ్రాతా వీరసేనోనామ, భర్త్రా నర్మదాకూలే (మందాకినీతీరే) అంతపాలదుర్గే స్థాపితః, తేన శిల్పాధికారే కళావిద్యాధిగమే ఇయం యోగ్యేతి భగిన్యై దేవ్యై ఉపాయనం ప్రేషితా" విదర్భదేశపురాజగు యజ్ఞసేనునకును నాతని జ్ఞాతియగు మాధవసేనునకును జరిగిన వివాదములో నీతఁడు ప్రవేశించి యజ్ఞసేనుని నోడించి రాజ్యమును రెండుభాగములుచేసి వరదానదియొడ్డున నున్న యొకభాగము నొకరికిని రెండవభాగము రెండవవారికిని నొసంగెను.

"తౌ పృథగ్వరదాకూలే శిష్టాముత్తరదక్షిణే,
నక్తం దివం విభజ్యోభౌ శీతోష్ణకిరణా ఇవ."

ఇఁక నగ్నిమిత్రుని రాజ్యకాలమును నిర్ణయించుటలోఁ గొంచెము కష్టముకలదు. పుష్యమిత్రుఁడు 36 సంవత్సరములు రాజ్యముచేసిన తరువాత నగ్నిమిత్రుఁడు రాజ్యముచేసెనని భాగవతాది పురాణములు చెప్పుచున్నవి. విమర్శకులచేఁ బ్రాచీనములని యెన్నఁబడిన మత్స్యవాయు పురాణములందుమాత్ర మగ్నిమిత్రుని పేరు లేనట్లు నేనిచ్చిన పైశ్లోకములనుండి తెలియనగును.

కె. పి. జయస్వాలుగారు బీహారు అండు ఒరిస్సా రీసెర్చి సొసైటివారి జర్నలులో (1929వ సం.) యీ క్రిందివాక్యముల ననుసరించి యొకనూతన సిద్ధాంతమును జేయుచున్నారు.

మత్స్యవాయు బ్రహ్మాండపురాణములు:—పుష్యమిత్రస్తు సేనానీ రుద్ధృత్యస బృహద్రథమ్, కారయిష్యతి వైరాజ్యం షట్త్రింశతి సమానృపః,

మత్స్యవాయు పురాణములు:—పుష్యమిత్ర సుతాశ్చాష్టౌ భవిష్యంతి సమానృపాః.

పై వాక్యములయందలి 'కారయిష్యతి వైరాజ్యమ్' 'సమానృపాః' అను పదములఁబట్టి పుష్యమిత్రుఁడు తనకుమారులను నెనమండ్రను సమముగా రాజులను జేసి దేశమును బరిపాలింపఁజేయుచుఁ దాను సేనాపతిగా నేయుండెనని యూహించుట కవకాశమున్నదని చెప్పుచున్నారు. అట్లయినయెడల నీతని కాలమున సార్వభౌముఁడు లేనియొక నూతన పరిపాలకసంఘము నేర్పఱచెననియును దానినే 'వైరాజ్యమ్' అను పేరితోఁ బిలుచుచుండిరేమో యనియు నూహించుచున్నారు. అప్పుడు పుష్యమిత్రుఁడు సేనాపతిగా నుండియే తన యశ్వమేధయాగమును జేసెనని యూహింపనగుననియును వ్రాయుచున్నారు. ఇట్లు పుష్యమిత్రుఁడు సార్వభౌముఁడైన తరువాతఁగూడ సేనాని యనియే పిలువఁబడుచున్నట్లు 'అయోధ్యాశాసనమును బట్టియు మాళవికాగ్నిమిత్రమునందలి యీక్రిందివాక్యమును బట్టియు నూహింపఁదగును.

"యజ్ఞశరణాత్ సేనాపతిః పుష్యమిత్రో వైదిశస్థం పుత్రమాయుష్మంతం అగ్నిమిత్రం స్నేహాత్పరిష్వజ్య అను దర్శయతి."

ఈసేనాపతిశబ్దమువలనఁ బుష్యమిత్రుఁడు సేనాని యని యర్థముచేయఁగూడదనియును మొదట సేనానిగా నుండి తరువాత రాజగుటవలన పుష్యమిత్రునకు సేనాని పుష్యమిత్రుఁడను నామము వాడుకయందు రూఢమయి యున్నదనియును నూహించుట యుక్తమని 'పండిత్' గారు వ్రాయుచున్నారు. జయస్వాలుగా రూహించిన దానికంటె 'పండిత్' గారి సమన్వయము యుక్తముగానున్నట్లున్నది. వైరాజ్యమును దానినొక్కపదముగా గ్రహియించి యప్పుడొక విజాతీయమగు ప్రభుత్వముండెనని యూహించుటకంటెఁ బయికల్పనయే సమంజసమనక తప్పదు. 'వైరాజ్యమ్' అనుదానిని 'వై', 'రాజ్యమ్' అని రెండుపదములుగా విభజించి యర్థము చెప్పుటయే యుక్తమని మనము పురాణశైలిని బరీక్షించునెడలఁ దెలియనగును. 'వై' అనునది పాదపూరణార్థమెన్నియో సారులు ప్రయోగింపఁబడుచున్నట్లు స్పష్టము. ఇఁక 'కారయిష్యతి' యను పదమునకు రాజ్యము చేయించుననికదా యర్థము దానినెట్లు సమన్వయింపనగునని యడుగవచ్చును. సేనాని పుష్యమిత్రుఁడు తాను సార్వభౌముఁడయి యున్నకాలముననే తన పుత్రులిందఱిని దేశముయొక్క వివిధభాగములకు రాజులుగా నియమించి పరిపాలింపఁ జేసెననుటయే యర్థమని యూహింపనగును. దీని కగ్నిమిత్రుఁడు విదిశాపట్టణముననుండి యాభాగమును బరిపాలించుచుండెననుటయే దృష్టాంతమని చెప్ప

నగును. పుష్పమిత్రుని యనంతరము దత్పుత్రుఁడగు నగ్నిమిత్రుఁడు రాజ్యమునకు వచ్చెనని భాగవతాదిపురాణములు చెప్పుచున్నను మత్స్యవాయుపురాణము లాతని పేరిని స్మరింపలేదని నే నుదాహరించిన శ్లోకములఁబట్టి తెల్లమగుచున్నది. పుష్పమిత్రుని యనంతర మేడు వర్షములాయన కుమారుఁడు రాజ్యముచేసినట్లును నాయన యనంతరము వసుమిత్రుఁడు రాజ్యమునకు వచ్చినట్లును క్రిందివాయుపురాణవాక్యములనుబట్టి నిర్ణయింపనగును. "భవితాచాఽపి తజ్జ్యేష్ఠః సప్తవర్షాణి వై తతః, వసుమిత్రః సుతో భావ్యో దశవర్షాణి పార్థివః." మత్స్యపురాణవాక్యమునుబట్టి యీ జ్యేష్ఠకుమారుఁడు వసుజ్యేష్ఠుడని తెలియనగును. "భవితాఽపి వసుజ్యేష్ఠః సప్తవర్షాణి వై నృపః" పయి రెండు పురాణములనుబట్టి యగ్నిమిత్రుఁడే కాలమునను సార్వభౌముఁడయి పరిపాలించినట్లుగాని యాతఁడే తండ్రికి పెద్దకొమరుఁడనిగాని యూహించుట కవకాశము లేదు. కాని తక్కిన పురాణవాక్యములనుబట్టి యగ్నిమిత్రుఁడు కొంతకాలము సార్వభౌముఁడయ్యెనని నిర్ణయించుచున్నారు.

ప్రస్తుతపు గథ జరిగిన కాల మగ్నిమిత్రుఁడు తండ్రి యధికారముక్రిందఁ దక్షిణభాగమును బరిపాలించుచుండిన కాలమేయని నిశ్చయము గావున నీకథ పుష్పమిత్రుని పరిపాలనముయొక్క తుదిసంవత్సరములలో నని చెప్పనగును. పుష్పమిత్రునిపాలన కాలము (184-148 క్రీ. పూ) అందు 155-8 (క్రీ. పూ) సంవత్సరములలో మీనాండరు పుష్పమిత్రుని రాజ్యముపై దండెత్తెనని తెలియవచ్చుచున్నది. ఈమీనాండరు సాకేతపట్టణమును జయించి పాటలీపుత్రము వఱకుఁగూడ వచ్చినట్లు విన్సెంటుస్మిత్తుగారు తమగ్రంథమున వ్రాయుచున్నారు. ఆయుద్ధమునఁ బుష్పమిత్రునికే జయము లభియింపఁగా మీనాండరు వెనుకకుఁ ద్రోసివేయఁబడెను. మాళవికాగ్నిమిత్రమునందు వసుమిత్రుఁడు యజ్ఞాశ్వమును రక్షించుచు యవనులతో యుద్ధముచేసి వారినోడించెనని వ్రాయఁబడెను. "స సింధోర్దక్షిణరోధసి చరన్నశ్వానీకేన యవనానాం నిషిద్ధః, తత ఉభయోః సేనయోర్మహానాసీత్ సమ్మర్దః." ఈసింధునది పంజాబులోని సింధునదిగాదు. రాజపుత్రస్థానములో నున్నది. ఈ యవనులతోడియుద్ధము నే మీనాండరుతోడి యుద్ధమనుట యయుక్తము. దీనికశ్వగ్రహణము నిమిత్తము. ఇంతకు బాటలీపుత్రముపై వీరుఁడగు మీనాండరు దండెత్తి వచ్చినప్పుడు పుష్పమిత్రునివంటి సేనాని తన మనుమని మాత్రమంపి యూరకుండుననుట యుక్తముగా లేదు. కాబట్టి వసుమిత్రుఁడు యవనులను జయించి యజ్ఞాశ్వమును దీసికొని వచ్చుటకును మీనాండరు పాటలీపుత్రముపై దండెత్తుటకును సంబంధము లేదు. ఇంక నశ్వమేధయాగమును బుష్పమిత్రుఁడు నాముకాలమున శత్రువులనందఱను జయించి శాంతుఁడై స్థిరముగాఁ డై యున్నప్పుడు చేసెననుట యుక్తముగదా! కావున నశ్వమేధయాగప్రయత్నము క్రీ. పూ. 158 వ సంవత్సరమునకు దరువాతనే జరిగియుండుననుట నిశ్చయము. పుష్పమిత్రునిచేఁ దోలఁతఁ బారదోలఁబడిన యవనులు సింధునదీప్రాంతములయందింకను నుండఁగా వారితో వసుమిత్రునకు యుద్ధము జరిగెననియును నూహించుట యుక్తము. 'అశ్వానీకేన యవనానాం నిషిద్ధః' అని చెప్పుటవలన యవనసైన్యము తోడనే యతనికి యుద్ధము జరిగెను గాని మీనాండరు సేనాపతిగా నుండినప్పుడు గాదని తేలుచున్నది. సింధునదికి దక్షిణప్రాంతమునందున్న యవనసైనికులు కొందఱు దిగ్గనఁ దిరుగుచున్న పుష్పమిత్రుని సవనాశ్వముఁ గాంచి యింతకుమున్నాతనిచే నోడింపఁబడినవారు గావున నాకారణమున దానింబట్టగా వారికిని వసుమిత్రునకును యుద్ధము జరిగెననుట యుక్తము. కావున క్రీ. పూ. 158 సం॥ నకును క్రీ. పూ. 148 వ సంవత్సరమునకును నడుమ నీయశ్వమేధము జరిగెనని యూహింపనగును. కాబట్టి మనకథాకాలమీ యైదుసంవత్సరములలో నెప్పుడో యైయుండవచ్చును.

ఇఁకఁ గ్రీస్తు పూర్వము 57 వ సంవత్సరమును సంబంధించిన విక్రమార్కుని కాలముననే కాళిదాసుఁడుండినయెడల (నూతను మొదటివ్యాసము) నీతనికిని గథా కాలమునకును సుమారు 100 వత్సరములు భేదమున్నదని చెప్పవచ్చును. కావునఁ గాళిదాసున కగ్నిమిత్రునిచర్యలన్నియును పెద్దలవలన వినఁబడినవిగాక

యుండుననుట యుక్తము. తనకాలములోని వారందఱి కును నీచరిత్రము పరిచితమనియే గాఁబోలు దీనిని గాళి దాసుఁడు దన తొలినాటకమునకుఁ గథగా నెత్తుకొనెను. ఈతఁడీకథ వ్రాయునప్పటికి పాటలీపుత్ర సింహాసనము పయి శుంగవంశప్రభుఁడిరాజు పరిపాలించుచుండెనో లేక కొలదికాలమునకు ముందే శుంగవంశమంతరించి కాణ్వులు పరిపాలనమునకుఁ దొడఁగిరో తెలియనవకాశము లేదు.

రూపకమునందు వచ్చిన పాత్రములలో, నగ్ని మిత్రుఁడు, వసుమిత్రుఁడు, పుష్యమిత్రుఁడు నను మూవు రును చారిత్రక పురుషులనుట నిర్వివాదము. యజ్ఞ సేనుఁడు వీరసేనుఁడు మాధవసేనుఁడు, గూడ చారిత్రక పురుషులై యుండవచ్చునని నాకు తోఁచుచున్నది. మాళవి కాదులు కల్పితపాత్రములో లేక చారిత్రకములో చెప్పఁ జాలముగాని పరిచారికాగులు మొదలగువారు కల్పితపా త్రములనియే చెప్పక తప్పదు.

మాళవికాగ్నిమిత్రముఁ బోలిన కథయే గుణా ఢ్యుని బృహత్కథయందున్నదని కథాసరిత్సాగరమునం దలి బంధుమతీచరిత్రమునుబట్టి యూహింపనగును. కాని కాళిదాసుఁ డీకథను గ్రహించి వ్రాసెననుట యసందర్భ మేమోయని తోఁచుచున్నది. గుణాఢ్యుఁడు క్రీ. వె మొదటి శతాబ్దమునందుండి యుండవచ్చునని యయ్యరుగారు చెప్పుచున్నారు.

౫

మాళవికాగ్నిమిత్రమునందలి కథాపటము నల్లు నప్పుడు కవి దేశకాలౌచిత్యములనెట్లు చేర్చి కలిపెనను విషయమును బరీక్షింపవలయును. ఇందలి కథయొక్క ఫలము మాళవికాగ్నిమిత్రుల వివాహము. అగ్నిమిత్రుఁడు మాళ వికాకృతిని జిత్రపటమునఁ జూచినది మొదలు నామె విదిశా పట్టణమును జేరుటకొక పెద్దకథ గలదు. అకథయంత యును రంగముపైఁ బ్రదర్శింపఁబడుటకు వీలులేక కవి దానిని మొదటి విష్కంభకమునఁ జెప్పించి వేసెను. మాధవసేనుఁడు విదిశాపట్టణమునకు బయలుదేరుట మొద లుగా మాళవికయుఁ బరివ్రాజికయు వచ్చిచేరువఱకును గల కథ మాత్రమే రంగప్రదర్శితమగు కథకంటెఁ బెద్దది గాను నెక్కువ రుచికరములగు సన్నివేశములు గలదిగాను రసపోషణమునకు మిక్కిలియు ననువైన పట్టులుగలదిగా నున్నది. తుదియంకమున నున్న వసుమిత్రునిజయము, పుష్యమిత్రుని యాగము మొదలగువిషయములు గూడ మధ్యమున్న కథకంటె నెక్కువరుచికరముగా నేయున్నవి. రంగప్రదర్శిత కథాభాగము మౌర్యసామ్రాజ్యమునకును విదర్భరాజ్యమునకును సంబంధించియున్నది. విశాలమగు పటములో నత్యల్పభాగమును మాత్రము కవి చూపింప సాగెను. ఈమధ్యభాగముతోడి సంబంధమున్నను లేకు న్నను మిగిలిన కొన్ని సంగతులను గవి సూచింపక తప్పి నదిగాదు. మాళవికాగ్నిమిత్రుల ప్రణయకథయను భాగ మునకు సామ్రాజ్యకథతోఁ గల సంబంధము వీలైన చోట్లనెల్లను గవి చూపించుటకుఁ బ్రయత్నించెనుగాని యీ యుక్తులన్నియు నతుకులట్లే యున్నవి. ప్రథమాంక మునందు విదర్భరాజుపయి దండెత్తుటకు సైన్యమును బంపవలసినదిగా నుత్తరువయ్యెనని మన మెఱుఁగుదుము గాని యా తరువాత నదియేమయ్యెనో దానివలన నన కథానాయకునకుఁగాని, నాయికకుఁగాని యెట్టిసంబంధ మున్నదో మన మెఱుఁగఁజాలము. ఆవిషయమప్పుడే విస్మృ తమగుచున్నది. 2, 3, 4 అంకములలో మరల నీరాజ కార్యప్రసంగమే మన మెఱుఁగము. అయిదవ యంకమున మాత్రము ప్రవేశకమూలమున వసుమిత్రుఁడు యజ్ఞరక్ష ణార్థము పోయియుండెనని సూచింపఁబడుటవలన రాజ కార్యవిషయకమగు మఱియొక సూత్రము గ్రహింపఁ బడినదేగాని ప్రథమాంకగృహీత సూత్రము విస్మృత మయినట్లేయుండి పునః పరామర్శ లేకుండెనది. మాళవి నయిదవయంకము తుదనే యీరెండుసూత్రములను దెచ్చి కథకుఁ గలుపఁబడినవి. వసుమిత్రుఁడు యజ్ఞరక్షణార్థము వెడలెననియును నాతఁడు ధారిణీకుమారుఁడనియును మన మెఱుంగుదుమేగాని యాతనికిని, యాలనికార్యమగు యజ్ఞరక్షణమునకును ప్రధానప్రయోజనమగు నాయికా నాయకులసమాగమముతో నియతమగు సంబంధము లేక పోవుటచే నాకథాభాగమునందు మనకేమియును బట్టుద లయు రుచియుఁ గలుగదు. కుమారవిజయముచే ధారిణి యానందపరవశయయి మాళవికను రాజునకర్పించినదేమో

యని యూహింపఁదగును గాని యంతకుముందే యామెకిట్టి సంకల్పముగలదని విదూషకునిమాటలవలనఁ దెలియనగును. మొట్టమొదట మాళవికాపరిచయము కలుగునంతటనే యామె యొక్క యున్నతకుటుంబజాత యని మనకు స్ఫురియింపఁజేయుటకీ వాక్యములను గవి గణదాసునిచేఁ జెప్పించెను. "భద్రే! తద్విధానసులభత్వాత్ పృచ్ఛామి." "ఆకృతి వినయప్రత్యయాత్ ఏనామసామాన్యవస్తుకామ్ సంభావయామి" నిశ్చయరహితములగు నీవాక్యములు మన కామె జన్మాదికమును గుఱించి మొదట్లోఁ గొంత కౌతూహలమును గల్పించును గాని తుదియంకమునకుఁ బోవునంతకు కౌతూహలము గొంచెమును సంశిపోవును. ఇంతకును మాళవికయొక్క యున్నతజన్మమును దెలుపుటవలనఁ బాఠకుల మనస్సులలో నామెను గుఱించిన పక్షపాతమును, నట్టిదైనను రాజుతో నామెకు వివాహము గలుగునాయను నాశయును గల్గించుటకంటె వేఱుప్రయోజనము లేదు. ఈమె యుత్తమకుల సంజాతయని మనకుఁ గవి చెప్పునప్పటికి మాళవికాగ్నిమిత్రుల వివాహము చాలసమీపించి సిద్ధమైయుండును గావున నీయావిషయము తెలియుటవలన మనకు గలుగవలసినంతటి యానందము గలుగదు. పెండ్లియైనది నీజకులజ గాదు గదా యను శాంతిమాత్రమే కలుగుచున్నది. ముఖ్యముగ ప్రాయకథయందును పాఠకుల నాకర్షింపఁగల బలమంతగాఁ లేకుండుటచే నీకథ యూర్వశీపురూరవసుల చరిత్రమువలెఁ గాని, శకుంతలాచరిత్రమువలెఁ గాని పాఠకవర్గమునకు ఘనమైక చిత్తతను గల్గింపఁజాలదు. ఇంతియగాక మాళవికను బెండ్లియాడుటకు రాజునకుఁ గల ప్రతిబంధములు కూడ తాను దాటలేనంతటివి కావు గావునను, నాతఁడామెపై మోహముగొని యున్నాఁడు గావునను, స్త్రీలహృదయమును సులభముగా వశముఁజేసికొని వారియనుమతిని రాజు పొందఁగలఁడు గావునను బాఠకులకు సిద్ధప్రాయమైన మాళవికాగ్నిమిత్ర వివాహకార్యము నందును విశేషము పట్టుదల కలుగదు. "సంవత్సరోపావర్తనీయో నిరర్గళస్తురగో విసృష్టః" అని చెప్పుటచే వసుమిత్రుఁడొక్క సంవత్సరమునకుముందే తురగరక్షణార్థము వెడలియున్నను నాతనిగుఱించి కొంచెమైనను గవి తెలుపకుండుటయు విశేషము రసోత్కర్షను గలిగింపఁజాలదు. ధారిణి వసుమిత్రుని యాగమనమును గుఱించి బ్రాహ్మణులకు దానములు చేయుచున్నదని యైదవయంకము మొదటమాత్రమే కవి చెప్పెను. దీనినిబట్టి చూడఁగాఁ గవి యీయజ్ఞమునకును ప్రాయకథకును సంబంధమును గల్పించుటయందిష్టము గలవాఁడై యున్నను నట్టి సంబంధమునుగూర్చుట కాతని కవకాశము లేకపోయెనని తెలియుచున్నది. ముందుపయోగపడునట్టి సర్పముద్రాంగుళీయక సంపాదనమును గవి ప్రథమాంకముననే సూచించుట యెంతయుఁ బ్రశంసనీయము. రూపకమునందుఁ బ్రదర్శింపఁబడిన వస్తువులో 'యాదృచ్ఛికసంఘటన' లేక 'దైవికకార్యసంఘటన' (The introduction of the Accident) చాల స్వల్పముగా నున్నది. ఇంతియగాక యీకథయందతిమానుష విధానములకు (The introduction of the Supernatural) విశేషమవకాశము లేదనియు ముందే తెలిపియున్నాను. ఇన్ని విషయములలోఁ గూడ లోటులున్నట్టుల విమర్శనపై దేలినను మొత్తముమీఁదఁ గథఁ జదివినప్పుడానందము పుట్టకయుండదు. కావుననే యీకావ్యము రసవంతమని చెప్పనగును.

ఇఁక మాళవికాగ్నిమిత్రము రూపకములలో నే తెగకుఁ జేరినదో విమర్శింపవలయును. దశరూపకములలో నాటకలక్షణము.

"నాటకం ఖ్యాతవృత్తం స్యాత్పంచసంధిసమన్వితమ్
విలాసర్ధ్యాదిగుణవద్యుక్తం నానావిభూతిభిః
సుఖదుఃఖసముద్భూతి నానారసనిరంతరమ్
పంచాదికా దశపరాస్తత్రాంకాః పరికీర్తితాః
ప్రఖ్యాతవంశో రాజర్షిః ధీరోదాత్తః ప్రతాపవాన్
దివ్యోఽథ దివ్యాదివ్యో వా గుణవాన్నాయకో మతః
ఏక ఏవ భవేదంగీ శృంగారో వీర ఏవ వా
అంగమన్యే రసాస్సర్వే కార్యో నిర్వహణేఽద్భుతః
చత్వారః పంచ వా ముఖ్యాః కార్యవ్యాపృతపూరుషాః
గోపుచ్ఛాగ్రసమాగ్రంతు బంధనం తస్య కీర్తితమ్."

మాళవికాగ్నిమిత్రమునందలి కథ చారిత్రకము గావున నిట్టిది ప్రఖ్యాతమనియే చెప్పనగును. సంధి

విభాగము వెనుకఁజేయఁబడును. విలాసమనఁగా నాయకునియొక్క చిత్రమైనదృష్టియుఁ గతియు, సస్మితముగానున్న వాక్కులునుగావున నవి యిందున్నవని చెప్పనగును. ఋద్ధియనఁగా నాయకుని యభ్యుదయము. అదియును నిందున్నది. న ఖదుఃఖసముద్భూతికిఁ దావలము. అంకములయిదున్నవి. ప్రఖ్యాతవంశ్యుఁడును రాజర్షి యునగు నగ్నిమిత్రుఁడు నాయకుఁడు. ఈతఁడు శృంగారప్రధానుఁడగు నాయకుఁడయ్యును కేవలము స్త్రీలోలుఁడు మాత్రమేగాక ప్రతాపవంతుఁడని చెప్పుటకుఁ గవి యజ్ఞసేనాదులతో యుద్ధమును గల్పించెను. ఈతఁడు ధీరోదాత్తుఁడు, గుణవంతుఁడు. ఓర్పు (క్షమ) గలవాఁడు గావుననే మదనసాయకతప్తుఁ డయ్యును నంతఃపుర స్త్రీలయెడఁజూపవలసిన యాదరమునకు లోటు రాకుండ వారి యనుమతిపైనే వివాహమునకుఁగడంగెను. మాళవికాగ్నిమిత్రుల శృంగారరసమే కావ్యవ్యాపియై యున్నది గనుక నిందుఁ బ్రధానరసము శృంగారమనియే చెప్పవలయును. అన్యరసములును నంగములుగా బ్రవేశించి యున్నవి. నిర్వహణసంధియందు మాళవికను విదర్భదేశాగతపరిచారికలు సత్కరించునప్పు డద్భుతరసము. విదూషకుని చర్యలచే నక్కడక్కడ హాస్యరసము. కౌశికి మార్గమునఁ దనకుఁ గిరాతకసైన్యములచేఁ గలిగిన విపత్తును వర్ణించునప్పుడు భయానకరసము. వసుమిత్రుని యొక్క విజయములను వర్ణించునపుడు వీరరసము. సుమతి మరణవర్ణనముకరుణము. ఇట్లు దక్కిన రసములును నంగములుగా నక్కడక్కడఁ గొంచెము గొంచెముగా స్ఫురించియున్నవి. నాటక కథావిధానమునందు సంధిసమన్వయముచేయుట కొంచెము కష్టమగుపని. దీనిని నిర్ణయించునప్పు డభిప్రాయభేదములు సాధారణముగాఁ గలుగుచునేయుండును. కొన్ని నాటకములందు నియ్యవి స్ఫుటముగానుండవు. ఇందలి యైదంకములును నైదుసంధులని చెప్పవచ్చును. 'ఇతివృత్తస్య భాగాస్స్యుః పంచసంధయః'. నాటకఫలము మాళవికాగ్నిమిత్రులవివాహము. ప్రథమాంకమున రాజుమాళవికా చిత్రమునుజూచినప్పటినుండియును మాళవికారూపమును బ్రత్యక్షముగాఁ జూచుట కిచ్ఛగలిగియే యుండుటచే

మొట్టమొదటనే యారంభావస్థవచ్చినది. రెండవ యంకమునందు మాళవికా నాట్యాదులవలన నామెఁగాంచి యామెయందును ప్రేమబీజమును నెలకొల్పుటవలన యత్నావస్థయని చెప్పవలయును. మూఁడవయంకములో మాళవికాసమాగమముకొఱకు రాజు నిరీక్షించుచు నిరాపతికిఁ దానుజేసిన వాగ్దానమును స్మృతికిఁదెచ్చుకొని కార్యమునెట్లు సాధించుటయని యుపాయాపాయములఁ జింతించుచుండుటచే ప్రాప్త్యాశ. నాల్గవ యంకమున విదూషకుని యుపాయముచే మాళవికాసంయోగము నిశ్చయముగావున నియతాప్తి. అయిదవయంకమునందు మాళవికావివాహముచే ఫలాగమము. అర్థప్రకృతులగు బీజాదులను నిరూపించుటకు మాళవికాగ్నిమిత్రవ్యాఖ్యాతయగు కాటయవేముఁడు ప్రయత్నించెనుగాని బీజబిందువులను గొన్నిసంఖ్యాంకములను నిరూపించి విడిచెను. 'అపూర్వేయం దారికేత్యారభ్య దర్శనపశ్చాత్ రక్ష్యేత ఇత్యంతేన వాక్యకదంబేన గమ్యమానః మాళవికాం ప్రతి రాజ్ఞోఽభిలాషః అత్రనాటకే బీజమిత్యనుసంధేయమ్.' రాజునకు మాళవికా దర్శనమునందు గల యభిలాషయే బీజమని పైవాక్యముల యభిప్రాయము. ప్రథమాంకముయొక్క తుదిని దేవీకోపముచేతఁ గథావిచ్ఛేదము జరుగుచుండఁగా నట్లు కాకుండుటకు విదూషకుఁడు గణదాసునిఁ బ్రోత్సాహముచేసి యాతనికిఁ గోపము పుట్టించి కలహమునకు కలహము గల్పించును. ఇయ్యది యేబిందువు.

"అత్రదేవీకోపేన విచ్ఛేదే ప్రాప్తే విదూషకకృత ప్రోత్సాహనస్య ఉత్తరాంకోపయోగిత్వేన అవిచ్ఛేద కారణత్వాద్ బిందురిత్యను సంధేయమ్."

మొదటియంకమున నారంభావస్థయును బీజమును గలియుటచే ముఖసంధి కలిగినది. రెండవయంకమున బిందువును యత్నావస్థయును గలియుటచేఁ బ్రతిముఖసంధిగలిగినది. ఇఁక మూఁడవసంధియగు గర్భసంధిని నిరూపించు సమయమునఁ గాటయవేముఁ డిట్లు వ్రాయుచున్నాఁడు. "సాతపస్వినీతి......అత్రప్రాప్తి సంభావనయా ప్రాప్త్యాశానామ తృతీయావస్థాసూచితా, అనయా ప్రాప్త్యాశయా బిందోః సమన్వయాద్గర్భసంధిరితి

మంతవ్యమ్." ఈబిందు వెక్కడిదని మనము పరీక్షించిన యెడల రెండవ యంకపుటుదిని రాజు మాళవికమీఁదతప్ప నంతఃపురస్త్రీ లెవ్వరిపైనిఁ గూడఁ బ్రేమగలవాఁడను గానని చెప్పు శ్లోకమును వ్యాఖ్యానముసేయు సందర్భమున వ్యాఖ్యాత యిట్లువ్రాసెనని తెలియనగును. "అత్రాఽంకే మాళవి కానిమిత్తగనేకకథావిచ్ఛేదేఽపి సర్వాంతః పురేభ్యోఽదినా గమ్యమానో రాజ్ఞోఽభిలాషాతిశయః ఉత్తరాంక కథాహేతుత్వాత్ బిందురిత్యనుసంధేయమ్." ఇట్లు చెప్పుటకంటె నిరానతికథనే పతాకగా నెంచుకొని దానికిఁబ్రాప్త్యాశతోఁ గలుగుసంబంధము మూలమున గర్భసంధిగల్గినదనుట యుక్తమని నాకుఁ దోఁచుచున్నది. "వ్యాపిప్రాసంగికం వృత్తం పతాకేత్యభిధీయతే—యథాశాకుంతలేవిదూషకస్య చరితమ్" కాటయవేమునిప్రకారము రాజునభిలాషాతిశయమునే బిందువుగా (వర్థప్రకృతి) దీసికొనుటయుక్తముగా గనుపట్టదు. రాజునభిలాష యవస్థావిశేషముగాని యర్థప్రకృతి గాదు. ఇంతకును బతాకకును బ్రాప్త్యాశకును గలుగు సంబంధముననే గర్భసంధి గలుగుననుట సుప్రసిద్ధము. నాల్గవయంకమున విమర్శసంధిని నిరూపించుచు 'విదూషకః—అస్త్యత్రోపాయః' అనువాక్యముపై వ్యాఖ్యానము నిట్లు వ్రాసెను. "అత్ర రాజ్ఞః కర్ణే విదూషకోక్త ఉపాయః నియమేన మాళవికాప్రాప్తిహేతుత్వాత్ నియతాప్తిర్నామ చతుర్థావస్థానూచితా, అత్ర ప్రాగ్వం ప్రకరీస్థానోక్తబీజస్యాఽనయానియతాప్త్యా సమన్వయాదవమర్శోనామ చతుర్థసంధిః ప్రతిపాదితఇతి మంతవ్యమ్." పైసమన్వయము ప్రకారమునిందుఁ బ్రకరీశేదనియుఁ దస్థానమున బిందువు వచ్చినదనియును కాటయవేముని యభిప్రాయము. దీనిననుసరించియే మూఁడవ యంకపు వ్యాఖ్యానము తుదిని "అత్రబీజానుసంధానాదాక్షేపో నామసంధ్యంగ ముక్తం భవతి. ఇదమనుసంధానమేవోత్తరాంకకథోపయోగిత్వాద్బిందు రిత్యనుసంధేయమ్." అనివ్రాసియున్నాఁడు. "ప్రాసంగికం ప్రదేశస్థం చరితం ప్రకరీమతా—యథాకులపత్యంకే రావణజటాయుసంవాదః." అనులక్షణమునుబట్టి విదూషకుని ప్రయత్నమే ప్రకరియని నిర్ణయింపనగునని నాకుఁ దోఁచుచున్నది.

ఈప్రయత్నము కథకు మిక్కిలియు నావశ్యకమైనది. విదూషకుఁడు చెప్పినమాటల వలననేగదా నియతాప్తి వచ్చినది. అతని ప్రయత్నమునే ప్రకరియని చెప్పవచ్చునాయని యెవ్వరైనను సందేహింపవచ్చును. కాని నియతాప్తియనునది యవస్థాభేదము గావున నొక్కరిమాటల వలన నాయవస్థ నాయకునియందుఁ గలుగుట కనుపపత్తి లేదు. అట్లు నియతాప్తి కలిగినయనంతరము విదూషక ప్రయత్నముచే సంధికలిగినదని చెప్పవచ్చును. కావునఁ బైసంశయము పుట్టుటకే యవకాశము లేదు.

పై ప్రకారమున నేగాక నియతాప్తికిని బూర్వాంకోక్తమగు పతాకకును (ఇరావతీచరిత్రము) నీయంకమునందు సంబంధముగలుగుటచే విమర్శసంధియనిగూడ ననవచ్చును. కాని రెండవ పద్ధతికంటె మొదటిపద్ధతియే నాకు మంచిదిగాఁ దోఁచుచున్నది. అయిదవయంకమునందలి యుపసంహృతిసంధిని గురించి నిర్ణయముచేయు సమయమున 'కాంతాం విచింత్య సులభేతరసంప్రయోగాం—' అను శ్లోకమునకు వ్యాఖ్యానముసేయుచుఁ గాటయవేముఁ డిట్లు వ్రాయుచున్నాఁడు. "అత్రమాళవికారూపబీజానుసంధానాత్సంధిర్నామ నిర్వహణ సంధ్యంగముక్తం భవతి" ఇంతకు ముందు నాల్గవయంకముతుదిని "ఇదం మాలవికాకృతముద్యానపాలికానుసరణ ముత్తరాంకోపయుక్తత్వాద్బిందు రిత్యనుసంధేయమ్." అని చెప్పియున్నాఁడు. దీనిని బట్టి మూఁడు నాలుగంకములయందు యిక్కడను బిందుయోగముచేతనే యుపసంహృతిసంధి యను నభిప్రాయమువలె గనుపట్టుచున్నది. ఇఁకను పసంహృతిసంధి ఫలాగమమనెడి యవస్థతోడను, కార్యమనెడు నర్థప్రకృతితోడను గలుగుచున్నదనుట శాస్త్రసమ్మతము. ఫలాగమమునకు లక్షణము "సావస్థా ఫలయోగః స్యాత్ యః సమగ్రఫలోదయః" పంచమాంకమున రాజు విదూషకునితో "సఖే మదనేనానువృత్యా నివృత్తేర్న్యాయా ధారిణ్యాః పూర్వచరితైః సంభావ్యతే ఏతత్." అని చెప్పు వాక్యములనుబట్టి ఫలసిద్ధియైనదను నూహ స్థిరపడుచున్నది. ఇదియే ఫలాగమమనెడువవస్థ. "బాధకబాధనేన ఫలపర్యంతత్వాదార్ఢ్యం ఫలాగమ ఇత్యర్థః" అని ప్రతాపరుద్రీయ వ్యాఖ్యానమున 'ఫలాగ

మావస్థ విపరింపఁబడినది. కార్యమునకు లక్షణము "అపేక్షితం తదుపాత్తాన్న్యమారంభో యన్నిబంధనః సమాపనం తు యత్సిద్ధ్యై తత్కార్యమితి సమ్మతమ్". ప్రతాపరుద్రీయమునందు "కార్యం నిర్వాహకృత్ ఫలే" యని లక్షణము వ్రాయఁబడెఁగా "కార్యమితి ప్రధానఫలనిర్వాహకో౽ంతిమః కథాంశః కార్యమిత్యర్థః" అని వ్యాఖ్యానము చేయఁబడినది. ఈలక్షణములఁబట్టి యైదవయంకమునందలి కార్యము ధారిణి మాళవికను రాజున కిచ్చుట. 'దేవీ—(మాలవికా ముపగుంఠనవతీం కృత్వా) ఆర్యపుత్ర! ఇదానీమిమాం ప్రతీచ్ఛ' అని యైదవ యంకమునందుఁ జెప్పుచున్నది. కార్యమునకును ఫలాగమమునకును సంబంధముగుటచే నీయంకమున నుపసంహృతిసంధి యని చెప్పఁబడును. అర్థప్రకృతుల యొక్కయు నవస్థల యొక్కయు సామాన్యప్రయోజనమును గుఱించియు వస్తువునందవి యెట్లు నియతములను విషయమును గుఱించియు ముందువ్యాసములలో విపరింపఁబడును.

ఇఁక నీనాటకముయొక్క కాలపరిమితిని నిర్ణయింపవలయును. పంచమాంకమునఁ బరివ్రాజిక, మాళవిక యొక సంవత్సరము సేవకురాలుగానుండి యనంతరము త్తముఁడగు భర్తను బొందఁగలదని చెప్పుచున్నది "సంవత్సరమాత్రమియం ప్రేష్యభావమనుభూయ—" ఈమాటలను బట్టి మాళవిక యంతఃపురమున నొక్క సంవత్సరము పరిచారికగా నుండెనని నిశ్చయము. పుదని వసుమిత్రుఁడు యజ్ఞాశ్వము నొక సంవత్సరము రక్షించి జయముతోఁ దిరిగివచ్చెనని చెప్పఁబడుటచే నాతఁడు యజ్ఞరక్షణార్థము బయలు వెడలుటయు మాళవిక సేవకురాలుగాఁ బ్రవేశించుటయు నొక్కకాలముననే జరిగియుండవలయును. మొదటి విష్కంభకమునకు ముందే యొక కాలమున రాజు మాళవిక చిత్రమును జూచియుండవలయును. చూచిన యల్పకాలముననే విదూషకునితో మాళవికను జూడవలయును గావున నెద్దియేని యవకాశము గల్పింపుమని యడిగియుండును. మఱికొన్ని దినములకే ప్రథమాంకము ప్రారంభమగుచున్నది. రాజకార్యములయందు మంత్రియగు వాహతకుఁడు విదర్భరాజు నోడించుటకై సేనలఁ బంప నాజ్ఞాపింపఁబడెను. ప్రేమకార్యముల మంత్రియగు విదూషకుఁడును నాసమయముననే వచ్చి మాళవికాదర్శనమున కుపాయమును బన్నితినని చెప్పును. మొదట మాళవిక చిత్రమును జూచుటకును ప్రథమాంకమున మంత్రితోఁ గలియుటకును నడుమ చాలి కాలముండుట కవకాశము లేదు. ఇప్పుడు పైనరాజు చాలఁ గాలము నిరీక్షింపఁజాలఁడు. ప్రథమాంకమును ద్వితీయాంకమును మొదటి మధ్యాహ్నముననే పూర్తియయ్యెను. ప్రథమాంకమునందలి మాటలవలననే వారందఱును సంగీతశాలకుఁ బోయి ప్రదర్శనమును గాంచినట్లు తేలుచున్నది. ఆనాటికిఁ బరీక్షను నిలిపి హరదత్తుని మఱునాఁడు పరీక్షింతునని రాజు వెడలిపోయెను. "త్వదీయముపదేశం శ్వో ద్రక్ష్యామః." అప్పుడే వసంతకాలము గూడ నారంభమై యుండవలయును.

మూఁడవ యంకమునందలి ప్రవేశకమున పచ్చు పరిచారికల మాటలవలన హరదత్తుని పరీక్ష జరిగినదనియు గణదాసుఁడే శిష్యాధిక్యముచే నధికుఁడని నిర్ణయింపఁబడెననియు మాళవిక కృశించి యున్నదనియుఁ దేలుచున్నది. "మాళవికా వ్యేషు దివసేషు అనుభూతము త్తేం మాలతీమాలా మ్లాయమానా లక్ష్యతే" ఆయంకముననే రాజుగూడ 'ఆత్మానమనోకృత్య—"శరీరం క్షామం స్యాద సతి దయితాలింగనసుఖే" అని చెప్పుచుఁ దాను కృశించినట్లు తెల్పుటచే రెండవయంకమునకును మూఁడవ యంకమునకును నడుమ నెన్నివారములైనను జరిగియుండవలయును. మూఁడవయంకపుఁ బ్రవేశకమును నాటకపరిధియును నొక్కదినముననే జరిగియుండవలయును. "మధుకరికా అహమప్యస్య చిరాయమానకుసుమోద్గమస్య తపనీయాశోకస్య దోహదనిమిత్తం దేవ్యై నివేదయామి." అని చెప్పి యానాఁడే దేవికా విషయమును నివేదించెను గావున నానాఁడే యశోకదోహదము గూడ జరిగెనని యూహింపనగును. "రక్తకురబకాణ్యపాయనం ప్రేష్య వనవసంతావతారవ్యపదేశేన—" అని చెప్పఁబడిన వాక్యమువలనను ముందు వచ్చు సర్గము వలనను నది వసంతావతారసమయమని తెలిసికొనక తప్పదు. ఆదినమునుండి యైదుదినములలో నశోకము పుష్పింపవలయునని ధారిణి చెప్పుటచేసియు నాల్గవయంకము తుదిని "అపూర్ణ

ఏవ పంచరాత్రే దోహదస్యముఖులైః సన్నద్ధస్తపనీయాశోకః" అని చెప్పుటచే మూఁడవ యంకమునకును నాల్గవయంకము తుదికిని మూఁడు నాలుగు దినములకంటె నెక్కువ యవధి లేదని నిర్ణయింపనగును. మూఁడవ యంకమున రాజును మాళవికయుఁ గలిసియుండుటఁ జూచి యిరావతి వెంటనే కోపముతో వెడలిపోయి ధారిణితోఁ జెప్పి యాదినముననే యామెను బందీకృతఁ జేయించియుండును. ఆమరునాఁడే విదూషకుఁడామెను విడిపించెననుట స్పష్టము. "హ్యఃకిలాత్ర భవతీం-వతీ..." నాల్గవ యంకాంతమున విదూషకునిపై సర్పకాష్టము వేసిన తరువాత నిపుణిక 'మా తావద్భర్తా ప్రవిశతు ఇహ కుటిలగతిః సర్ప ఇవ దృశ్యతే' అని చెప్పుటఁబట్టి సాయంకాలము సమీపించినదనియును సర్పమునకును సర్పాకారకాష్టమునకును గల భేదము తెలియలేదనియును నూహింపనగును. ఇది దోహదమైన తరువాతి మూఁడవ దినము సాయంకాలము. నాల్గవ నాఁటియుదయముననే తరువాతి ప్రవేశకము జరిగెనని చెప్పవలయును. ధారిణి బ్రాహ్మణులకు ధనమును దానముచేయుట యుదయముననే జరిగెననుట యుక్తముగదా! అయిదవయంకమా సాయంకాలముననే ముగిసినదని చెప్పనగును. అశోకవృక్షసత్కారము మయ్యది పుష్పించిన వెంటనే జరుగుట యుక్తముగావున నాదినముననే మిగిలిన క్రియాంతరయును జరిగియుండును. రాజునకును మంత్రికిని బ్రథమాంకమున జరిగిన సంవాదము నారంభించి నాటకము పరిసమాప్తియగువఱకు మూఁడు వారములకంటె నెక్కువ పట్టియుండదని చెప్పనగును. రెండవయంకమునఁ బ్రత్యాసన్నమని చెప్పఁబడిన వసంతకాల మైదవయంకమునఁ గించిత్పరివృత్తి యౌవనమని చెప్పఁబడుటచేఁ బై సంభావన మఱియు పరిపోషమగుచున్నది. ఈ పైరీతినే కాలవిభజనమును 'కాళే'గారు తమ మాళవికాగ్నిమిత్రోపోద్ఘాతమున వ్రాసియున్నారు. పై వాదమంతయును సోపపత్తికముగా నున్నది గాని యొక్క విషయమునుమాత్రము కాళేగారు పరిశీలింపలేదు. ప్రథమాంకమున రాజు విదర్భరాజ్యముపై దండెత్తఁబంపిన సైన్యము విదిశాపట్టణమునుండి బయలుదేరి విదర్భదేశమునకేగి వారితో యుద్ధముఁజేసి జయించి యక్కడినుండి మూఁడువారములలో వచ్చెననుట యెంతవఱకు యుక్తము అను విషయమును జర్చింపవలయును. ఈసైన్యమూరకపోయి యేసంధినో జేసికొని వచ్చెననుటయు నీక్రింది వాక్యములచేఁ బొసగదు. "వశీకృతః కిలవీరసేనప్రముఖైః భర్తుర్విజయదండైః విదర్భనాథః—

విరచితపదం వీరప్రీత్యాసురోపమ సూరిభి
శ్చరితముభయోర్మధ్యేకృత్వా స్థితం క్రథకైశికాః
తవహృతవతో దండానీకైః విదర్భపతేఃశ్రియం
పరిఘగురుభిర్దోర్భిః శౌరేః ప్రసహ్య చ రుక్మిణీమ్"

ఇక నీవీరసేనుఁడు రాజునకు బావయును సంతపాలదుర్గపాలకుఁడును నర్మదాతీరస్థుఁడునగు వీరసేనుఁడా వేఱొకఁడాయని చర్చింపవలయును. ఈవీరసేనుఁడు సర్వసైన్యాధిపతియగునో లేక యాకార్యమునకుఁగాను సైన్యాధిపతిగా నియమింపఁబడెనో యెక్కడను జెప్పఁబడలేదుగాని యాతఁడంతపాలదుర్గమున స్థాపింపఁబడినవాఁడనుటచే నీతఁడే సర్వసేనాధిపతియని భావించుట యుక్తముగానుండదేమోయని తోఁచుచున్నది. విదర్భదేశముపై దండెత్తుటకు సైన్యము నెప్పుడును సిద్ధముచేసికొని యేదియో యొక సాకుకొఱకగ్నిమిత్రుఁడు వేచియుండెననిమాత్రము దీనినిబట్టి తెల్లము. విదిశాపట్టణము సాంచి(భిల్సా)చేరువ మధ్యభాగమునకు(విదర్భ)కు మారు 250 మైళ్లదూరముండునని మనము లెక్కవేసిన యెడల సైన్యములు 21దినములలో పైనూరమునంతయును బ్రయాణముచేసి యుద్ధముచేసి తిరిగి రాఁగలిగెనని యూహింపవలసినదిగానున్నది. అనఁగా నేడుదినములు పోవుటకును నేడుదినములువచ్చుటకును యుద్ధమునకేడుదినములునుబట్టెనని యూహింపవచ్చును. ఇంతకంటె నర్మదానదీతీరమునందున్న వీరసేనుఁడు తనదుర్గములోనున్న సైన్యమునే దీసికొని సుమారొక నూరుమైళ్లుపోయి యుద్ధముచేసి విదర్భరాజవాహిని నోడించియిచ్చి యుండుననుట పైదానికంటె మఱియును యుక్తముగానుండును. కాఁబట్టి మాళవికాగ్నిమిత్రనాటకము కథ సుమారు మూఁడు వారములలో జరిగెననుట నిర్బాధమని తోఁచుచున్నది.

ఈనాటకమందలిపాత్రములనుగుఱించి మున్ముందుఁ గాళిదాసుని పాత్రములనన్నిటిని గుఱించి విమర్శించు నప్పుడు విమర్శింపఁబడును.

మొత్తముమీఁద మాళవికాగ్నిమిత్ర మున్బాల్యావస్థయందు వ్రాయఁబడిన దయ్యును సహృదయులకానందము నొసంగుచుండుటచేఁ గాళిదాసుఁ డెంతయును బ్రశంసార్హుఁడు.

---

## అంధ బాలిక

కొడాలి ఆంజనేయులుగారు

౧

అంధురాలను దివ్యనిశాంతసమయ
పరిమళానిలమార్గముల్ పట్టిపోదు
త్వత్పదాబ్జసేవాపరత్వమునఁ జేసి
జీర్ణతృణకుటీరాంగణసీమ విడిచి.

౨

చిగురువెన్నెల లేత పచ్చికబయళ్లు
మధురనీహారముల మాటు మణఁగువేళ
వలపు పిల్లనగ్రోవి పాటలకు నేను
వెదురుపొదరిండ్ల రొదలలో వెదకుకొందు.

౩

గొల్లపడుచుల చెదరిన కుంతలముల
జారిపోయిన అడవి గన్నేరుపూలఁ
తావులంటిన్న సడలెద తావకీన
ప్రణయపదరేఖ నలుచు భూభాగములకు.

౪

త్వద్గళమ్మున నాగరప్రమద లిడిన
స్వర్ణకప్పురమాలానిసర్గసౌర
భమ్ముఁ ద్రోవలఁ బసి పోవ వలతు నేను
ప్రేమపుంజాసుమాన్వేషహృదయ నగుచు.

౫

నీ మనోహర రూపమ్ము నీమనోజ్ఞ
వేణుగానమ్ము గీర్తించి వెల్లివిరియు
విమలయమునాతరంగనాదముల చాయ
చనెద నిబిడతమాలవృక్షముల నీడ!

---

# విగుర్వణము కర్ణాటపదమా? సంస్కృతపదమా?

కవిభూషణ, కవిరాజ, శ్రీరాజా వత్సవాయ వేంకటనీలాద్రిరాజుగారు

ఈ యను చర్చ కొన్నాళ్లనుండి సాగుచున్నది.

ఈ పదమున కాంధ్రసారస్వతమునం బ్రయోగంబు లిప్పటికి నుపలబ్ధము లైనవి నాలుగు మాత్రమే:

(1) వి,గుర్వింపుముచూతమనినగోత్రభిదుండుర్విన్
— మహాభారతము, ఆదిపర్వము.

(2) గణముఖ్యులు, వెడలి విగుర్వించి.

(3) పటుదోర్బలగర్వ విగుర్వణంబులన్.
— నన్నెచోడకవిరాజశిఖామణి కుమారసంభవము.

(4) * కోరి శశాంకమౌళికి విగుర్వణతో గుడి
నిల్పె భక్తునన్.
— శాసనము.

శబ్దరత్నాకరము పుట్టునాటికి మొదటిప్రయోగ మొకటిమాత్ర ముపలబ్ధమైనందున దానికి "విఱుచుచు విఱుచు విగుర్వించు" అని రత్నాకరమున నిర్వచన మియ్యబడినది. "ఇది విగుర్విసిద" అను కన్నడధాతువనియు, దీనికి భయంకరత్వము చూపు టర్థమనియు, రత్నాకరకారుని నిర్వచనము ప్రామాదికమనియు కీ॥ శే॥ తేవప్పెరుమాళ్లయ్య మహాశయు డాంధ్రసాహిత్యపరిషన్మహాసభలో జదివిన యుపన్యాసమున తెలిపెను. అప్పటికి కవిరాజశిఖామణిప్రయోగములు గూడ నుపలబ్ధములైనవి. అందు "దోర్బలగర్వవిగుర్వణంబులన్" అను సంస్కృతసమాసఘటనముం జూచి యది విచారణీయ మని యా మహాశయు డాశంకించెను. విచారణీయ మనుటలో రెండు సందేహము లున్నవి:

(1) "విగుర్విసిద" అను కన్నడధాతువునకు కర్ణాటకకృత్ప్రత్యయవిధానమువలన "విగుర్వణ"మను పదము పుట్టినది?

(2) "విగుర్వణము" కర్ణాట వ్యాకరణము ప్రకారము నిష్పన్నమైనను సంస్కృతశబ్దముతో నెట్లు సమసించెను?

ఈ రెండాక్షేపణలకును కర్ణాటవాదులు సమాధాన మియ్యవలసి యున్నారు.

కర్ణాటపక్షమువారు

(1) కీ. శే. తేవప్పెరుమాళ్లయ్యమహాశయుడు
(2) గా. శ్రీ. నడకుదటి వీరరాజుపంతులుగారు
(3) బ్ర. శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రులుగారు

సంస్కృతపక్షమువారు

(1) ......వ్యాసకర్త
(2) విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రులుగారు
(3) వేటూరి ప్రభాకరశాస్త్రులుగారు

* శాసనమున 'గౌరి శశాంకమౌళికి విగుర్వనతో' అని యున్నది. 'గౌం' యన్న నర్థము లేదు, యతి చెడ్డది. 'విగుర్వనతో' నన్నప్పుడు, 'విగుర్వ' అనియా, 'విగుర్వన' అనియా? 'విగుర్వణ' అనుట సమంజసము.

సంస్కృతపదవాదమును 1922, 1924 లో నేనును, 1924 లో సాంబమూర్తి శాస్త్రులుగారు నుపపాదింపగా ప్రభాకరశాస్త్రులుగా రామోదించినారు.

సంస్కృతపక్షమందలి సాధకబాధకముల నన్నింటిని నే నిదివరకే చర్చించి యున్నాను.

విపూర్వక గుర్వీధాతువుకంటె ల్యుట్టు చేయగా "విగుర్వణ"పద ముత్పన్న మగును. "ఉపధాయాంచ" అను సూత్రమువలన ప్రాప్తించవలసిన ఉపధాదీర్ఘవిధాన మనిత్య మగుటవలన దీర్ఘము రాలేదని తెలిపితిని. కాని యీ యనిత్యత్వము నంగీకరింపక శ్రీలక్ష్మీపతి శాస్త్రులుగారు వాదించిరి. నా వాదమును (1) మాధవీయధాతువృత్తి (2) తత్త్వబోధిని (3) అమరకోశము యొక్క భానోజీదీక్షితీయ వ్యాఖ్యానము సమర్థించుచున్నవి.

"సంజ్ఞాపూర్వకో విధిరనిత్యః" అను పరిభాషనుబట్టి భానోజీదీక్షితీయవ్యాఖ్యానములో "ఉర్వరా" శబ్దనిష్పత్తి చేయబడ్డది. ఉర్వీధాతువుకంటె ఘఞ్ప్రత్యయము చేయగా "ఉర్వం; ఉర్వం రాతీతి ఉర్వరా" అయినదని భానోజీదీక్షితీయవ్యాఖ్యానమున నున్నది. మాధవీయధాతువృత్తియందును, తత్త్వబోధిని యందును "టుజ్ స్ఫూర్జా వజ్రనిర్ఘోషే" అను ధాతువునందలి పర్యోపదేశము "ఉపధాయాంచ" అను దీర్ఘవిధానముయొక్క అనిత్యత్వజ్ఞాపనమని చెప్పి, "ముర్చతి, హుర్చతి" అను రూపములు సాధింపబడినవి. కావున విగుర్వణపదము సంస్కృతమని సంస్కృతవ్యాకరణశాస్త్ర సమ్మతముగ మేము చెప్పుచున్నాము. విగూర్వణము సంస్కృతమని లక్ష్మీపతిశాస్త్రులుగారు నొప్పుకొన్న దే. మాధవీయవృత్తి తత్త్వబోధినీ కారుల మతము ప్రకారము దీర్ఘవిధాన మనిత్యము గనుక హ్రస్వరూపమును శాస్త్రులుగా రంగీకరింపక తప్పదు. అంగీకరింపని పక్షమున శ్రీశాస్త్రులుగారు "విగుర్విసిద" అను కన్నడ ధాతువునుండి విగుర్వణ మనుపద మేకర్ణాటక వ్యాకరణవిధానముబట్టి నిష్పన్నమైనదియుం జెప్పవలసి యున్నారు.

ఈ శబ్ద మిదివరకే శబ్దరత్నాకరమున ప్రామాదికముగ నిర్వచింపబడినది. ఇప్పుడు సూర్యారాయాంధ్ర నిఘంటువునం దయినను శాస్త్రీయముగ నిర్వచింపబడవలెను. ఈవ్యాసమును, నిటుమీదట కర్ణాటపక్షమున శ్రీశాస్త్రులుగారు ప్రచురింపబోవు వాదమును గూడ ఆంధ్రసాహిత్యపరిషన్మహాసభలో జర్చించి నిర్ణయించిన పిమ్మటనే యీశబ్దము సూర్యారాయాంధ్ర నిఘంటువున కెక్కవలయును.

(1) రత్నాకరము ప్రకారము అత్యంతము విఋను టర్థము.

(2) కన్నడపక్షవాదము ప్రకారము భయంకరత్వము చూపు టర్థము.

(3) సంస్కృతవాదప్రకారము విశేషమగు నుద్యమన మర్థము. సూర్యారాయాంధ్ర నిఘంటువునం దేమి యర్థము వ్రాయబడ నున్నదో యాభారమంతయు సాహిత్యపరిషత్సభ్యమహాశయులపై నున్నది.

# ప్రణయసమాధి



౧

కలల పొలాలు చెమ్మగిలగా దరహాస కళాతుషారముల్
చిలుకు శరద్విలాసరుచిశీలవొ! పుష్పాశిపైట మేల్ముసుం
గులు బెళుకన్ వసంతధరకున్ డిగు నందనలక్ష్మివో! అరా
ళలలిత కుంతలాల దరళమ్ముగ నాచెదవా కటాక్షముల్ ?

నాకసతీరహఃప్రణయనాటకరంగము లల్కి వెన్నెలల్
రేకులు రేకులన్ జిలకరించు వియోగకథాసుధారస
వ్యాకులధాళధళ్యముల వన్నెలు దిద్దు ముఖాబ్జపాండుర
శ్రీకరుణమ్ముగా పలుకరింప గలంతు వదేల డెందమున్ ?

మన మొక భావగీతమయి మాధురులన్ స్రవియింప తొల్లి నిన్
గనుగొనినప్పుడే వలపుకమ్మరుతుల్ చన క్షీరసాగరా
సనదరహాసశోభవలె నాతి! గభీరప్రశాంతిపూత మీ
'ప్రణయసమాధి' మున్నిటి భవచ్ఛుభమూర్తి స్మరింపు [illegible]

'కోరికతీవ లెల్ల తెగగోసి, నిరాశయె మన్మనోశ్మశా
ధారముగాగ జేసి వనితా! నెఱచేదుల స్వాదు లేరు నా
చారమె జీవితావధిగ శాంతి గడించు విషాదభాగ్యరే
ఖారమణీయతల్ తెలుప గ్రమ్మర దర్శన మిచ్చితేనో!

ఏసరసంపువేళ హృదయేప్సితముల్ వెలపోసి యీ యువ
స్థాసుకుమారవేదన లతాంగి! వరించితినో ప్రవాస గీ
తాసఖమా ప్రపత్తిగ, నగాధహృదంతరతీక్ష్ణబాధ లే
మో సరళమ్ములై తెంలిపోవు సుఖాశయక్రమసీమలన్.

*　　*　　*　　*　　*

ఏయనురాగపున్ తొలకరింపుల, నీలనభోవిశాలశా
లాయతలాస్యఖేలనములన్ విహరింపుచు, బాలికయ్యపున్

రాయిడి పెట్ట నే జలదరాట్సుతు బాసి చలించుచంచలా
ప్రేయసివో! నరింతె నిరుపేదయెదన్ ప్రణయాతిథేయముల్ ?

ఏసంధ్యారుణధర్మహర్మ్యములలో, నే యింద్రచాపాచ్ఛరో
చిఃసౌధాంతరకాంతి శయ్యలనొ, రాకాచంద్రికారామసీ
మాసౌరభ్యనికుంజరాసనముల, ప్రేమశ్రీల శాసించు నీ
కీసామాన్య మనోజ్ఞమాధురి నివాళింపన్ రుచుల్ దోచునో!

రేయిచెఱంగులో పసిడిరేకుల గేదగికన్నెవో లెనున్
సోయగ మొల్కఁబోసెదవు సోగగ సోలుచు, నే పురాణజా
తీయమహోన్నతాశయప్రతిష్ఠకు జీవముగొన్న భారతీ
నాయికవో! అగాధనయనమ్ముల తీరనిదాహ మూరెడిన్.

ద్యోమందారవనీహ్రదాంతరప్రశాంతుల్ పోలె, మందాకినీ
శ్రీమత్పావనగర్భశైత్యమటు లో సీమంతినీ! అక్షర
ప్రేమోదంత సజీవసార మధురావేశమ్ము నీమందవీ
తూమందాక్షము లొయ్యనొయ్యన హృదాశాసీమలన్ జల్లెడిన్

నవనవచంద్రికావిలసనాంకితసౌధపథాల మార్గవా
సన మురలంగ నిర్దయ కృశాంగి! క్రమించితివెంత దవ్వొ మ
ఱ్ఱాన జెమరించు లేయలికఁ గ్రొంజిరుపాయపు ప్రాపయందముల్
నవయుట కెట్టు లోర్చితి వనాదరభావమలీమసాత్మవై ?

వెన్నెల కల్గి తావి చెఱ విచ్చిన తళ్కుమొగాల పచ్చిపూ
గన్నెల పాలపాయపు సుగంధమధుప్రవాహమ్ముల్ వేనొ! నీ
సన్నిధి పూజరేకులయి జల్లన నా యెద విచ్చు మైకపున్
జిన్నెలు ప్రేమగర్వగుబి చిక్కుఁగంఠపులాల గ్రమ్మగన్.

---

---

# ప్రియదర్శికానాటికనుగుఱించిన గ్రంథకర్తృత్వాదినిర్ణయము

కీ॥ శే॥ శ్రీమన్మహామహోపాధ్యాయ బ్ర. కల్లూరి వేంకటరామశాస్త్రిగారు

I. ప్రియదర్శిక, రత్నావళి, నాగానందము ఈ మూఁడింటిని రచించినవాఁ డొక్కఁడు. శ్రీహర్షుండు సరసవాగ్వైభవ సంపదలతోఁ దులతూఁగు నట్టి మహాకవులలో నొకండు. ఇతండు ప్రియదర్శికనే కాకుండ, రత్నావళియనియు, నాగానందమనియు సుప్రసిద్ధములగు రెండు రూపకంబులను రచించినట్లు తెలియుచున్నది. ఏలయనఁగ పైనిం జెప్పిన మూఁడు గ్రంథంబులయందును (1) "శ్రీహర్షో నిపుణః కవిః" అనిన శ్లోకంబును, (2) "నానాదిగ్దేశాగతేన రాజ్ఞః శ్రీహర్షస్య పాదపద్మోపజీవినా...... అనిన" వాక్యంబును నొకరీతిగానే ప్రస్తావనయందు వ్రాయఁబడినవి. ఇంతియే కాక "న్యక్కృత్య క్షణంజనధాతునా......" ఇత్యాదులైన కొన్ని పద్యంబులు గూడ నాయా ప్రకరణ సందర్భంబులకు నుచితంబుగాఁ బైనిం జెప్పఁబడిన యట్టి గ్రంథములయందుఁ బ్రయోగింపఁ బడియున్నవి. అనఁగ మిక్కిలి యభిరుచికరంబగు వాక్యంబునుగాని, శ్లోకంబును గాని, లేక యట్టియర్థమునే విశదీకరించునట్టి వేఱొక పదసందర్భమును గాని స్వకల్పితగ్రంథములయందు ననోన్యన్యంబును జొనుపుట కవులకు స్వాభావికమై యున్నది. ఆబాలగోపాలము రఘువంశ, కుమార సంభవంబులు రెండు గ్రంథములకును కర్తగాఁ దెలియఁబడుచున్న కాళిదాసకవియును "అపవాద ఇవోత్సర్గం వ్యావర్తయితు మీశ్వరః" అని రఘువంశమందును, "అపవాదైరివోత్సర్గాః కృతవ్యావృత్తయః పరైః" అని కుమారసంభవ కావ్యమందును నొకటియే తాత్పర్య మిచ్చునట్టుగా బింబప్రతిబింబరీతిని శ్లోకద్వయంబు రచించెను. ఇట్లే భవభూతి విరచిత నాటకములయందుం గూడ "వ్యతిషజతి పదార్థాన్" ఇత్యాద్యనేక శ్లోకంబులు పరస్పరంబును జొప్పింపఁబడియున్నవి. కాళిదాస భవభూత్యాది కృతములగు గ్రంథములలో నొకదానిలోని శ్లోకములు వేఱొకదానియందుఁ గానిపించినట్లు ప్రకృతమున (1) ప్రియదర్శిక, (2) రత్నావళి, (3) నాగానందములందుఁ గనఁబడుచున్నందున నీమూఁడు గ్రంథములకును శ్రీహర్షుం డొకఁడే కర్తయని తేటతెల్లమగుచున్నది.

II. శ్రీహర్షులనేకు లున్నందున నితం డే శ్రీహర్షుఁడని యాశంక కలుగఁగాఁ దన్నిర్ణయము సలుపఁబడుచున్నది.

(1) శ్రీహర్షశబ్దము వినినతోడనే మామల్లదేవికిని శ్రీహీరునకును జనించి నైషధకావ్యమును రచియించిన మహాకవి బుద్ధికి స్ఫురించుచుండును.

(2) తర్వాత, కావ్యప్రదీపగ్రంథకర్తయైన గోవిందదాసకు, రవకుఁ గనిష్ఠభ్రాతయైన వేఱొక శ్రీహర్షుండు గూడఁ గలండని యాలోచనవశంబునఁ దోఁచకట్టును.

కాని వీరిద్దఱును రాజులు కానందున 1. ప్రియదర్శికా 2. రత్నావళీ 3. నాగానందములకు గ్రంథకర్తలని చెప్ప వలనుపడదు.

(3) ప్రకృతములగు గ్రంథములకు మూఁడింటికిని శ్రీహర్షుఁ డనునట్టి రాజు కర్తయైనట్లుగా ఈ గ్రంథముల మొదటి ప్రస్తావనలఁ గనుపించు వాక్యములవలనఁ గానిపించుచున్నది.

(4) ఈకారణ మొక్కటియే కాక వేఱొక హేతువును గలదు. నైషధకర్తయైన శ్రీహర్షుఁడు తాను రచించిన నైషధ సర్గముల చివరను నచ్చటచ్చట స్వకృతంబులగు స్థైర్యవిచారణాప్రకరణాది గ్రంథముల నామంబులను బఠించి కనఁబఱుచుచున్నాఁడు. ఆ శ్రీహర్షుఁడే ప్రియదర్శికాది గ్రంథత్రయమునకు రచనాకర్త యయ్యెనేని నైషధసర్గాం

తములయందుఁ దక్కిన స్వరచిత గ్రంథాంతరములతో పాటుగాఁ బ్రకృతరూపకములను మూఁడింటిని జేల చేర్చకుండును? కావునఁ బైనిం జూపిన కారణములనుబట్టి రాజులు కానట్టి యిద్దఱు శ్రీహర్షులును బ్రకృతరూపకత్రయమునకు రచనాకర్తలు కారనిన యంశము తేటపడుచున్నది. అనఁగా శ్రీహర్షుఁడనిన రాజే యీరూపకత్రయమునకుఁ గర్తయని స్పష్టమగుచున్నది.

III. శ్రీహర్ష శబ్దముతో మిళితమైన నామంబులు గల రాజులును బెక్కుఱు కానవచ్చుచున్నందున వారిలో నితం డెవరనెడితృతీయప్రశ్నమునకు సమాధానము వ్రాయఁబడుచున్నది.

(1) సాతవాహన వంశంబునఁ గలశరాజపుత్రుం డగు శ్రీహర్ష దేవుం డొకఁడు గలఁడు. అనంతరాజునకుఁ బట్టమహిషియైన పరమవిదుషి యని ప్రసిద్ధిం గాంచిన సూర్యవతీదేవి యితనికిఁ బితామహి యయ్యె (సూర్యవతీ దేవికి నితండు మనుమఁడు.) ఈదేవికి వినోదమునిమిత్తమే సోమదేవకవి కథాసరిత్సాగరమును రచియించినట్టులు తెలియుచున్నది.

(2) ధారానగరంబు రాజధానిగాఁ గలిగిన భోజ మహారాజునకుఁ దాత వేఱొక శ్రీహర్ష దేవుం డుండినట్టు ప్రాచీనలేఖమాల యను గ్రంథమువలన విశదమగుచున్నది.

ఇట్లిద్దఱున్నను వీర లుభయులును బ్రియదర్శికాది ప్రకృతిరూపక త్రయంబునకు రచనాకర్తలుగా నుండుట సంభవింప నేరదు.

పైవారిలో మొదటివాఁడు క్రీస్తు పండ్రెండవ శతాబ్దములో మొదటి యర్ధభాగంబునఁ గాశ్మీరదేశ రాజైనట్టు రాజతరంగిణీ గ్రంథాంతభాగంబున వచింపఁ బడినది.

భోజరాజ పితామహ శ్రీహర్ష దేవుండు క్రీస్తు పదవశతాబ్దముయొక్క ప్రారంభకాలంబున జనించి యుండవలయును. ఇతనికిఁ గుమారుండును, భోజునకుఁ దండ్రి సోదరుఁడైన ముంజరాజు క్రీస్తు పదవశతాబ్దము యొక్క మధ్యభాగంబున జనించిన యంశము సర్వజనులకును సుప్రసిద్ధముగదా! ఈముంజరాజు సభలోఁ బ్రతిష్ఠావంతుఁడైన ధనికకవి దశరూపావలోకమందు నీమూఁడు రూపకములను (ప్రియదర్శికాది రూపకములు) నుదాహరించెను.

మఱియు, క్రీస్తుసంవత్సరముల యెనిమిదవశతము మధ్యభాగంబున జనించి జాయాపీడునకు మంత్రియైన దామోదరగుప్తుం డనువాఁడు తన కుట్టినీమతగ్రంథము నందు శ్రీహర్షకృత రత్నావళీకథను సవిస్తరంబుగా వర్ణించియుండెను. ఆ గ్రంథమందు ప్రసంగవశంబున "ఉదయనవగాంతరిత మియం" అనిన రత్నావళిలోని పద్యంబును నైతము దామోదరగుప్తుండు సంమేళనము కావించెను. "అశ్లిష్టసంధిబంధం సత్పాత్రసువర్ణయోజితం సుతరాం, నిపుణపరీక్షకదృష్టం రాజతి రత్నావళీరత్నం" అనిన కుట్టినీమతగ్రంథమందలి పద్యముకూడ స్పష్టముగా రత్నావళీ నాటికను స్మరింపఁజేయుచున్నది. ఇట్లు రత్నావళీ నాటికలోని పద్యమును క్రీస్తువత్సరముల యెనిమిదవశతము మధ్యభాగంబున జనించిన దామోదరగుప్తుండు తనగ్రంథంబున సంధించుటవలన రత్నావళ్యాదిరూపకత్రయకర్తయగు శ్రీహర్ష మహారాజు యెనిమిదవశతాబ్దమునకు ముందే యుండక తీరదు.

ఇట్లెనిమిదవ శతమునకు ముందే వ్యవహారములో నుండిన ప్రియదర్శికారత్నావళ్యాది రూపకంబులకుఁ బండ్రెండవ శతాబ్దమందు జనింపఁబోవునట్టి కలశరాజపుత్ర శ్రీహర్ష దేవుండును, పదవశతాబ్దమందు నుద్భవిల్లంబోవునట్టి భోజరాజపితామహ శ్రీహర్ష దేవుండును నెట్లు రచనాకర్తలు గాఁగలరు?

కావున వారికంటె నన్యుండేయైన శ్రీహర్షుఁడు ప్రియదర్శికాదులకుఁ గర్తయని సిద్ధాంతమగుచున్నది.

మఱియు, నైషధకర్త శ్రీహర్షుఁడును, కావ్యప్రదీపకర్తయగు గోవిందఠక్కురునకుఁ గనిష్ఠభ్రాతయైన శ్రీహర్షుఁడును నీరూపకత్రయంబునకును రచనాకర్తలు గారనుటకు రాజులు గారనెడి హేతువే కాక యీకాల నిరూపణముకూడ కారణముగా నుండును.

నైషధకర్త శ్రీహర్షుఁడు పండ్రెండవశతాబ్దమందును, గోవిందచక్రవర్తిసభ్య భ్రాత శ్రీహర్షుఁడు పదునేనవ శతాబ్దమందును జనించిరి.

పైకారణములనుబట్టి విల్సన్ విద్యాధికారి యీ రూపకత్రయంబునకును కర్తయైన శ్రీహర్షుని పైనిం జూపిన శ్రీహర్షులకంటె నన్యునిగా నిర్ణయించెను.

కావునఁ దక్కిన శ్రీహర్ష నామధేయులపైని నీరూపకత్రయ నిర్మాణభారము మోపుటకు వలవి గానందునఁ గాన్యకుబ్జాధీశ్వరుండును, బాణమయూరాది కవులను సేవ్యుండును, విద్వత్పక్షపాతియును, స్వయం వేత్తయునైన శ్రీహర్షమహారాజు పైని నిట్టి రచనా కర్తృత్వంబారగక తప్పదని గ్రహింపవలయును.

IV. ఈకవి బౌద్ధమతాభిమానియా లేక మహేశ్వరభక్తుఁడా యనిన నాల్గవప్రశ్నమునకు సమాధానము.

(1) క్రీస్తుసంవత్సరముల యేడవశతంబు ప్రారంభ భాగంబునందు చీనాదేశస్థుండైన హ్యూన్‌త్సాంగు భారతవర్షమును జూడ వచ్చినపుడు ఈ శ్రీహర్షనగ నఁడు బౌద్ధమతమందునభిమానము గలవాఁడైనను దక్కిన సిద్ధాంతములయందు ద్వేషబుద్ధి లేనివాఁడని యును, బ్రాహ్మణులను, బౌద్ధులను సమదృష్టితోనే గౌరవించువాఁడనియును తన దేశసంచారచరిత్రయందు వ్రాసెను. బౌద్ధమతాభిమాని గనుకనే యితండు నాగానందనాటకమందు భూతదయాముఖ్యమును (బౌద్ధమతస్థులకు ప్రధానమతధర్మము) ప్రధానముగా వర్ణించెనని మఱికొందఱు చెప్పుచున్నారు.

(2) మాస్పృష్టికి నితండు బౌద్ధమతాభిమాని యైనట్లు తోంచుకయా కారణము గానిపింపకున్నది. బౌద్ధమత ప్రియుండే యయ్యెనేని యితండు రూపకంబుల ముఖ లను శివకేశవస్తుతులతో నాందీశ్లోకముల నెట్లు రచించిన వాఁడయ్యెను? చీనాయాత్రికుఁడైన హ్యూన్‌త్సాంగు ఇతనికి నన్యమతస్థులయందు ద్వేషము లేకపోవుటను జూచి యట్లు భ్రమపడియుండును. పూర్వకాలమందు అగ్రచక్రవర్తి తమతమ మతములయందు నభిమానవంతుఁడని వివిధమతముల వారిచేతను భావింపఁబడినట్లు వినుచున్నారము గదా! క్రీస్తుయొక్క యేడవశతాబ్దమందు బౌద్ధమత మడుగంటించుటకుఁ బ్రయత్నించిన రాజులే యుండిరి. హ్యూన్‌త్సాం గనువాఁడే తనసంచారచరిత్రయందు నట్టి కాలంబున మిహిరకులుం డనురాజు బౌద్ధమత నిర్మూలనంబునకుఁ బ్రయత్నించెనని చెప్పుచున్నాఁడు.

(3) నాగానందనాటకమువలన నితండు బౌద్ధమతావలంబి యనుటకు వీలుపడదు. ఆనాటకమందు భూతదయ ముఖ్యముగా వర్ణింపఁబడినది. "అహింసా పరమో ధర్మః" అనుస్మృతి చేతను, "నహింస్యాత్సర్వాభూతాని" అను శ్రుతిచేతను బ్రాహ్మణులకుంగూడ భూతదయ ముఖ్యమతధర్మమే కాని వేఱొకటి కాదు. యజ్ఞముల యందు పశుహింస శాస్త్రప్రామాణ్యంబునఁ బారమార్థిక దృష్టి గలవారికి హింస కాదని తాత్పర్యము. లౌకికదృష్టినే ప్రధానముగా నెంచిన బౌద్ధులకుయజ్ఞపశుమారణంబు నైతము హింసగాఁదోఁచి నిషాద్యమయ్యె. నాగానంద నాటకంబున సర్పమారణముయజ్ఞములోనిది కానందున బౌద్ధులకుంబోలె బ్రాహ్మణులకుంగూడ నిందితమైనది యగుటచే శోచనీయముగా వర్ణింపఁబడినది. నాగానంద నాటక నాందీశ్లోకంబు నందలి బుద్ధస్తుతి, గ్రంథమధ్యమందునప్పటప్పట బోధిసత్వుని మతవాక్యముల యుద్ఘాటనమును, నాధారముగాఁ జేసికొనిన యంతమాత్రమున నితండు బౌద్ధమతావలంబి యని నిర్ధారణము చేయుట శక్యము గాదు. గ్రంథకర్త యితర మతద్వేషి కానందునను, సర్వమతసామరస్యంబున లోకతంత్ర ప్రవర్తనాచతురుండైనందునను, బుద్ధదేవుఁడు భగవంతుని తొమ్మిదవ యవతారమని జయదేవకవులే స్తుతించినందునను, తాను మహేశ్వరభక్తుం డయ్యును నారితిగా స్తుతించి యుండవచ్చును. మఱియు, నాగానందము బృహత్కథను ననుసరించి వ్రాయఁబడినది గాన మూలానుసారముగ బోధిసత్వ మతాంశములు వర్ణింపఁబడినవి గాని స్వమతము దభినివేశముచేతను గాదని యెఱుంగనగు. నాగానందనాటకములోని గౌరీవర్ణనాదికమునుగూడ మూలానుసారముగానే వ్రాయఁబడినందున మహేశ్వరభక్తుండని చెప్పుటకును నవకాశము లేదని పూర్వపక్షము లాక్షేపింతురేని యట్లనవలదు. నాగానందనాటకమును బట్టి యితనిమత మేదియో మనము నిర్ణయింప

తముగాఁ జూపెను. కావ్యప్రదీప ప్రభాకారుఁడును నిట్లే యభిప్రాయ పడియెను.

(2) డాక్టరు హాల్విద్యాధికారి తాను సంపాదించిన యొక కావ్యప్రకాశిక పుస్తకమందు "శ్రీహర్షాదేర్బాణాదీనామివధనమ్"—శ్రీహర్షాదుల వలన బాణకవి ప్రభృతులు ధనసంగ్రహణమునకై రచించినట్టు దృష్టాంతముగాఁ జెప్పఁబడియె నని తాను జూచినరీతిని వ్రాయుచున్నాఁడు. ఇంతియ కాక బాణకవిచేత రచియింపఁబడె నని నిర్వివాదముగా నొప్పుకొనఁబడిన హర్షచరిత్రమందలి పద్యమే రత్నావళీ నాటకమందును గనఁబడినదనియు డాక్టరు హాల్విద్యాధికారియే వ్రాసెను.

(3) కవల్విద్యాధికారి రత్నావళీ నాటకమును బాణకవియే రచియించెననిన యంశమును నామోదించుచు నాగానందమునకు మాత్రము గ్రంథకర్త వేఱొకండని యభిప్రాయపడెను.

(4) రమేశచంద్రదత్తుఁడును రత్నావళీ నాటకము బాణకవి కృతియని యంగీకరించెను.

(5) మెగ్డానలు విద్వాంసుఁడును పార్వతీపరిణయ నాటకమును రచించిన యట్టి బాణకవియే యీగ్రంథము రచించెనని తన యాశయము వెల్లడించెను.

(6) దుర్గాప్రసాదవిద్వాంసుఁడు బాణభట్టే తన ప్రభువైన శ్రీహర్షుఁడు స్వకృతి(రత్నావళీ నాటకమును) రచియించునట్లుగా ప్రకటించెనన్న యంశము కాశ్మీరదేశస్థులు చెప్పుదురనియు, "శ్రీహర్షాదేర్బాణాదీనామివ ధనమ్" అని ఆదేశస్థులు పఠింతురనియు, నన్యదేశములందలి పుస్తకములకంటెఁ గాశ్మీరదేశస్థుల పుస్తకములందుఁ గొంచెము ప్రామాణ్య మంగీకరింపక తీరదనియు (కావ్యప్రకాశకర్తయైన రాజానకమమ్మటుఁడు కాశ్మీరదేశస్థుఁ డగుటచేతను) తన యభిప్రాయమును బ్రకటించుచున్నాఁడు.

VIII. రూపకత్రయమును శ్రీహర్షుఁడే రచించెను గాని ధావక బాణకవులు రచింపలేదను సంగతికి కారణములు.

(1) డాక్టరు హాల్ విద్వాంసుఁడు ప్రమాణముగాఁ దీసికొనిన యాయొక్క పుస్తకమందే బాణుఁడు రత్నావళీ నాటికను రచించెననిన యంశము కనఁబడుచున్నది. దుర్గాప్రసాద పండితుఁడును నొకవేళ హాల్విద్వాంసుని యభిప్రాయము ననుసరించిగాని, లేక యతని పుస్తకమును జూచి గాని తానుగూడ నట్టియభిప్రాయమును బొందియుండ వచ్చును. కావ్యప్రకాశ పుస్తకము లెన్నియో చూచినాము గాని హాల్విద్వాంసుని పుస్తకమందున్న రీతి నేపుస్తకమందును గానరాదు. ఒకవేళ కాశ్మీరదేశస్థుల పుస్తకములు కొన్నిటిలో బాణుఁడు ధనాశచేతఁ జేసిన రత్నావళీగ్రంథమునె శ్రీహర్ష కృతిగా వ్రాసినట్టి విధము కనఁబడినను నంతమాత్రముచేతను నా వ్రాఁత విశ్వసింపఁదగినది కాదు. నివురుగప్పిన నిప్పువలె నుండి కీర్తికై ప్రయత్నింపని దరిద్రుఁడైనను నొక మంచిగ్రంథము రచించెనేని యాగ్రంథ మతఁడు చేసినట్లునమ్మక దానిగ్రంథభారమును వేఱొక ప్రసిద్ధ కవి శిరముపైని మోపుట లోకములో సాధారణముగా నున్న సంగతియే గదా! ఈ కారణమును బట్టియే మెగ్డానలు రమేశదత్తులు శ్రీహర్ష కృతిని బాణునికృతిగా మార్చియుందురు. బాణకృత శ్రీహర్షచరిత్రములోని పద్యమే రత్నావళీ నాటకయందును గనఁబడుచున్నదని చెప్పుచున్న హాల్విద్వాంసుని వాక్యముకూడ నాకంతసలక్షణముగాఁ గానిపింపదు. ఏలయనఁగా విచారింపుఁడు—

శ్రీహర్షచరిత్రమందు "ద్వీపాదన్యస్మాదపి....." ఇట్టిరీతి పద్యము వ్రాయఁబడియున్నది. రత్నావళీ నాటకయందున్ననో, "ద్వీపాదన్యస్మాత్........" ఈవిధముగాఁ గనఁబడుచున్నది. ఈపద్యములలో ద్వీప శబ్దముతో పద్య మారంభించుట మాత్రమే యొక్కటి గాక యన్యమైన శబ్దస్వరూపసరణినిబట్టిగాని, యర్థసరణిని బట్టి గాని యెంతమాత్రమును రెండు పద్యములకుఁ బోలిక యైనను కానరాకున్నది.

హాల్విద్వాంసుఁడైనను, లేక తన్మతావలంబులగు రమేశదత్తాదులైనను రత్నావళీవలనం గాని, హర్షచరిత వలనం గాని తగినంతకారణ మెత్తి చూపుచు రత్నావళి బాణకృతి యనినయంశమును ఋజువుపఱుపఁజాలకున్నారు.

చీనాయాత్రికుఁడైన హ్యూన్‌త్సాంగు పెక్కురు కవులను, పండితులను శ్రీహర్షుఁడు పోషించుచున్నట్టులు తనయాత్రాచరిత్రయందు వ్రాయుచున్నాఁడు. సంఖ్యకు మీఱిన పండితులు శ్రీహర్షునియొద్ద సంపుటంజేసి వారిలో నొకండైన బాణకవియే రత్నావళ్యాది నాటికలను రచియించి విక్రయించి తనప్రభుకృతులుగా బ్రకటించుట యుక్తియుక్తముగానే యున్నదనియు, నిట్టియర్థమును వివరించు వాక్యము కానొక పుస్తకమందును జూచి పాశ్చాత్యాంసుఁడు లోనైనవారుగూడ నట్టిగ్రంథములను బాణకృతులుగా నూహించుటయు సరసముగానే యున్నదనియు నెవ్వరైనను సకార్ణింతురేని సమాధానముతో వినుండు. ఈ గ్రంథములను ధావకకవియే రచించి శ్రీహర్షకృతులుగాఁ బ్రకటించెనని మమ్మటభట్టారకులు వ్రాసినట్టుగా కొన్నిపుస్తకంబులఁ గానఁబడుచున్నందున వానిని విశ్వసించి ధావకకవియే యీగ్రంథములకుఁ గర్తయని యేల వచింపఁగూడదు? హ్యూన్‌త్సాంగు తన యాత్రాప్రబంధమందు శ్రీహర్షునియొద్దను ధావకకవి యున్నట్టులు లిఖింపనందున నతండు కర్తయగుట యసంగత మందురేని, యట్లైనచో నతండు యాత్రాప్రబంధమందు బాణనామధేయమును సహిత మసూచింపనందున బాణకృతియని వాదించువారికి స్వవచనవ్యాఘాతంబే సమకూరును.

(2) ఇంతియ కాక హర్షచరితంబును పరికించి చూడఁగా బాణుఁ డాగర్భశ్రీమంతుఁడైనట్టులు కనఁబడుచున్నదిగాని దారిద్ర్యమున్నవఁ దనకృతుల నితరులకు విక్రయించునంతటి దుర్దశపట్టినవాఁడుగాఁ గానిపింపఁడు. మఱియు రత్నావళీప్రియదర్శికలు రెండును మాళవికాగ్నిమిత్రంబునకుఁ బ్రతిబింబంబులే కాని వేఱొకటి కాదు. "సంతిశ్వాన ఇవాసంఖ్యా" ఇత్యాదివచనంబులచేఁ బరగ్రంథార్థచోరులైన కవులను నెత్తిఁ గొట్టుచున్నట్టి బాణుఁడే కాళిదాస కృతి మాళవికాగ్నిమిత్రరూపకార్థంబును నపహరించి రెండు నాటికలను రచియించినాఁడనుటకంటెఁ బరిహాసాస్పదమైనయంశము వేఱొండు కానరాదు. పోనిండు. తమరు చెప్పిన చొప్పున నొకవేళ బాణుఁడే యీగ్రంథంబులను విక్రయించెఁ గాక! అతం డింతకంటె రసవత్తరములైన కాదంబరీ హర్షచరిత్రల నేల విక్రయింప లేదో యుత్తరమిండు.

కావునఁ గొన్నిపుస్తకంబులలోని పాఠంబులంబట్టి ధావకకవి రచించినాఁడని కాని, మఱికొన్ని పుస్తకంబులలోని పాఠభేదములంజేసి బాణకవి యీగ్రంథములను రచించినాఁడని కాని చెప్పుట యసందర్భము. రెండు విధములగా నున్నది సత్యము కానేరదు. కావున సుందోపసుందన్యాయమున రెండువాదంబులును బ్రతిహతంబు లగును. ఇంతియ కాక ప్రస్తావనయందు (1) ప్రియదర్శికయు (2) రత్నావళియు (3) నాగానందము ననునట్టి మూఁడురూపకములును శ్రీహర్షకృతులైనట్టులు స్పష్టమగుచుండఁగా పైనిం జెప్పిన గ్రంథములలో నొకరత్నావళీ నాటికమాత్రమే ధావకకృతియనియు శ్రీహర్షునకు విక్రయింపబడ్డది యనియుఁ జెప్పినకావ్యప్రకాశవ్యాఖ్యాతల యసందర్భవాక్యము లెట్లు విశ్వసింపఁదగియుండును? రత్నావళి కాక తక్కిన రెండురూపకంబులను రచింపఁ జాలిన శ్రీహర్షుఁడు కావ్యప్రకాశవ్యాఖ్యాతల మతమం దిది మాత్రము (రత్నావళి) ఏలరచింపఁగా నసమర్థుఁ డగును? కాని ప్రస్తావనయందు ప్రస్తుతింపఁబడిన రూపకత్రయ నిర్మాణాంశంబునకు విపరీతముగా నూహించుట సాహసమూలకంబని మా తాత్పర్యము. పూర్వకాలమందు రామాభ్యుదయకర్తయైన (1) యశోవర్మ (2) భోజరాజు (3) సాహసాంకమహారాజు మొదలైనవా రెందఱో రాజులు భారతవర్షమందు మహాకవులై యుండుట వింత కాదు కాన శ్రీహర్షుండును మహాకవి యనుటకు సంశయింపఁబనిలేదు.

IX. (1) ఈప్రియదర్శికా నాటికయందలి కథ పురాణేతిహాస మూలకము కాదు. బృహత్కథ ననుసరించుచుఁ గొన్నిమార్పులతో నిండియున్నది. బృహత్కథయందు "బంధుమతి" అనిన యామెకే ప్రియదర్శిక యనిన నామాంతర మీయఁబడినది. (2) ఉజ్జయినీపతియైన చండమహాసేన మహారాజు తనకుఁ బుత్రజననమందు నింద్రోత్సవము సలుపఁగా నింద్రుండు సంతసించి పుత్రికారత్నము గలుగునట్టుల ప్రసాదించెను గాన వాసవదత్త యను నామంబు గలిగెను.

X. (1) మహారాజ్ఞియైన వాసవదత్తను నాయిక యున్నతస్థానంబునకుఁ దగిన యుదారస్వభావములో నున్నదానినిగా నీకవి వర్ణింపలేదు. ఆమెపట్టమహిషీత్వమునకు న్యూనత సహితము తేఁబడినది. ఆమెయందు (1) గాంభీర్యము (2) సాధువచనంబు (3) లోకోపకార బుద్ధి మొదలైన సుగుణంబులు కనఁబడవు సరిగదా, మీఁదుమిక్కిలి యైశ్వర్యగౌరవగర్వంబును, మాటిమాటికిఁ గోపప్రాబల్యమును, దీర్ఘరోషము లోనైన వ్యతిరేకగుణంబులు పొడఁగానవగును. లోకులు పలుగురును తన్ను నేమనుకొందురో యని జంకు వహించుటయే యామెకు గుణముగాఁ జూపఁబడినది. నాటకాంతమునందు ప్రియదర్శిక తనభగిని యగుట తెలిసి వత్సరాజునకు భార్యగా వాసవదత్త యంగీకరించెనని వర్ణింపఁబడినది. సోదరీ సంబంధము తనకు గోచరింపనిచో నట్టి యుదారస్వభావ మామెయందు నెంతమాత్రము లేదనియే స్పష్టమగుచున్నది.

(2) ప్రియదర్శికమీఁది పరమానురాగం బనెడి నగాగ్రంబునకు నాయకుని మెట్లవరుసను క్రమక్రమముగా రాఁజేయక ద్వితీయాంకమందు నొక్కుమాఱుగా చూచిన వెంటనే మోహసముద్రములో మునింగినట్లు వర్ణించుట యితర నాటకములలోని వర్ణనకు వ్యతిరేకమై యన్యాయముగఁ దోఁచక మానదని మా తాత్పర్యము. ప్రియదర్శికకు వివాహమునకు నీడు గాని కన్యావస్థ మొదల్కొని యామెకు వివాహమునకుఁ దగిన యవస్థవఱకును వర్ణింపఁబడినందున నీనాటక చరిత్ర ప్రథమంబులో లోకచర్యగా జరుగుటకు నైదాఱుసంవత్సరంబులు పట్టినదని యూహింపవలయును.

---

# శివరాత్రిప్రభ

కవికొండల వేంకటరావుగారు

[గీతిక]

౧

కాలకంఠుని నాగసర్పము
కుబుస మూడ్చి పడగ బన్నంది,
రెండు నాల్కలు ... ... ... ...
గండు మీసాలట్లు దూసింది,
చెవులు మోసింది; ... ... ...
"నాగసార" మూదేది యెవరోయి?
రాగ మొలికించేది యెవరోయి?
కాటు నల్లని కాళరాత్రి.

౨

నొసట గొనసరిన మూఁడోకన్ను
నివురు లూదిన కొలిమి దెగడి
సెగడి ద్రిప్పింది, ... ...
పొగలు గప్పింది; ... ...
కమ్మరయితే యినుము కరగ,
సోమరయితే చలిని కాఁగ,
నెవరు వచ్చేరోయి?

ఎవరు మెచ్చేరోయి?
కాఱు నల్లని కాళరాత్రి.

౩

అర్ధ భాగపు మహాంకాళీ
కర్ధ మది కాలేదా? ... ...
ఏమో? ... ...
పునుకులా గలగలలు వింటూ
కునుకు గన్నాదో? ... ...
నాథునీ వద్దనదు నాట్యము,
నాదు నీ కద్దనదు: ... ...
అరరే! ఆడిపోతున్నాయి.

వాడి ముమ్మొనవాలు, ...
హుతభుక్, ... ...
అజకపాలం, ... ...
ఢొక్క ఢుబుడక్, ... ...
నాల్గుసేతుల నాడు లౌతున్నాయి:
అశ్శరరభ! శరభ! ... ...
పందెమూ వేసేది యెవరోయి?
కుందనము గాసేది యెవరోయి?
కాఱునల్లని కాళరాత్రి.

౪

చంద్ర మకుటము, ... ...
జటాజూటము, ... ...
సాంద్రనీలపుఁ జడలపాపట
సురిగిపోతున్నాయి,
చక్కనీ మువ్వన్నె చర్మము
అక్కళించిన పొట్టపైని
అంటియుండీ అంటకున్నాదోయి,
ఆకలా అని యనే దెవరు?
సోకులా అని కనే దెవరు?
కాఱునల్లని కాళరాత్రి.

౫

మోకరింపులు గావు:
అది మఱి ... ...
బూకరింపుల నిలువు గాదు:
ఆకడకుఁ బడు నొక్కయంజ
యీకడకుఁ బడు నొక్కయంజ
ఏకముగఁ జేయుచును
నడు మొక ... ...
రేఖగాఁ దా వంగిగొంచు:
సందియం బే తెంచువా రెవరు?
చిందు-అని త్రోతెంచు వా రెవరు?
కాఱునల్లని కాళరాత్రి.

౬

అహంకారము లేదు లోలో
మహార్ణటనము మొగము చాటదు,
మహాదేవా! యుభయ మిదు మన
అభినయానకు హస్తమే లేదూ!
రభసముసఁ దనముందు వెనుకల
ప్రభల గలిపించు:
ప్రభలలో ప్రభ నిలుప నెవరోయి?
ప్రభలలో ప్రభ గలుప నెవరోయి?
కాఱునల్లని కాళరాత్రి.

## మీ జీవితపర్యంతము మీ శిరోజములను కాపాడుకొనుడు

శిరోజములు మిక్కిలి సున్నితమైనవి. వాటిని మీరు సరిగా పోషించిన అది చక్కగా పెరిగి, అందముగా నుండును. లేనిచో వాటిని అలక్ష్యముచేసినట్టి చిహ్నములు ప్రారంభమగును. మీ శిరోజములు యే విషయమునందైనను ఆశాభంగమును గలిగించిన వాటిని ధ్వంసపరచునట్టి అపాయము లన్నిటినుండి రక్షింపును.



# సు సా మ

ప్రాగ్దేశమునందు శిరోజముల నభివృద్ధిపరచునది

కొన్ని యేండ్లనుండి వాటిని లక్ష్యముచేసి యుండినను, లేక సరిగా వాటిని పోషించక యుండినను మీ శిరోజముల కిది తప్పక ఆరోగ్యము నొసగును. గడచిన ౯౦ సంవత్సరములనుండి దేశమందంతటను వాడుకలో నున్నది.

ప్రతిచోటను అమ్మబడుచున్నది.

**P. SETT & Co.,**
**Perfumers, Calcutta.**

# లివరు వ్యాధికి అమోఘమైన చికిత్స

మాదిరి ఔషధములు బయలుదేరినవి. మోసపోకుడు.

వీరి ఔషధరాజము అనేకమంది ప్రజలచేతను, గొప్పగొప్ప డాక్టర్లచేతను, ఆమోదింపబడి వేలకువేలుయోగ్యతాపత్రములు పొందియున్నది. గొప్ప గొప్ప డాక్టర్లుకూడ వదలివేసిన

లివరు వ్యాధులను వీరు అతి జయప్రదముగా గ్యారంటీగా నివారణచేయుచున్నారు.

ఎప్పటను యీ లివరువ్యాధికి తగిన ఔషధము లేకపోవుటచే వీరి ఔషధమునే అనేకమంది డాక్టర్లు ప్రతిదినము పోష్టుద్వారా తెప్పించుకొనుచు, వారి వారి రోగులకు వాడి వారి సంతృప్తుల దెలిపియున్నారు.

షరా:—మా ఔషధమును చూచి అనేక మాదిరిఔషధములు బయలుదేరినవి, గాన మోసపోకుండగలందులకై ప్రజలను హెచ్చరించుచున్నాము.

☞ అన్నిచోట్లను వీరి ఔషధరాజములనమ్ముటకు పలుకుబడిగల ఏజంట్లు గావలయును. వివరములకు;

విజయనగరవాస్తవ్యులగు;

## డాక్టర్ జమ్మి వెంకట రమణయ్యగారు,

లివరు అండ్ స్ప్లీనువ్యాధులకు ప్రత్యేకవైద్యులు.

8. సాలెవీధి, మైలాపూరు, మదరాసు.



# మలేరియావలన గలుగు బలహీనతను శానటోజిన్‌వలన జయించుడు.

ఒక ప్రఖ్యాతిగాంచిన డాక్టర్ హెచ్. డబ్లియు. ఎస్. అనువైద్యుడు యిటుల వ్రాసియున్నాడు:—

"శానటోజిన్ మలేరియాజ్వరానంతరము కలుగు బలహీనతను తొలగించుటలో యమోఘమైనది."

క్వైనైన్ మలేరియాను తొలగింపవచ్చునుగాని జ్వరము యొక్క బలహీనతను తొలగింపజాలదు.

మీ బలమును మరల సంపాదించుకొనుటకుమార్గము సరియైన బలవర్ధకాహారము భుజించుటయే. ఇట్టి యాహారము శానటోజిన్ యొక్కటిమాత్రమే.

శానటోజిన్‌నందు బలమును కలుగజేయు పదార్థములు చేరియుండి, రక్తమును తక్షణమే వృద్ధిచేయగలిగియున్నది.

నేటినుండియే శానటోజిన్ సేవించుటకు ప్రారంభించుడు. (8)

# SANATOGEN

నిజమైన బలవర్ధకాహారము.

చేతితో తాకబడలేదు.

అన్ని మందులషాపులలోను

# రాజమోహన హేరాయిలు



శ్రేష్ఠమయిన సువాసనగల తలనూనె. మెదడునకు చల్లదనమును గలిగించి వెంట్రుకలను అభివృద్ధి చేయుటలో అత్యుత్తమ మయినది.

తలపోటు, మాడుపోటు, శిరోవేడిమి, చుండు మొదలగువాటిని పోగొట్టి కన్నులకు చలవ నొసంగి వెంట్రుకలను మృదువుపరచి, నల్లగా పెంచుటలో అత్యుత్తమ మయినది.

స్త్రీలకు ఆనందమును కలుగజేయును.

సీసా 1-కి రు. 1-0-0 3 సీసాలు రు. 2-10-0

పోస్టేజి ప్రత్యేకము.

## పి. శి. ఏ. అండు కంపెని,

ఆయుర్వేదసమాజం,

పెరిదేపి, నెల్లూరుజిల్లా.

# కామామృతము

ఆయుర్వేదశాస్త్రి, అష్టావధాని,
కూరి వేంకటసుబ్బారావు,
ఎం. డి. ఎ. గారి

స్వదేశమునందు, అనేకవిదేశములయందుఁ బ్రఖ్యాతిఁజెందిన యౌషధము. ప్రూట యొకమాత్రపుచ్చుకొనిన ఎంతనిస్సారమైన శుక్రమైనను వెంటనే సంసారము నీయఁగలదు. 5 దినములలో మూత్రములోఁ గలిసిగాని ముందువెనుకలఁగాని ఁగాని పోయెడి వీర్యమును దృఢముగా నిలిపివేయును. మధ్యవయస్కులు, నరబలహీనముగలవారు ఈ మందునే పైకి ప్రతిగాఁగూడ నుపయోగించిన మిక్కిలి తులు కాఁగలరు. వెంటనే పరీక్షింపుఁడు. ఉత్తరములు రహస్యముగా నుంపఁ . మానద్ద మదరాసు గవర్నమెంటువారిచే నిశ్చితమైన ఆయుర్వేదౌషధములు పెక్కులు గలవు. యోగ్యతాపత్రములు అనేకములు కావలసినవారు వ్రాయుఁడు.

20 మాత్రల కామామృతము సీసా 1-కి రూ. 2-0-0.

అమృతాశ్రమము, నెం. 2, ఏలూరు, పశ్చిమ గోదావరి.

# మయూర మహాకవి

ప్రమోదూత సంవత్సరాశ్వయుజమాస భారతియందు శ్రీయుతులు ఆకుంఠి వెంకట శాస్త్రిగారు 'మయూర మహాకవి' యను పేర నొక వ్యాసమును ప్రకటించిరి. అందు సూర్యశతక కర్తయగు మయూర మహాకవి రచియించినట్లు పేర్కొనబడిన మయూరాష్టకము గలదు. దానిని జదువ సమన్వయము కుదురమి నయ్యది నిర్దుష్టముగా దేమో యను సంశయము పొడమెను. దానికి మాతృకయగు 'మయూరుని సంస్కృత కావ్యములు* అను పుస్తకమును బరిశీలింప మూలము దోషజుష్టమగుట తెల్లమయ్యెను. ఆంగ్లలిపినున్న మూలమాంధ్రలిపిని సరిగా నుండకుండెను. యథామాతృకమగు మూలము సైతము సుసంబద్ధముగ గానిపింపమి సూర్యశతకకర్తయే యీ యష్టకమును రచియించెనన వలనుపడకున్నది.† యథామాతృకమగు మూలము†—

౧. ఏషా కా ప్రస్తుతాంగీ
ప్రచలితనయనా హంసలీలా వ్రజంతీ
ద్వౌ హస్తౌ కుంకుమార్ద్రౌ
కనకవిరచితా..........,
.....ఉం (గామ్).....గే గతాసా
బహుకుసుమయుతా బద్ధవీణా హసంతీ
తాంబూలం నామహస్తే
మదనవశగతా గుహ్యశాలాం ప్రవిష్టా.

౨. ఏషా కా భుక్తముక్తా
ప్రచలితనయనా స్వేదలగ్నాంగవస్త్రా
ప్రత్యూషే యాతి బాలా
మృగ ఇవ చకితా సర్వతశ్శంకయంతీ,
కే నేదం వక్త్రపద్మం
స్ఫురదధరరసం షట్పదే నేవ పీతం
స్వర్గః కేనాఽద్య భుక్తో
హరనయనహతో మన్మథః కస్య తుష్టః.

3. ఏషా కా స్తనపీనభారకఠినా,
మధ్యే దరిద్రావతీ
విభ్రాంతా హరిణీ విలోలనయనా
సంత్రస్తయూథోద్గతా,
అంతఃస్వేదగజేంద్రగండగళితా
సంలీలయా గచ్ఛతీ

---

* 'మయూరుని సంస్కృత కావ్యములు' అను గ్రంథమును రచియించిన క్వాకెంబోసు దొరగారు ఈ యష్టకమును, సూర్యశతకమును మయూరుడే రచియించెననియు, అందును నీయష్టకము సూర్యశతకరచనమునకు గారణమనియును తలచుట కనుకూలములు, ప్రతికూలములునగు గాథలను, ఇతరప్రమాణములను జెక్కించని పేర్కొని, యీ రెండును నేకకర్తృకములు గాని నిశ్చయించుటకు ఇంకను ప్రబలములగు ప్రమాణములు లభించువరకు వీని నేకకర్తృకములుగనే భావింపవలె నని నిశ్చయించియున్నారు.

† "గృహలక్ష్మి" మూడవసంపుటపు తొమ్మిదవసంచికయందు పండిత శ్రీ వేమల సూర్యనారాయణశాస్త్రి గారు 'మయూరనిహతురు' అను పేరున నొకవ్యాసమును ప్రకటించియున్నారు. అందును నీయష్టకము గలదు. అది దోషజుష్టమగుటయే కాక, పాఠములతో గూడ నున్నది. అది వారి కెచట లభించెనో!

8. 4- 6 ౧౮౭౭

దృష్ట్వా రూప మిదం ప్రియాంగ గహనం
వృద్ధోఽపి కామాయతే.

౪. వామేనాఽఽవేష్టయంతీ
ప్రవిరళకుసుమం కేశభారం కరేణ
ప్రభ్రష్టం చోత్తరీయం
రతిపతిగుణాం మేఖలాం దక్షిణేన,
తాంబూలం చోద్వహంతీ
వికసితవదనా ముక్తకేశా నరాగా
నిష్క్రాంతా గుహ్యదేశా
న్మదనవశగతా మారుతం ప్రార్థయంతీ.

౫. ఏషా కా నవయౌవనా శశిముఖీ
కాంతాఽఽపథిగచ్ఛతి
నిద్రావ్యాకులితా విఘూర్ణనయనా
సంపక్వబింబాధరా,
కేశైర్వ్యాకులితా నఖైర్విదళితా
దంతైశ్చ ఖండీకృతా
కేనేదం రతిరాక్షసేన రమితా
శార్దూలవిక్రీడితా.

౬. ఏషా కా పరిపూర్ణచంద్రవదనా
గౌరీమృగాక్షీ భిణీ
లీలామత్తగజేంద్ర హంసగమనా
... ... ... ...
నిశ్వాసాధరగంధశీతలముఖీ
వాచా మృదూల్లాసినీ
న శ్లాఘ్యః పురుషః స జీవతి నరో
యస్య ప్రియా హీదృశీ.

౭. ఏ షా కా జఘనస్థలీ సులలితా
ప్రోన్మత్త కామాధికా
భ్రూభంగం కుటిలం త్వనంగధనుషః
ప్రఖ్యం ప్రభా చంద్రవత్,
రాకాచంద్రకపోలపంకజముఖీ
క్షామోదరీ సుందరీ
వీణీదండ మిదం విభాతి తులితం
వేలద్భుజం గచ్ఛతి.

౮. ఏషా కా రతిహావభావ విలస
చ్చంద్రాననం బిభ్రతీ
గాత్రం చంపకదామ గౌరసదృశం
పీన స్తనాలంబితా,
పద్భ్యాం సంచరతి ప్రగల్భహరిణీ
సంలీలయా స్వేచ్ఛయా
కిం స్వైషా గగనాంగనా భువితలే
సంపాదితా బ్రహ్మణా.

వ్యాసమున నుదాహృతము లయిన యొందు రెం డితర శ్లోకములు నిట్లున్నవి:

శ్లో. దర్పం కవిభుజంగానామ్
గతా శ్రవణ గోచరమ్,
విషవిద్యేవ మాయూరీ
మాయూరీ వాఙ్ నికృంతతి.

శ్లో. భక్తమాయూరవక్త్రాబ్జ
పదవిన్యాసశాలినీ,
నర్తకీవ నరీనర్తి
సభామధ్యే సరస్వతీ.

శ్లో. వణీదృశః పాణిపుటే నిరుద్ధా
వేణి ర్విరేజే శయనోత్థితాయాః,
సరోజకోశాదివ నిస్సరంతీ
శ్రేణీ ఘనీభూయ మధువ్రతానాం.

(శ్రీ) శాస్త్రిగా రించుక జాగరూకత వహించియుండిన నిపుడీచర్వితచర్వణ మనావశ్యకమయి యుండెడిది.

—'భారతి' పాఠకుడు.

# మోహిని

మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు

ప్రకృతి సౌందర్యంబుఁ బరికించువేళఁ
బురుషుని మహిమంబు నరసెడువేళ
వివిధంబులై తోఁచుఁ బ్రేమ తత్త్వంబు;
తల్లియై, పడఁతియై, తనయయై యొప్పి
భువనమోహనమైన మూర్తి ధరించి,
ప్రకృతి యానందంబు పఱఁగించుచుండఁ,
గొడుకయి, మగఁడయి, వడిఁ దండ్రి యౌచుఁ
బురుషుఁ డానందంబుఁ బొందుచు నుండు;
ప్రకృతి పూరుషు లైక్య భావంబు నొంది
యద్వైతమైన బ్రహ్మానందమందు
మునుఁగుచుఁ దేలుచు మునుఁగుచున్నప్పు
డానంద మిమ్మాడ్కి ననుభవింపంగఁ
గోటి జన్మము లెత్తఁ గోరుచునుందు;
అనుభవించినవాఁడె సాక్షి దీనికిని.

..............................

..............................

శ్రీసర్వ మంగలాకృతిఁ బొల్చుచుండి
యార్యాభిధేయ భవ్యయశంబు నొంది,
తగునపర్ణత్వంబు తఱిగిపోకుండ
నన్నపూర్ణ ఖ్యాతి నతిశయం బంది
యర్థి సతీత్వ మన్వర్థమై యొప్పఁ
దన్నుఁ గొల్చుచునున్న తనయున్నమిన్నఁ
బ్రోవంగఁ దలఁ బొంది ప్రోద మీఱంగఁ
దనువునఁ దను విచ్చి తని వొందఁ జేసి,
మనసున మనసిచ్చి మనియుండఁ జేసి,
యాత్మ నాత్మ యొసంగి యలరారఁ జేసి,
తనశివాభిఖ్యాతి ధన్యమౌనట్లు
బుధ గురు శేఖర భూరియశుండు
సర్వజ్ఞుఁ డైశ్వర్య సహితుండు హితుఁడు
క్షీరంబు శర్కరఁ జేరియున్నట్టు
లేకరూపంబున నింతితోఁ గూడి
యేకమై యొప్పారు నీ దివ్యమహిమ
యెఱిఁగి దేవునిఁ గొల్వ నేర్పడ్డ దినము
శివరాత్రి యనుపేరఁ జెలువొందు దినము
చనుదెంచి నాకు నుత్సాహం బొసంగె.

..............................

తనివి తీరఁగ నీశుఁ దలఁచితిఁ గొలువ.

..............................

ఈశుఁ గొల్వఁగ నెంచి యిలు వీడిపోయి
యందందుఁ దిరుగాడి, యల్లన నడచి
యబ్ధిఁ జేరితిని సంధ్యాకాలమునకు
సంజ కెంజాయలు సరసంబులగుచు
నంబుధిలోఁ బ్రతిబింబించుచుండి
యెన్న శక్యము గాని హృత్ప్రీతి నొసఁగె.
అంత నొయ్యొయ్యన నంధకారంబు
వ్యాపింపఁగాఁ జొచ్చె నన్నితావులను.

..............................

ఆకాశపథమున నలరు నీలిమము
నంభోధితలమున నలరు నీలిమము
నంధకారంబున నలరు నీలిమము
మూఁడు త్రోవలయందు ముత్తెఱంగులుగ
నేకమై మనమున కింపు గావించె;

మూఁడు త్రోవలయందు మొనసియున్నట్టి
పరమేశ్వరుని మహాభావంబుఁ బోలె
మూఁడు తెఱంగుల మొనసి యున్నట్టి
యంధకారంబున నద్భుతంబైన
జ్యోతిస్స్వరూప మత్యుత్సాహ మొసఁగె.
...........................
లోకజాలమ్ములు, లోకనాయకులు,
లోకస్థు లపఁగ నలోకమైనట్టి
యంధకారంబున కవ్వలి త్రోవ
నాదిత్యకాంతి నేకాకార మగుచు
నలరుదివ్యజ్యోతి యద్భుతం బొసఁగె.
...........................
...........................
ఆరభటీవృత్తి నుదుతాండవము
కైశికవృత్తిసంగతుల లాస్యంబు
సంగవిశేషవిద్యలను నృత్యంబు
వివిధరసంబుల వెలయునాట్యంబు
గావించి, కావించి, ఘనత మీఱంగ
నలుదెఱంగుల నృత్తనైపుణిం జూపి
నృత్తానువృత్తమై నెగడు ఛందమున
మంద్ర మధ్యమ తారమహిమముల్ వెలయ
భావానురూపమై పరఁగురాగంబు
రాగానురూపమై ప్రబలుభావంబు
ప్రకటించి గీతవైభవములం జూపి;
గీతానురూప విఖ్యాతరీతులను
దత్తోమిత్యాదిశబ్దములఁ గొల్చుచును
రాగభావముల మార్గములందు నిలిపి
లయయుక్తవాద్యలీలలఁ గోరి చూపి;
వాద్యవైభవములవాసి నొప్పారు
నృత్తగీతంబులనిపుణతల్ మెఱయు
తౌర్యత్రికంబు నందంబు మీఱంగఁ
బ్రకటించి భావముల్ రసములు నొకట
వివిధభేదంబుల వివిధరీతులను
వెలయించుచున్నట్టి వీచికాతతుల
క్రీడావిశేషముల్ ప్రీతి గావించె.
...........................
...........................
అంధకారములోని యద్భుతంబైన
జ్యోతిస్స్వరూపంపుఁ జోద్యంబునదుమ
వీచికానృత్తంపువిభవంబు నూచి
తన్మయం బయ్యెఁ జిత్తం బంత నాకు.
...........................
వీచికానృత్తంబు వీక్షించుచుండి
తన్మయం బైన చిత్తంబందు నంత
వింతయానందంబు విలసిల్లుచుండె.
...........................
అంత, వింతగ మార్పు లందెఁ జిత్తంబు.
లేవు తరంగముల్, లేదు సంద్రంబు,
లే దంధకారంబు, లేదు రావంబు;
కోటిభాస్కరు లొక్కచోటనే కూడి
భాసిల్లురీతి దివ్యజ్యోతి యొప్పె.
ఆజ్యోతిమధ్యంబునం దొక్కకోటి
మన్మథుల్ గుమి గూడి మనియున్నరీతి
సౌందర్యరాశియై జానొందుచున్న
మోహినీరూప మూర్తమోలఁ గన్పట్టె.
కర్పూర కస్తూరికాగంధములకు
మిన్నయై యున్న నెమ్మేనిగంధంబు
పృథ్వీస్వరూపమై ప్రీతి నింపంగ,

• జాలుజాలుగఁ జెక్కు లీలలం జూపు
లావణ్యరసము జలం బయి యొప్పఁ
దళుకు తళు క్కని తనివి గావించు
తనుకాంతి తేజోవితానంబు నింప
సరసశీతల మృదుస్పర్శలం గొల్పు
చూపులు వాయుసంక్షోభలం జూపఁ
గలదు లే దనురీతి నలరుమధ్యంబు
గగనతత్త్వంబును గన్పట్టఁ జేయ,
భూతపంచకమునఁ బొల్పారుచున్న
యంద మంతయు నొక్కయాకార మంది
మూఁడులోకంబులు మోహింపఁ జేయు
నా మోహినీరూప మటు చూచి చూచి,
మోహజాలంబున మునిఁగితి నేను.

మోహినీరూపంబు ప్రోలఁ గన్గొనుచు,
మోహజాలంబున మునిఁగిపోవుచును,
జెదరని బెదరని చిత్తంబుతోడఁ
గదలక మెదలక...........
.................ఎదుటఁ గూర్చుంటి.

కదలక మెదలక కనుచున్న నన్నుఁ
గదలక మెదలక కనుచుండెఁ గాంత;
కాంత నిశ్చలబుద్ధిఁ గనుచుండె నన్ను
నేను నిశ్చలబుద్ధి నింతిఁ గంచుంటి;
నేను మోహినిని మోహించి కంచుంటి,
మోహినియును నన్ను మోహించి చూచె.

నిశ్చలయై యట్లు నిలుచున్న కాంత
నిశ్చలత్వము మాని నృత్తంబు సలిపె.
...     ...     ...     ...     ...
...     ...     ...     ...     ...
...     ...     ...     ...     ...

నృత్తానువృత్తమై నెగడు చందానఁ
దాళమానములు పాదంబులం గొల్పె;
హస్తనేత్రగ్రీవహారిభేదముల
నభినయ మ్మొనరించి యందంబుఁ గొల్పె;
భావరాగంబుల ప్రౌఢి చెన్నొంద
ననుపులు పుట్ట గానంబులు గొల్పె;
భావానుగుణమైన వసత రాగంబు,
రాగానుగుణమైన రమణీభావంబు,
తాళానుగుణములై తనరారుచుండె.
...     ...     ...     ...     ...
భరతశాస్త్రప్రౌఢి పరిఢవిల్లంగ
నృత్త మిమ్మాయి నాచరించుచునున్న
భువనమోహనరూపమును గాంచి కాంచి
తన్మయం బయ్యెఁ జిత్తం బంత నాకు.
...     ...     ...     ...     ...
భువనమోహినియైన మోహినిం జూచి
మోహించి మోహించి మోహించి యంతఁ
దన్మయంబైన చిత్తము తత్తఱింపఁ
గౌఁగిలింపఁ దలంచి, కాంతచెంతకును
వడివడివడిగాఁగఁ బరువులెత్తితిని.

పరువెత్తి తనవైపు వచ్చు న న్గాంచి
వడినడిఁ గాంతయుఁ బాఱిపోసాగె.

భువనమోహిని ముందు పోవుచునుండ
నింతిని వెన్నాడి యేఁ బోవుచుంటి.
పరువెత్తి పరువెత్తి వచ్చు నన్ జూచి
వడివడిఁ గాంతయుఁ బరువెత్తుచుండె.
అలసియు సొలసియు,నాయాస మొప్ప,
మెల్ల మెల్లఁగ నేను మెలఁగుచునుండ,
మెలమెల్లఁ జెంత నే మెలఁగ నింతియును;

మెల్లమెల్లఁగఁ జెంత మెలఁగుచునున్నఁ
జిక్కి మోహిని చేతఁ జిక్కి నం చెంచి
వడివడి నింతిని బట్టుకోఁబోవ,
వడివడి దవ్వుగాఁ బాఱె నింతియును.
కాంత చెంతకు రాఁగఁ గడు నాశఁ బొంది,
కాంత దవ్వుగఁ బోవఁ గడు వంత నొంది,
యాశయు, వంతయు నట్టిట్టుకొల్ప,
నట్టూఁతయుయ్యాల లూఁగెఁ జిత్తంబు.
మోహినిఁ గనుఁగొని మోహంబు నొంది
మోహంబు విడువ కుత్సాహంబుతోడఁ
బట్టుకోఁ గౌఁగింటఁ బెట్టుకో నెంచి,
పరుగెత్తి పరుగెత్తి పరుగెత్తలేక,
యలసియు సొలసియు నాయాస మొంది,
యాయాసమందు దుఃఖానంద మొంది,
నిట్టూర్పు నిగుడించి, నిలిచి, నిరాశ
ననునయాలాపదీనాస్యుండ నగుచు
నతికరుణంబుగాఁ బ్రార్థించుచుంటి.
అతిదీనమైన నాయాలాప మింతి
యాలించి నాపైని జాలి చూపించె-
జాలితో నింతి నాసరస కేతెంచె
సరస నాకౌఁగిటఁ జనవున నిమిడె.
కాంత కౌఁగిటిలోనఁ గలసియున్నప్పు
డానందవార్ధి మున్గాడుచునుంటి,
నానందరూపుండ నై వెల్గుచుంటి.
... ... ... ... ...
అంతలోఁ గను విచ్చి యరసితి మరల.
మోహినియై నన్ను మోహజాలమున
ముంచినమోహినీపూర్వరూపంబు
పూర్వరూపము లే కపూర్వమై తోఁచె.

... ... ... ... ...
తనువునఁ దను వుంచి తని వొందునట్లు,
మనసున మన సుంచి మనియుండునట్లు,
ఆత్మైక్యమును బొంది యలరారునట్లు
తలఁ పొంది యాశ నేఁ దన్ను వెన్నాడఁ
గాంత కౌఁగిటఁ జేరి కరుణఁ జూపించి,
యంతలోఁ దనరూప మప్పుడే మార్చె.
... ... ... ... ...
... ... ... ... ...
మోహిని భార్యయై మోహింపఁ జేయ
నేనె భర్త నటన్న యెఱుకతో నుంటి.
భార్యచందానఁ గన్పట్టి మోహినియు
భార్యాస్వరూపంబుఁ బాసె తత్క్షణము.
... ... ... ... ...
ప్రేమ చూపులలోన వెలయుచునుండఁ
జల్లనిచేతులు చాఁపి, కౌఁగింట
ననుఁ జేర్చి, తనివార నన్ను ముద్దాడి
యననుభూతానందమందు నన్ ముంచె.
ప్రేమస్వరూపమై ప్రీతి నింపుచును,
బ్రోలఁ గన్పడుచున్న మోహినిఁ జూచి,
సాష్టాంగముగ నమస్కారమ్ము చేసి,
"అమ్మ నిన్నెన్నాళ్ల కరసితి నమ్మ!
నిన్నుఁ జూడనియొక్క నిముసంబు నాకు
యుగమయి తోఁచు న న్నోమవే తల్లి,
చల్లని నీచేయి చాలు నోయమ్మ
చల్లని నీచూపు చాలునోయమ్మ"
యనుచు నిమ్మెయిఁ బల్కి యమ్మపాదములు
కరములఁ బట్టుచుఁ, గనుల నద్దుచును,
భక్తిభావంబు, విశ్వాసభావంబుఁ

జూపించి, ముదమునఁ బొక్కుచునుండ,
మఱియొక్క రీతిగా మాఱె నింతియును.

...    ...    ...    ...    ...

...    ...    ...    ...    ...

ముద్దు గాఱుచునుండె ముద్దునెమ్మోము,
ముద్దు గాఱుచునుండె ముద్దు చూపులును,
ముద్దు గాఱుచునుండె ముద్దు చేతులును,
ముద్దు గాఱుచునుండె ముద్దు పాదములు.

ముద్దుల మూటయై మ్రోల నిల్చున్న
ముద్దుబిడ్డను జూచి ముదమందుచుంటి.

చిన్నారి పొన్నారి చిగురుఁ జేతులను
నవ్వుచుఁ గేరుచు ననుఁ గౌఁగిలించి,
ముద్దాడుచున్నట్టి ముద్దులబిడ్డఁ
గనుఁగొని, విసియును గనియును దొల్లి
యనుభవింపని యపూర్వానందమందు
మునుఁగుచుఁ దేలుచు మునుఁగుచునుంటి,
ముద్దులు గురియుచు మ్రోల నిల్చున్న
ముద్దుబిడ్డను జూచి, ముద్దులాడుచును,
కౌఁగింట నిలుచుచుఁ, గౌఁగిలించుచును,
నననుభూతానందమందు మున్గాడి
యలరారుచున్నప్పు డంతంత — వింత —
ఒకమార్పు కనుపట్టె నొక్కసారిగని

...    ...    ...    ...    ...

...    ...    ...    ...    ...

ఎదుట నొప్పుచునున్న యింతిని జూడఁ
బరిపూర్ణమా ప్రేమ పరగె నాయెదను.

కౌఁగింటఁ జేర్చితిఁ గౌఁగిట నుంటి,
ముద్దాడుచుంటిని, ముద్దిడుచుంటి;
గాని,...    ...    ...    ...
...    ...    సందేహంబుకలిగె నాయెదను.

మోహంబు గొల్పుచు, మ్రోల నిల్చున్న
యింతి యెవ్వతెయొ, నే నెవ్వాఁడనొక్కొ,
యేర్పర్పలేనైతి నించుకంతయును.

ముదుఁజూపులతోడ మురిపెంబు నింపి
కన్నతల్లి యటన్న కరణి నొప్పారె;
ముద్దుఁజూపులతోడ మురిపెంబు నింపి
ప్రాణేశ్వరి యటన్న పగిదిఁ గన్పట్టె;
ముద్దుఁ జూపులతోడ మురిపెంబు నింపి
యనుఁగుబిడ్డ యటన్న హరువునఁ దనరె.

పడఁతినై, తల్లినై, కడుఁబ్రీతి నొసఁగి,
తల్లినై, పిల్లనై, తనివొందఁ జేసి,
బిడ్డనై, యింతినై, ప్రియమందఁ జేసి,
వివిధవిధంబుల విలసిల్లుచున్న
ప్రేమస్వరూపంబు ప్రీతి నీలాగ
ననుభవింపఁగఁ జేసి యానందవార్ధి
నన్ను ముంచుచునుండ, నన్నిరీతులను,
మగఁడనై కొడుకనై మఱి తండ్రి నగుచుఁ,
బరిపరివిధములఁ బరిఢవిల్లంగ
నానందవార్ధి మున్గాడుచునుంటి,
నానందపీయూష మది గ్రోలుచుంటి,
నానందరూపుండనై వెల్గుచుంటి.

...    ...    ...    ...    ...

...    ...    ...    ...    ...

...    ...    ...    ...    ...

ఎంతసేపుంటినో యెఱుఁగ నిమ్మాడ్కి —
ఇంతలో — అక్కటా — యేకతంబుననొ,
చప్పున నొక్కింత చైతన్య మబ్బె —
చైతన్య మబ్బినసమయంబునందు
గాఢాంధకారంబు కప్పి నల్దెసల —
తడిసిన ట్లెండెఁ బాదంబులు రెండు.

కెరట మొక్కటి వెన్క కరుగుచునుండె —
సంపూర్ణ మైనట్టి చైతన్య మబ్బె.

...  ...  ...  ...  ...

...  ...  ...  ...  ...

ఆకాశపథమున నలుగునీలిమము,
నబ్ధితలంబున నలుగునీలిమము,
నంధకారంబున నలరునీలిమము,
మూఁడుత్రోవలఁ గప్పి, మొనసి కప్పట్టె.

తరఁగల నురుఁగులు తళుక్కు తళుక్కనుచు
నంధకారముఁ జీల్చి యులరాఁచుచుండె.

పాటలఁ బాడుచు, నాట లాడుచును,
గెరటంబు లెదురనే క్రీడించుచుండె.

...  ...  ...  ...  ...

...  ...  ...  ...  ...

అట్టిచీఁకటివేళ నంబుధిచెంత
నొక్కండ నుండుట నుత్సహించితిని
బరమేశుఁ దలఁచుచుఁ బరిపూర్ణభక్తి
నింటికి నొక్కండ నేతెంచుచుంటి.

చీఁకటి యంతటం జిక్కనై యుండెఁ,
ద్రోవ కన్పడకుండెఁ ద్రోవపాటయ్యెఁ;
జిత్త మీశునిపైని చెరఁగోయుండె.

“హా పరమేశ్వరా, హా కన్నతండ్రీ,
చిత్రంబు నీచర్య, చిత్రంబు తండ్రీ;
ప్రకృతిపూరుషులరూపంబులఁ దాల్చి,
చిత్రవిచిత్రమై చెలువారు చున్న
ప్రేమామృతంబును వివిధరీతులను
సంపూర్ణమైన యుత్సాహంబుతోడ
ననుభవింపఁగఁ జేసి, యానంద మిచ్చి,
నిన్నుఁ సేవింపంగ, నిన్నుఁ గూడంగ,
నిన్నుఁ జేరంగను, నిన్నుఁ బొందంగఁ,
దగురీతులం జూపి తనివొందఁ జేసి,
నను బ్రోచుచున్న నీనవ్యవైభవము

కొనియాడనేర్తునే కోటివేలైన
జన్మంబు లెత్తంగా శంక నా కేల ?
నీవు నన్నరయనినిముసంబు లేదు,
నీవు నన్ బ్రోవనినిముసంబు లేదు.

వివిధవిధంబులఁ బ్రేమ చూపించి,
నన్నుఁ బ్రోచుచు నీవు ననుఁ జూచుచుండ,
నానందమే కాని యన్యంబు లేదు;—
ఆనందరూపమై యులరు నంతయును.”

...  ...  ...  ...  ...  ...

...  ...  ...  ...  ...  ...

అనుచు నేమేమియో యనుకొంచు, మఱల,
నందియు నందక, యూయూనపెట్టి,
దొరకియు దొరకక, తొందర పెట్టి,
తనుఁ బట్టుకోఁజూడ, ననుఁ జేరరాక,
ననుఁ బట్టుకో వచ్చి, నా కందరాక,
యలయించి, సొలయించి, యూయూనపెట్టి,
యూయూనము దొక్క యద్భుతంబైన
యానంద మిచ్చి, నన్నాదరం బొప్పఁ
గనుఁగొన్న మోహాసి కన్నులం గట్టి
నట్టులు కన్పట్టిన ట్లున్నకతన,
జరిగిన దంతయు మఱవఁ బోలేక,
మఱిమఱి తలఁచుచు నఱిమఱి గొనుచు,
నల్ల నల్లన నింటి కరుగు దెంచితిని.

...  ...  ...  ...  ...

...  ...  ...  ...  ...

...  ...  ...  ...  ...

ప్రకృతిసౌందర్యంబుఁ బరికించు వేళఁ,
బురుషునిమహిమంబు నరసెడు వేళ,
వివిధంబులై తోఁచుఁ బ్రేమతత్త్వంబు
ననుభవించినవాఁడు సాక్షి యొక్కండె.

---

# పెలియూజ్-మెలిజాండాలు
## (మారిస్ మిటర్‌లింకునుండి అనువాదము)

దేశరాజు రామదాసు గారు

### పాత్రములు

ఆర్కేల్—అల్లిమాండ్ దేశపురాజు.

జెనివీవు—పెలియాజ్, గోలాడులతల్లి.

పెలియాజ్ } ఆర్కేల్ మనుమలు.
గోలాడ్ }

మెలిజాండా.

న్యిల్డు—గోలాడ్ మొదటి భార్యవల్ల గలిగిన పుత్రుడు.

ఒక వైద్యుడు.

ఒక ద్వారపాలకుడు.

దాసీలు, భిక్షుకులు, మొదలైనవారు.

### అంకము ౧.

### రంగము ౧.

కోటతలుపు.

దాసీలు—(లోపల) తలుపు తియ్యి! తలుపు తియ్యి!

ద్వారపాలకుడు—(లోపల) ఎవరక్కడ? ఎందుకు వచ్చి నన్ను లేపేరు? పైకి వెళ్లడానికి దార్లులేవు? చాలండి కావలసినన్నున్నాయి.

ఒకదాసి—(లోపల) మేము గడప కడగడానికి వచ్చాము. తలుపూ మెట్లు కడగాలి. తలుపు తియ్యి! తలుపు తియ్యి!

మరొకదాసి—(లోపల) ఇంకా చాలా పనులు చెయ్యాలి.

మూడోదాసి—(లోపల) గొప్ప శోభస్కరంగా చెయ్యాలి. వేగం తియ్యి!

అందరు—తియ్యి. తియ్యి.

ద్వార—ఉండండి. ఉండండి. నేను తలుపు తియ్యడానికి వీలవుతుందో లేదో నాకు తెలియదు... అదెప్పుడు రాత్రి తియ్యడము లేదు... తెల్లవారిందాకా ఉండండి.

మొదటిదాసి—బయట కావలసినంత వెలుగొచ్చింది. కన్నాలగుండా నాకు సూర్యుడు కనబడుతున్నాడు.

ద్వార—ఇవిగో పెద్దతాళాలు......అబ్బబ్బ! తాళాలు ఘడియలు ఎలా అరుస్తున్నాయో. సాయం చెయ్యండి, సాయం చెయ్యండి.

అందరు—మేము లాగుతున్నాము, మేము లాగుతున్నాము.

రెండోదాసి—అది రాదు.

మొదటిదాసి—అదిగో వస్తున్నది! మెల్లగా వస్తున్నది.

ద్వార—ఎలాగు అరుస్తున్నదో! ఇంటందరినీ లేపేస్తుంది.

రెండోదాసి—(గుమ్మముకడ కనబడి)

ఓహో! అప్పుడే యింత ఎంత వెలుగొచ్చిందో!

మొదటిదాసి—సూర్యుడు సముద్రంమీద ఉదయిస్తున్నాడు.

ద్వార—అది వచ్చింది... బాగా తెరవబడింది.

[దాసీలందరు గుమ్మముకడ కనబడి, అది దాటి వెడలుదురు.]

మొదటిదాసి—నేను ద్వారంరాయి కడగడం ప్రారంభిస్తాను.

రెండోదాసి—ఇదంతా మన మప్పటికీ కడగలేము.

మిగిలిన దాసీలు—నీళ్లు తే, నీళ్లు తే.

ద్వార—అవునవును. నీళ్లు పొయ్యండి, నీళ్లు పొయ్యండి. పారుతున్న నీళ్లన్నీ పోసినా మీరు పూర్తి చెయ్యలేరు......

మెలిజాండా—అయ్యో! నీజుత్తు అప్పుడే పండి పోతున్నాదే.

గోలాడ్—అవును. ఇక్కడ కణతలమీద కొంచెము.

మెలిజాండా—నీగెడ్డాముకూడాను...నువ్వెందుకు నాతట్టలాగు చూస్తున్నావు?

గోలాడ్—నేను నీకళ్లవైపు చూస్తున్నాను. నువ్వెప్పుడు కళ్లు మూసుకోవు?

మెలిజాండా—మూస్తాను, మూస్తాను. రాత్రి నిద్రపోయేటప్పుడు.

గోలాడ్—నువ్వెందుకంత అద్భుతపడి చూస్తున్నావు?

మెలిజాండా—నువ్వు రాక్షసివా?

గోలాడ్—నేను తక్కినమనుష్యులవంటి మనిషిని...

మెలిజాండా—నువ్విక్కడ కెందుకొచ్చావు?

గోలాడ్—నాకే తెలియదు నేను అడవిలో వేటాడుతూవుంటిని. ఒక అడవిపంది వెంట తరుముతూ వచ్చి దారి తప్పిపోయాను...నువ్వు మిక్కిలి చిన్నదానిలాగ కనిపిస్తున్నావు. నీవయస్సెంత?

మెలిజాండా—నాకు చలి వేస్తున్నాది...

గోలాడ్—నువ్వు నాతో వస్తావా?

మెలిజాండా—రాను రాను. నే నిక్కడే ఉంటాను.

గోలాడ్—నువ్వొక్కర్తవే యిక్కడుండలేవు నువ్వీరాత్రంతా యిక్కడ ఉండలేవు. నీపే రేమిటి?

మెలిజాండా—మెలిజాండా.

గోలాడ్—నువ్వొంటరిగా నుంటే జబ్బుస్తావు. ఇక్కడ దేమంటాయో యెవరూ చెప్పలేరు. రాత్రంతా ...ఒంటిగా...ఉండడం సాధ్యం కాదు. మెలిజాండా! రా! చెయ్యియ్యి.

మెలిజాండా—అబ్బా! నన్ను ముట్టకు.

గోలాడ్—నువ్వు పై కేడకూడదు. నేను నిన్ను మరి ముట్టను. నాతో మాత్రము రా. రాత్రి మిక్కిలి చీకటిగాను, మిక్కిలి చలిగాను ఉంటుంది. నాతో రా...

మెలిజాండా—నువ్వేదారిని వెళుతున్నావు?

గోలాడ్—నాకు తెలియదు. నేనూ దారి తప్పిపోయాను.

(నిష్క్రమింతురు.)

## రంగము 3.

కోటలో నొకసావడి.

[ఆర్కేల్, జెనివీవులు కనబడుదురు.]

జెనివీవు—వాండు తనతమ్ముడైన పెలియాజ్ పేర వ్రాసిన చీటి:—

"ఒకనాటి సాయంసమయమున, ఏడుస్తూ బావి ప్రక్కనిలబడిన యీమెను, అడవిలో నేను దారితప్పిపోయి చూచాను. నా కామె యెవ్వరు గాని, ఆమె యెవరో, యెక్కడనుంచి వచ్చినదో గని తెలియదు. అని ప్రశ్నించడానికిగూడా నేను సాహసించలేను. ఎందుకంటే, యేమి జరిగిందని యెప్పుడడిగినా యేదున్నా నారంభించి చూచిన వారికి భయం వేసినంత శెక్కును. నే నామెనుద్దకా బావి కడకు వెళ్లినప్పటికి, ఒక బంగారుకిరీటము ఆమె శిరస్సు నుండిజారి లోతునీళ్లలోనికి బడిపోయెను. అదిగాక యీమె వస్త్రములు ముళ్లపల్ల పీలికలగా చినిగిపోయినప్పటికి, ఆమె రాజకుమార్తెనని తెలిసే గుర్తులు ధరించినది. నేనామెను వివాహమాడి యీ రుమాసము లైనది. మే మిద్దరము మొదట కలసిన నాటకంటే నా కామెను రేమి తెలియదు. ఈమధ్యన, సోదరా! పెలియాజ్—మన మిద్దర మొక తండ్రికి పుట్టినవారము కాకపోయినను, నా స్వంతతమ్ముని కన్న యెక్కువగా ప్రేమించిన నీవు, నారాకకై సన్నాహము చేయుము... నాతల్లి నన్ను క్షమించునని నాకు తెలుసును. కాని రాజైన మనతాతగారికి నేను భయపడతాను. వయోమయుడైనప్పటికి ఆర్కేల్ నకు నేను జడుస్తాను. వీలనంగుదా యీ విచిత్రపువివాహమువలన నతని రాజకీయ యోజనల కన్నిటి కంతరాయము కలిగించితిని. అ

మేధానిధి మెలిజాండాచక్కదనము చూచియైనను నన్ను క్షమిస్తాడో లేదోయని జంకుతున్నాను. ఏదెలాగైనను, అతడు తనకుమార్తెంక కంగీకరించినట్లు, ఆమె స్వాగతాని;కనుమతించినయెడల, ఈ ఉత్తర మందిన మూడో నాటిసాయంకాలము కోటబురుజుమీద, సముద్రంమీద నుంచి కనబడేటాగు ఒక దీపంపెట్టు. నౌకోపరిభాగము నుండి దానిని నేను చూస్తాను. లేకపోతే దూరంగాపోయి మరి తిరిగి రాను." మీరు దీని కేమంటారు?

ఆర్కేల్ — ఏమీ లేదు. వాడు చెయ్యవలసిందే బహుశా వాడు చేశాడు. నేను మిక్కిలి ముసలివాడిని. అయినప్పటికీ ఒక్కక్షణమైనా నాయంతరాత్మను పరిశీలించలేదు. అట్టియెడ పైవారిచర్య లెటు విచారించేద? నేను కాటికి కాళ్లు చాచుకుని కూర్చున్నాను. నేను నామట్టుకే విచారణ చేసుకునేశక్తిలో లేను. ఎవడైన ఆత్మపరీక్ష చేసుకోనియెడల ఎప్పుడూ తప్పుదారిలోనే బడతాడు. వాడు చేసినది మనకు విపరీతంగా కనబడవచ్చును. వాడు వయస్సు ముదిరినవాడు. ఒకబాలిక బావిదగ్గర కనబడితే, ఒకబాలుడేమి చేస్తాడో, అలాగు వాడు తనమట్టుకు తానే పెండ్లి చేసుకున్నాడు... ఇది మనకు విపరీతంగానే కనబడవచ్చును; ఏలనంటే మనవిధినియోగము నెరుగము ...ఒక్కొక్కతరి మనము చేసినప్పుడూ అల్లే తప్పు త్రోవనే యనుసరింతుము......వా డెప్పుడు నిదివరకు నాసలహా ననుసరించేవాడు. దుర్మలరాజకుమార్తె నడుగ బంపేటప్పుడు నేను వానిని సౌఖ్యపెట్టాలని తలచేను. వాడు ఒంటరితనమును భరింపలేకపోయెను. తనభార్య మరణించిన నాటినుండి యొంటరిగా నుండుటకు వాడు విచారించుచుండెను. ఈవివాహము దీర్ఘసంగ్రామములను, పురాతన వైరములను నశింపజేసియుండును...నా పెట్లు కోరలేదు. వాడు కోరినట్లే కానీ. విధినియోగమునకు వ్యతిరేకించి నే నెప్పుడూ జోక్యము చేసుకోను. వానికి వానిభావిస్థితి నాకంటే బాగా తెలుసును. బహుశా అకారణకార్యములు జరగడ మన్నది ఉండదు...

గొనిపీవు — వా డెప్పుడూ తెలివిగా, గంభీరంగా, స్థిరంగా ప్రవర్తించేవాడు... పెలియాజ్ గాని యిలా చేసి యుంటే నా కర్థమయ్యేది... కాని వాడు... ఈవయస్సులో......మనమధ్య కొరిని తీసుకురానున్నడో? దారిప్రక్క దొరికిన ఒక యజ్ఞాతబాలికను...తనభార్య మరణించిననుండి వాడు బ్రతకడం తనకుమారుడైన న్యీయాల్డుకొరకే. ఇప్పుడు తిరిగీ వివాహం చేసుకోవాలని యత్నపడడం మీరు కోరినారని...మరి యిప్పుడు...అడవిలో నొకచిన్నపిల్ల...వాడంతా మరిచిపోయాడు...మన మేమి చెయ్యడం? [ప్రవేశము పెలియాజ్.]

ఆర్కేల్ — ఆలోపలికి వస్తున్న దెవరు?

గొనివీవు — పెలియాజు. వా డేడుస్తున్నాడు.

ఆర్కేల్ — నువ్వా పెలియాజ్? వెలుగులో చూస్తాను కొంచెము దగ్గరకు రా......

పెలియాజ్ — తాతయ్యా! మా నేస్తం మార్సిలస్ దగ్గరనుండి మరియొక ఉత్తరం వచ్చింది. అతడు చనిపోయేస్థితిలో నున్నాడు. నన్ను రమ్మని వ్రాశాడు. అతడు మరణించే లోపుగా నన్ను చూడాలని కోరుతున్నాడు.

ఆర్కేల్ — మీఅన్న రాకముందే నువ్వు వెళ్లిపో గోరుతున్నావా?— నీ స్నేహితు డనుకున్నంత జబ్బుగా లేడేమో......

పెలియాజ్ — ఆ పంక్తులమధ్యను అతని చావు ప్రత్యక్షముగా కనబడుతున్నది. అతని ఉత్తర మంత విచారం కలిగిస్తున్నాది...సరీగా చా వెప్పుడు తప్పక వస్తుందో తనకు తెలుసునని వ్రాస్తున్నాడు. నేను కోరితే అతని మరణమునుండి తప్పించగలనని వ్రాస్తున్నాడు; కాలవిలంబమునకు వ్యవధి లేదు. ప్రయాణము చాల దీర్ఘము. గొలాడ్ రాకకై నిరీక్షిస్తే మిక్కిలి యాలస్యము కావచ్చును...

ఆర్కేల్ — అయినప్పటికీ కొంచెమాగడం మంచిది. ప్రస్తుత మింటికి వారిరాక వల్ల యేమి వస్తుందో మనము చెప్పలేము. అది గాక, పైని మీనాన్నగారు బహుశా నీస్నేహితునికంటే గూడ మిక్కిలి అపాయస్థితిలో నున్నారేమో!...నీ తండ్రి, స్నేహితుల మధ్య నెవరు ముఖ్యమో నిర్ణయం చెయ్యగలిగేవా?...

(నిష్క్రమించును.)

గొలోవు—పెలియాజ్! ఈసాయంత్రము దీపం వెలిగించడము మాత్రము మరచిపోకు...

(వేరువేరుగా నిష్క్రమింతురు)

రంగము ౫.

కోటముందర.

[ప్రవేశము: గొలోవు, మెలిజాండాలు.]

మెలిజాండా—ఈ తోటలో చీకటిగా నుంది. ఎంత పెద్ద అడవులో! ఈ మేడ చుట్టూ ఎంత పెద్ద అడవులో!......

గొలోవు—అవును; నేను మొట్టమొదట వచ్చినప్పుడు నాకుగూడ ఆశ్చర్యం కలిగించింది. అందరికీ ఆశ్చర్యం కలిగిస్తుంది. కొన్ని కొన్ని చోట్లలో సూర్యుడెప్పుడూ కనబడడు. కాని అలవాటైన తరువాత అంతా కనబడుతుంది.... చాలా కాలం క్రిందట, చాలా చాలా కాలం క్రిందట...... నేనిక్కడకు కొండవాగుకి వచ్చి నల్బై సంవత్సరాలైంది..... రెండో వైపు చూడు. నీకు సముద్రాలు కనబడుతుంది.......

మెలిజాండా—క్రింద ఏదో శబ్దం వినబడుతున్నది.......

గొలోవు—అవును; ఎవరో మీదకి వస్తున్నారు... అదిగో పెలియాజ్. ఇంకా కాలం చేదిపోనందుకు వాడు విశ్రాంతి చెందినట్లుగా కనబడుతున్నాడు.

మెలిజాండా—ఇంక మన నడకను చూడలేడు.

గొలోవు—మాకా తెలుసుంటాను. కాని యేం చేస్తున్నాడో వానికి తెలియకుండానుంది... పెలియాజ్, పెలియాజ్! నువ్వేనా?

పెలియాజ్—అవును... నేను సముద్రం ప్రక్కనుంచి వస్తున్నాను...

గొలోవు—మేము కూడాను. మేము వెలుగుకోసము వెతుకులాడుతున్నాము. ఇక్కడ మిగిలిన చోటుకంటె కొంచెము వెలుగుగా నుంది. కాని సముద్రం మాత్రము చీకటిగానే యున్నది.

పెలియాజ్—ఈరాత్రి తుపాను వెడుతుంది. కొంతకాలం ప్రతీరాత్రి తుపానుండేది. అయినప్పటికీ యిప్పుడెంత నిమ్మళంగా నుంది... ఎవరైన తెలియక పడవ తెనం చేసి పోతానిస్తే మరి తిరిగి రాడు......

మెలిజాండా—ఏదో నౌకాశ్రయమును విడిచి వెడుతున్నది...

పెలియాజ్—అది ఒక పెద్దపడవై యుండాలి... దాని దీపాలు ఎత్తుగా నున్నాయి... ఆ వెలుగులోకి వస్తే మన మిప్పుడే చూస్తాము...

గొలోవు—దానిని చూడగలమని నాకు తోచదు. సముద్రం మీద నింకా మంచున్నది.

పెలియాజ్—మంచు మెల్లగా లేచిపోతున్నట్లున్నది.

మెలిజాండా—అవును; ఇందాక కనబడని దీపమిప్పుడు కనబడుతున్నది.

పెలియాజ్—అది యొక్క పెద్దదీపం. మనకు కనబడనివి మరికొన్ని వున్నాయి.

మెలిజాండా—ఓడ వెలుగులోనికి వచ్చింది... అప్పుడే చాలాదూరం పోయింది.

పెలియాజ్—అది యొక విదేశనౌక; మనపడవల కంటె పెద్దదిగా కనబడుచున్నది.

మెలిజాండా—నన్ను ఇక్కడకు తెచ్చినపడవ యిదే!

పెలియాజ్—చాల జోరుగా వెళిపోతున్నాది.

మెలిజాండా—నే నొచ్చిన పడవే......దానికి పెద్ద తెరచాప లున్నాయి...దాని తెరచాపలవల్లనే నేను పోల్చగలను.

పెలియాజ్—అపడవకీ రాత్రి సముద్రముపై అపాయము సంభవిస్తుంది.

మెలిజాండా—ఏమిటి? అది యీరాత్రే వెళ్లిపోతున్నాదా?...దాని నిప్పుడు చూడడము దుర్లభము ...బహుశా అది దెబ్బతింటుందేమో!......

పెలియాజ్—వేగంగా రాత్రియి పోతున్నది...

[నిశ్శబ్దము.]

గనివీవు—ఇక నెవరూ మాట్లాడరా? ...మీ రొకరితో నొకరు చెప్పుకోడాని కింకా మరేమి లేవా?... మన ఇంటికి పోడాని వేళైంది. పెలియాజ్, నువ్వు మెలిజాండాను తీసుకురా. నేను పోయి ఒకసారి న్యాయాల్డుని చూడాలి. (నిష్క్రమింమను.)

పెలియాజ్—ఇప్పు డింకా సముద్రంమీద కన బడ్డాని కేమీ లేదు.

మెలిజాండా—నేను మిగిలిన దీపాలు చూస్తు న్నాను.

పెలియాజ్—అవి మిగతా పెద్దదీపాలు,... .. నీ కింకా సముద్రఘోష వినబడుతున్నాదా?...... అదిగో గాలి సాగుతున్నాది......మన మీ దారిని వెళ్లి పోదాము. ఏదీ! నీచె య్యిస్తావా?

మెలిజాండా—చూస్తున్నావా, నాచేతులు నిం డుగా నుండడం.

పెలియాజ్—సరే నేను బుజము పట్టుకుంటాను. దారి జారుగాను, చీకటిగాను ఉన్నాది ...బహుశా నేను రేపు వెళ్లిపోతున్నాను.

మెలిజాండా—అమ్మో!.......ఎందుకు వెళ్లి పోతున్నావు? (నిష్క్రమింతురు.)

---

# మృగరోదనము

డాక్టరు నిడమర్తి ఈశ్వరప్ప గారు,
B. A., M. D. B., F. M. H. C.

మృగయుఁడా! నాయెడ నీకుఁ బగ యదేడ?-ఆకు నలమును దిని యరణ్యములలోన
మనుచు నజ్ఞాతవాసమ్మునను జరించు-నిరపరాధను నన్నుఁ జంప నిరతి యేల?

“ఫలిత మెన్నక పోరగపకే వ్యసన మంద్రు-నేఁటఁ బోలెడి వేఁటాంచు నేడు కేది?”
యనెద వకట! “పిల్లికిఁ జెరలాట గాని-యెలుకకుం బ్రాణపోకడ” నెఱుఁగవొక్కొ?

కుక్కలమందలం బిలిచికొం చుసికొల్పుచు నన్ను నేల న
ల్దిక్కులఁ జుట్టి ముట్టెదవు? దీనను, దిక్కెక వేఱ లేదు; న
న్నక్కఁగఁ బట్టి చీల్చునవి; ధైర్యముఁ గల్గినవాఁడవేని నీ
వొక్కఁడ నన్ను మాఱ్కొనఁగ నోపెదె? చూపెద నా ప్రతాపమున్.

కుక్క కొఱికిన వస్తువుల్ క్షుద్రములని-ముట్టకొ నొల్ల రెన్నఁడు బుధవరేణ్యు
లట్టి యెంగిలి నీనోటి కెట్టు వోవు?- వేఁపి సావాసమునఁ గాదె వెలితి బుద్ధి?

మించిన వేడ్కతోడుత నిమేషములో నను గూల్ప నారి సా
రించి శరమ్ము వేసెదు, పరిశ్రమ మెల్లను మమ్ము బొంట్లు గా
రించుటకే యొనర్చితో ? పరిస్రుతరక్తము గాంచునప్పుడే
నించుక పొక్కవో శబర! నీదగు గుండియ ఱాతిగుండటో!

నడి గిడి సేయ కేదో పొదచాటున దాఁగి తుపాకిఁ బేల్చి న
న్నడుగిడనీక కూల్చెఁ గఠినాత్ముఁ డెవండొ. జముం డతండె నా
బుడుతని కెవ్వ రేడుగడ ? బుజ్జన మెవ్వరు చేయువారు ? పా
ల్గుడిపెడివార లేరి ? యిదె గోడున నేడ్చెదు నేను గూలఁగన్.

మొఱఁగు కుక్కలగమి కను మొఱఁగఁ గల్గి-సాయకము బాధ కోడక సైఁపఁ గల్గి
నీయహంఘుంపు గుఱిఁ దప్పనేర నహహ-పాపముం గట్టికొంటె తుపాకివాఁడ !

సంతతముచు జంద్రుఁ డంతరంగము నిల్చి మెచ్చి యెవ్వారిఁ గూడి మెలఁగుచుండు
హాస్యాంగుళులఁ బురహరుఁ డెవ్వారిం దాల్చి యమితమోదమున నాట్యమ్ము సల్పుఁ
బాఱువేగము నెంచి వాయుదేవుం డెవ్వారి న్వారిపై సంచరించుచుండుఁ
దమసంతతింబోలెఁ దాపసవర్యు లెవ్వారి నాశ్రమంబుల నరసి పెంతు
రెవరి కనుసొంపు లింతుల కింపు నింపు-నట్టి మాన్యతం దివి భువి నందినట్టి
కులమునం బుట్టు న న్నిట్లు కూలనేయఁ-జేతు లెటువచ్చె నోయి నీ కాతతాయి?

అడవిని వసించి శాకము లాస్వదించి-స్వాదు శీతోదకముఁ ద్రావి స్వచ్ఛబుద్ధి
హరిని స్మరియించు మాకు మహాత్ములకును-భేద మిసుమంత గలదె వివేకహీన ?

నిండుప్రేమంబున నోండొరుల న్నాకు జింకజంటను బాపి చీల్చినానొ ?
చేఁపువచ్చినపాలఁ జిఱుతలం గుడుపు లేబాలెంతలం బట్టి వైచినానొ ?
పెనునీడ హాయిగాఁ గను మూసి నిదురించు సాధుసత్వంబులం జదిమినానొ ?
చివురాకుమేఁత నేర్చెడివేళ దయ మాని శాబకంబులఁ బట్టి చంపినానొ ?
వేఁటకాఁడనై పాపమ న్వీతి లేక-తొలిభవమ్మునం జేఁజేఁత నలిపినట్టి
ఘోరకృత్యమ్ము లిటఁ గట్టి కుడుపకున్న?-దైవముం దూఱఁగా నేల తగుదునంచు?

కొంటెవేఁటకాఁడ ! కొంత నీ నెమ్మది-నరసి చేయు మిట్టి యలఁతిపనులు
ముందు జన్మసుఖము నందఁ గోరెదవేని-జంతుహింస నింక నలుపఁబోకు.

కొట్టితివె పో ననుం బొట్టం బెట్టికొనంగం-బరువు లిడలేని నాముద్దుపట్టి నకట
వెంతువో గొంతుం గోతువో పంతగించి-కడుపుతీపిని ప్రాణమ్ము వెడల దయయో.

దినమున కొకరుచొప్పున మీరు వీనినిం జనుం గుడ్పి నెనరునం బెనుపుడమ్మ
చిన్నతనమున మీ చిన్నిగున్నలతోడం గయ్యమాడిన సైంచి గావుడమ్మ
ఆటలనందడి నాంకలి మఱచిన వేళం బోనకుం జేరం బిలువుడమ్మ
మంకుపట్టులం బట్టి మారామ్ము గొను నెడ నింపుమాటల బుజ్జగింపుడమ్మ
వీండు మీవాండె గాని నావాండు కాండు-సోదరునింబోలె ముద్దుగాం జేరం జీరి
తల్లి లోపమ్ముం గనరాక దయను బ్రోవ-రంపు కొనిపోండు, కృష్ణసారమ్ములార!

మోహబంధమ్మున మోము మోముం జేర్చి కులసతి నీవునుం గులుకువేళ
ముద్దుల న్మురించి నీ బుడుతని నడ్డాల నిడికొని తల్లి చన్నిచ్చువేళం
ప్రాంగణంబునం బసివాం డాడుకొన మీరు మా దాపు నొగ్గి యుప్పొంగువేళ
బందుగులును మీరుం బండువ దినమందు విందువేడుకల మిన్నందువేళ
జాడ్యమే లేక నీసతి చచ్చినపుడు-పిడుగునోంకి నీ తనయుండు మఱియు నెవరు
వగలం బొగిలి నన్ దలంచవే స్వాంతమందు-వ్యాధ! నీఘాతములకు నయ్యెదె ఫలంబు.

కడుపునఁ గన్న నిన్నుం బడసితిం గాని కొడుక!-యింత నీముద్దు ముచ్చటల్ చూడనోంచ
మొగముదఱిం జేర్పరా, తుదముద్దుం గొందు-తీపి నీముద్దు స్వర్గసౌఖ్యము నిపుడు.

తనయా! చెల్లె ఋణమ్ము నాకు. "మనదౌ దౌర్భాగ్య మిట్లయ్యెంగా"
యని నీ వెన్నండు బెంగటిల్లకుము నిన్నొప్పాటను ముందంచి మిం
చిన ప్రేమంబున నిట్టి లోమెడిని, నిశ్చింతం జిరంజీవివై
మనుమా, పెద్దలు చెప్పినట్ల నడుమా, మాటాడకే నీడ బున్.

వెంపటి నాగభూషణంగారు

౧

చిన్నీ...చిన్నీ...

ఆఁ. వొస్తున్నా.

ఎక్కడ... వస్తావు, ఆయుర్దాయం మూడే లోపల.

అబ్బ, వొస్తున్నానండీ. అప్పుడే మొదలు. ఇంటికి రావడం భయంగద!...

అయితే ఏం చెయ్యమంటావు. ఇంటికి రాకుండాను, నీకంటికి కనపడకుండాను ఊడ్చిపెట్టుకుని ఉప్పినీళ్లు చల్లుకొని పొమ్మంటావా ఏమిటి, ఖర్మం?

అబ్బ. ఎందుకండీ, అంతవిసవిస. ఇంటిన్లగడప ఎక్కేసరికి, నా ముఖం చూచేసరికినా ఏమిటి? తల దువ్వుకుంటూ ఉంటిని. చేతులో జడవున్నదాయె. వస్తున్నా నంటిని. దానమ్మకడుపు బంగారంగాను, అప్పుడే యింత నాటకమా. ఇల్లాగైతే బయటెట్లా నెగ్గుకొస్తారు బాబు...?

ఇంకా యేం. మాటలున్నాయి కోటలు దాటేటట్లు. పనిశూన్యం...... ఇదిగో యీ ఉత్తరియ్యం తీసుకు వెళ్లి, మంచినీళ్లు పట్టకు రా. త్వరగా వెళ్లాలి...

అయితే మంచినీళ్లు ఉత్తరియ్యంతో పట్టుకు రమ్మనా యేం, మీఅభిప్రాయం?

చాల్లే. తెలివికి సంతోషించా గాని, త్వరగా తీసుకు రా? పోవాలి.

ఏమో, కవులుగా. మీ చమత్కారాలు నాకర్థం కావద్దూ?

రొంబ ఆనందం గాని... తీసుకు రా. వెళ్లాలి. అతను వచ్చేవేళకూడా అయింది.

ఎవరు, శర్మేనా? మిమ్మల్ని పట్టుకు వేళ్లాడ్డం తప్ప అతనికి వేరే పనేమీ లేదూ?

అబ్బ. ఊరుకుందూ. వాక్చాపల్యం జాస్తి. అతను వింటే ఏమనుకొంటాడు. ఏదో అట్లా ఉంటూంటాయి కొన్ని ఘటాలు.

ఏమనుకుంటాడేం. శనిగ్రహంలాగు అన్నిటికీ తయారు. అయినప్పుడూ, లేనప్పుడూ టీ, కాఫీ చెయ్యలేక రామూ (వంటవాడు) మచ్చమాస్తోంది. మీకూ ఊర్కోరాయె.

పోనిస్తూ, చిన్నీ,...అదేమిటి జడ వొదులుగా వేశావేం.

అది అంతేలెండి. మాడరన్ ఫేషన్.

సరే, అయితే. నాకు చదువు చెప్పేటట్టున్నావు చూస్తే. అదిగో అతను వస్తున్నాడు. నేను పోతున్నా.

పెందరాడే వస్తారుకదూ?

నువ్వు అడగాలీ? బయట అంతసేపుంటే నాకు మాత్రం ప్రాణం నిలుస్తుందీ.

ఓ చెంప అతను వింటున్నాడు. ఏమిటి ఊర్కో.

ఎబ్బే. ఏముంది. నిజమేగా చెప్పింది. పోతున్నా, గుడ్ యీవెనింగ్.

౨

ఆబట్ట కాకపోతే మరొకటి కట్టుకోకూడదూ. అంచంతా వెలిసి అసహ్యంగా ఉన్నది.

తమ పుట్టింటివా రిచ్చిందేనండి, ఇంకోలక్షణం గా ఉన్నది. మొన్న నే నాన్నింది. ఇది రెండో ఉతుకు.

అసే. ఎప్పుడూ వాళ్ల మీద సొమ్ము వెతకడం సరి పోతోంది. ఏదో శక్తి ఉన్నంతవరకు ఇచ్చారు. ఇచ్చిందానికి తృప్తిపడకూడదూ?

ఆహా. ఇచ్చారు. కట్టుకోలేక, ఉపయోగించు కోలేక ప్రాణం విసుగుతోంది. పెళ్లినాటివి, కాళ్లకడుగుపళ్లెం, ముఖంకడుగుకుర్చీ ఇప్పటికి బాకీ. లిమిటేషన్ పట్టిపోయింది కూడాను. ఇచ్చినబట్టలు సరే గదా, ఇంత మహాయోగ్యం గా ను, లక్షణంగాను ఉన్నాయి.

అబ్బ! పోనిస్తురూ. మనకు ఒకరు పెట్టే దేమిటి. మన కున్నది చాలదూ?

ఉన్నదంతా కట్టుకుపోతారా యేం. సగం యిట్లా పడవెయ్యరాదూ?

ఇంతకూ అది. సగం మన కివ్వడ మేం, వాళ్లు అనుభవించలేరూ?

అన్నీ,అట్లా వెనక వేసుకు రా ఎక్కడికి పోతుంద అభిమానం. ఈమాటు దీపావళికి పట్టుబట్ట లిస్తేనే గాని రానని చెప్పు.

పోనీండి పోకపోతే నేం. వాళ్ల కే నయం. అయినా నే నెందుకు మధ్య సారథ్యం. మీరే చెప్పండి మామగారితో...

ఏమో, ఆయనయెత్తుకు నేను...

ఊహుం, ఏమి టామాటలు. అక్కడ నుంచి తెచ్చుకొనేవి తెచ్చుకోవడము, పైగా ఎత్తి పొడవడము. మామూలేగా అల్లుళ్లందరికీ...

ఈలా సద్దుకు రావడం కూతుళ్లకుగూడా మా మూలేగా. మొత్తానికి మాట మీద ఉంచు కోరు, పాపం.

౩

ఏమండీ; ఊం, ఏమండీ—

ఆం. ఏమిటీ?

ఏమంటారు, ఏమండీ.

అబ్బ! ప్రాణం తియ్యి. దేనికి?

ఈ పూట వెడదామా!

కొంప మునిగింది. ఎక్కడికి?

సినిమాకండీ. అది నా చేత అనిపించాలి.

ఏమిటి ఫిలిం, యివ్వాళ.

"చంద్రముఖి"—గోహార్ ఫిలిమండీ.

సాహో యె. నాకంటె ఎక్కువ తెలుసాయె. ఏం బాగుంటుంది. గోహార్ ఫిలిం. కులకడం, తిప్పు కోడం, నవ్వడం తప్ప ఏముంటుంది?

గోహార్ బాగుండకపోవాలి. నవ్విపోతారు ఎవ రైనా వింటే. ఏముంది, అర్థం కాకపోతే సరి.

ముందు ఏ దెట్లా వున్నా, పర్యవసానం అనుభ వించేవాణ్ణి నేను.

ఏం అనుభవిస్తున్నారండీ బాబూ, యిన్నాళ్ల నుంచీ. లేనిపోనిమాట అనడ మంటే, మహా సరదా.

అవును. లేనిపోనివి కాదు, మరి. ఫిలిం చూచి రావడం, ఆచమత్కారాలన్నీ ఇంట్లో ప్రయోగించడమూను ప్రాలంబికం పైన వేసి, సిగచుట్టూ గంపెడుపూలు దోపి, గోహార్‌లాగా కులకడం; నడవడం, కదలకపోవడం.

ఇంతేగద. పోనీండి మీ కేం కష్టం యిందులో.

కష్టమా, అంతా నాదే. ఫిలింలో నాయకుడల్లే నన్నుగూడా ప్రవర్తించమని నిర్బంధనాయె. అట్లా సూటు వేసుకుని, అట్లా నవ్వుతూ, అట్లా కారెక్కి తిరుగుతూ, అట్లా చుంబనం చేస్తూ కాలం గడపమంటావు. ఎల్లా చెప్పు.

ఏమిటండీ, అబ్బ. ఎప్పుడో ఒకసారి తమాషాకు అంటే దాన్నే పట్టుకు వేళ్లాడుతారు. అవును నే నేం జేసినా అంతే... మొన్నెగా మీరు రాత్రి పద్యాలు వ్రాసుకుంటూ— "చిన్నీ, లారాకు మల్లే నన్ను ఉత్సాహపరచాలి" అని, కళ్లలోకి నిద్ర కూరుకు వస్తున్నా పద్యాలు వరుసగా చదివి వినిపించి తీరారు. అవును. ఎవరు చేసినవి వారికి జ్ఞాపక ముండవు. ఎందుకు లెండి.

సరే, గునుసు ప్రారంభించక బయల్దేరు త్వరగా.

ఎందుకు, ఇంత నిష్ఠూర్యంగా?

ఊఁ, బయల్దేరు త్వరితం. సవర తియ్యలేను మాటిమాటికి.

సరే నేను సిద్ధం.

అయితే, అదే నేమిటి చీరె. దరిద్రం ఓడుతూండాలి. ఎన్ని ఉన్నా అంతే.

దీని కేమండీ నిక్షేపంలా గున్నది నాలుగు పెళ్లిళ్లు చేయించవచ్చు. కొర్నాడచీర. తీసిపోయిందా యేమండీ?

సిల్కు ఊదాచీరె ఏమైంది? అది కట్టుకుని రోజా క్రేప్ రవికె తొడుక్కో త్వరగా కానీ.

ఇల్లా చెప్పి రేపెట్టేదిన్నీ, పైగా నన్నే దీని. ఎందుకు లెండి. ఇంతకు యింతా........

అనుభవిస్తానంటావా? సరేగాని బ్రూచ్ ఏదీ? కాళ్లకు స్లిప్పర్సు ఏవి! అతురమతురం చెప్పాలిసి ఉంటే మళ్లీ అన్నీ తెలుసునని భేషజం.

ఇప్పుడు స్లిప్పర్సుగూడా ఎందుకు పోనిస్తురూ.

కొనిపెట్టిందాకా ప్రాణాలు తోడేశావు. ఇప్పుడు మొహమాటం...తొడుక్కో. వేషం పూర్తికావద్దూ.

ముందు మనకంటికి నచ్చాలిసుండె. సినీ [illegible] వేషం వేసేవాళ్లకన్న మనకు ఎక్కువ అలంకారాలు కావాలాయె. చెప్తే వినడమూ, ఏమన్నానా...

సరే, నడు. పుణ్యకాలం కాస్తా దాటుతోంది.

ఊఁ. పద.

౪

అయితే, చిన్నీ, ఎంతసేపట్లో వస్తావన్న మాట?

ఎంతోసేపా ఒక అరగంట.

అరగంటంటే మనలెక్క ప్రకారం ఆరునెలలేగా.

అచ్ఛే. ఈవేళ చూడండి. సరిగ్గా అరగంట.

సరే, యిదివరకెన్నిసార్లు అయింది. చూసి చూసి కళ్లు బాధ్యత లెక్కాయి......అయితే ఇంజనీరుగారింట్లో ఏమిటీదినం

వాళ్ల అబ్బాయికి ముద్దగోడుగులు యిప్పిస్తారు.

ఇంకా యిట్లాంటి అలవాట్లు పోలేదూ!

ఏంచిత్రమండీ. మన దంతా తల్లక్రిందులు పద్ధతేగా.

పుట్టెత్తమంటే పూర్వోత్తరాలు మెత్తుతావు, ఛీస్నీ. ఎరక్కపోయి అన్నాగాని, నీస్త్రీవని నీ వెళ్లు.

వచ్చిందాకా కాస్త వాకిలి చూస్తూండండి. రాముూమీద యిల్లు విడిచి పోకండి.

ఇలాగ పట్టింది ఖర్మం. నువ్వు తిరిగి వేంచేసే వరకూ ఇల్లు కాపలా కాయనా, జాతికుక్కల్లే? బాగానే వుంది అదృష్టం.

పోనీ లెండి, పేరంటం మానేస్తాను. ఎప్పుడూ నేను తల్చుకున్నదానికే గా విఘ్నం. ఛీ.

వెళ్లవమ్మా, వెళ్లు. పొరబాటు......చూడు, అయితే సైరోలోలకు లేకా—పెట్టుకోలేదేం?

మళ్లీ మొదలు...ఏమో యెక్కడో వున్నాయి; తీయలేక బద్ధకించాను. ఈమారు పెట్టుకుంటూ లేస్తురూ.

వీల్లేదు. ముందు పెట్టుకో. కావాలని ఎంతో ప్రయత్నం జేసి తెప్పిస్తే ఉపయోగించడం తెలియదామె.

పోనీలేస్తురూ. ఏదో పిచ్చో, వెర్రో యిల్లాగ వున్నోండి.అయినా నాకీపురమాయింపు లేమిటి? మచ్చ మాపేస్తున్నారు మీాఫేషన్లతోను, సలహాలతోను

వొప్పుకోను. నీకేం తెలుసు. ఆలోలకులతో నీకు జుబేదా రూపు వస్తుంది.

జుబేదా కాదు,సుల్తానా. నా మొహం. ఇహ లాభం లేదు. ఎవరో ఒకరికైనా వుండాలి...

చూడు అదిగో, నే చెప్పింది అబద్ధమా.ఎలాగ మెరుస్తున్నయో.సరిగ్గా జుబేదా. ఇల్లా రా—

ఎట్లాగైతే నేం, పంతం నెగ్గిందిగా. ఆనందించండి. వెడ్తున్నాను,ఆలస్య మైంది యిప్పటికే. ఒక్కమాట......

తిరిగి వచ్చిన తర్వాత......

౫

ఏమండీ, ఇట్లా ఒకసారి వస్తారూ?......అబ్బ మాట్లాడరేమండీ. పదిసార్లు పిలిచినా పలుకే లేదాయె...బ్రహ్మ వ్రాత, నా ప్రాణానికి వచ్చింది. ఇరవైనాలుగు గంటలు వ్రాతే నాయె. ఇవతలవాళ్లు ఏమైనా సరే...

ఏమిటీ అతిశ్రవణం. నావ్రాతకోతల మాట కూడా నీ కెందుకు?

నా కెందుకేమిటి? తలప్రాణం తోక కొస్తోంది. ఇంత నిర్లక్ష్యమైతే యెల్లా. ఇవతలమనిషి ప్రాణం పోయినా అంతే.

అదే తలనొప్పి. ఊర్కే అయినదానికీ కానిదానికికూడా చాకుత్తి చెరగడం. పోనీ ఏదో

యథాలోపాన వున్నానేమో అనుకొని అగ కూడదా, లేక అంత తొందర వుంటే దగ్గరకు వచ్చి చెప్పకూడదా. అదీ గాక యిదీ గాక ఎక్కడనుంచో—ఏమండోయి, ఓహో, చూడండి, మిమ్మన్నే—అని సోమిదేవమ్మ గారి ఫక్కీగా పిలుస్తే, ఏం తెలుస్తుంది? నువ్వు మాత్రం నే పిల్చిన పదిఘడియల దాకా నోరు తెరవకుండా, తరువాత, "వస్తున్నా; జడ వేసుకుంటున్నా; చీర కట్టుకుంటున్నా; బొట్టు పెట్టుకుంటున్నా" అంటూ జామున్నర ఆలస్యం చేసినా ఫరవా లేదు. ఏం?

ఈ పనస, ప్రవర అయ్యేసరికి యీ టీ కాస్తా చల్లబడిపోయింది. అరగంట అయింది రామూ టీ తయారుజేసి.

పోనీ, ఆ విషయం తెలిసేటట్టు చెప్పగూడదూ? టీ కోసమంటే పరుగెట్టుకొస రాకపోదునా?

అవును. దానియందున్న లక్ష్యం నాయందుంటేనా?

ఉన్నది చాలదూ? దాసోహం అనమంటావా ఏమిటి?

ఆ పాపం నా కెందుకు గానీండి. ఏమిటా వ్రాసేది.

నే వ్రాసే దేమిటో నీకు తెలియదూ?

కథా, పద్యమా?

రెండూను: ఒకదానితర్వాత ఒకటి.

ఏం విసుగు లేదండీ. మీరు వ్రాయడమూ అట్లాగే వుంది, వాళ్లు అచ్చు వేయడమూ అట్లాగే వుంది. అన్నీ అటకిపోయినై......మొత్తంమీద అన్నీ శతమానం దాటినై అనుకుంటూ......

అందులో సగం తమరివేనండి.

కాదుమరి—అయినవాటిల్లోను, కాని వాటిల్లోనూ కూడా నన్ను యిరికిస్తూంటే.

పేరు చిరస్థాయిగా ఉంటుంది, పో.

ఇప్పుడదే బెంగ........ఎట్లా ఉంది, టీ?

రోజ్ పీక్ ఆ.

అవును. అది తెప్పించమంటిరిగా?

సరే గాని, చూడు, మరచిపోయాను. రావు టీకి వస్తానన్నాడు.

టీకిగూడా వారాలు చెప్పకుంటున్నాడా యేం?

పోనిస్తూ. రామూని టీ సిద్ధంగా ఉంచమను. అతను వచ్చే వేళైంది........అదిగో డాక్టరు గారి భార్య వచ్చినట్టుంది నీకోసం, వెళ్లు...

౬

ఏమండీ, యీ వేళైనా పట్టుకొచ్చారా?

ఏమిటి బాబు?

ఎంతతిన్నా పరిగడుపైనట్టుగా, ఎన్నిసార్లు చెప్పినా కొత్తే. పేపర్ ఫ్లవర్సును, పటం కుట్టేటందుకు చంకీను తీసుకురమ్మంటిని గాదండీ?

సాహేబుసంపాదన బీబీ కుట్టుపోగులకు సరిట. ప్రస్తుతం మన ఆర్జనంతా యీవిధంగా అయినదానికి కాని దానికి వ్యయం. ఏమన్నా అంటే నోట్లో......

అంతా చిత్రమండీ మీది. చెయ్యమనేది మీరే, చెప్పమనేది మీరే. చివరకు మాటలు నాకు. మొన్నగా మీరు పదహారురూపాయలు పెట్టి పెద్ద గజు ఫ్లవర్ వాజు కొనుక్కొచ్చారు. పొరబాటున చిల్లుమంటే ఎందుకూ కాకుండా రూపాంతరం పొందుతుంది.

సరే, ఏముంది? నిన్ను నేననా, నన్ను నీవనా. మొత్తానికి యిద్దరం కలిసి సంసారాన్ని చక్కబెడుతున్నా మన్న మాట.

ఇదిగో ఏముండోయ్ చూచారా. ఈకిటికీ దగ్గర ప్రాకించిన సన్నజాజి ఎంతలో పైకి వచ్చిందో. సరిగ్గా యిక్కడే పడక, పైన జాజి పొద. ఎల్లా వుందంటారు?

అనేదేమిటి; శేషశాయికి మూడింతలు పైగా వుంటే.

మొత్తానికి కవితాశక్తి, ఊహా, వ్యర్థం కాని చ్చా కాద.

చెప్పవ్. టెస్టిమోనియల్ యిచ్చావుగద.

ఆమాత్రం తెలివే వుంటే మీ రిట్లా అంటారు ...ఇదిగో, ఏముండోయ్, మరచి పోయినాను. ఒక్క క్షణం కళ్లు మూసుకోండి తమాషా చూపిస్తా...

చంపావు, పో వేగిరం కానీ.

ఇప్పుడే అయిదు నిముషాల్లో వస్తాను......అదిగో కళ్లు తెరుస్తున్నారు. నేను వొప్పుకోను. ఊహు వాడావిడి. ఎవరు తెరిచారు?

ఊం. ఇప్పుడు చూడండి!

నువ్వేనా, చిన్నీ......ఎక్కడిది. నిజంగా చుక్క, లమధ్య చంద్రుడల్లే వున్నావు. వొట్టు... అయ్యో, మీవొట్టు బంగారంగాను. నేను కాదనానటండీ...మాఅమ్మ కొని పంపించింది.

ఏదీ, యిల్లా రా, చూస్తాను. కొంచెం పెద్ద పువ్వల్లే వుందే?

మరీ అంతపెద్దది కాదులెండి. ఉన్నది సామాన్యంగానే. సిల్కు కూడా మంచిదే. ఏమంటారు.

అవునవును. చాలామంచిది.

ఎప్పుడేనే మీచేత్తో మీరు యిటువంటిదొకటి......

కొనలేదూ? ఎందుకు పక్షపాతం......పోనీలేగాని, అదేమిటి బుగ్గపైన. ఇల్లా రా.

ఉంటే వుందిలెండి, నే రాను. మీమొత్తు నాకు తెలుసు.

ఎబ్బే. నిజంగా. ఉండు. ఇదిగో......

అబ్బ ఏమిటండీ, మోటుతనం చీరంతా నలిగిపోయె. ఉండండి. అన్నిటికీ తొందరే.

---

# ఆత్మసమర్పణము

శ్రీయుత దేశభక్త కొండ వెంకటప్పయ్యగారు

"కఱవుల్ మారియు ప్రజలన్ - బోరిగొనంగాఁ జొచ్చె; బందిపోటుల బాధల్
భరమయ్యె; గ్రామదేవత - కర మలుకం దాల్చె"నంచు గలఁగిరి జనముల్.

ప్రార్థన:— కాళిదేవి యను గ్రామదేవతనుఁ - బోనము పెట్టియుఁ బొగడిరి జనములు
"తల్లీ దండము తనయుల మమ్మా - తల్లీ నిక్కము దాసుల మమ్మా
ఏమితప్పిదమొ ఏదోషంబో - ఏమి చేసితిమొ యెఱుఁగంజాలము
మఱవుము జననీ మాపాపంబులు - మన్నింపఁగదే మానేరంబులు
పేదఱికమ్మును పెద్దకాటకము - చీడలు పీడలు చెచ్చెర వచ్చెను
తాళఁజాల మిఁక తల్లీ దండము - వేఁగఁజాల మిఁక నీ కొకదండము
పెద్దయుకాలము పిలిచినఁ బలుకుచు - తోడునీడపై తోడ నిలిచితివి
కోరినకోర్కెలఁ గొంకక యిచ్చుచు - కంటికిఱెప్పగఁ గాచితిమమ్ముల
చల్లఁదనంబున సాఁకితి బిడ్డల - నేమి కావలయు నేమి గోరెదవు
ప్రాణసమానుల ప్రాణంబైనను - మానక యిత్తుము మానుము కోపము.
అనుచు పురోహితులందఱు - వినయము, భక్తియు, భయంబుఁ బెనఁగొన ప్రార్థిం
చిన ఫలము గల్గకుండెను - జననాశము మేర మీఱె జనముల్ బెగడన్

కాలము గతించె నదియును గడువఁగడువ- "ముద్దుటిల్లాలు బిడ్డతో మఱియుఁ దేఁడు
ప్రాణపద మైనవారిని బలి నొసంగ - మేలుచేకూరు"నం చిటు కాళి పల్కె.

నరపాలున్ ప్రతిబింబము - కరణిన్ జెలువారుచుండు కన్నకుమారున్
ధరయువరాజకుమారున్ - పరిపోషణ చేయు జనని వాత్సల్యమునన్.

ధరణీపాలుఁడు వనమున - కరిగెను మృగయావినోద మత్యధికముగా
నరపతిసుతుఁ గొని వచ్చుట - కరిగిరి భూజనముల్లప్పు డంతఃపురికిన్.

మరలి రాఁగ నృపాలుఁడు పురమువారు - బాలకునిఁ గొనిపోయిన వార్తఁ జెప్పి
"వాని దేవత బలి గోరె; దానఁ గల్గు - జనులకున్ మే"లటంచును వనిత పల్కె.

"సుతుని గొనిపోయి రిఁక వానిగతియుఁ దెలిసె - నైన నడిగెద నొకమాట నవనిపాల
సుతునిఁ బ్రేమింతువో లేక సతిని నన్నొ-యెవరి నెక్కుడు ప్రేమింతు వెఱుఁగఁ జెపుమ."

మెడ వంచి, కేలు నుదుటన్-దడవుచుఁ దాఁ బల్కెన్నృపతి తాలిమిదూలన్
"నుడివినఫలంబుఁగలదే?-పడతీ నా కిద్దఱొక్క-ప్రాణమె సుమ్మా"
"అతివరో! నీవు నాకు నర్ధాంగి వగుదు-వతఁడు పుత్త్రరూపమున నా కాత్మయగును
భార్య లేకున్నసుతుఁడున్న ఫలితమేమి?-సుతుఁడు లేకున్న సతితోడసుఖములున్నె?"

అతిముదము గూర్చు సుతు భూపతి దేవికి గాన్క నిచ్చి ప్రణతి యొనర్చన్
కుతుకం బందరి జనములు-బ్రతుకంగా తెరవు దొరకె భాగ్య మటంచున్.

బాలకు బలి నిచ్చుటకున్ - కాళికిఁ బూజలను సల్పి ఖడ్గము మెడపై
వ్రాలగ వ్రేసెడిలోపల - తాలిమితో నడ్డువచ్చి తల్లి వచించెన్.
"ఆలింపుఁడు నామాటలు - పాలించును ప్రేమ నవనిపాలుఁడు నన్నే
బాలుని కన్నను మిన్నగ - కాళికి నాప్రాణములను కాన్కగ నిత్తున్."

ఇటుపలికి, బలికి కంఠము - పటురయమున సాఁచినంత వనితను పతి తా
నటు పోవ నీక లాగెను; - తృటిలోపల నిజము తెలిసె; తీఱెను శంకల్.

బాలునికన్న భూపతికి భార్యయె ప్రాణపదంబు; కాన నీ
బాలునిమారు దగ్గకును భార్యశరీరము నిత్తు మంచు పై
న్వాలున నామెకంఠమును వాఁడి ద్రుంపఁ దలంచినంతనే
"చాలును; చాలు; మానుఁ" డని చండిక పల్కెను విస్మయంబుగన్.

"ప్రాణముకన్న తియ్యనగు బాలకు ప్రాణముఁ బ్రోవ సిద్ధమై
ప్రాణము లీయఁ బూని మము భామిని గొల్చెను చిత్తశుద్ధితో
ప్రాణము లేల మా కరయ పావనభక్తియె చాలు; మీమహా
రాణి మహత్త్వదే ప్రజల త్రాణ మొనర్చి సుఖింపఁ జేసెడిన్."

చింతలు వంతలున్ దొలఁగు; చిత్తము పావనభక్తియుక్తమై,
శాంతినిధానమై; పరమసాధ్వివలెన్ బలిదానయోగ్యమై,
సంతసమున్ జరింపఁదగు సాధన సల్పుఁడు; మీర లెల్ల ర
త్యంతము భోగభాగ్యముల నంది సుఖింతురు సర్వకాలమున్.

[టెన్నిసన్‌కవి రచించిన 'The Victim' అను కావ్యమున కనువాదము.]

"వోరేయి తమ్ముడూ!" "పది మాట్లు చెబుతుం దేమిటి యీ పిచ్చిముండ" అనుకోకు. నువ్వు చిన్నవాడవూ, నేను పెద్దదాన్నీని; కానయితే, పంచ శిఖలతో వుండగానే నీకు పెళ్ళికావడం బాగానే వుంది; కాని జోగమ్మ యింత తొరగా కాపరానికి వస్తుం దని మే మెవళ్ళమూ అనుకోలేదు. మొన్నటి పిల్ల కాదుట్రా తల్లి పెంపు సాంప్రదాయాన్ని పట్టి అలాగ బొబ్బిల్లా వుంది కానీ, పద్దానుగేళ్లు వెళ్ళలేదురా యింకానూ—ఇంతకీ కోడలు కాపరానికి రావడం అమ్మ కళ్ళతో చూసుకుంది. వొక్క కొడుకువైనా అమ్మకి ముచ్చట్లు బాగానే తీరాయి.........ముప్ఫయ్యెకరాల భూమీ, పెట్టెలాంటి యిల్లూ—చదువు పోతే పోయింది యేం లోటు నీకూ? పెట్టి పుట్టావు నువ్వు. బతికి వున్నంత కాలమూ నిన్నూ నాన్ననీ కనిపెట్టుకుని వుంటాను కదా నేనూ? చూడు తమ్ముడూ! మొగుడు చచ్చిన ముండని. ఇల్లు పట్టాను. నువ్వు నిష్కారంగా చూశావంటే నా ప్రాణాలు యెగిరిపోతాయి సుమా. నీకు నామీద చాలా భక్తే వుంది. ఆ మాట నాకు తెలుసును. అయినా భయం అలా అనిపిస్తుంది.........చెప్పవచ్చిం దేమీ లేదూ. చేబోలువారి ఆడాళ్లు కజ్జాకోర్లు. పైగా నీ అత్తగారు చింతావారి ఆడబడుచు కూడానూ. నెలకి నూటయిరవై రూపాయలం తెస్తా డన్నమాటే కాని పెళ్లాంచేతులో పొయ్యడమే కదా నీ మామగారు? నీ పెళ్లాం అన్నివిధాలా తల్లిని పుణికి పుచ్చుకుంది. ముడి మాటలూ అదీ—నీ భావమరిది పోయినప్పుడు వెళ్లి చూశా నంతా. కావలసినవాళ్లనీ, పుట్టెడు దుఃఖంలో వున్నారు కదా అనీ అక్కడ వున్న పదిరోజులూ వొండి పెట్టాను కాదూ? తల్లి దుఃఖంతో పడి వుండేది కనక తానేనా కాస్త సాయం కావచ్చునా నాకూ? అదేం చదువో గాని అస్తమానం పుస్తకం చేత్తో పట్టుకొని కూచునేది. ఎలా మానగలిగిందో ఆ పదిరోజులూ; అరమణీ మాత్రం ముట్టుకోలేదు. ఆడపడుచుముండ నొదునా? ఈడు వచ్చిన పిల్ల కదా; కాస్త ఆసరా కాకూడదమ్మా, చెప్పు తమ్ముడూ. "ఛీ! ఎప్పుడు వెళ్లిపోతానా అనిపించింది. .........నువ్వు చిన్నవాడవు కనక యింతగా చెబుతున్నాను. వెయ్యి కళ్లతో నేను కనిపెడుతూనే వుంటాను అయినా—నను విన్నావంటే నెత్తెక్కుతుంది సుమాను. వ్వంటే భయభక్తు లుండీలాగ మసులుకోవాలి. నాన్న వెర్రిబాగులవా డనీ, నేను మనోవర్తియుండని కదా అనీ, నిన్ను లోపు చేసుకోమని యిదివరకే చెప్పి వుంటుంది తల్లి. అబ్బో అసలు నీ పెళ్లామే నెల్లూరు సెరజాలల రకమూ. అవతల పెద్దాళ్లు వున్నారు కదా మన కెందు కని దేనికేనా, కాస్తేనా వదురూ బెదురూ వుం దనుకున్నావా? నువ్వు చిన్నవాడవు కదా అనీ, వేషాలంటే సరదా పడతావనీ, అదనీ యివనీ నగలికి పురమాయిస్తుంది. విన్నావు సుమా. కావలిస్తే అక్కణ్ణుంచి తెచ్చుకోమను డబ్బు. తను వొక్కర్తే కామూ వారికి బిడ్డా? వారి ఆస్తంతా యిక తనకి వచ్చేదే కామా?" అని యిలాగ యింకా చాలా దూరం చెప్పింది బుచ్చమ్మ. నలపతిరావు ముసిముసి నవ్వులతో కొంతసేపూ, సిగ్గుచేత కొంతసేపూ, యేమీ తోచక కొంతసేపూ వూరుకున్నాడు; గాని దేనికీ జవాబు చెప్పలేదు. "ఇది బాగా విను" అని వొకటీ, "ఇది ముఖ్యమైనది సుమా" అని యింకొకటీ, "ఇది మరిచిపోయావు సుమా" అని మరొకటీ—యిలాగ యింకా కొన్ని సంగతులు కూడా చెప్పి చివరికి "సిగ్గుపడుతున్నాడు తమ్ముడు" అనుకుని ఆమె కూడా అంతటితో వూరుకుంది.

## ౨

జగ్గయ్య సరిగా యేడుగంటలికి జోగమ్మని తీసుకువచ్చాడు. "సుబ్బన్నగ డయితే మాత్రం పేటలోకి పావలా యేమిటే?" అని బుచ్చమ్మ తండ్రిమీద ధుమ

ధుమ లాడింది; కాని జోగమ్మని "మంచినీళ్లు కావాలా!" అనేనా అడగలేను. బండివాడు సామాను నాకట్లో పెట్టి, అద్దె పుచ్చుకుని వెళ్లిపోగా జగ్గయ్య "సామాను నీగదిలో సద్దుకోవే అమ్మాయీ" అని కోడలితో చెప్పి గోదావరికి నక్కాపోయాడు. దానిమీద బుచ్చమ్మ చుర చుర చూస్తూ "మామగారు చెప్పేదాకా అలా బొమ్మ లాగ నుంచోకపోతే సద్దుకోరాదా?" అంటూ మూతి ముడుచుకుని వంటింటోకి వెళ్లిపోయింది.

"పిల్లాం వచ్చాటప్పటికి యెదురుగా వుండ కూడ" దని అప్పగారు చెప్పడంచేత "కామోసు" నను కుని నలపతి గోదావరిగట్టుకి షికారు వెళ్లి యెనిమి దైతే గాని యింటికి రాలేదు. ఈలోపుగా జగ్గయ్య భోజనం చేసి "అబ్బాయి నెక్కడికి పంపించావే?" అని మాటిమాటికీ పొంతుర్ని అడుగుతూనే గాది సావిట్లోకి వెళ్లి మడతమంచం వాల్చుకుని పడుకున్నాడు.

పాపం జోగమ్మకి ఆ వంటలో పొద్దున్న తొమ్మిది న్నరకి తిన్న మెతుకులు. దారిలో తిన మని తల్లి జంతిక లిచ్చింది; కాని పడవలో మూట మామగారి దగ్గిర వుండ డంచేత, నిడదవోలు స్టేషనులో జనసమ్మర్దం అధికంగా వుండడంచేతా ఆపిల్ల వాట్లని తెలుచుకుని గుటకలు మింగుతూనే కూచుంది. ఈసంగతి యేమీ యెరగని జగ్గయ్య స్టేషనులో "అరిటిపళ్లు కొన మంటావా?" అని అడిగాడు; గాని ఆమె సిగ్గుపడి వద్దంది. మొత్తాని కామె రాజమహేంద్రవరం వచ్చాక అడిగి పుచ్చుకునీ దాకా వచ్చి మంచినీళ్లేనా యెరగదు. తాను గుమ్మంలో అడుగు పెట్టాటప్పటికి ఎంతో ప్రేమతో ఆడబడుచు పీట వేసి కూచో పెట్టి అన్నం పెడుతుం దనుకుంది. అది లేకపోయినా చివరికి నలపతి మొగం కనపడినా కాస్త బాగుండిపోను; గాని అదీ లేకపోయింది

ఎనిమిదిన్నరకి వంచిన తల యెత్తకుండా గబ గబా నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని, ఆసాయం త్రమే తల అంటుకోవడంచేత నిద్ర ముంచుకురాగా చల పతి స్వయంగా పక్క దులుపుకుని పడుకున్నాడు. తొమ్మిదయితే గాని జోగమ్మకి విస్తట్లోకి అన్నం రాలేదు. అప్పుడేనా తెమలకుండా బుచ్చమ్మ సావ కాశంగా అదనీ, యిదనీ ఆవంట గొడవ లడుగుతూ, వుండివుండి యిక్కడి కబుర్లు చెబుతూ, మధ్యమధ్య యి రుగుపొరుగు అనుమానాలకంపతులికి పేగ్లా వద్దులా పెడు తూ, కొత్తిమిరి కారంతోటీ, వంకాయపులుసు పచ్చడి తోటీ, మామిడికాయ పచ్చడిబద్దలతోటీ, మధ్యమధ్య వొట్టి నేతితోటీ, చివరికి మీగడ పెరుగుతోటీ కాస్త కాస్త చొప్పున వుప్పుపిండి తిని, యిల్లంతా సద్దుకుని, పక్క సవిరించుకుని, "రామయ్యతండ్రీ! నడుం లాక్కు పోయిం" దంటూ పడుకుని, "హుహ్హుహ్హా" అంటూ వొకమాటు అటూ యిటూ దొర్లి, జోగమ్మకి సెల విచ్చాటప్పటికి పదిమ్ముప్పా వయింది.

ఇదే తొలిమాటు రావడం కనక తన తమ్ముడు ముద్దుకోసం అయితే నేమి, తన ముచ్చటకోసం అయితే నేమి, లోకంలోవాళ్లని చూసి అయితే నేమి గంధం తీసీ, మల్లె మొగ్గలు తెప్పించీ, అగరువొత్తులు వెలిగించీ —యింకా యింకా యిలాంటివి చెయ్యాలసిన ఆవ బడుచు యిలా చెయ్యడమూ, ఇది యిలా అయినా, యింటోకి వెళ్లాటప్పటికి యెదురు వచ్చి, చెయ్యి పట్టుకు తీసుకు వెళ్లి, వొడిలోనో పక్కనో కూచో పెట్టుకుని, వొక్కమాటు గట్టిగా అదిమిపట్టి, ముద్దుపెట్టి మురిపెం చూపించవలసిన మొగుడు బుస్సలొడుతూ నిద్రపోతూ వుండడమూ, చూసి పాపం ఆపిల్ల తెల్లపోయి, వుసూరు మంటూ కాళ్లకాడదిక్కున పడుకుని నిద్రపోయింది.

## 3

మూడు గంటలికే బుచ్చమ్మకి మెలుకువ వచ్చింది. తరవాత మరి నిద్ర రానూ లేదూ, ఆమె అందుకోసం ప్రయత్నం చెయ్యనూ లేదూ; కాని ఏమిటో మింది పోతూ వున్నట్టు మనస్సు గుబగుబ లాడిపోయింది. వొకటి రెండు మాట్లామె గది గుమ్మంలోకి వెళ్లి తలు పుకి దుడిచెవి ఆనించి, శ్రద్ధగా ఆలకించింది. అయితే: గంపతులలో యెవరూకూడా మేలుకుని వున్నట్టు తోచలేదు. తరవాత అతికష్టంమీద పూర్తిగా వొక్క గంట గడిపింది. నాలుగు కొట్టాటప్పటికల్లా వూరుకో

లేవే "తెల్లవారిపోతోంది లేచి చదువుకో తమ్ముడూ" అని కేక వేసింది.

మంచంమీద పడుకునే వుండి రెండు మూడు మాట్లిలాగే పిలిచింది; గాని జవాబు రాలేదు. నాలుగో మాటు పిలిచేటప్పటికి జోగమ్మకి మెలుకువ వచ్చింది. అయిదో మాటు పిలవగా ఆమె భర్తను లేపి "మీ అక్క పిలుస్తూ వుం"దని చెప్పింది. దాని కతను ముస ముసలాడుతూ "వూరుకుందూ" అని చెప్పి గోడవేపుకి తిరిగి పడుకున్నాడు. అయితే బుచ్చమ్మమాత్రం వూరుకోలేదు. కేకమీద కేక చొప్పున ఆమె మళ్లీ రెండు మాట్లు పిలిచి, అప్పటికీ జవాబు రాకపోగా "మొగుడుకీ పెళ్లానికీగూడా మొద్దునిద్దరే. ఆడపిల్లకిగూడా బండ నిద్దరే అయితే యెలా గమ్మా వేగడం? పోనీ నీకేనా మెలుకువ రాలేదుటే?" అని సాగదీసుకుంది. దానితో యిక లాభం లేదనుకుని జోగమ్మ లేచి వచ్చి తలుపు తీసింది.

తలుపు తీసీ తియ్యడంలోనే బుచ్చమ్మ లోపలికి దూకింది. అందుకు సిగ్గుపడి జోగమ్మ యివతలికి రాగా "మరీ మంచిదీ" అనుకుంటూ బుచ్చమ్మ మంచం దగ్గిరికి వెళ్లి "ఏనో చదువుకుంటూ వున్నట్టు నటించకపోతే నీ పెళ్లాం లోకువ చేస్తుందిరా" అని చెవిలో చెప్పి చలపతి నివతలికి లాక్కువచ్చింది. అప్పుడు జోగమ్మ మళ్లీ లోపలికి వెళ్లి తలుపు దగ్గిరగా వేసుకుని వూరూరుకుంటూ పడుకుంది.

"దీపం పెద్దది చెయ్యవే" అని బుచ్చమ్మతో చెప్పాడు. గాని యే పుస్తకం చదవాలో చలపతికి తోచలేదు. సంవత్సరం కిందట లోవరు సెకండరీ చదువుతూ పెళ్లాము రజస్వల అయిందన్న శుభలేఖ రాగానే బుచ్చమ్మ ప్రోత్సాహంచేత చదువు మానేశాడతను. అప్పటి పుస్తకాలన్నీ యేమయిపోయాయో సోదికి వెళ్లినా యెవరూ చెప్పలేరు. సోదుగింటి పుల్లయ్య దగ్గిర "రైల్వే లిప్టేవరు" దండిగానే వుంది; గాని యిప్పుడెలా వస్తుందీ? తండ్రి దగ్గిర పంచాంగం తప్ప మరేమీ లేదు. అది చలపతికి పురరామూ వడవదు. ఎంత ఆలోచించినా యేమీ తోచక నాలుగు మాట్లు ఆగూడూ యీగూడూ వెతికేటప్పటికి బుచ్చమ్మ చదువుకునే లంకాయాగం దొరికింది. తానేదో మహా చదివేసి వొరగతెస్తున్నాడని జోగమ్మ అనుకోవాలని కదా యీ పాట్లన్నీని? ఆమె గదిలో నిద్రపోతూ వున్నప్పుడు కాస్తసేపు కాగితాలటూ యిటూ తిరగవెయ్యడానికి యే పుస్తకమైతే యేమీ? ఇలాంటి ధైర్యంతో అతనదే పుచ్చుకుని దీపం దగ్గిర కూచున్నాడు ఇదంతా చూస్తూ వున్న బుచ్చమ్మ "తెల్లవారడంతోటే నాన్నని పంపి బాలరామాయణమేనా పెద్దచ్చు అమరమేనా తెప్పించా" లని నిశ్చయం చేసుకుంది.

అబ్బాయిచేత బి. య్యే. ప్యాసు చేయించి "మేస్త్రీటు"పని చేయించాలని జగ్గయ్య యింగ్లీషు చదువులో ప్రవేశపెట్టగా చలపతి ఫస్టుఫారంలోనే దండయాత్రలికి మొదలుపెట్టి ఏడేళ్లకి—అంటే పద్ధెనిమిగోయేట థర్డుఫారం చదువుతూ జమాబందీ పూర్తి చేసేశాడు. అంచేత అతని కింగ్లీషు అంటలేదు. పాఠశాలకే బలామూ రవడంచేత తెనుగు సుంటపువ్వులు పూసింది. పైగా ఆలంకాయాగం చెన్నపట్నంలో ధబడధక్క మొదలియారు స్వయంగా పరిష్కరించి స్వకీయ ఆరుముగం ప్రెస్సులో అచ్చువేసింది కూడానూ.

అయితే యేమీ? నమురు నిండా వుండడంచేత దీపం బంతిపువ్వులాగ వెలిగిపోతూనూ వుంది. పుస్తకంలో మొగ్గనుంచి చివరికీ, చివరనుంచి మొదటికీ కాగితాలు గిర్రున తిరిగిపోతూనూ వున్నాయి. "తమ్ముడు నామాట తీసెయ్యడు" అని బుచ్చమ్మ గర్వపడుతూనూ వుంది. ఇంట్లో జోగమ్మ యిక్కడ గొడవ లేమీ బోధపడక తెల్లపోతూనూ వుంది. ఇలాంటి సమయంలో యెప్పుడు వచ్చిందో యెవరికీ తెలియకుండా వచ్చి గాఢనిద్ర అందర్నీ అలముకుంది. భళ్లున తెల్లవారేక అప్పలమ్మ వచ్చి "బుచ్చమ్మగోరూ, బుచ్చమ్మగోరూ" అని పదిమాట్లు తలుపు గుంజేదాకా యెవరికీ మెలుకువ రాలేదు.

౪

అప్పుడేనా అందరిలోనూ ముందు జగ్గయ్య మేలుకున్నాడు. కళ్లు నులుముకుంటూ లేచి కూచుని యెదట నాళాటప్పటి కతనికి వెలవెలపోతూ వున్న దీపం దగ్గిర కొట్టేసిన పాములాగ పడివున్న చలపతి కనిపించాడు. దానికి కారణం తెలవక తట్టి లేపి "యిక్కడ పడుకున్నావేం నాయనా" అని అతనడగ్గా చలపతి "అక్క చదువుకోమంటూ నాలుగ్గంటలికే లేపిం"దని చెబుతూ, తూలుతూ తూలుతూ దొడ్లోకి నక్కాపోయాడు.

ఇదయిన తరవాత వాకట్లో బుచ్చమ్మా, యింట్లో జోగమ్మా వొక్కమాటే లేచారు. ఆ లేవడంలోనూ కూడా బుచ్చమ్మ మరదలింతలికి వచ్చిందా లేదా అని చూస్తూనే లేచి కూచుంది. ఇద్దరూ మొగాలు కడుక్కునేటప్పటికి రెండు బారల పొద్దెక్కింది. అందుకే నో మునిగిపోయినట్టు కంగారుపడుతూ బుచ్చమ్మ తననీ, మరదలినీ కూడా కలిపి "ఏడిసినట్టుగానే వుంది తెలివి. ఇంత పొద్దెక్కేదాకా లేవకపోతే యెలాగా?" అంటూ వొక్కమాటు సాగదీసుకుని, "వంటిల్లు అలుకు" అని మరదలికి పురమాయించి, వీధిలోకి వెళ్లింది. అప్పటికప్పుడే పక్కయింటి సోదెమ్మ వీధిలో నుంచుని కరివేపాకూ, కొత్తిమిరీ, పచ్చిమిరపకాయలూ—ఇలాంటివి కొంటోంది.

"వొసేవు సోదెమ్మోయి! రాత్రి మా మరదలు వచ్చింది సుమా" అంటూ బుచ్చమ్మ ఆగుమ్మంలోకి వెళ్లగా "నే నలాగే అనుకున్నాను అయితే "రాదినా సుఖంగా పడుకోకుండా నాలుగ్గంటలికే లేపా వెందుకే వాళ్లనీ" అని సోదెమ్మ అడిగింది. తరవాత యిద్దరూ ఆమాటా యీమాటా అనుకున్నారు. "ఇదిగో వచ్చే" అని యింట్లోవాళ్లకి బదులు చెబుతూనే సోదెమ్మ "వెళ్లాలి. బోలెడు పని వుంది" అంటూనే బుచ్చమ్మా అలాగే నుంచున్నారు. మొత్తానికి అరగంట అయితేగాని ఆయిద్దరూ అక్కణ్ణుంచి కదలలేదు. అప్పుడేనా "అమ్మోయ్! నీ తెలివి తెల్లవారిపోనూ! చెప్పావే కాదేమిటే మాతల్లీ?" అని వొకతే, "అయ్యో! నీ మొగం యీడ్చా! నేను మాత్రం చూశానా యేమిటే?" అని వొకతే అంటూ యిద్దరూ ఈయింట్లోకి నక్కావచ్చారు.

అప్పటికప్పుడే జోగమ్మ ఆడబడుచు చెప్పిన పని ముగించి, కళ్లకి కనపడిన వొకటి రెండు చిన్నపనులు గూడా చేసేసి, పుట్టింటినుంచి తెచ్చుకున్న సామాను గదిలో సద్దుకుంటోంది.

ఆనే, గుమ్మంలో అడుగు పెట్టాటప్పటికి మొట్టమొదట కనిపించేలాగ బల్లమీద మునిముందు హార్మోనియం వుంచింది. దాని తరవాత ట్రంకూ, బొట్టుపెట్టే, పాందానూ, పీకిదానూ, వెండిచెంబూ వరసగా పెట్టింది నవలలూ, పాటల పుస్తకాలూ, వసనభారతమూ, సంగీత దర్పణమూ వగైరా పుస్తకాల దొంతర ట్రంకుమీద పెట్టింది. ఇదయిన తరవాత పింకివంటల బట్ట విప్పుతోంది. ఈసమయంలో వచ్చారు అక్కడికి ఆ వితంతువు లిద్దరూనూ.

బుచ్చమ్మ పరాయివాళ్ల యింట్లో చూసినట్టు చూసి మూతి ముడుచుకుంది. సోదెమ్మ మాత్రం అలా కాక అవన్నీ నిదానించి చూసి "వంచమూ, అవ్వీ ఎప్పుడు పెడితారు వీూ వాళ్లు?" అని అడిగింది. దానిమీద జోగమ్మ "మా నాన్న మా అమ్మా పెళ్లాళ్లలో యిచ్చి, పందిరిపట్టె మంచమూ, పరుపూ, కావడిపెట్టే, బిందెలూ కేమ్మా, కుర్చీలూ, నిలువుటద్దమూ, కడపరాతిబల్లా, వెండికంచమూ– ఇంకా యిలాంటివి కొని యిస్తా" రని చెప్పింది. "బాగానే వుంది" అని అంగుకు సోదెమ్మ సంతోషించగా బుచ్చమ్మ "బోగందాని కిచ్చినట్టు ముందు ఆర్మణీ యిచ్చారు కదా?" అంటూ సోదెమ్మ నినతలికి లాక్కువచ్చింది.

అది విని జోగమ్మ చిన్నబుచ్చుకుంది. "అలా అంటావేమిటే" అని సోదెమ్మ నొచ్చుకుంది.

౫

తరవాత ఆ యిద్దరూ గోదావరికి వెళ్లిపోయారు. అప్పుడే కాఫీహోటలునుంచి వచ్చిన చలపతి హార్మోనీ

యం చూశాటప్పటికి కూనిరాగం వుబకగా "సంగీతం బాగా నేర్చుకున్నావా నువ్వు?" అంటూ గదిలోకి వెళ్లాడు.

"కొంచెం నేర్చుకున్నాను. మీరు కాఫీ పుచ్చుకున్నారా?"

"ఇప్పుడే వచ్చాను వరదారావు హోటలునుంచి"

"నాకు కాస్త వుప్మా తెచ్చిపెట్టరూ?"

"మా అక్కని రానియ్యి"

"ఎందుకూ?"

"మరి డబ్బులో?"

"మీ రెలా పుచ్చుకొని వచ్చారూ కాఫీ?"

"ఎప్పుడూ లేదు గాని యింవేళతో మా అక్క నాకే తానే యిచ్చింది డబ్బు లివాళ"

"మీ దగ్గిర డబ్బేమీ లేదూ?"

"తాళం మా అక్క దగ్గిరే వుంటుంది"

"పోనీ నే నిస్తాను తెచ్చిపెట్టండి"

"ఛే"

"ఈ సంగతి రహస్యంగా వుంచుతాం?"

"ఏం?"

"ఏమీ లేదూ"

"మా అక్క అడిగితే?"

"ఆవిడి కెందుకు తెలవాలి?"

"నువ్వు తినడం చూస్తే?"

"నే నెరూ చూసేలాగ తినను. మీరు కూడా ఎవరికీ కనపడకుండానే తేవాలి"

"తరవాత తెలిస్తే మాఅక్క "నాతో యెందుకు చెప్పావు కా"ఎని గదుముతుంది బాబూ"

"అయితే వొద్దు లెండి. పూచోండి. ఇలా అడిగానని మాత్రం చెప్పకండేం?"

"ఏమీ అనదు లే"

"అనడం దాకా యెందుకూ? మీరు చెప్పనే వద్దూ"



"నీకు మొఖారిరాగం వచ్చునా?"

"వచ్చును. చెప్పకండేం"

"వల్ మోహనరంగా' వచ్చునా?"

"తప్పుతప్పు. అది నాకు రాదు. వుప్మా సంగతి మీ అక్కతో చెప్పకుండా వుంటారు కామా?"

"పోనీ" "సిరిసిరిమువ్వ పాడగలవా?"

"అదేమి టండీ అలాంటి నడుగుతారూ? మీరు నేర్చుకున్నారా యేమి టవి?"

"దంచేసి పాడతాను నేను"

"మీ అక్క నేర్పిందా?"

"బండి అప్పేసామి నేర్పాడు. అలాంటివి చాలా వచ్చును నాకు. "అప్పనా తనా మనా" ఓసీ గోరి బండివాడా" "గోంగూరకీ—నేను పాడతాను నువ్వు హార్మనీ వాయిస్తావా?"

"అవి నాకు రావు. నేను వాయించలేను"

"మరేం నేర్చుకున్నావూ?"

"వాతాపిగణపతీ, రామభక్తీ, రామ నీ సమానమూ, మనసు కరుగ దేమీ—"

"హోస! పూర్వకాల ప్పాటలా? ఇప్పు డెవరి క్కావాలి అవి?—పోనీ నీకు వచ్చిం దేదో వొకటి పాడెయ్యి తొరగా"

జోగమ్మ మనస్సు చివుక్కు మంది. తన భర్త స్థితి అంతా ఆమెకి తెలిసిపోయింది. ఆడబడుచు సంగతి అలా వుండగా యీ వృద్ధవ్రతం కూడా యేమిటి? ఆ పద్ధాలుగేళ్ల పిల్లకి భవిష్యత్తేమీ బోధపడ లేదు. తల తిరిగిపోయింది. ఈకారణంచేత ఆమె నుంచోలేక కుర్చీలో కూలబడగా అదేమిటో యెరగని చలపతి "మా అక్క రాకుండా తొరగా వొక మట్టు పాడేసెయ్యి" అని తొందర పెట్టాడు. దీనితో పుండుమీద కారం చల్లిన ట్టయిం దామెకి.

"మీ అక్క వస్తే యేమీ?"

"తిడుతుంది"

"ఎవర్ని?"

"నిన్నూ నన్నూ కూడానూ"

"మీ రింకా ఆవిడిచేత తిట్లు తింటున్నారా?"

"లేకపోతే చంపెయ్యదూ?"

"అంటే?"

"అన్నం పెట్టదు. గుమ్మంలోకి రానివ్వదు"

ఆమెకి మీది ప్రాణాలు మీదికే రెగిరిపోయాయి ఒక్కక్షణం ప్రపంచకం తెలవలేదు; కాని విచారిస్తేమూ, తెల్లపోతేనూ యేం లాభమూ? కన్నీటిని రెప్పలలోనే అప్పళించుకుంది. దుఃఖాన్ని దిగమింగుకుంది. కొంచెం ధైర్యం తెచ్చుకుని యేదో అనపోయింది; గాని అతను పడనివ్వలేదు. "వో పాట పాడు" అని మళ్లీ తొందరపెట్టాడు. హార్మోనియం తీసేదాకా తొందలు విడిపించాడు కూడానూ.

మొగు డెంత తెలివితక్కువవాడైనా పెళ్లాం అన్నాక విధేయత చూపించక తప్పదు కాదూ? మూర్ఖులైన భర్తలు ఈ సద్గుణాన్ని దురుపయోగం చేసినా భారతస్త్రీకి సభ్యత కలిగించిన యోగ్యత యిదే. ఇది వొక్కొక్క చోట దంపతుల అనురాగానికీ సౌఖ్యానికీ భంగం కలిగిస్తూవుండడం నిజమే; కాని ప్రేమవున్న చోట త్యాగానికి వెనకతీత వుండదు.

చేసేది లేక జోగమ్మ మాట రాకపోగా హార్మోనియం పట్టుకు వాయించసాగింది. "తొలి నే జేసిన పూజాఫలములు" అనే కృతి హార్మోనియంలోనుంచి నింపాదిగా మొలుచుకువస్తోంది; కాని అతని కదేమీ నచ్చలేదు. తనకి వచ్చిన మట్లన్నీ వొక్క నిమిషంలో దానిమీద పాడెయ్యాలని నాలుగు మెట్ల మీద వేళ్లు పెట్టి "భోంయి" మనిపించి, యింకట్లో బుచ్చమ్మ వచ్చిన సవ్వడి కాగా గభీ మని వొక్క గంతులో యివతలి కుడాయించాడు. జోగమ్మ అందుకే తెల్లపోతూ వుండగా బుచ్చమ్మ బిడెద బుజమ్మీద వుంచుకునే యెదురుగా వచ్చి "మా మర్యాదా తక్కనివ్వవూ? నేను బతికివున్నంత కాల మేనా ఆర్మణీ కట్టిపెట్టు. తర వాత నువ్వెలాగా భూమ్మీద మన్నవు" అంటూ గింజుకుంది.

## ౬

జోగమ్మ ఉలిక్కిపడింది. "ఎందు కిలా తిట్టడం? హార్మణీ వాయిస్తే యేం తప్పా?" అని ఆమె ఎంతో దేవుళ్లాడింది. కాపైతే వచ్చినప్పణ్ణుంచీ బుచ్చమ్మ వాలకం తెలుస్తూనే వుంది. అయినా అది యింతలో యింతగా ముదిరిపోతుం దని ఆమె అనుకోలేదు. ఆమె తల్లి అయిన పూర్ణమ్మ మాత్రం యిదివరకే కనిపెట్టింది సంగతంతానూ. బుచ్చమ్మ, వితంతువై వుండికూడా పెళ్లిలో అన్నింటికీ తనే ముందుకు వస్తూ ప్రతీదానికీ పెడర్థాలు తీసి, కుహూ స్తులు పన్నడమూ, చలపతిని ఫలహారానికి రానివ్వకపోవడమూ, అక్షతలు మీద తగని పట్టు పట్టించడమూ, నాగవల్లి నాటి పట్టుచీర వెనక్కి పెట్టించి తన కూతురికి సాదాచీర యిప్పించడమూ, పూర్ణమ్మ మరిచిపోలేను. తరువాత రెండు మూడు మాట్లు తమ్ముడుతో తమ యింటికి వచ్చినప్పుడామె చేసిన పెంకితనంకూడా ఆమె మరిచిపోలేదు. మొత్తంమీద మొగుడి అప్రయోజకత్వమూ, ఆడబడుచు రాగతనమూ, తన కూతురికి ముందు ముందు చాలా ముప్పు కలిగిస్తా యని ఆమె ముందే గ్రహించింది.

కనక ఆమె కూతుర్ని అందుకు తగినట్టుగానే తయారుచేసింది. జోగమ్మేనా సహజంగా నిదానంది గాని వాజమ్మ కాదు. ప్రోళ్లో పట్టుచీర వెనక్కి పెట్టించినప్పణ్ణుంచీ ఆమెకి బుచ్చమ్మమీద గుర్రుగానే వుంది. మొగుడు తులసీదా సని యిప్పుడు ప్రత్యక్షంగా తెలియడంతోటే ఆమె భవిష్యత్తుని గురించి ఆలోచనలో పడింది. పైగా "తాళాలు నీ మామగారి చేతుల్లో వుండాలి. లేకపోతే నీ మొగుడిచేతుల్లో వుండాలి; అలాగా లేకపోతే నీచేతుల్లో వుండాలి; గాని నీ యింటో పెత్తనం చెయ్యడానికి ఆడబడుచు కెవరూ?" అని తల్లి చెప్పిన మాట ఆమె కిప్పుడు చటుక్కున జ్ఞాపకంకూడా వచ్చింది.

అయితే తొలిమాటు వచ్చాటప్పటికే కథ యిలా అడ్డం తిరిగింది. ఇప్పు డేమిటి చెయ్యడం? బుచ్చమ్మకి స్థానబలం వుంది. తండ్రిబలం వుంది. తమ్ముడిబలం వుంది.

తరుకూ పారుకూ ఆసరా వుంది. జోగమ్మ కేం వుందీ పాపం! కాస్తైతే ఆమె సిసింద్రీయే. అందుకు సందేహం లేదు; కాని బాగారపు పళ్లేని పైనా గోడ చేసుకు వుండాలి. వచ్చీరావడం తోటే కజ్జాకి సిద్ధపడితే జయం మాట యెలావున్నా లోకులు పీకయ్యరూ? ఏ పారుకు ముసలమ్మేనా తనకి ఆసరా అవుతుందన్న భరవసా లేనప్పుడు న్యాయపక్షం తన దైతే మాత్రం యేమి లాభమూ? జోగమ్మ యిదంతా ఆలోచించింది. పైగా తల్లీ దండ్రీకూడా కొద్ది రోజుల్లోనే వస్తా రాయె. ఇంతలో తొందర లెందుకూ?

ఇలా అనుకుని జోగమ్మ వోపిక పట్టింది. బుచ్చమ్మ యెప్పుడు చూసినా ధుమధుమ లాడుతూనే వుంటుంది. దీనికి సాయం చలపతి పెళ్లామనీ, అప్పటనీ, ముచ్చటనీ యెరగడాయె. అయినా ఆమె తేలిపోలేదు. బుచ్చమ్మ యెన్ని మాట లంటూ వున్నా జవాబు లేదు. వచ్చిన మూడోనాటి రాత్రి తీరా యిక పడుకోడమే అనగా "ఇవాళ హరిశ్చంద్ర నాటకంట కాదూ? చూసివద్దూ తమ్ముడూ!" అని అర్ధరూపాయ చేతి కిచ్చి బుచ్చమ్మ చలపతిని పంపెయ్యగా ఆరాత్రి మాత్రం బేలపోయి ఆమె వొక్క గంటసేపు కుమిలి కుమిలి యేడ్చింది.

౩

అసహాయస్థితిలో యెలాంటి వాళ్లకీ కూడా ధైర్యం తనంతట అదే వస్తుంది. పైగా అలాగ గంటసేపూ యేడ్చాటప్పటికి జోగమ్మకి కొంత భారం తగ్గిపోయినట్టయింది. హృదయం కొంచెం తేరుకుంది. పదకొండయేటప్పటికి నిద్రకూడా పట్టింది.

మూడింటికి చలపతి యింటికి వచ్చాడు. అతగాడు పిలవడమూ, బుచ్చమ్మ తలుపు తియ్యడమూ, "నీ కిప్పుడు నాటకా లేమిటి నాయనా?" అని జగ్గయ్య మందలించడమూ — యీ సందట్లో నిద్రాభంగం కాగా జోగమ్మ మొగుడు యింటోకి వస్తా డని గదియ తీసి వుంచింది; గాని "తెల్లారిపోతోంది"

అంటూ బుచ్చమ్మ చలపతి! వాకట్లో అరుగుమీద కుంగచాప పరిచింది.

దీనితో జోగమ్మకి యిందాకటి కన్నా యెక్కువ దుఃఖం వచ్చింది. తనవల్ల యేదేనా తప్పుండినా, మొగుడికి తనమీద యేమేనా కోపం వుండినా యిందు కామెకి కష్టం లేకపోవును. కాని యిదేమిటీ?

తనే తుమ్ముకుని తనకి తనే దీవించుకున్నట్టు జోగమ్మ కొంతసేపటికి తన్ను తానే వోదార్చుకుంది.

కళ్లనీళ్లు తుడుచుకుని గోడ వేపుకి తిరిగి పడుకుని ఆమె ఆలోచన మొదలు పెట్టింది. "దీనికి వుపాయం యేమిటీ?" అని ఆమె సంగతి యెత్తుకునేటప్పటికి "బుచ్చమ్మకి యీ పెత్తనం యెలా వచ్చిందీ?" అని యెవరో అడిగినట్టయింది. ఎలా వచ్చిందీ? చలపతి తుంటరివాడు కనక. అతను బుచ్చమ్మ చేతులోవున్నాడు కనక. కనక యిప్పుడు చెయ్యవలసిం దేమిటీ? ముందు చలపతినీ, బుచ్చమ్మనీ విడతియ్యాలి. తమ్ముడంగా అతన్ని తాను లోపు చేసుకోవాలి. జగ్గయ్య యేమీ కలగ చేసుకోడం లేదు కనకనూ, చలపతి స్వయంగా సంసారం దిద్దుకునే టంతవాడు కాడు కనకనూ యింతకంటె మరో వుపాయం లేదు. ఇంకో మార్గం లేదు.

౪

జోగమ్మ యిలా నిశ్చయం చేసుకుని చదరంగపు ఆట మొదలుపెట్టింది; కాని రెండు దినాలు గడిచేటప్పటికే బుచ్చమ్మ యీ సంగతి కనిపెట్టేసింది. జోగమ్మా, చలపతీ యేకం అయా రంటే యిక తన కేం వుందీ? యథార్థంలో అంతే అయినా బుచ్చమ్మకి "మనోవృత్తిముండ" గా మాత్రమే వుండిపోవడం యిష్టం లేదు. ఇంటి పెత్తనం తనే చెయ్యాలి. జోగమ్మని ముప్పతిప్పలూ పెట్టాలి.

మొదణ్ణుంచీ చలపతి తన చెప్పుచేతల్లోనే వుండడంచేత బుచ్చమ్మ "తమ్ముడు నామాటే వింటా" డని మొదట గర్వించింది; కాని చివరికి విమమించేలాగ కవడగా శ్రద్ధపట్టింది.

మొట్టమొదట బుచ్చమ్మ "పగలు పెళ్లాంతోటి అట్టే మాట్లాడకూడ" దని వొక ధర్మసూత్రాన్ని తమ్ముడికి వుపదేశించింది. తరవాత వొకనాడు జోగమ్మ తల దువ్వడం కోసం మొగుణ్ణి యింటోకి రమ్మని సంజ్ఞ చేసి పిలవగా బుచ్చమ్మ అది కనిపెట్టి "పని వుంది యిలా రా తమ్ముడూ" అని పిలిచి వంటింటి వసారాలో కూచోపెట్టి తానే తల దువ్వేసి పంపేసింది. మర్నాడు తనే తొందరపనిలోనో వుండగా జోగమ్మ చటుక్కున మొగుణ్ణి యింటోకి పిలవడం గమనించి "ఎంత గొంతుకు చించుకున్నా పలకవేమిటే మా తల్లీ? అని విసుక్కుంటూ వెంటనే జోగమ్మని ఇవతలికి రప్పించింది. తను గోదావరికి వెళ్లినప్పుడు జోగమ్మ తమ్ముడికి యేం విరుగుడు మాటలు చెప్పి పోతుందో అని ఆమె రెండు మూడు మాట్లు తనతో రమ్మని పిలిచింది; గాని "గోదావరిలో దిగితే నాకు జబ్బు చేస్తుంది బాబూ" అని జోగమ్మ తిరస్కరించేసింది. అంతట "యిది కాదు మార్గం" అని బుచ్చమ్మ సరిగ్గా తను గోదావరికి వెళ్లేటప్పుడు తమ్ముడికేదో పని పురమాయించి వూళ్లోకి పంపడం ప్రారంభించింది. ఇది గ్రహించి వొకనాడు జోగమ్మ ఆడబడుచు గోదావరికి వెళ్లే ప్రయత్నంలో వుండగానే చలపతిని "తమలపాకు లైపోయా" యని బజారుకి పంపి బుచ్చమ్మ గుమ్మం దిగిన వెంటనే యింటికి వచ్చేటట్టు చేసింది. ఇంకో రోజున సరిగా ఆసమయానికి పొరుగింటికి వెళ్లి యేదేనా కథల పుస్తకం తెచ్చిపెట్టమని పంపింది. మరో రోజున వొక కాని డబ్బు చేతులో పెట్టి "చీనాపంచదార తెచ్చిపెట్టండి" అని బజారుకి పంపి బుచ్చమ్మకి కనపడకుండా చేసింది. మర్నాడు బుచ్చమ్మ నెగ్గింది. ఆమర్నాడు మళ్లీ జోగమ్మ గెలిచింది.

౬

ఇలాగ వొక్క వారం గడిచిపోయింది. పైకేమీ గొడవలు కనపడవు; గాని లోపల్లోపల మాత్రం తాపాలు పెరిగిపోతున్నాయి.

ఒకనాడు సోదెమ్మ పెత్తనాలకి వచ్చి కూచుంది. అప్పటికి వాకిట్లో కూచుని బుచ్చమ్మ చలపతికి తల దువ్వుతోంది. రూపొందిన అసంతృప్తి లాగ జోగమ్మ స్తంభాన్ని చేరబడి నుంచుని వుంది. సోదెమ్మ కూచుంటూ, కూచుంటూ జోగమ్మ కేసి చూడగా జోగమ్మ సోదెమ్మ కేసి పురపుర చూస్తూ యింటోకి వెళ్ళిపోయింది.

జోగమ్మ చూపుల్లో సోదెమ్మ యేం కనిపెట్టిందో యేమిటో వూరికే కూచోక "నువ్వు దువ్వుతున్నావేమే?" అని బుచ్చమ్మనీ, "పెళ్లాంచేత దువ్వించుకోడానికి సిగ్గా యేమిట్రా బావా?" అని చలపతినీ అడిగి, అంతటితో పోనీయక "చక్కగా క్రాపింగు పెట్టుకోక ఆడదానికి లాగు అంత జుట్టేమిటిరా యీ రోజుల్లోనూ?" అని కూడా అడిగింది.

అసలలాంటప్పుడు సోదెమ్మ రావడమే బుచ్చమ్మ కిలాగో వుంది. వచ్చిన మనిషి వచ్చినట్టు నోరు మూసుకుని కూచోక తల దువ్వడం మాట తెచ్చాటప్పటికి ఆమెకి పిసాళం యెత్తుకొచ్చింది. ఆపైని క్రాపింగు మాట తెచ్చాటప్పటికి వొళ్లు మండుకుపోయింది. దానితో బుచ్చమ్మ యిక వూరుకో లేకపోయింది. "నా మొగం చూసేనా అదివూరుకోనప్పుడు దాని మొగం చూసి నేను మాత్రం యెందుకు వూరుకోవాలి?" అనుకుంది. వెంటనే రుసరుస లాడుతూ "ఇంటో వున్న ఆడపీనుగులు తెలివి తేటలూ, భయభక్తులూ వున్నవాళ్లయితే పైవాళ్లు తరుదునమ్మా అని పూనుకు వచ్చి యిలా అడగ్గలరా? సిగ్గు కాకపోతే మాత్రం పెళ్లాం వచ్చాక తల్లీ వాళ్ల నందర్నీ తీసిపారెయ్యాలా యేమిటి? తల దువ్వి దిక్కు లేక క్రాపింగూ పెట్టించుకోక, బోడిగుండూ చేయించుకోకపోతే యిక యేం చేస్తాడే మా వాడూ? గురివిందగింజ తన నలుపెరగదుట. వొకళ్ల యింటో మాత్రం యింతకంటే బాగా యేం వస్తోంది యేమిటి? అయినా కొంతమంది కదేమిటో కళ్లల్లోనే వుంటుంది విషం" అని విసిరి కొట్టింది.

సోదెమ్మ మనస్సు చివుక్కుమంది. "ఏదో యాదాలాభంగా అన్నమాటకి యింత అల్లరి యేమిటే మా తల్లీ" అని చాలా నొచ్చుకుని ఆమె యిక అక్కడ కూచో

లేక తటాలున లేచి వెళ్ళిపోయింది. అది చూసి "వెళ్ళిపో. నా కేం దిగదుడుతుందా యేమిటి?" అనుకుంది బుచ్చమ్మ వీథిగుమ్మం దాటాక. "దీని కెప్పుడూ యిలాంటి వెధవ గుణాలే" అనుకుంది సోదెమ్మ.

బుచ్చమ్మ ఆరోజంతా సోదెమ్మమీద ధుమ ధుమలాడుతూనే వుంది; కాని యీ ప్రసంగం మాత్రం జోగమ్మకి చాలా వుపకరించింది. ఆ రాత్రి ఆమె నల పతికి తమలపాకుల చిలక లందిస్తూ "ఇందాక సో దెమ్మ అక్కగారన్న మాటలు వినిపించుకున్నారా? ఏ మొగాడేనా యింట్లో పెళ్లాం వుండగా మరో ఆడ దానిచేత తల దువ్వించుకుంటాడా? మీ అక్క మీకు నే చెప్తూంటే తల దువ్వినట్టు ఎలా తేల్చిందో చూశా రా?" అని ముద్దుముద్దుగా బుద్ధిచెప్పి, చివరికి "రేప ట్నుంచి నా చేతే దువ్వించుకుంటారు కాదూ?" అని నిలవ దీసి అడిగింది.

౧౦

నెల్లాళ్లలో వస్తామన్న జోగమ్మ తల్లీ దండ్రీ పదిహేనురోజులికే వచ్చారు. లెక్కకి పదిహేనే; కాని ఆరోజులు జోగమ్మకి సంవత్సరాలుగా తోచాయి. వారేనా వుండలేకపోవడంచేత నైతే యేమి, నెల ఆఖ రుకి కాని రా దనుకున్న సెలవు పదిహేనో తేదీకే రావడంచేత నైతే యేమి పిలిచినట్టు వచ్చారు కనక సరిపోయింది; కాని లేకపోతే యెంత దృఢపరుచు కున్నా ధైర్యం చాలక జోగమ్మ తెంపేలుపడిపోవును. అక్కడికీ, పెట్టెలో పెట్టుకు వచ్చిన మినపసున్ని బుట్టా, అరిసెల బుట్టా పైకి తీస్తూ యేదో తలవని తలంపుగా తన ముఖంకేసి చూసి "అదేమే మా తల్లీ అంతగా చిక్కి పోయావూ?" అని తల్లి అడిగేటప్పటికి దుఃఖం వుబ్బె త్తుగా పొంగుకు రాగా జోగమ్మ తల్లిమీద వాలి బేరు మంది.

బుచ్చమ్మ కూడా కూడా తిరుగుతూ వేయి కళ్లతో కనిపెడుతూనే వచ్చింది; అయినా యెలాగో వీలుచేసుకుని జోగమ్మ సంగతంతా తల్లికి చెప్పే సింది. అదంతా వినేటప్పటికి పూర్ణమ్మకి అరికాలి మంట నెత్తికి వచ్చింది. వెంటనే ఆమె బుచ్చమ్మని దులి పెయ్యా లనుకుంది; గాని తాము వెళ్లాక ఆమె యింకా బరితెగుతుం దేమో అని వస్తాయించి, కోరలు తీసిన తాచులాగ బుసలు మాత్రం కొట్టింది. లేకపోతే, కంప మీద బట్ట పడినా, బట్టమీద కంప పడినా బట్టకే నష్ట మైనట్టు పుట్టింటివారు తొందరపడినా, అత్తింటివారు తొందరపడినా కోడలుపిల్లకే చిక్కు కదూ?

నాటి మధ్యాహ్నమే అల్లుణ్ణీ, కూతుర్నీ వెంట పెట్టుకుని వెంకటాచలం సకళత్రంగా బజారుకి బయలు దేరాడు. కాని చలపతి వారితో వెళ్లడం బుచ్చమ్మకి సుతరామూ యిష్టం లేదు. వాళ్లలో హూమన్న వారు హూమన్నట్టుగానే బయలుదేరడంచేత ఆమెకి చెప్పడా నికి వీలు లేకపోయింది. సంజ్ఞ చెయ్యా లని చూసింది; కాని ఆసమయంలో చలపతి బుచ్చమ్మకేసి చూడనే లేదు. సాయంత్రం యింటికి వచ్చాక ఆమె "వాళ్లు రమ్మంటే చనకా ముందూ చూడకుండా వెనకా పోతావా?" అని మొదట గ[illegible] తరవాత "ఏమేం కొన్నా రేమిటి?" అని అడిగింది.

౧౧

మర్నాడు పొద్దున్న బుచ్చమ్మ "వాళ్లు బయలు దేరేదాకా యెందుకూ?" అని ముందే మేలుకుని "ఈ మూడణాలూ పెట్టి పెసరట్లు తిని, కాఫీ తాగి ధనశే శ్వరం వెళ్లిరా. రానూ పోనూ జట్కాకి పావలా తగ లెయ్యడం యెందుకూ? నడిచి వెళ్లి రా" అని చలపతితో చెప్పింది.

"బజారుకి వెళ్తావుద్దూ?"

"నీ పెళ్లాం వెళుతోంది చాలదూ?"

"నేను కూడా వెళితే యేం?"

"నిన్ను లోకువ చేస్తారురా"

"..............."

"కాకపోయినా నీ పెళ్లానికి సామాను కొంటూంటే నువ్వు కూడా యెందుకూ?"

"ఏ బ్బెక్కు పైనా అదీ నేనూ కొన మన్న వస్తువులే కొంటున్నారు"

"మామగారు మాట వింటారు; గాని నీ మాట వింటా రనుకున్నావా యేమిటి?"

"వింటూంటేనే?"

"అయితే వెళ్లు. నీఖర్మం. నా కేం?"

చలపతికి కడుపులో రాయి పడింది. వెడితే యేమిటో, వెళ్లకపోతే యేమిటో? పది రోజుల కిందట అయితే అతని కీ తలపటాయింపు లేకపోవును. ఇప్పుడు ద్వంద్వప్రభుత్వం వచ్చింది. కానైతే బుచ్చమ్మ అధికారం ముందు జోగమ్మ అధికారం తీసికట్టే; అయినా నిరంకుశత్వానికి ప్రతిష్టంభనం అంటూ వొకటి ప్రత్యక్షం అయింది.

చలపతికి బజారుకి వెళ్లాలని యెంతైనా సరదాగా వుంది. వెడితే తనూ పెళ్లామూ వొక బండీలో కూచుని, నిన్నటి లాగ జోగమ్మ చాటుగా తమలపాకుల చిలక లందిస్తూ వుంటే పుచ్చుకుని దర్జాగా వేసుకో వచ్చు. పైగా—ఇవాళ మామగారు తనకి కోరిన కుర్చీ కొంటాడు.

కనక "ధవళేశ్వరం వెళ్లకపోతే యేం?" అనుకున్నాడు; గాని అతనికి ధైర్యం చాలలేదు.

ఒకరి కేసి వొకరు చూసుకుంటూ అక్కా, తమ్ముడూ వొక్క క్షణం అలాగే నుంచున్నారు. ఉత్తర క్షణంలో అతని దుర్బలహృదయంలో వొక మెరుపు మెరిసింది. వెంటనే "పో" అని మూ పెదాలూ పుక్కుకుని, బుచ్చమ్మ తలుపు తియ్యగా అతను దొడ్డిదారిని బయలుదేరాడు. నాలు గడుగులు వేశాక బుచ్చమ్మ చిటికెలు వేసి వెనక్కి పిలిచి, "పది గంటలికి. తెలిసిందా? ఈలోపున ఇంటికి రావద్దు" అని కళ్లు పులకరించుకుంటూ ఆజ్ఞాపించింది. "సరే" అని అతను వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ, కప్పలాగ వురుకుతూ నిమిషంలో మలుపు తిరిగాడు. "పిల్ల కింతే కావాలి" అని బ్రహ్మానందపడుతూ బుచ్చమ్మ యింటోకి చక్కాపోయింది.

## ౧౨

ఎనిమిదింబా వయింది. "అమ్మా! ఈపాటికి కొట్లు తెరుస్తారు లేవండీ తొరగానూ" అంటూ వెంకటాచలం కూతుర్నీ, భార్యనీ తొందరపెట్టి "చలపతీ!" అని పిలవగా జవాబు రాలేదు. జోగమ్మ పడకగదీ, వీధిగదీ చూసింది; గాని కనపడలేదు. "మీ తమ్ముడేడీ?" అని పూర్ణమ్మ అడగ్గా "ఏమో? నే నే మెరుగుదునూ?" అని సాగదీసుకుంటూ బుచ్చమ్మ నూతికి వెళ్లిపోయింది.

వెంకటాచలం పూర్ణమ్మ కేసి చూశాడు పూర్ణమ్మ జోగమ్మ కేసి చూసింది. "ఎక్కడికో పంపేసింది" అని జోగమ్మ అనగా "అవును; ఆపేనుగు పనే యిదీ" అని పూర్ణమ్మ పళ్లు కొరికింది.

వెంకటాచలం వొక్క బండే తీసుకు వచ్చి బజారుకి బయలుదేరదీశాడు. వాళ్లు గుమ్మం దిగడంతోటే బుచ్చమ్మ మండువాలోకి వచ్చి వీధి కేసి చూస్తూ "ఇక గింజుకోండి...మహా బాగా చేశానుకాదూ?" అంటూ రాకాసినవ్వు నవ్వుకుంది.

* * * * *

బండి కూరల బజారు దగ్గిరికి వెళ్లింది. బండి వెనక్కాల నడుస్తూ వెంకటాచలం కూతురుతో యేమిటో చెబుతున్నాడు. పూర్ణమ్మ జోగమ్మకి దాన్నే నప్పు చెబుతోంది. జోగమ్మ కొంచెం విచారంగా వున్నట్టు కనబడుతోంది.

ఎక్కణ్ణించి వచ్చాడో యిలాంటప్పుడు, ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ చలపతి చక్కావచ్చాడు; గాని వెంకటాచలం "యెక్కడికి వెళ్లావోయి?" అని అడిగేదాకా పూర్ణమ్మా, జోగమ్మా కూడా అతగాణ్ణి చూడలేదు.

"ఎక్కడికి వెళ్లా రండీ?"

"................"

"మాట్లాడరేం?"

"................"

"నువ్వే వెళ్లావా యెవరేనా వెళ్లమన్నారా నిన్ను?"

"ఏమయితే యేం? వూరుకోండింక. సమయానికి వచ్చాడు కదా?"

దానిమీద యెవరూ మాట్లాడలేదు. చురుకూ చురుకూ చూస్తూ జోగమ్మ చోటిచ్చింది. మామగారు నడుస్తూవుండగా తాను బండెక్కవచ్చునా కూడదా? అని అనుమానిస్తూనే చలపతి బండెక్కాడు.

అత్తగారూ మామగారూ పరధ్యానంగా వున్న సమయం కనిపెట్టి చలపతి జోగమ్మ వొళ్లో వొక కిల్లీ పడేశాడు. జోగమ్మ కూడా దాన్ని నడీ చప్పుడూ లేకుండానే నోట్లో వేసుకుని చలపతిలో కలుగుతూ వున్న మార్పుకి చాలా చాలా ఆనందించింది.

* * * * *

పదిన్నరకి, కొనవలసిన సామానంతా అయింది. వైగ్రాం రోడ్డు దగ్గిరికి వచ్చాక చలపతి బండి దిగి వాళ్లంవారి సలాం చేసి వెళ్లిపోయాడు.

వెంకటాచలం, జోగమ్మకోసం కొన్న సామానంతా వాకిట్లో పెట్టి వియ్యంకుడికి చూపిస్తూ వుండగా చలపతి యింటికి వచ్చాడు. అది చూసి "నువ్వు బజారుకి వెళ్ళలేదుట్రా నాయనా?" అని జగ్గయ్య అడిగాడు.

"ధవళేశ్వరం వెళ్లి వచ్చాను!"

"ఎందుకూ?"

"అక్క వెళ్లి రమ్మంది"

"ఏం పని?"

"..............."

"సంసారికి అనేక పనులుంటాయి. అడిగేదేమిటి బావగారూ?"

వెంకటాచలం యిలా అనేటప్పటికి దాని భావం బుచ్చమ్మమీదికి మొగ్గి వున్నట్టు జగ్గయ్య అనుమానపడ్డాడు. బుచ్చమ్మ తమ్ముణ్ణి వంటింటోకి పిలిచి "నేను ధవళేశ్వరం వెళ్లి రమ్మన్నానని వాళ్లు వినీలాగ చెబుతావా నాన్నతోటి?" అని కళ్లెర్ర చేసింది.

౧౩

"మీ అమ్మా మీ నాన్నా వెళ్లారా యింకా వున్నారా చెల్లాయీ?"

జోగమ్మ నూతిదగ్గిర వెండికంచం కడుగుతూ వుండగా యీ మాట వినపడింది. ఆమె అటూ యిటూ చూసింది గాని యెవరూ కనపడలేదు.

"ఇక్కడున్నాను నేను"

అని మళ్లీ వోమాట వినపడింది. ఈమాటు వెనక్కి తిరిగి చూడగా గోడ అవతల కరివేపచెట్టు కొమ్మల్లో నక్కి సోదెమ్మ మాట్లాడుతోంది

"ఇంకా వెళ్ళలేదు అక్కయ్యగారూ! ఇప్పుడే వచ్చి బజార్నుంచి, భోజనాలు చేశాము"

"సామానంతా కొనడం అయిందా?"

"అయింది. వచ్చి చూడరూ?"

"నువ్వు రమ్మన్నప్పుడు వచ్చి చూస్తాను"

"ఇప్పుడు రమ్మనడం లేదూ?"

"అలా కాదు"

"............"

"............"

"ఈజన్మలో అలాంటి అదృష్టమే నాకూ?"

"అలా అనకు. అంతా సరే. తక్కువవాళ్లు నాలుగు మెతుకులికి చేరినవాళ్లూ"

"నేనే యిప్పుడెలా వున్నాను"

"నిన్ను చూస్తే నా కేడుపు వస్తోంది. దిక్కుమాలిన పీనుగు చూస్తే పీకేస్తుంది. మరోకప్పుడు మాట్లాడుకుందాము వెళ్ళమ్మా"

"ఉపాయం—"

జోగమ్మ మాట పూర్తి కాకుండానే సోదెమ్మ వెళ్లిపోయింది. అందుకు జోగమ్మ చాలా యిదయింది;

గాని తటాలున ఆమె హృదయంలో కొన్ని ఆలోచనలు చెలరేగాయి. వెంటనే కంచం కడిగేసి ఆమె యింట్లోకి చక్కాపోయింది.

*    *    *    *    *

జోగమ్మా తల్లీ పడకగదిలో నుంచుని ఏమిటో చెప్పుకుంటున్నారు. కిటికీతలుపులు తీసివుండడంచేత వీధిలో వాళ్ళంతా వారికి కనపడుతున్నారు.

బుచ్చమ్మ వీధిగుమ్మంలో నుంచుంది. వొక వృద్ధబ్రాహ్మడు వీధిలో నుంచుని "ఈయిల్లు యెవరి దండీ?" అని అడిగాడు.

"మాదే"

"మీ యింటి పేరేమిటండీ?"

"..............."

"మీ యింటి పేరేమిటండీ?"

"మా యింటి పేరా?"

"అవును"

"ఎందుకూ?"

"వూరికేనే"

"మా యింటి పేరు మద్దూరివారు"

"..............."

"మీ కెవరి యిల్లు కావాలీ?"

"కల్లూరివారిది"

"అలా వెళ్ళండి. ఆవాబా యిల్లే"

ఇలా చెప్పి బుచ్చమ్మ యింట్లోకి చక్కాపోయింది. ఈమాటలు గదిలో వున్న తల్లికీ కూతురికీ కూడా వినపడ్డాయి.

"ఈయిల్లు మద్దూరివారి దని చెప్పింది చూశావా?"

"ఇంకా రెండేళ్లు పోతే నీ యింటి పేరే పైకి రానివ్వదు. పెళ్లి అయింది; ముండామోసి యింటికి చేరుకుంది; గాని దాని యిల్లని నడివీధిలో నుంచుని చెబుతోంది"

"ఇందుకోసమే కాబోలు యిందాకా సోదెమ్మ అక్కగారు అలా అన్నారు. ఎలాగే అమ్మా మరి?"

"ఎలాగే అంటే యేం వుందీ?...ఇంతకీ నీమామ గారికి కష్టంగా వుంటుం దేమో అని—"

ఇంతలో వెంకటాచలం వచ్చి "యేమిటమ్మా?" అని అడిగాడు. "ఏమీ లే దండీ నాన్నగారూ" అని జోగమ్మ బదులు చెప్పి కళ్ళల్లో నీళ్లు తెచ్చుకుంది. అది చూసి అతను "ఎందుకూ?" అని అడిగ్గా పూర్ణమ్మ సంగతి అంతా చెప్పి "కల్లూరివారి యిల్లని చెప్పక పోవడం యేమిటి? అని అమ్మాయికి కష్టంగా వుంది" అని చెప్పింది.

"ఆమాటలు నేనూ విన్నాను; గాని మన బంగారం మంచిది కాదు. వూరుకోండి"

"అతనికి చేతగాకపోతే అమ్మాయి చేసుకుంటుంది పెత్తనం. మధ్య నీ కెను గెవ రండీ?"

"కొంచెం వోపిక పట్టాలి. కోడలికివుంటే అది బతుకుకే అధికారం యెక్కువ వుండే యిల్లులూ చాలా వున్నాయి. తొందరపడకండి"

"ఎన్నాళ్లూ?"

"వెలపతికి జ్ఞానం వచ్చేదాకానూ"

"అందాకా అమ్మాయి బతుకుతుందా?"

"..............."

"ఇక నేను లేనని అనుకోండి నాన్నగారూ?"

జోగమ్మ యీమాట అనేటప్పటికి వెంకటాచలానికి కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. పూర్ణమ్మ కూతుర్ని చెయి పట్టుకుని "నీకేం భయమమ్మా? నునోవృత్తిమనిషి, అదేం చెయ్యగల దమ్మా నిన్ను?" అని వోదార్చి "ఇంకో వారం రోజులు సెలవు కావా లని పైకి రాయండీ. ఆవారమూ కూడా చూసి, వీలు లేకపోతే అమ్మాయినీ, అల్లుణ్ణీ కూడా మన యింటికే తీసుకువచ్చదాం" అంది.

"ఆపీనుగు రానిస్తుందటే అమ్మా?"

"అదీ నిజమే. ఏమంటా రండీ మీరూ?"

"చలపతి మన యింటో వుంటేఁ ఇక్కడేమా తుందో?"

"అదీ నిజమే. గండ కత్తెర వచ్చి పడిం దండీ యీభూతంతోటీ"

"సరే. ముందు సెలవు పుచ్చుకుని వస్తాను" ఇలా చెబుతూ వెంకటాచలం సూపర్నెంటుఆఫీసుకి వెళ్లాడు.

## ౧౪

"ఇంతకంటె పదొయ్యోర్ధ్యలు వుండి యేడుస్తాయా యేమిటి ముందు? ఏమయినా సరే వొక మాటు పోదమ్మగారి యింటికి వెళ్లి వస్తానే"

"నేనూ రానా?"

"కళ్లల్లో నిప్పులు పోసుకోమా?"

"..... ........."

"పోనీ మీ నాన్నని యింటికి రానీ"

ఇలా అనుకొని తల్లీ కూతురూ వాకట్లోకి వచ్చా టప్పటికి జగ్గయ్య వచ్చి "అమ్మా! వంటిల్లు సర్దాలి కామోసు చూడమ్మా" అన్నాడు. అది విని జోగమ్మ పూర్ణమ్మకేసి చూసింది. పూర్ణమ్మ "బతికాం" అని నింపాదిగా అని "నువ్వు కూచో అమ్మా! నేను సర్దు తాను" అని వంటింట్లోకి వెళ్లగా, చిటికెలు వేసు కుంటూ జోగమ్మకూడా తల్లి వెనక్కాల వంటింట్లోకే వెళ్లింది.

*   *   *   *   *

"అక్కయ్యగారూ!"

"..............."

"వీధిగదిలో వున్నట్టుంది. వినపడుతుం దేమోనే"

"వినపడదు...అక్కయ్యగారూ?"

"..............."

"ఆవిడ వాకట్లో వుందేమోనే అమ్మాయీ"

"ఇంకా వంటింట్లోనే వున్నారు..."అక్కయ్యగారూ!"

"చెల్లీ!"

"ఏం చేస్తున్నా రండీ?"

"వంటింటో పని అయిపోయింది. వాకట్లోకి వెడదాం అనుకుంటున్నాను"

"మూడు రోజులు పండుగు వచ్చిం దండీనాకూ"

"వచ్చిందా? వెయ్యిమంది దేవుళ్లకి మొక్కు కుంటున్నాను మీ వాళ్లు వుండగా యిలా రావాలనీ. మీ అమ్మ ఏం చేస్తున్నారూ?"

"ఇక్కడే వుందండీ. మా అమ్మ మీ యింటికి రావాలనుకుంటూ వుండగా, మామగారు "యిల్లు సర్దమ్మా" అని చెప్పారు నాకు"

"వెర్రి బ్రాహ్మడు. ఏమీ యెరగడు పాపం. సత్యరుషీ. అంచేతే ఇలా ఆడుతోంది ఆట. పిన్ని గారూ!"

"వింటున్నా"

"అలా రండి దొడ్లోకి"

"వస్తున్నా. నువ్వు సర్దుకోవే తల్లీ వంటిల్లు"

ఇలాగ చెబుతూ పూర్ణమ్మ దొడ్లోకి వెళ్లగా "ఎక్కడికి పంపించిందో యింటో లేకుండానూ!.... ఈ మూడు రోజులూ కంట పడనివ్వకూడదు" అను కుంటూ జోగమ్మ పనిలో ప్రవేశించింది.

## ౧౫

చలపతి బజారులో కిల్లీ కట్టించుకుంటూ వుండ గా వెంకటాచలం చూసి "ఇంటో తమలపాకు లయిపో యాయిట యెరుగుదువా?" అని అడిగాడు.

"నే నెరగను"

"మరి కొనుక్కోవద్దూ?"

"తమలపాకులు తెస్తే మా అక్క తిడుతుంది"

"ఏం?"

"ఏమో"

"మీ నాన్న తిడతారా?"

"మా నాన్న తెచ్చుకోమనే అంటాడు. "సంసార్గం కాదూ?" అని మాఅక్క వల్లకాదంటుంది"

"సంసార్గం కనకనే కావాలి. తెలిసిందా? మా అమ్మాయికి చిన్నప్పణ్ణుంచీ తాంబూలం అలవాటూ. అది లేని రోజు దానికి వుపవాసమే. మేము వెళ్లేదాకా చేసే కొంటాను. తరవాత నువ్వు తెస్తూ వుండాలి సుమా. డబ్బులు మా అమ్మాయే యిస్తుందిలే. భయపడకు."

"అలాగే లెండి"

"కూరల బజారు దగ్గిర కవటాకులు వున్నాయి. పుచ్చుకుందాము రా"

మామగారు కొన్న తమలపాకులూ, అవ్వీ పట్టుకుని చలపతి ఆనందంతో యింటికి వచ్చాడు. మామగారి చేతులో యేవో రెండు పొట్లా లుండడం చూసి అవి ఫలహారపు వస్తువు లని అనుకొని వూరుకుంటూ వచ్చాడు; గాని గుమ్మంలోకి వచ్చాటప్పటికి అరుగుమీద బుచ్చమ్మ కనపడగా అతని మొగం గూక్కుపోయింది. పూర్ణమ్మా, వెంకటాచలమూ వుండగా తాను బైట చేరినందుకే వుడికిపోతూ వున్న బుచ్చమ్మ, యిది చూసి తల నేల కేసి కొట్టుకున్నంత యి దయింది."

* * * * *

"వెళ్లక్కర్లేదు"

"మా అక్క పిలుస్తోంది"

"మునిగిపోయీ పనేమీ లేదు అవతల"

"ఇప్పుడే వస్తాను"

"ఇప్పుడే వెళుదురు గాని"

"............"

"మా నాన్నగారు ఫలహారాలు తెచ్చారు పుచ్చుకుందాం కుర్చీలో కూర్చోండి"

"............"

"కాఫీ కూడా వుంటే బాగుంటుంది కాదూ?"

"స్ట్రాంగు కాఫీ అయితే మరీ బాగుంటుంది"

"తెస్తారా?"

"............"

"డబ్బులు నేనే యిస్తాను బెంగపెట్టుకోకండి"

జోగమ్మ వాకట్లోకి వెళ్లగా, వెంకటాచలం చలపతిని పిలిచాడు. జోగమ్మ వెండిచెంబు అందించింది. వెంకటాచలం వొక రూపాయి చేతులో పెట్టి "అయిదు కప్పులు కాఫీ, ఏబులం కారాబూందీనీ" అని చెబుతూ వీధిగుమ్మం దాకా వచ్చి సాగనంపాడు. చలపతి బుచ్చమ్మకేసి చూసి బెదురుతూనే వెళ్ళగా "యీ మూడు రోజులూ యిక వీళ్లు భాగోతం ఆడేస్తారు" అనుకుంటూ ఆమె మొగం మాడ్చుకుంది.

## ౧౬

జోగమ్మ, గదిలో కూచుని ఫలహారం చేయిస్తూ తాను కూడా చేస్తూ చలపతికి మర్యాద చేస్తూ వుండగా పూర్ణమ్మ వంటింటి వసారాలో జగ్గయ్యకీ, వెంకటాచలానికీ ఫలహారాలు వడ్డించింది. అది మాకాటప్పటికి ప్రాణాలు లేచిరాగా జగ్గయ్య "ఇదేమి టండోయి భావగారూ? మాయింట్లో మీకు మేం చెయ్యవలసిన మర్యాదలు మాకు మీరే మొదలు పెట్టా రేమిటి?

"మా యింట్లోనూ మేమే చెయ్యాలి, మీ యింట్లోనూ మేమే చెయ్యాలి మీకు. ఆడపిల్లని కన్న వాళ్ళం కాదుటండీ మేమూ? మా సంగతంతా మీ అనుగ్రహంమీదే ఆధారపడివుంది"

"మా అనుగ్రహం యెందుకూ? మీ అనుగ్రహమే వుండాలి మాకు. చలపతి భారం అంతా మీదే"

"మీ అమ్మాయి మా దాకా మిగిలిస్తే కదా?"

వెంకటాచలం యిలా అనగా పూర్ణమ్మ అందుకుని "ఈకాలపు మొగపిల్లలికి యెవరూ చెప్పనే అక్కర్లేదూ? అయినా ఆలోటు లేకుండా బుచ్చమ్మ దిద్దుతూనే వుంది చలపతిని" అని సన్నాయి నొక్కులు నొక్కింది.

జగ్గయ్య వులిక్కిపడ్డాడు. జోగమ్మ వచ్చినప్పణ్ణుంచీ బుచ్చమ్మ వాలకం అంతా కాకపోతే కొంతే

నా తెలుస్తూనే వుంది; గాని కజ్జా అంటే వెనక్కి తీసే వెంకటాచలం యిలా అనడంచేత అది దుర్భర మై పోయివుంటుం దని అతను వూహించాడు.

తరవాత యెవరూ మాట్లాడలేదు. వొకదాని తరవాత వొకటి చొప్పున వారు ఫలహారం పూర్తి చెయ్యగా పూర్ణమ్మ కాఫీ యిచ్చింది. అంతా అయి పురుషు లిద్దరూ లేచారు. లేస్తూ లేస్తూ జగ్గయ్య "భానగారూ! సంగతంతా మీకూ తెలుసును నాకూ తెలుసును. ఈపాటికి మీ రీవూరు బదిలీ చేయించుకోండి" అని చెప్పాడు.

ఇది విని వెంకటాచలం పూర్ణమ్మకేసి చూడగా ఆమె కళ్ళల్లో "వొప్పుకోండి" అన్నట్టు ఆత్రం తొణికిసలాడిపోతోంది.

"ఈ విషయం మీరు మీ అమ్మాయితో ఆలోచించారా?" అన్నాడు వెంకటాచలం.

"అవసరం లేదు. అలా చేస్తే మీరు మీ అమ్మాయి! సంరక్షణ చేసినవారూ అవుతారు. చలపతి బాగూ పడతాడు"

"పిక్కులు కూడా యేమేనా—"

"మనం ద్వంద్వాతీతులం కాము. నా కొడుకు బాగుపడడమూ, నా వంశం వృద్ధి కావడమూ—ఇదే నాకు ప్రధానం. తప్పకుండా బదిలీ కోరుకోండి"

"మీ సెలవు"

"సెలవో, విధో మీకే తెలుసు"

"అలాగే చేస్తాను"

"అయితే సంతోషమే. ఇప్పటికి వొక భారం తగ్గిపోయింది నాకు"

ఇలా అనుకుంటూ పురుషు లిద్దరూ హాల్లోకి వెళ్లిపోగా "అవున్న భారా లేమిటో యింకానూ!" అనుకుంటూ పూర్ణమ్మ స్థలశుద్ధి చేసేసి, ఈ సంగతి కూతురితో చెప్పడానికి వాకట్లోకి వెళ్లింది. అప్పటి కప్పుడే జోగమ్మ తాంబూలాలు కూడా ముగించుకుని, గోడలికి తగిలించడానికి కొత్తగా కొన్న పటాలు చలపతి కందిస్తోంది.

## ౧౨

ఆవేళా, మర్నాడూ, ఆమర్నాడూ కూడా జోగమ్మ గాని, చలపతి గాని వీధిగుమ్మం తొక్కి చూడలేదు. ఎలాగేనా చలపతి నివతిలికి రప్పించాలని బుచ్చమ్మ అభూతకల్పనలు చాలా చేసింది; గాని వొకటీ కూడా సెగ్గలేదు. ఎన్నిమాట్లు పిలిచినా చలపతి పలకడమే మానేశాడు. చాలా సేపు గుట్టుగానే పడివుండి చివరికి పట్టలేక పూర్ణమ్మ నడగ్గా "ఏమో? నే నేమెరుగుదునూ?" అని తన మాట తనకే అప్పగించేసి లోపలికి వెళ్లిపోయింది. "ఇదిగూడా చూసే వొదిలెద్దాం" అనుకుని "తమ్మ డేం చేస్తున్నాడు నాన్నా?" అని అడగ్గా అతను నిర్లక్ష్యంగా జవాబు చెప్పి వీధిలోకి వెళ్లిపోయాడు.

దీనితో ఆమెకి వుక్రోషం వుధృతంగా పెరిగిపోయింది. వూసిపోడానికేనా మాట్లాడేవాళ్లు లేకపోవడంచేత సోదెమ్మని విసిరికొట్టిన దుడుకుతనం ఆమె కిప్పటికి బోధపడింది. ఇంతకీ "సోదెమ్మగూడా వాళ్ళతో కలిసిం దేమో" అని ఆమెకి అనుమానం కూడా కలిగింది.

ఇక యేమిటి చెయ్యడం? వొళ్లంతా చీమలూ, జెర్రెలూ పాకినట్టుండగా ఆమె ఆవేళ రాత్రి ఆకల్లేదని చెబుతూ పిండి తినడం మానేసింది. రెండో రోజు రాత్రి సగం సగం తిని మజ్జిగ పోసుకోకుండా లేచిపోయింది. మూడో నాడు మధ్యాహ్నం ఆర్యాపురం వెళ్లి విందు కుడిచి వచ్చింది; గాని యేం చేసినా యెవరూ యేమీ అనలేదు.

ఏమీ తోచక మూడో నాడు సాయంత్రం గోదావరికేసి షికారు బయలుదేరగా అక్కడ బయట చేరిన వొక స్నేహితురాలు కనబడి లోకాభిరామాయణం విడేసింది. కొంతసేపటికి పుట్టింటారు వచ్చి జోగమ్మకి సామాను కొనడం మాట వచ్చింది. అందులో చల

వతి దగ్గిరవుండి స్వయంగా కుర్చీ యేరుకున్న నూష్మాతి సూక్ష్మవిషయం కూడా బైటికి వచ్చింది.

దానితో బుచ్చమ్మకి కొట్టినంత పనయింది. "మూడజాలు పుచ్చుకుని కూడా యింత పని చేసిన చల వతి యింకా యెంత పని చేస్తాడో—వాళ్లు చేయి స్తారో?" అని గాభరా పుట్టింది. వెంటనే—యిక అక్కడ క్షణ మైనా వుండలేక, కొంప మునిగిపోతోం దన్నంత కారణం యేదో కల్పించి, అమాంతంగా లేచి మంచుని, "కాస్సేపు వుండవే మాతల్లీ" అని రెండో ఆమె కొసురుతూ వుండగానే గిరుక్కున వెనక్కి మళ్లింది.

## ౧౮

బుచ్చమ్మ యిలా గోదావరికి బయలుదేరగానే పూర్ణమ్మ కోవాబిళ్ళలు తెమ్మని నలపతిని కాఫీహోటలుకి పంపింది. ఆమె "వెంటనే రావాలి సుమా" అనే చెప్పింది. గాని వరదారావు హోటల్లో అవి అయిపోవడంచేత అతనికి దామోదరరావు హోటలుదాకా వెళ్ల వలసివచ్చింది. అక్కడికి కోవా పుచ్చుకున్న తరవాత అతగాడు వాయువేగ మనోవేగాలమీదే బయలుదేరాడు; గాని నోరివారి యింటి దగ్గిరికి వచ్చాటప్పటికి బుచ్చమ్మ కలుసుకుంది. దానితో ప్రాణాలు ఎగిరిపోయినట్టు కాగా నిర్ఘాంతుడై పోయి అతను కదలలేక పోయాడు.

"అనుగ్రహం తప్పిన ట్టుందే?"

"............"

"మాట్లాడవేం?"

"............"

"వొద్దన్నారా యేమిటి వాళ్లు?"

"............"

"మొగం అలా తిప్పుకుంటావేం?"

"............"

"వినపడ్డం లేదుట్రా?"

"ఏం?"

"ఏం జరుగుతోం దేమిటి?"

"............"

"ఇలా చూడ్రా"

"............"

"అయిపోయింది అత్యా పని"

"............"

"ఎంతలో తిరిగిపోయిందిరా కాలం? ఏదో మందు రాశారు పెద్దమ్మవారుకి"

"............"

"నే ననుకుంటూనే వున్నాను. మాయలమారి పీనుగు లెంత పనేనా చేసేస్తారు. కాకపోతే వాళ్లిక్కడ వుండగానే నాకి గ్రహచారం రావాలా? పండువంటి సంసారం యిక కుక్కలికీ నక్కలికీ అయిపోతుంది కామోసు"

"............"

"వోరి చెవలవాజమ్మా! ఇప్పటికేనా కళ్లు తెరుచుకో. చెడిపోతు. పెళ్లాం పీనుగు చెప్పినట్లా వింటావుట్రా?"

"............"

"మొన్న నువ్వెక్కడికి వెళ్లావ్రా?"

"నువ్వు శివలేశ్వరం వెళ్లి మన్నావు కాదూ?"

"వెళ్లావా?"

"ఊ"

"ఛీ! నీ బతుకెక్కాలా! పెళ్లాం వెనకాలే బజారుకి తగులడి—ఏం పోగరు పట్టేవురా?"

"ఎవరు చెప్పారమ్మా నీకూ?"

"ఇంకా బుకాయిస్తావా?"

"నే నక్కడికే వెళ్లాను"

"ఛి ఛీ! నోరు ముయ్యి"

"............"



ఏకతార

('విశాలభారతి' కళాంకమునుండి)



తిరుత్తణి దృశ్యము

శ్రీ ఏ. నారాయణముగారు తీసిన ఫోటో.

"సరే. ఇక నీయిష్టం వచ్చినట్టు తగులడు. నాకేం? కాని పీనుగులి కెంత సాయం చేసినా బూడిదలో పోసిన పన్నీరే అయిపోతుంది"

"............"

"ఎంత కష్టపడ్డానురా నీకోసం? చివరికెంత గొంతు కోశావురా నువ్వూ?"

"............"

"వెళ్లి పోతావుట్రా?"

"............"

"ఇలా రావూ!"

"............"

"ఇప్పుడేనా బుద్ధి తెచ్చుకో"

"............"

"నేను చెప్పినట్లు వినవూ?"

"ఏం చెయ్యమంటావూ?"

"నీ నింటోకి వచ్చేదాకా వాళ్లతోటి మాట్లాడకు"

"............"

"నా మాట విను. ఆబోగం పీనుగుని స్నేలాగా కనిపెట్టమూ దాని దగ్గిర పెద్ద తప్పు కనపడీ దాకా వోపిక పట్టి తరవాత నిమిషంలో చేసేస్తాను నీకు పెళ్లి. మంచి పిల్లని తెచ్చి. బోలెడు కట్నం వస్తుంది నీకు"

"............"

"ఏమంటావు?"

"నాకు మళ్లీ పెళ్లి చేస్తావా?"

"వొక దెబ్బని"

"............"

"వెళ్లిపోతావేం? వారితో చెబుతావా యేమిట్రా యీమాటా? వోరేయ్! చలపతిగా! వోరి నీయిల్లు వల్లకాడు—వోరేయ్!"

"............"

"సరే. తగులడు. జ్ఞాపకం పెట్టుకో"

## ౧౮

చలపతిని వైగాంరోడ్డులో నుంచోపెట్టి బుచ్చమ్మ తర్జనభర్జన చెయ్యడం సోదెమ్మ చూసింది. ఆమె గోడ అవతలినుంచి పూర్ణమ్మతో చెబుతూ వుండగా ఆమాటలు జగ్గయ్య చెవిలో పడ్డాయి. గాది సావిట్లోకి తీసుకువెళ్లి జగ్గయ్య అడగ్గా చలపతి జరిగిందంతా చెప్పేశాడు. అదంతా విని జగ్గయ్య నెత్తీ నోరూ బాదుకోగా చలపతి గజగజలాడిపోయాడు.

బుచ్చమ్మ యింటికి వచ్చింది గాని మనస్సు మనస్సులో లేదు. ఆ రాత్రి ఆమె తిండి మానేసి ఆపాద మస్తకమూ ముసుగుతన్నుకుని కడుపులో కాళ్లు పెట్టుకుని పడుకుంది.

మన్నాడు పొద్దున్న యింట్లోకి వచ్చింది; గాని ఆమెతో యెవరూ మాట్లాడలేదు. అంతా కట్టు కట్టినట్టూ వెలివేసినట్టూ కనపడ్డారు. చలపతి వొకమాటు గదిలోకివెళ్లి జోగమ్మతో గుసగుసలాడి వస్తూ వుంటాడు. పూర్ణమ్మ వంటింట్లోకీ వెంకటాచలం వీధి గదిలోకీ, అతన్ని పిలుస్తూ వుంటారు. మధ్యమధ్య జగ్గయ్య గాదిసావిట్లోకి తీసుకు వెళ్లి యేవో అడుగుతూ చెబుతూ వుంటాడు. ఇలాగ యెటుచూసినా గుసగుసలు ప్రబలిపోవడంచేత బుచ్చెమ్మ కేదో బెంగ పట్టుకుంది. గుసగుసశబ్దం కొంపకి నష్టం అన్నమాట ఆమెకి తెలుసు; కాని అది యెవరిమీద విరుచుకుపడి పోతుందో.

భోజనాల వేళ బుచ్చమ్మ తాను కూడా పురుషులతోటే కూచుంది. పూర్ణమ్మ నెయ్యి వడ్డిస్తూ "అన్నయ్యగారూ! రాత్రికి నెయ్యి తేవాలి" అని జగ్గయ్యతో చెప్పగా జగ్గయ్య చలపతితో చెప్పాడు. దానికే బుచ్చమ్మ ధుమధుమ లాడుతూ వుండగా జగ్గయ్య తనకి యేవూళ్లో యెంతెంత భూము లున్నాయో, యేభూమిమీద యెంతెంత శిస్తు వస్తుందో—ఇదంతా చెప్పడం మొదలుపెట్టాడు వెంకటాచలానికి.

బుచ్చమ్మ కిదంతా వప్పగింతలు లాగా, ఇక తన ఆవాహనా, విసర్జనా లేనట్టూ కనపడింది. పూర్ణమ్మ అది కావాలా, యిది కావాలా అని యేం వడ్డించడానికి వచ్చినా సంజ్ఞలతోనే భోజనం ముగించి బుచ్చమ్మ లేచిపోయింది.

## ౨౦

బుచ్చమ్మకి అంతా బోధపడింది. ఇది వరకి తాను రాజ్యం చేసిన యింటో యిక ముందు కూలిపని చెయ్యాలని గ్రహించింది. వొక్కమాటు కళ్లు తిరిగి పోయాయి; గాని వెంటనే ధైర్యం తెచ్చుకుని తనబట్టలు సద్దుకోవడం మొదలు పెట్టింది.

ఇదంతా కనిపెట్టి వెంకటాచలం పూర్ణమ్మతో చెప్పాడు. పూర్ణమ్మ జోగమ్మతో చెప్పింది. జోగమ్మ చలపతితో చెప్పగా చలపతి జగ్గయ్యతో చెప్పాడు. ఇదంతా యిలా అయ్యేటప్పటికి తన సంగతి అందరికీ తెలిసిపోయిందని బుచ్చమ్మ గ్రహించేసింది.

యథాపూర్వంగా వియ్యంకులిద్దరూ వాకిట్లో కవాచీబల్లమీద కూచున్నారు. జోగమ్మ యేదో వూదగా చలపతిగూడా వాకిట్లోనే పడకకుర్చీలో కూచున్నాడు. "పని తరవాత చేసుకోవచ్చు" అనుకుంటూ పూర్ణమ్మ వంటింటో నుంచుని తొంగిచూడడం మొదలుపెట్టింది. జోగమ్మకి యెప్పుడూ తీరుబడే కనక ఆమె గదిలో మంచంమీద కూచుని యేమిటో ఆలోచిస్తోంది. ఎక్కడా యేమీ చప్పుడేనా కావడం లేదు.

ఇలాంటప్పుడు బుచ్చమ్మ మూట చంకని పెట్టుకుని మెల్లిగా వాకిట్లోకి వచ్చి నుంచుంది.

"అదేమిటే అమ్మాయీ?"

"నాయింటికి వెళుతున్నాను నాన్నా"

"ఎందుకూ?"

"ఇక్కడేం వుంది నాకూ?"

"ఇప్పుడేం వచ్చిందీ?"

"నన్నడగవద్దు. అంతా నీకే తెలుస్తుంది ముందు ముందు"

"ఎప్పటికప్పుడే తెలుస్తోంది నాకు వున్నదంతానూ. నీ ప్రయాణానికి కారణం యేమిటి?"

"తెలిసివుండి అడగడం యెందుకూ?"

"సరే మరీ! ఇంతవరకూ వచ్చాక ఇక బతిమాలితే మాత్రం నువ్వు వుంటావా యేమిటి? బతిమాలడానికి నాకు సిగ్గుతనం వుందా."

'ధారపోసుకుంటే యెలా వుంటుంది?"

"అదా సంగతి?"

"ఏది యేమయిపోతే నాకేం? నేను వెళ్లిపోతున్నాను"

ఇలా చెప్పి బుచ్చమ్మ వొక్క అడుగు ముందుకు వేసింది.

"అయితే తాళాలు ఇచ్చెయ్యి మను నాన్నా"

"............"

"అడగవేం నాన్నా?"

"వినపడిందిటే అమ్మాయీ?"

"పుచ్చుకోండి; నా కక్కర్లేదు"

ఇలా అని గుత్తి మండువాలోకి గిరవాటు వేసి బుచ్చమ్మ ముంగుకు మళ్లీ అడుగువేసింది.

వెంటనే పూర్ణమ్మ తటాలున యివతలికి వచ్చి ఆమె కడ్డంగా నుంచుంది. "వెళ్లిపోవడానికి యేం కారణం వచ్చిందీ?" అని వెంకటాచలం అడిగాడు. ఇది మాని బాగుండదని జగ్గయ్య మాట లాక్కోపోయాడు; గాని ఆమె అందర్నీ విదిలించి కొట్టి "అంతరిపాలూ పొంగాయికదా" అంటూ బలవంతాన మూట విడిపించుకుంది.

జగ్గయ్య వెనక్కి తగ్గి "పోనివ్వండి" అనగా, వెంకటాచలం "తొందరపడకు సుమా" అన్నాడు. పూర్ణమ్మ కూడా యేదో అనపోయింది; గాని బుచ్చమ్మ వినిపించుకోకుండా "ఎంతలేని మంతలేనా వున్నాను భూమ్మీద.....నా వుసురు తగలదూ? ఈ పీనుగులు ముందుకి

 

వస్తారా ?" అంటూ వొక్క గంతులో వీధిలోకి వెళ్లి పోయింది.

వాకట్లో యీనాటకం యిలా జరుగుతూ వుండగా చలపతి గదిలోకి వెళ్లి "మాసుకో నామజా" అంటూ అమాంతంగా జోగమ్మని యెత్తి పడేసి వాకట్లోకి వచ్చావచ్చాడు.

౨౧

తరవాత మంచువాలో వున్న తాళాల గుత్తి తీసి కడిగి, తుడిచి, మొలలో పెట్టుకుని "రంగి భావగారూ?" అంటూ జగ్గయ్యగారి పావిట్లోకి దారితీశాడు. "ఎంత పని చేశింవోయి మీ అక్కా?" అంటూ గుగ్గమీద చెయ్యి పెట్టుకుని పూర్ణమ్మ చలపతిని పరామర్శ చేసింది.

జోగమ్మ యెగిరెగిరిపడుతూ మూద్దగ్గిరికి వెళ్లి "అక్కయ్యగారూ! నేను రమ్మన్నప్పుడు వస్తానన్నారు మీరు. తొరగా—నుంచున్న పళంగా రావాలి" అని చిటికెలు వేస్తూ పిలిచింది.

"ఏంకధా ?"

"భామ వెళ్లిపోయింది"

"ఎక్కడికీ ?"

"అత్తారింటికి"

"ఏం ?"

"చెబుతా నలా రండి తొరగాను"

---

# ఆ వే ద న

తుమ్మలపల్లి నరసింహారావుగారు

ఏ నగమందొ మున్ను వసియించెడివాఁడను: ప్రేమ చూపి న
న్నే నరుఁ డింత చేటు పరికించి యొసంగఁ; డిదేమికర్మ? మీ
లో నెటనుండి వచ్చె నసువుల్ తినివేయఁగ, మాయదైవమా?
కే నేఁడు పొట్ట పోసికొన సిగ్గు దొలంగుద రొక్క మానవుల్?

ఈపోఁగాల మిదేమి వీరలకు?—పోనీ! వెంటనే చంపి, యే
దో, పుణ్యంబు రవంత కట్టుకొనరాదో? ప్రేవులన్ మాఁడ్చి న
న్నీ పాట్లన్నియుఁ బెట్ట నేమిటికి? నాకీ పంజరం బేల? ఆ
టోపంబింతయు నేల? ఈడగు నిదెట్లో మావిపై గూటికిన్?

నాపలలం బిసీ! యెటు తినంగలవారలొ వింత యయ్యో! న
న్నాపసికైన బంధనమునం దిడఁగాఁ దమ కేమి పుట్టె? లే
దా, పలుమాఱు నాకుశల మారయుచుండఁగ హేతు వేమి? పీ
రీపగిదిన్ ననుం బెనుప నిచ్చఁ దలంచిరొ ప్రీతి చూపునన్?

నన్నిటు ముద్దుగొందు రిది న్యాయమె యీ చపలాత్ము? లింతసి
గ్గన్నది లేదె వీరి కకటా! పలుపోకలఁ బోవుచున్న నా

చెన్నొకర యింత చూచి, తమిచే ననుఁ దేరఁగ వీర పంచిరో
క్రన్ననఁ బూరుపాళి?—తనకాంతకుఁ దార్పు డెవండు నల్పెడిన్?
ఎంతో ప్రేముడి యున్నవారివలె వీ రిపండ్లు నీభత్క్యముల్
సంతోషంబునఁ దెచ్చి యిచ్చెదరు నాస్వాంతంబు మెప్పింప: నీ
గంతల్ బొంతలు వీరి కీడగును, నాకా? సర్వకాంతారభా
స్వంతుండన్, సహకారపల్లవనిజేచ్ఛాభోగినౌ రాజునే!

సేమము దయ్యమే యెఱుఁగు; చింత దొలంగుట వట్టిమాట; నా
కామిని యెందుఁ ద్రిమ్మరుచు గాసిఁబుచున్నదొ చెప్పువారు లే
రే! మనవాఁ డనంగ నిట నెవ్వఁడు గానఁ బడండు; నోటి మా
టా? మఱి కాంతఁ జూతు నెటు, లానుడ లున్నది దూర మక్కటా!

తెలతెలవాఱుచుండఁగనె తియ్యనిమామిడిపిండె లేరి, వేల్
పలుకుల నన్ను మేల్కొలిపి, బమ్మెరవోయిన బుజ్జగించి, నా
యలుక యొకింత దీర్చి, కడు నాఁకటి చిచ్చున నేడ్చుచున్న బి
డ్డల నఱగంటఁ జూచి యకటా! నను దేర్చెడి కాంత యేదిరా?

పం డొకయింత దాఁ గొఱికి పం డ్లికిలించుచు, నాసతోడఁ గూ
ర్చుండిన నన్ను గన్గొని 'యిదొక్కటి యెంగిలి సు' మ్మటన్న, నో
రెంచిన నేను నవ్వఁ, గను లించుక మూయుచు నింపుప్రీతి నా
దండను జేరి వచ్చినయెడన్ నను గ్రుచ్చు నెంత యేదిరా?

వలవల యేడువం దుడకు వచ్చెడిలాభము సున్న; ఊరటన్
గలిగిన నెంత మేలు గద? కామిని పోయినఁ బోయెఁ బో; యిఁకన్
వలపులబిడ్డ లెండ ఱిటు వమ్మయిపోయిన లెక్క యేమి? నే
నిలపయిఁ బుట్టినప్పుడ లభించిన స్వేచ్ఛ యదెందుఁ బోయెనో?

చల్లసికొండగాడుపులు చచ్చినప్రాణిని లేవ నెత్తు; ను
త్ఫుల్లసరోజ సంచయ విభూషితముల్ సరసుల్ విదుర్చు నా
మెల్లనిపిల్లతెమ్మెరలు మే నవశత్వము నొందఁజేయు; నీ
యిల్లిది యేమి? వాయువును హేయగవాక్షమునందు బద్ధమా?

———

చూసుకుని, ఈసారి తీసెయ్! ప్రారంభించడానికి పూర్వం తెల్లబోయి మాట్లాడుతూ కూచుని స్తోత్రం పాడు చేసుకోక, అంతులేని మిఠాయి వస్తురాలు రుచిమూచి, పేచీ పెడ్తే, వడ్డించలేదను. జలపానానికి కూడా పలా క్రమంగానే ఉంది గనుక, భోజనం పూర్తికాందే, ఉదకం తాగకు. తరువాత ఎక్కడేనా ఇంకోరింట్లో కాబోతే విందు చూపు మేరలో ఉంచే తిప్పు, పప్పు 'డబుల్ డోస్' చెయ్యి. కొండొకచో మాగాయి టెంక వడ్డించినట్టయితే, వెంటనే వస్తుగ తెప్పించి అందులో అది ప్రప్రథమాన్నే నాకెయ్. ఆ పెలు వడ్డించేటప్పుడు దిక్కులు చూస్తూ కూచోక అవి దధిసహితంగా పడ్డాయో లేదో, సరిగా పడ్డాయో లేదో గమనించు."

అంటే మాతమ్ముడు, "సరిగా పడ్డం వేమిటి? నాకు తెలియనట్టు చెబుతావేం అన్నయ్యా!" అన్నాడు.

"సరిగా అంటే సరిసంఖ్యలో, అనగా, రెండు, నాలుగు, ఆరు ఇల్లా పడవలసినవే గాని అవి, బేసిగా పడకూడదు. అవి కొంచెపరకు ముప్పటికి, వడ్డించేవాళ్ళ దగ్గిరకి పిల్చి, చెవులో చెప్పు, "పూర్వాశ్రమం" తెప్పించండీ అని. "పూర్వాశ్రమం అంటే ఏమిటన్నయ్యా!" అన్నాడు మావాడు. "ఎంత సత్తెకాలంరా నీది. పూర్వాశ్రమం అంటే కారప్పూసరా. ఇంకా తెరుగులో పడటప్పుడు అదేగా మరి గాని జన్మ! అది అందిన వెంటనే మరోమారు వడ్డించేవాళ్ళ పిల్చి (మొదటివాడే అయితే దిష్టి తగల్చు) "నిజస్వరూపం" పట్రమ్మను అది కారంలేని అసలుగారె. క్షీరాన్నం పట్రాగానే ఎన్నడూ వడ్డించుకోకు. తెచ్చిన గోకర్ణం లోది చాలా భాగం అయిపోయిన తరువాత, మిగిలిపోయినదాన్ని నీ విస్తట్లో పోయించమను; అప్పుడే నీకు ఉడిపప్పు వగైరా గంభీర సామగ్రి దక్కుతుంది."

మావాడు—ఒకవేళ పైవి అవేళ చెయ్యకపోతే.

నేను—ఏదో ఓటి చెయ్యక మానరు. లడ్డూలు చేస్తారనుకో. ఏంచేస్తావు?

మావాడు—అమాంతంగా తినెయ్యడమే.

నే—ఏడిసినట్టే ఉంది. అవి ముందు నేతివో నూనెవో పోల్చాలి. అందు నిమిత్తం, అవి చిదిపి వాటిల్లో నెయ్యి వడ్డించమనకో. ఆమిఠాయి నేతిదా, నేతి మీద నెయ్యివుంచిది, నేరి లేదు. కాక అది నూనెదా, నెయ్యి కలిసింది గనక నాసన కొడుతుంది, విసర్జించు.

మావాడు—నాకు అట్టే సయించదన్నయ్యా?

నే—రీతి తెలియనప్పుడు వినోరి!

"ఎప్పైనా తీపిసరుకు ప్రత్యేకంగా తినడం పాపం. అది ఎప్పుడూ పకోడీలాంటి కారపుసరుకుతో చేరి సహాయిస్తావేలో లాగ లాగించేసిందే."

మావాడు—ఏమో! కారమే ఎక్కువ తినాలని నా ఉద్దేశం!

నేను—"నీ ఉద్దేశం ఎవడికి కావాలిరా, ఇందులో ప్రవేశమేనా లేనివాడికి! కృష్ణుడి ఉద్దేశంగా అదీ! సుఖం అనగా, తీపేనా? దుఃఖం అంటే కళ్లమ్మట నీళ్లు గనక, కారమేనా? అయితే విను. సుఖదుఃఖే అనగా తీపికారాలు రెండున్నూ అనగా లడ్డూ పకోడీలు రెండున్నూ, సమే కృత్వా అనగా రెండు సమరాసులుగా ఇదంతో అదంతో చేసి, లాభాలాభౌ అనగా లడ్డూలలో ద్రాక్షలు గాని పకోడీలలో ఉల్లిపాయలు గాని లభించినా లభించకపోయినా, జయాజయౌ నీకు చాలా సయించినా సయించకపోయినా ఏలించక ఏకరుతో ఉండి, తరువాత, యుద్ధాయ అనగా లడ్డూపకోడీ లరాయిని, యుజ్యస్వ అనగా తగూరు కాపోదప అబ్బాయి! నైవం పాపం అవాప్స్యసి అనగా ఇల్లా చేస్తే నిన్ను ఏమంత్రైనా పాపం ముట్టుగోదు—అని."

మాతమ్ముడు—నాకు చాలా చాలా వడ్డించమని అడగడం సిగ్గు అన్నయ్యా!

నేను—అప్పుడు నువ్వు వడ్డించే ఆయనతో, "ఇల్లా ఒక్కరవ్వ విదపండి" అని విస్తట్లో వేలు పెట్టి చూపించి, వేలు అల్లానే ఉంచి, ఒరిగి పక్కపంక్తిలో ఉన్న ఎల్లయ్యగారితో రాచకార్యం ఉన్నట్టు పెద్ద వాక్యం మాట్లాడుతూండు. కావలసినంతా పడ్డవయినం

కీగంట గమనించి, అప్పుడు నువ్వు సరిగ్గా తిరిగి వడ్డించే వాడిమీద తమాషాగా ఖస్సుమను. వడ్డన ఆలస్యం ఎప్పుడేనా అయితే, ధప్పళం ముక్కలు పరామర్శించు. అందుకనే అవి పెద్దసైజులో ఉండడం. వీలైనప్పుడల్లా "రెడ్ విత్" చేస్తూండు—అనగా మిశ్రమం. ఒకవేళ పచ్చిమిరపకాయ తెప్పించి ఉప్పులో అద్ది పప్పులో కొరకచ్చు. ఆపనినే పప్పులో పచ్చిమిరప 'రెడ్ విత్' సాల్ట్‌యాక్టు అంటారు. అల్లాగే పప్పు రెడ్ విత్ ధప్పళం! మా ప్రెసిడెంటుగారు ఇల్లాంటి నూతన దాంపత్యాలు అనేకం కనిపెట్టి ప్రపంచానికి కళ్లు తెరుస్తూంటారు. జిలేబీ విశేషంగా తినేటందుకు వీలు ఏర్పడడానికి వారు జిలేబీ-రెడ్ విత్-మజ్జిగపులుసు! అనేది స్వానుభవం మీద కనిపెట్టారు. అన్నట్టు మరిచిపోయాను. చేతికి చాలా జిడ్డు పట్టుకుంటే వీలునుబట్టి కాళ్లకో గడ్డానికో పట్టించు."

ఈరీతిగా, పెద్దలవల్ల విని, మావాడికి భోజనోపదేశం చేస్తున్నాను. ఉపదేశం ఆచరణలోకి రావడం మాటలే! దేశం ఆచరణలోకి వస్తే, ఉపదేశమూ వస్తుంది.

౨. (..........)

3. సంగతులు.

(౧) ఒకానొక జైలులో ఉన్న ఒక ముగ్ఖైదీని చూడడానికి అనుజ్ఞ కోరుతూ, ఆఖైదీ పెళ్లాం దరఖాస్తు చేసింది. అనుజ్ఞ కాలేదు. కొన్నాళ్లకి ఆఖైదీయొక్క స్నేహితుడు ఒకాయన ఖైదీని చూడడానికి దరఖాస్తు చేశాడు, అనుజ్ఞ ఇచ్చారు, చూశాడు. మళ్లీ కొన్నాళ్లకి ఆఖైదీ భార్య చూడడానికి అనుజ్ఞకోసం దరఖాస్తు చేసింది. అనుజ్ఞ ఇచ్చారు కాదు. మన్లోమనమాట, రెండోసారి వెళ్లి చూసినమొగాడు, ఆవిడేట! శేషం! పగలుట!

(౨) 'బొంబాయిలో పగటి చుక్క కనపడింది'ట. అది అసలు చుక్క. తెల్లారకట్ల వచ్చేచుక్కని చాలామంది ఎరగరు. వాళ్లు అసలు తెల్లారకట్ల అనేది చూడరు. ఆచుక్క కాంతికి నీడ ఉంటుంది. అది సాలుకి రెండుసార్లు పైచిలుకు అల్లా పొడుస్తుంది. ఆకాలంలో అది సూర్యోదయం తర్వాతగుడా కనిపిస్తుంది. ఈవేళ ౧౦ గంటలకి నే చూశాను.' అని మా విలేఖరి వ్రాశాడు. పగటిచుక్కకి ఇంతపట్టింపు ఎందుకన్నాడు ఒక ద్రావిడ ప్రియుడు.

(౩) 'లాటీ' అనే జంతువుయొక్క జననాభివృద్ధి క్రమాలగురించి రిసర్చి చేసి పర్యవసానం తేల్చడానికి ఒకచోట ఒకకమిటీ పెట్టారు. ఆకమిటీవారికి పాసగశ నారు రెండింటికింద చీలిపోయారు. ఒకరు ఇంగ్లీషునా ఒకరు తెలుగునా ఆలోచించారు. ఇంగ్లీషు ఆలోచనపరులు అన్న దేమిటంటే,

"లాటీ అనే దాన్లో ఉండుకున్న వస్తుతత్త్వం కర్ర—అనగా ఇంగ్లీషులో 'వుడ్'. ఈ 'వుడ్' ఉన్న ప్రదేశమే లాటీయొక్క జన్మస్థలం. ఈ 'వుడ్' ఎక్కడెక్కడ ఉందంటే—సెడ్జ్‌వుడ్ బెన్ను అనే పేరుగల ఇండియామంత్రిలోనూ, H. E. ఎడ్వర్డు ఫ్రిడరిక్ లిండ్లేవుడ్ అనే స్వంతపేరుగల రాజప్రతినిధిలోనూ, H. E. బర్డువుడ్ అనే పేరుగల్గి వెళ్లిపోయిన ప్రధాన సేనానిలోనూ, ఉంది. ఆమాటకొస్తే, H. E. చెట్ వోడ్ అనే పేరుగల ప్రస్తుత ప్రధాన సేనాని పేరులో కూడా చాలాభాగం ఉంది.

ఇక తెలుగు కమిటీవారిలో కొందరు చెప్పిందేమిటంటే, ఆలా ఈలా కాకుండా సిసలైన తెలుగు "లా" అనేదానికి "టీ" పార్టీపదమైనప్పుడు, ప్రయోగరీత్యా 'లాటీ' సిద్ధిస్తుంది—అని.

మరికొందరు అది అసలు 'లాఠీ' గాని 'లాటీ' కాదన్నారు. అనగా లాఠీ అనేది, తీ=తీసేయ్ అని. అంటే నీ లా తీసేస్, నా లా తీసొక్క—అని అన్వయించారు.

(౪) ఒకమునిసిపాలిటీలో ఉండే చాలానూతుల్లో మూడు నాలుగుమాత్రమే అప్పట్నించోద్దీ బాగుపడ్డాయి. ఎందుచేతంటే, వాటిల్లో మనుష్యులు పడి చచ్చిపోడం మూలాన్ని నీళ్లు తోడించేసి, బురదా, మరి లోగడ పడిపోయినవాళ్ల ఎముకలూ వగైరాలు పైకి లాగించెయ్యడం చేత. తక్కిన వాటిల్లోగూడా ఎప్పుడు మనుష్యులు పడుదురా, ఎప్పుడు అవి బాగు చెయించి పుణ్యం కట్టుకుందామా అని మునిసిపాలిటీవారు కుతూహలపడుతున్నారు

నిరీక్షిస్తున్నారు. పురుషుల్ని తీసెయ్యండి; స్త్రీలైనా నడుం కట్టి ముందుకి అంగ వెయ్యరా అని వారి ఆశ.

(౫) ఓ పట్టాన్ని ఏ ఉద్యోగమూ కాని ఈ టైములో, చాలామందికి, అయాచితంగా, సర్వవిపత్తులు లేకుండా, ఆశ్రయింపులూ, సిఫారసులూ, లంచాలూ లేకుండా అవడం గొప్ప శుభసూచన. ఎవీ అంటే, మన సెన్సస్ ఉద్యోగాలు, కొందరు ఇంగ్లీషు తిన్నగా రాకపోయినా, 'జనాభా లెక్కలు' అని వాడితే తేలికగా ఉంటుందని, ఏ తప్పుడుగానో ఇంగ్లీషే వాడుతూంటారు. 'మీకు సెన్సస్ ఉన్నాయిటండీ?' అని కొందర్ని అడుగుతూంటే అవతలవారు 'లేవండీ' అంటూండడం విని పిస్తూంటుంది.

(౬) ఆర్. టి. సి. (R. T. C.) యొక్క (అనగా రాజమండ్రీ ట్రైనింగు కాలేజీ కాదు, రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సు) ధోరణి మాస్తే అది మాంచి రసకందాయపట్టులోనే జరిగింది. ఆరసంయొక్క వయినం:— అక్కడికి స్త్రీలనికూడా పిలవడం, అదో కళ్యాంగారం. ఒకళ్లు వెడతారనుకున్నది మరొకళ్లు వెళ్లడం హాస్యం. ఒక అఖండుడు మరణించడం కరుణం. ఇండియాకి ఇంకా ఏమిచ్చారో తెలియకుండానే, అంతా ఇచ్చేసేవా అని మెక్డొనాల్డుగారికి చర్చిల్ కంపెనీవారు కోప్పడడం, రౌద్రం. ఇంగ్లండులో లెఫ్టు వింగు లేబరైట్లు చేస్తూన్న ప్రయత్నం వీరరసం. ఆ సమయంలోనే, కర్మిన కాత్తు కొందరు తీసుకుంటూన్న చర్యలు భయానకం. ప్రజల్లో కొందరిస్థితి బీభత్సం. సైమన్ జట్టు వారి పంచాంగం మూలపడేశాం అని పైకి అని, అందులో చెప్పిన ప్రకారమే క్రియలు జరపడం, అద్భుతం. జనకనించీ ఇండియాలో కోరుతూన్నదీ, ప్రస్తుతం ఇంగ్లండునించి వారు కోరుతూన్నదీ శాంతం.

(౭) ఓ పెద్దమనిషి ఓ అబ్బాయికి ఓ పెళ్లిసంబంధం తప్పించెయ్యాలని బయలుదేరి, వాణ్ణి నిరసిస్తూ, పిల్లనివ్వదల్చిన ఆయనదగ్గిర ఇల్లా అన్నాడట:—

అయ్యా! మీరు పిల్లనివ్వదల్చిన వాడికి 'మిరామాలా బులా' అనేపాటకుడా రాదు. వాడు గణితశాస్త్రం ఎరగడు. వాడు తెలుగు క్లాసులోకుడా అల్లరి చెయ్యలేడు. వాడు ముందు ముందుకి మేష్టరీ ట్రైనింగుకైనా పనికిరాడు. అతణ్ణి రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సుకైనా పంపడానికి వీల్లేదు, చివరికి.

(౮) ప్రస్తుతం ట్రేడ్ డిప్రెషన్‌లో ఉన్నాం, అనగా వర్తకమాంద్యం, అంటే డబ్బుకాటకం. దేనికైనా సరే సమాధానాలు చెప్పి పారెయ్యడానికి ఇది ఓ పెద్దకారణంకింద ఏర్పడింది. ఈమధ్య ఓ కుర్రాణ్ణి "ఏం అబ్బాయి, లేటుగా వచ్చావేం?" అని మేష్టరు అడిగితే, "ఏం లేదండి. ట్రేడ్ డిప్రెషన్‌గదా!" అన్నాట్ట. మేష్టరు "అప్రస్తుతంగా మాట్లాడక సరియైన సమాధానం చెప్పు!" అన్నాడట అంటే కుర్రాడు, "నిజమేనండీ, సార్! ఇదివరకు చేతుల్లో డబ్బాడుతూంటే జట్కామీద వచ్చేవాణ్ణి, ఈ వేళ నడిచి వచ్చాను, లేటయింది" అన్నాట్ట. తనరాబడిని బట్టి చూసి, "డబ్బుకాటకంవల్ల, రోగాలు తగ్గిపోయినాయి" అన్నాడు ఓ డాక్టరు. "రోగాలసంఖ్య తగ్గలేదు! డబ్బుకాటకంవల్ల రోగాలు ఇంటిదగ్గిరే కుదిరిపోతున్నాయి" అని వారి స్నేహితుడన్నాడు. దీనికి కారణం, పదణాలనించీ మాత్రమే గల మన రూపాయే అని కొందరంటారు. కొందరు, అసలు ఈ తెగులు ప్రపంచానికే వచ్చింది, ఇండియాకిమాత్రమే కాదన్నారు. కొందరికి ఈ సంగతి ఇల్లా వస్తుందని అయిదేళ్లకిందటే తెలుసుట, మనతో చెప్పారట, మనం వినిపించుకోలేదు. ఏమైతేం? వస్తువు ఉన్నవాడినోట్లో మట్టి. ఈ మధ్య ఓ ఆయన క్షౌరం చెయించుకుని మంగలాడికి పదహారు కొబ్బరికాయలు ఇచ్చాడు. ఋణదాతలు ఋణస్థుల్ని నిక్కచ్చి చేస్తున్నారు. అందుచేత ప్రస్తుతం అన్నీ చవక అయినట్టే, దివాలాలుకూడా చవక అయినాయి. ఇదివరలో కొన్నేసి వేలకే దివాలాలు గాని, ఇప్పుడు కొన్నికొన్ని వందలకే. టంకసాలల్లో రూపాయిలు కొట్టించి దేశంమీద చిమ్మితే డబ్బుజబ్బు కుదురుతుంది అని ఒకాయన అన్నాడు. కొందరు, మాస్తూంటే సరి, ధరలు వాటంతట అవే పెరుగుతాయి అన్నారు. అని "ధర తగ్గుట హెచ్చు కొరకే" అనేది ప్రమాణంగా ఇచ్చారు.

(౯) ఆంధ్రా యూనివర్సిటీ స్థలనిర్ణయం రెండింటితో బయల్దేరి, మూడు మించి నాలుగులోకి వెళ్లింది. నాయకత్వానికి పోటీ ఇద్దరితో మాత్రమే బయల్దేరింది. ఇదికూడా ముగ్గుర్లోకి వెళ్లిందా, నలుగుర్లోనూ పడిందన్నమాటే!

(౧౦) ఒక పల్లెటూరిశాస్త్రుల్లుగారు, పట్నవాసపు చుట్టంతో మాట్లాడుతూ:—

శా—చూడండీ! శారదాభిల్లుడుగారు సులాసాగా ఉన్నట్టా.

చుట్టం—ఆ. ఏం?

శా—ఆయనది మహాగొప్ప ముందుచూపు.

చు—ఏం? ఎల్లా కనిపెట్టారు?

శా—ఆయన అప్పుడు శాసనం చెయింనకపోతే, అన్ని పెళ్ళిళ్లు అప్పుడు జరిగి ఉండవు. అప్పుడు గనక జరిగి ఉండకపోతే, ఇప్పుడు, డబ్బు కాటకం మూలాన్ని అసలే జరక్కపోను.

చు—చిత్తం. ఏమిట సెలవు.

శా—ఆయన గట్టివాడే!

చు—తమరి అనుగ్రహం!

(౧౧) ఇండియాలో డబ్బు కాటకం గురించి ఆలోచించి, సలహా చెప్పడానికి "సాల్టరు" దొరగారు వచ్చారు. ఇంతమంది ఉండగా 'సాల్టరు'వారే ఎందుకు వచ్చారంటే! ప్రజల్లో తగాదా ప్రారంభం "సాల్టు"తో అయింది గనక ప్రభుత్వంవారు ఓ డిగ్రీ పైన ఉండడాని "సాల్టరు"గారిని పిలిపించారు.

(౧౨) షణ్ముఖం అనే ఆయనకి ఈమధ్య లాటీ దెబ్బలు తగిలాయిట. అతనిమీద పోలీసువారు అక్రమ సంఘం (అన్‌లాఫుల్ ఎస్సెంబ్లీ) నేరం మోపారట. అతనొక్కడే ఉన్నాడని పోలీసువారు కూడా ఒప్పుకున్నా, అతనిపేరులో అయిదుకంటే ఎక్కువ ఉంది గనక అతనిమీద ఆ కేసు పెట్ట వలిసొచ్చిందని సెల విచ్చారట.

సెలవ్.

---

# లాస్యతృష్ణ

శ్రీ. శ్రీనివాసరావు గారు (కవితాసమితి)

కడలి కెరటాల శ్రుతిలోన కలసి మెలసి
గగన గంధర్వ గానరాగములు మ్రోయ
తూర్పు దిక్కున పూర్ణిమా తుహినకరుడు
తరళధవళ విలాస నర్తనము తెరచె.

ఈ విశాల సమగ్ర వాతావరణము
కాంతి తంత్రీ సుధామృదు గానగీతు
లెగయు జగదీశ్వరాంఘ్రి మంజీర నటన
మటు లనంత లీలా నాట్య మభినయించె.

తారకలు లేని స్వచ్ఛ సౌందర్యబంధు
రాంబరాంగణ మొక ధవళాంబరి వలె,
అమృత వారాశి వలెనె చరాచరముల
కిడెను తనదివ్యలాస్య సాహిత్యరుచులు.

ఇది జలధినాథు నెదలోన నిముడలేని
ఎదురు లేని మహా సౌఖ్యమే మొ—శీత
వీచికా మేదుర తుషార సేచనమున
ఆకసము నంటుకొ ప్రాకులాడు నితడు.

ఉరలువా నా ఎడంద ఈ దొరలు తరగ
లం దొక సుధాంశుకిరణమై, హర్ష గాన
కలకల శ్రావ్య నినదము లొలయుచున్, న
వీన ఫేనద్యుతులలోన లీనమగుచు.




భ ట్రా జు

వెంకి వాళ్లమ్మతోకూడా లేచి అప్పుడే మొహంకడుక్కొంది. సూరీ సీతీ మరి రవంత సేపటికి లేచారు. ఇద్దరూ చెంబూ పుల్లా పుచ్చుకొని దొడ్లో కబుర్లు చెప్పుకుంటూ పళ్లు దోముకొని మొహాం కడుక్కొన్నారు.

వాళ్లమ్మ ముగ్గురికీ పెరుగేసి చద్దివణ్ణం పెట్టింది. "నాకు ఆవకాయ నంచుకోవడానికి కావా" లని సూరి అంది. "నాకు రాత్రి చేసిన గోంగూరపచ్చడి కావా"లని సీతి అంది. "నాకేం, నాకేం, గోంగూర కావాలి" అపి వెంకి అంది. అందరూ నవ్వారు. "గోంగూర తింటారుటే వెంకీ" అంది సీతి. "పచ్చడి తినరా ఏమిటమ్మా" అంది సూరి. "పత్తడి" అంది వెంకి. వాళ్లమ్మ రొంత గోంగూరపచ్చడి ముగ్గిరికీ వేసి తినమంది. ముగ్గురూ గబగబ తింటున్నారు.

"నిమ్మళంగా తినండి, గొంతుక పడుతుంది" అంది వాళ్ల।మ్మ.

"ఈవాళ సూరిమీద నే సొడ్డేస్తాను" అంది సీతి.

"సీటమీద నే సొడ్డేస్తాను" అంది సూరి.

"నేనేత్తాను సొద్దు" అని వెంకికూడా గబగబ తినడం మొదలెట్టింది. కాని వెంకికి పలకమారి దగ్గు వచ్చింది.

"నే చెప్పలేదూ, నిమ్మళంగా తినముృ" అంది వాళ్లమ్మ.

సూరి ముందస్తిగా తినేసి లేచింది. సీతి ఇంకా అన్నం ఉండగానే లేవబోయింది. కాని వాళ్లమ్మ కోప్పడి కూచోబెట్టి మిగిలిన అన్నం తినిపించింది.

"సీతి మీాద సొడ్డు. వెంకి మీాద సొడ్డు. సీతి మీాద సొడ్డు. వెంకిమీాద సొడ్డు" అంటూ నవ్వుతూ సూరి అంటచెయ్యి సీతి కంచం పక్కా వెంకికంచం పక్కా తిరగా మరగా అద్ది లేచి పెరట్లోకి వెళ్లింది.

"చూడవే అమ్మా మరి. నామీాద సొడ్డుట" అంది సీతి.

"సీతి మీాద సొడ్డోయి ఓయి ఓయి" అంది మళ్లీ సూరి.

"రాత్రి నీమీాద సొడ్డేస్తానుండు" అని సీతి లేచి ఎంగిలిచెయ్యి నాకుతూ వొడ్లోకి వెళ్లి చెయ్యి కడుక్కొంది.

వెంకికూడా అన్నం తిని లేచి, "సూలిమీాదా సీతిమీాదా సొడ్డోయి" అంటూ వెళ్లి చెయ్యి కడుక్కొంది.

ముగ్గురూ కలిసి వెళ్లి నడవలో కూర్చున్నారు. సూరి రెండోతరగతి వాచకమూా సీతి ఒకటో తరగతి వాచకమూా వెంకి పలకా పలకపుల్లా పట్టుకు కూర్చున్నారు.

సూరి పుస్తకం జాగ్రత్తగా అట్ట వేసుకొంది. కొత్తబట్టలమీాది బొమ్మలు అట్టలమీాద అంటించుకొంది. పుస్తకంలో ఒక నెమలి కన్నూ దాని దగ్గిరే పువ్వారమూా పెట్టింది. "సీతోయి. చూడవే చూడవే. ఈ నెమలి కన్నే ఎంత పువ్వారం తినేసిందో. ఒక పిల్లనైనా పెట్టదు—పాడు" అంది సూరి. సీతి తనపుస్తకంలో నెమలికన్నున్న పేజీ తీసి,

"నా పువ్వారం కొంచెం తింది నా నెమలికన్ను. చూడే, అక్కా చూడే, ఎంత చిన్నపిల్లని పెట్టిందో! చూడే ఒసే," అంటూ సీతి ఒక చిన్న నెమలి వెంద్రుక సూరికి చూపింది.

"అది పిల్లా ఏమిటమ్మా?" అంది సూరి.

"కాదా ఏమిటమ్మా" అంది సీతి.

"నాకదియ్యవ్వా" అంది వెంకి. వెంకిని మధ్య పెట్టి సీతి కన్ను దాచేసుకుంది

సీతిపుస్తకము అంతా నలిగి చిరిగి ఉంది.

"అక్కయ్యా ఈపాఠము చెప్పవుటే నాకు" అంది సీతి.

"ఏంపాఠం" అని సూరి అడిగింది.

"కుక్కపాఠం" అంది సీతి.

"కుక్కపాఠ మేమిటి అసయ్యం. ఇంకా పాఠాల్లేవ్వూ" అంది సూరి.

"పిల్లిపాఠం, ఏనుగపాఠం, సోమరిపిల్లవాడి పాఠం ఉన్నాయి" అంది సీతి.

"అవేంపాఠాలే పాడుపాఠాలు—కథలు లేవ్వూ" అని సూరి అడిగింది.

"నృగునికథ, హరిశ్చంద్రునికథ, ఎడ్వర్డుకథ, ఫ్రాంక్లిన్ కథ—ఈ కథ లున్నాయే" అంది సీతి.

"అవేం కథలే. ఎంచక్కటి కథ లేమీా లేవ్వూ, మనం చెప్పకునేలాంటివి" అంది సూరి—

"ఏమో నమ్మా నాకు తెలియదు" అంది సీతి.

"పోనీ పద్యం చదువు" అంది సూరి.

"చివరున్నాయే పద్యాలూ చదవనా,—

క్షేత్రంబు పుష్కరపురాగారము
ధాత్రీశ్వర బీజమరయ దైవము రెండుగ
సూత్రపడ గూడ నేనియు—"

అని నట్టుతూ చదవింది సీతి.

"ఏమో నమ్మా ఆపద్యాలు నాకు తెలియవు. అవేం పద్యాలో గాని" అంది సూరి.

"సూరోయి, ఇదేం, నాలుగో వాచకం" అంది సీతి.

"అసి దొంగా. ఇంకా నీపుస్తకం అనుకుంటు న్నాను." అంది సూరి.

"పోనీ నీపుస్తకంలో కథలు చదవవే" అంది సీతి.

"నాపుస్తకమూ ఆలాగే ఉందమ్మా పాడు" అంది సూరి

"ఒకటి చదవ్వే పోనీ" అంది సీతి.

"అయితే చదువుతా విను." అని సూరి ఇలాగ చదవింది.

"పూర్వకాలంబున నుజ్జయిని నా బట్టణం బొంకు కలదు ......"

"బొంకు బొంకు బొండేమిటే సూరీ" అంది సీతి.

"వినవే మరి" అని సూరి చదవడం సాగించింది.

"అందు వీరసేనుండను భూతలేంద్రుండు రా జ్యంబు సేయుచుండెను. అతనికి చంద్రకళ యను పేరం బరగు కళత్రంబు సకల గుణో పేత........."

"పేత పేత పేతేమిటి పీత" అంది సీతి.

"పోనీ అమ్మా నే చదవను" అని సూరి పుస్త కం మూసేసింది.

"నాపుస్తకంలోనూ లేవే మంచి పాఠాలు" అంది సీతి.

"నాపుస్తకమూ అంతే" అంది సూరి.

"పేత పేత పీత" అంటూ కూచుంది వెంకి.

"వెంకీ నీకు నేను అక్షరాలు రాసిపెట్టనులే" అంది సీతి.

"ఊఁ" అంది వెంకి.

ఇంతట్లోకే వాళ్లింట్లో గుమ్మందగ్గిరికి ఒక ముసిలబ్బి వచ్చి నిలబడ్డాడు. తలకు తీవిగా తలపాగా చుట్టుకొన్నాడు. కుడితిసీ తొడు క్కున్నాడు. చేతిలో కర్ర ఉంది. చెవులకు ఎర్రరాళ్ల కమలా లున్నాయి. ఎర్ర కుంకం బొట్టు నిలువుగా పెట్టుకొన్నాడు. వచ్చి గుమ్మంలో నిలబడి సూరీ సీతీ వెంకి వీళ్లను చూచి నవ్వి, "అమ్మాయిగాళ్లు కూచున్నారా" అని ఇంట్లోకి చూచాడు.

"బూచాడు" అంది వెంకి.

"బూచివాడా రారా బుట్టలుకోరా
ఏడ్చేటి మా వెంకీ నెత్తూకుపోరా"
అని సీతి పాడింది.

"బూచాడు కాదమ్మా; అబ్బి" అంద సూరి.

వాళ్లు ముగ్గురూ ఆ అబ్బికేసి చూస్తూ కూచు న్నారు.

ఆ అబ్బి ఇంట్లోకి చూస్తూ గట్టిగా ఇలాగ చదివాడు.

"శుభోజయం. శుభోజయం. సకలవిద్వజ్జనాధారా, సకలవిద్యా విశారదా, సకలభోగపురందరా, సకలకళాప్రవీణ, సంగీత రత్నాకర, సాహిత్య భువనమండల, సాహస విక్రమార్క, సత్యభాష హరిశ్చంద్ర,—జయ విజయీభవ దిగ్విజయీ భవ—శుభోజయం శుభోజయం అమ్మగారూ" అని కేకవేశాడు.

"అమ్మ దొడ్లో ఉంది" అంది సీత.

"నాన్నగారో తల్లీ" అన్నాడు భట్రాజు.

"నాన్నేం గదిలో రాసుకుంటున్నాడు" అంది సూరి.

వెంకి సూరి వళ్లో కూర్చుంది. అప్పుడు భట్రాజు గొంతు కిత్తి గట్టిగా

"గగనమండల మదే గంటి నేడోయమ్మ
        గగనంబు కాదది గజను కొమ్మ
గజమైన నక్షత్ర గణములం దేమమ్మ
        నక్షత్రములు గావు నవ్యమణులు
మణులైన అరుణాభ మండలం బేమమ్మ
        అరుణాభ మది కాదు సురకజాలు
సురక జాలది యైన మెరపు లం దేమమ్మ
        మెరపులు జలతారు సరుకులమ్మ
సరుకు లవి యైనచో నీడు చంద్రు డేల
నటి ఘన మేటి శ్రీపూసపాటి విజయ
రామరాజేంద్రసుతుడు నారాయణగజ
పతి సుమీ రాజచంద్రుడే పద్మగంధి."

అని చదివి, "శుభోజయం శుభోజయం" అని మళ్లీ కేక వేసి ఇలాగ చదివాడు.

"పసముత్య మొకటి చాలును
కన వృద్ధినచిడి పెరాలు గంపెండేలా
రసికుం డొక్కడె చాలును
రసహీనులు పలువు రేల రాయని బావా.

డాబాపై కూర్చున్నా
డే బాలుడు ముద్దుగుమ్మ! ఎవరే చెపుమా
శాబాసు నీ వెరుంగవె
బాబాజీ బుచ్చితిమ్మ బహాదరు చెలియా."

"శాబాసు, శాబా సేమిటీ. శాబాసుట" అంది సీత.

ఇంకో పద్యం చదువు అబ్బీ" అంది సూరి.

అమ్మాయిగారు—చదువుతాను:
కలిమి గలనాడె మనుజుడు
విలసితసత్కీర్తిచేత వెలయగ వలయున్
కలి మేమి ఎల్ల కాలము
కులగిరులా కదలకున్న గువ్వలచెన్నా."

"అవేం పద్యాలే చదువుతాడూ" అంది సీత.

"మంచివీ చదువుతా ఉండు" అంది సూరి.

"పాటలు చదువు అబ్బీ" అంది సీత.

"పాటలు రావు తల్లీ పద్యాలు చదువుతాను" అన్నాడు భట్రాజు.

"మా సీతమీద పద్యా చదువు" అంది సూరి.

"చదువుతా తల్లీ:
సీతమ్మలు ధర నెందరొ
ఖ్యాతిని గన్నట్టివారు గలరట డొక్కా

సీతమ్మగారి వితరణ
నాతరమా కీర్తి చేయ నలువకు తరమా"

అని భట్రాజు చదివాడు. అందరూ గొల్లున నవ్వారు.

"మళ్లీ చదువు అబ్బీ మళ్లీ చదువు" అంది సూరి.

భట్రాజు మళ్లీ చదివాడు.

"డొక్కా–సీతమ్మ కాదు. సీతి" అంది సూరి.

"అవును తల్లీ అవును" అన్నాడు భట్రాజు.

"అవునైతే ఇంకో పద్యం చదువూ" అంది సూరి.

"చదువుతా తల్లీ:
త్రువ్వట బాబా తలపై
పువ్వట జాబిల్లి మేన బూదట విషమే
బువ్వట చూడగను హుళ
క్కా–వ్వట అరయంగ నట్టి హరునకు జేజే."

"ఉళక్కి ఉళిక్కి" అని సీతి నవ్వింది. వెంకి కూడా నవ్వింది.

"అది కాదు సీతిమీద పద్యం" అంది సూరి.

"అలాగే తల్లీ—అమ్మాయిగారూ చదువుతా:
సీతమ్మలు ధర నెందరో
ఖ్యాతిని గన్నట్టివారు కలరట డొక్కా
సీతమ్మగారి వితరణ
నాతరమా కీర్తిచేయ నలువకు తరమా"

అని చదివాడు.

"మళ్లీ ఆపద్యమే చదువుతాడేం" అంది సూరి.

"ఈ అబ్బికి పద్యాలూ రావు పాటలూ రావు" అంది సీతి.

"డొక్కా సీతమ్మోయి" అంది సూరి. సీతికి ఉడుకుబోత్తనం వచ్చి,

"మా సూరి మీద ఓ పద్యం చదువబ్బీ" అంది.

"అమ్మాయిగారు-అమ్మగారి నడిగి బియ్యం తెచ్చి పెట్టండి" అన్నాడు భట్రాజు.

"సూరిమీద పద్యం చదివితే నీకు బియ్యం వేస్తా"నంది సీతి.

"సూరమ్మవంటి బాలిక
ఊరంతా తిరిగితేను ఉంటుందమ్మా
సూరమ్మా నిను బోలగ
వరమ్మా మంచిపిల్ల లీకాలమునన్."

అని భట్రాజు చదివేటప్పటికి సీతీ వెంకీ చప్పట్లు కొట్టి నవ్వారు.

"అయిందా, అయిందామరి" అంది సీతి సూరిని చూచి.

"నాన్నగారితో చెప్పి బియ్యం వేయించరా అమ్మాయిగార్లు" అన్నాడు భట్రాజు.

"ఇంకా పద్యాలు చదువూ" అంది సీతి.

"బియ్యం తెండి-అలాగే చదువుతాను" అన్నాడు భట్రాజు.

"మా వెంకిమీద పద్యం చదవవూ అబ్బీ" అంది సూరి.

"అలాగే తల్లీ:
ఒక్కడు మాంస మిచ్చె మరి
యొక్కడు చర్మము కోసి ఇచ్చె వే

ఒొక్కరు దస్థి నిచ్చె మరి
　　యొక్కడు ప్రాణము నిచ్చె వీరిలో
నొక్కొకపట్టున బ్రదుక
　　నోపక యిచ్చిరొ కీర్తి కిచ్చిరో
చక్కగ చూడు మంత్రికుల
　　సంభవ రాయన మంత్రి భాస్కరా.

పడుచు నిడినవాని పద్య మిచ్చినవాని
కడుపు కిడినవాని నడుపవలయు
నడుపలేనివాని నయవిదు లెంతురా
భువిని భాస్కరేంద్రు పుత్ర కొండ."

"అవి చదువుతాడేం. అవి కాదు. వెంకిమీద పద్యం" అంది సూరి.

"వెంకిమీద పద్యం చదువబ్బీ" అంది సీతి.

"చదువుతా తల్లీ;

　నవనవలాడే దేహము
　చవులూరేపలుకు తీరు సంపదలోనన్
　ప్రవిమలదానగుణంబున
　భువిలో వెంకమ్మ తల్లి బోలంగలరే"

అని భట్రాజు చదివాడు. సూరీ సీతీ వెంకీ చప్పట్లు కొట్టి నవ్వారు.

ఇంతట్లోకీ వాళ్ల నాన్న గదిలోనుంచి నడవ లోకి వచ్చి భట్రాజును చూచి,

"ఎవరవోయి నువ్వు" అని అడిగాడు,

"మేం భట్రాజులం అన్నదాతా. ఇది మా కులవిద్య తండ్రీ.

　పలువిద్య లెన్ని నేర్చిన
　కులవిద్యకు సాటి గావు కుంభిని లోనన్
　వెలకాంత లెందరైనను
　కులకాంతను బోల రన్న గువ్వలచెన్నా.

అమ్మాయిగార్లకు పద్యాలు చదివి "వినిపిస్తున్నాను అన్నదాతా" అన్నాడు భట్రాజు.

"సూరీ, బియ్యం వేసి పంపించవే" అన్నాడు వాళ్ల నాన్న.

"తండ్రీ తమరు తొడిగి విడిచిన వస్త్రం ఒకటి దానం చేస్తే కలకాలమూ చెప్పుకుంటాను" అన్నాడు భట్రాజు.

వాళ్ల నాన్న ఒకచొక్కాయిచ్చాడుభట్రాజుకి.

సూరి సోలతో బియ్యం తెచ్చి భట్రాజు వళ్లో పోసింది.

"నేనూ బియ్యం పెడతా" నని సీతి కూడా సోలెడు భట్రాజువళ్లో పోసింది.

"నేనూ పెత్తా" అని వెంకి రెండు గుప్పిళ్లతోటే బియ్యం వళ్లో పోసింది.

"ఇక వెళ్లు" అన్నాడు వాళ్ల నాన్న.

"అయిదోతనంకలిగి ఐశ్వర్యం గలిగి ఆరోగ్యం కలిగి నూరేళ్లువర్ధిల్లండి అమ్మాయిగార్లు నూరేళ్లు వర్ధిల్లండి" అని చెప్పి భట్రాజు వెళ్లి పోయాడు.

"బియ్యం అన్నీ పోసేస్తున్నారర్రా" అని వాళ్లమ్మ పెరట్లోంచి కేక వేసింది. "లేదే" అన్నారు సీతీ సూరీని.

"లేదులే నేచూస్తున్నా" అన్నాడు వాళ్ల నాన్న.

సూరి సీతినిచూచి "డొక్కసీతమ్మాయి" అంది.

సీతి సూరిని చూచి "ఊరంతా తిరిగితేను ఉంటుందమ్మా సూరమ్మా" అంది.

సూరీ సీతీ వెంకిని చూచి

"వెంకమ్మ తల్లి బోలంగలరే" అన్నారు.

వాళ్ల నాన్న నవ్వాడు.

# విరహాగోపి

పాటిబండ మాధవశర్మ గారు

శ్రీ వసియించు పట్టు నిరసించి కఠోర దరిద్రదేవతా
ప్రావరణమ్ములన్ నిజనివాసముగా వరియించుకున్న యా
నీ వరకీర్తి నామెదటి నెత్తుటిరేఖల వ్రాసికొందు; త
ల్లీ! వచియింపు మాశిషము లీ నతశీర్షముమీద భారతీ!

శ్రీకరమై ముహుః పరవశీకృత గోపవధూకమై, సదా
లోకి సమస్త లోకమయి, లోకవిమోహనకృద్విలోకమై,
ప్రాకటమైన నీవదనపంకజ లక్ష్మికి రక్షయైన యా
కేకిశిఖాకలాపమున కెత్తెద కప్రపు మంగళారతుల్.

నీవు సుధానిధానమవు నీ మురళీ మృదుగానమున్ సుధా
స్రావి సుధామయమ్ము గదరా! నిఖిలమ్మును నిన్ను గూర్చినన్
స్థావర జంగమాత్మక విశాలజగాన త్వదీయదివ్యగా
నావశమై కరంగనిది యున్నది లేదుగదా! జగత్ప్రభూ!

కోటివరాలు సేయు కులుకుల్ తులకించెడు పాలబుగ్గలన్
కాటుకముంగురుల్ మురువుగా గుబురుల్ గొన చంద్రవంకపై
నీటగుపించియమ్ము తవణిల్లెడు ముందల గొప్ప ముద్దులన్
మూటలు గట్టు కొంటెతనముల్ గనిపింతువు రాగదో ప్రభూ!

పా లెగజేపుకున్న వొకపట్టున చేరెడు నేని రాల్ప వీ
యాలు; భవద్వియోగజనితాశ్రుముఖమ్ములు; నిల్వ నీరు గా
బోలును; రాల్ప వొక్కకణమున్ పసిపాపలకైన; ఇంత మో
హాలసలైన పీకదుపులైన; అదెంతటి దివ్యశక్తియో!

"రాతిరియున్ బవల్ మరపు" రావు గదా! భవదీయహస్తసం
పాతముమాత్రనే విరియబారెడివే? మరి నే డికేరిసం
ప్రీతికిగా నటంచు నరవిచ్చుట సైతము మానుకున్న వీ
లేత గులాబిమొగ్గలు; బళే! జగదేకమనోహరాకృతీ!

సన్నము సన్నమై విరహశాపహార్తిఁ లతలెల్ల గుజ్జులై
చన్నవి; గొల్లపల్లెపువుజప్పరముల్ నిను లేక విన్ననై
యున్నవి; యేమి యెంచుకొనెనో గద! వెన్నెలు వంగునట్లుగా
క్రొన్ననలుఁ బువుల్ కలిపి గ్రుచ్చుచునున్నవి యేకదీక్షతో!

ద్వేషితకాళియోరగపతిఁ, హృతజీవనపూతనాసురున్,
భూషితపింఛలాంఛనుని, పోషితగోకులు, బాలకృష్ణు న
న్వేషణకార్యమం దశన నీరనిరాకృతి నేకదీక్షతో
ఘోషకుటీ విటంకముల గ్రుమ్మరుచుం బికలం దివమ్ములం.

గాటపు మోహ మాచికొనగా దరి గానక నీవు నేను ము
న్నాటల నాడుకొంచు తిరుగాడిన కానలలో తమాలపుం
వాటులవెంట నీవు కనవత్తువొ యన్నదురాశపాంథు నై
శాటపథమ్ము వట్టి తిరుగాడుచునుంటి గదా! జగత్ప్రభూ!

యామున నిమ్నగా తరళ హారి తరంగములందు వాలుకా
సీమలలో భవ న్మోదము జేసుక శారదశుభ్రయామినీ
యామములందు రాసరచనార్పిత జాగృతి నే మనోహర
శ్యాము దనించినానొ భరమయ్యెడు నాస్మృతి మోహనాకృతీ!

తే గను గూర్కులం గలవరించుచు మై పులకించుకొంచు నీ
లం గెటు లెట్టులో దినములం గ్రమియించితి నింతదాక నిం
కీగతి నెన్నినాళ్లు భరియింతు ప్రభూ! దయచేసి యీమనో
వేగము దీర్తు గాని కనుపింప గదోయి జగన్మనోహరా!

పిల్లసమీరముల్ మలయువేళ, సుధాంశుడు లేతవెన్నెలం
జల్లెడువేళ, సప్రణయ సామృతదృక్కులతోడ నాపయిం
జల్లని చూపు జూచినను చాలు నదే పదివే లటంచు మే
నెల్ల విషాదమై పలువరించెదు నన్నిటు సేతువో సఖా!

తీయని వెన్నపూస పగిదిం ద్రవియించెడు నీదుమానసం
బాయసకర్కశం బయినదా? ఇనదారుణదుర్వియోగదుః
ఖాయితకేలికాజ్వరితమై పలవించెడు దాసి నిట్టు ల
న్యాయము సేతువా? ఘనఘనాఘనకాలవపుఃకళానిధీ!

నా రతినాలకుప్పవని, నా మురిపమ్ముల మూట వంచు, బం
గారపుకొండవంచు తమకమ్మున నిన్ బ్రతిమాలుకొందు, నన్
చేరగ రమ్ము ముద్దిడుము చెక్కిలి నొక్కుచు చక్కనయ్య! సిం
డారుకవుంగిటం బొదివి యందెద అందగరానిసౌఖ్యమున్.

సాగరనీలమున్ మధురసప్లుత మా తవసుందరాంగమున్
కౌగిటజేర్చి యొక్క త్రుటికాలము, లౌకికనారకవ్యథా
త్యాగ మొనర్చి పారవశతాధికతాసుఖితాత్మ నౌదు; హం
సీగమనమ్ముతోడ నను చేరగ రాగదరా! మనోహరా!

మ్రాగనువడ్డ జాలు గదరా! యెదురయ్యెదు, వంశికాసుధా
రాగముతోడ, పింఛపరిరంభిత చూడముతోడ, భాగురో
భాగముతో లయానుగుణపాదయుగీగమనమ్ముతోడ; ఈ
యాగడ మేటికోయి, భరమయ్యెడు మోహము, మోహనాకృతీ!

నీ లలితస్వరూపము పునీతతమాలమహీజశాఖలన్
వ్రేలెడునాట దెచ్చి పదిలించితి నాహృదయమ్ములోన, గో
పాలక బాలలాలనకృపాళులు నాటికి నేటి కీశ్రవో
గోళములందు హత్తెనివిగో భవదీయ మనోజ్ఞగానముల్.

విశ్వము "తల్లక్రిందయి" తపించియు పొందగ రానిదై, సుధా
నిశ్వసనప్రపూతమగు నీమురళిన్ పెదవిన్ దగిల్చి, సైం
ద్రాశ్వమనోజ్ఞరింగణశనైర్గమనమ్మున వచ్చి యొక్క నా
గస్వర మూది జీవభుజగమ్మును పట్టుకపొమ్ము! మోహనా!

వైరవిచారకారణము పాలకసేవకభావమై యహం
కార వికారదూషితము కశ్మలవేశ్మమునైన యీతమోఽ
గారమునుండి యొక్క ఋతుకాలవిభాగము లేని, క్షుద్రని
ద్రారతి లేని శాశ్వతపదమ్మును చేర్ప గదో జగత్ప్రభూ!

పాక్షికభావలుబ్ధము, స్వపక్షవిపక్ష విధావిభక్తమున్,
తత్క్షణమాత్ర ముగ్ధమును, తత్క్షణమాత్ర విరుద్ధమున్, విము
క్తక్షమమున్, సదాసుముఖశిక్షయ మీ జగమున్ త్యజించి యే
యక్షయప్రేమరాజ్యమునకైనను పోదము రాగదో సఖా! (సశేషము.)

"మధుకణములు" నుండి.

# యుక్తి

శ్రీమతి వి. సంపూర్ణముగారు

అనగనగా ఓ రాజు. ఆ రాజుకో మంచి వజ్రాల ముద్దుటుంగరం వుండేది. దాన్ని ఎప్పుడూ తీయకుండా వేలినే పెట్టుకో వుండేవాడు ఆ రాజు. ఎప్పుడూ దాన్నే చూచుకొంటూ తన ప్రాణాలన్నీ దానిపైననే పెడుతూ వుండేవాడు.

ఓ నాడు రాత్రి రాజు మంచి నిద్రలో వుండగా ఓ పనివాడు వుంగరాన్ని తీసుకుపోయినాడు. రాజు మర్నాడు తెల్లవారె లేచి వేలుచూసుకుంటే వుంగరం కనపడలేదు. పడక, యిల్లూ అంతా వెతికాడు. ఎక్కడా దొరకలేదు. పని వాళ్లందర్నీ అడిగాడు. 'మాకు తెలియదంటే మాకు తెలియ' దన్నారు అందరూనూ. రాజు నాడు సాయంత్రానికి ఓ వుపాయం ఆలోచించాడు. రాత్రి పడుకోపోయేముప్పుడు నౌకర్లనందర్నీ పిలిపించాడు. పన్నెండంగుళాల పొడుగుండే కర్రలను తెప్పించాడు. 'ఒకే ఈ కర్రలను మీరు ఇండ్లకు తీసుకువెళ్లండి నా వుంగరం దొంగిలించినవాడి కర్ర తెల్లవారే సరికి ఓ అంగుళం పెరిగివుంటుంది. దొంగ చిక్కిపోతాడు; పొండి తెల్లవారే కర్రలు తీసుకొనిరండి' అని వాళ్లను పంపేశాడు.

ఉంగరం దొంగిలించిన నౌకరు 'తెల్లవారికి కదా కర్ర ఓ అంగుళం పెరుగుతుంది. కాబట్టి ఇప్పుడే ఓ అంగుళం ఇందులో నరికేస్తాను. తెల్లవారేటప్పటికి పన్నెండంగుళాల పొడుగే వుంటుంది. అందుచేత రాజు నన్ను పట్టుకోలేకపోతాడు' అని తన కర్రలో ఓ అంగుళం నరికేశాడు.

రాజు వుత్తర ప్రకారం అందరు తెల్లవారే మళ్లీ కర్రలు తీసుకొనిపోయి రాజుదగ్గర పెట్టినారు. అన్ని కర్రలూ ఆయన చూచాడు. ఒక కర్ర మాత్రం పొట్టిగా వుంది. దాన్ని యెత్తుకొని 'ఈ పొట్టికర్ర ఎవరిది' దన్నాడు. 'నాది' అని దొంగవాడు దగ్గరికి వచ్చాడు. వాణ్ణి రాజు బాగా శిక్షించాడు. వాడు 'కుయ్యో మొర్రో' అని యేడుస్తూ వుంగరం రాజుకు ఇచ్చేశాడు. కథ కంచికిపోయింది. మనం యింటికి వచ్చాము.

---

# కొడుకు కాపుగన్నా తల్లి ముదికీపలో

శ్రీ పాలంకిపాటి లక్ష్మీబాయమ్మ గారు

అనగనగనంగా ఒక వూళ్లో ఒక తల్లి, కొడుకు, కోడలు వున్నారు. కోడలి తల్లి కూడా వాళ్లదగ్గిరే వుండేది. ఇలాకొన్నాళ్లు జరిగిన తరువాత అత్తగారుండడం యిష్టములేక కోడలు రోజూ, మొగుడుదగ్గిర కూర్చుని, "మా అమ్మ వుండగా మీ అమ్మ ఎందుకు? మీ అమ్మను అర్ధరాత్రి తీసుకెళ్లి గోదావరిలో తోసిరా" అని పోరుతూ వుండేది. ఆ మొగుడు

## సింహం చప్పిడిముక్కు

శ్రీ నరసింహస్వామిగారు

పూర్వం ఒకప్పుడు శివపార్వతు లిద్దరు నంది వాహనం ఎక్కి భూలోక సంచారం వెళ్లి తిరిగొస్తూ కైలాసానికి దగ్గరసా వాహనం దిగి ముచ్చట్లాడుకుంటూ నందిని వెనక నించి రమ్మని వచ్చేస్తున్నారు. కొంతదూరం వచ్చేసరికి పార్వతీదేవి వాహనం అయిన సింహం తోవలో కూచొని భూమి ఊరికే వాసన చూస్తూంది. ఈశ్వరు డేం చేశాడూ, సింహం దగ్గరసా వెళ్లి 'ఏమిటి వాసనచూస్తూందో చూద్దా' మని వంగి చూశాడు. ఏమీ కానరాలే. ఆమట్టున సింహాన్ని అడిగాడు, ఏం చేస్తున్నావని. "ఏమీ లేదూ ఎదో పశువు వస్తూన్నట్టు వాసనేసింది. ఎంతదూరంలో ఉందో అని పసిచూస్తున్నా" నంది. ఓసి! నీతల తరగా ఇదా నువ్వు చేసేపని. నీక్రూరత్వానికితోడు! పసిగూడా పెట్టాడా బ్రహ్మ! ఇలా అయితే ప్రపంచంలో గల జీవరాసుల నన్నీ మీవంశమే యిట్టే కాచేసేస్తుందే. ఇహ ఏంలాభం సృష్టించి" అంటూ సింహం తలకాయ పట్టుకొని ముక్కు నేలనేసి గట్టిగా రాచేశాడు. అప్పట్నుండే దానిముక్కు చప్పడ్డాది. పసిపట్టడం గూడా పోయింది. ఇది దాని జాతంతటికీ సంక్రమించింది. ఇలా శివుడు చేయకపోతే లోకం ఈపాటికి వెళ్లాల్సిందే యమలోకానికి. కథ కంచికీ. మనం ఇంటికీ.

---

## మా చిన్ని కృష్ణమ్మ

చిలుకూరి లక్ష్మీనరసమ్మగారు

కాళ్లకు గజ్జలు - కట్టుకొని
చేతికి గొలుసులు - పెట్టుకొని
మెడలో సరములు - చుట్టుకొని
గునగున రారా - కృష్ణయ్యా.

కస్తురితిలకము - దిద్దుకొని
కొప్పున పువ్వులు - తురుముకొని
పాపటను తురా - పెట్టుకొని
మొగముచూపరా - కృష్ణయ్యా.

చందమామరా - నీమోము
చల్లని వెన్నల - నీ నవ్వు
అమృతంమూట - నీమాట
ముద్దివ్వర నా - కృష్ణయ్యా.

ఆవుల దూడల - తోలుకొని
చెట్టుల నీడం - చేరుకొని
వేణువు చేతను - పట్టుకొని
తియ్యగ పాడర - కృష్ణయ్యా.

గొల్లల పిల్లల - కూడుకొని
గొల్లల యిండ్లను - గొల్లగొని
వెన్నా మీగడ - తెచ్చుకొని
నాకును పెట్టర - కృష్ణయ్యా.

వెండి గిన్నెలో - వెనముద్ద
పైడిగిన్నెలో - పాయసము
ఉంచితి నీకును - జాబిల్లి
కూడుక తిందము - కృష్ణయ్యా.

# పిల్లలపాటలు



చీమ యెక్కడి కెళ్లిండి
చిటికలోన వచ్చింది
పంచదార తెచ్చింది
పాయసమెంతో వండింది
పెరుగు అన్నం తినకుండ
పరుగుపరుగున పోయింది.



దబ్బా చెట్టుకు దారీ లేదు
నిమ్మా చెట్టుకు నీరూ లేదు
కందికంపకు కాయా లేదు
పొందిక లేని పోకమల్లు
వానల్లేక యెండేనమ్మ.



చెట్టునివున్నా కాయలూ
చెలువుమీర కొయ్యండి
పొదలోవున్నా పువ్వులూ
పొందికగాను కొయ్యండి
కాయలు పువ్వులు ఉంచండి
సజ్జలో ఎంతో సందడిగా
రాముడి కన్ని కాయలూ
జానకి కన్ని పువ్వులూ
భక్తితోనే పంచండి.



ఉసిరికాయలకుండ
ఊరిబిండీకుండ
కుండో కుండ.

పసిడివన్నె పుకుండ
పానకపుకుండ
కుండో కుండ.

చల్లవున్నా కుండ
చక్కదనాల కుండ
కుండో కుండ.

---

## జోలపాటలు

శ్రీ శంకర సీతారత్నముగారు

ఓ జోలా;
జోలపాడినవారు జోకొట్టువారూ
అబ్బాయిని పాడినవారు ముద్దాడువారు

తాతలకి ముద్దమ్మా తండ్రులకి ముద్దూ
అంతకన్నా ముద్దు మేనమామలకీ
మేనమామలగారి పట్టె నిమ్మన్నీ

ఎక్కడి బాబయ్యా వెలపొన్నమానూ
మంచిగంధపుచెక్కా మామ లట్లాడా
మా పట్టె నిచ్చేము దిగవయ్యా పొన్నా.

* * * *

ఓ జోలా;
జోలలు పాడితే బాలలకు నిద్రా
నాగస్వరముబట్టితే నాగులకు ఆటా
ఆడంగ ముద్దమ్మా పాడంగ ముద్దూ
అందరికీ అమ్మాయి అల్లారిముద్దూ.

* * * *

చిచ్చీ చిచ్చీ చిగురుమామిడీ,
పళ్లేల పండవే పళ్ల మామిడీ
నే నెట్లు పండుకనూ చిలకల్ల చేతా
చిలకల్లు మాయింటి చెలికత్తెలమ్మా
చిలకల్లు మాయింటి చెలికత్తెలమ్మా
హంసల్లు మాయింటి ఆడపడుచల్లూ
కోవెల్లు మాయింటి కొత్తకోడళ్లూ
కోవెల్లు మాయింటి కొత్తకోడళ్లూ
పావురాల్లు మాయింటి బాలపాపల్లూ:—

* * * *

ఓ జోలా;
జోలలకి జొన్నబువ్వ: అమ్మకు కోరిబువ్వా
యేడ్చేటి అమ్మాయికి యెఱ్ఱావుపాలు
చిన్న నా అమ్మాయి పుట్టిన్నినాడూ
స్వాతివానలు గురిసె, సముద్రాలకడనూ
పాలవానలు గురిసె బంధువులకల్లా.

* * * *

ఓ, లాలీ!
లాలి కొండ రత్నాలు, రంగు నీలాలు
చీకటికి దీపాలు చిట్టితల్లి కళ్లు
యెవ్వ రేమన్నారూ; నిన్ను నా తల్లీ
వెలలేని వీధిలో యేనుగన్నారా
కంభానికట్టిన్న కనకమన్నారా.

* * * *

ఆటకూటమ్మిలో ఆడేవు నెమలీ
వేటగా డొచ్చాడు, ఆట చాలించూ
బంగారుమేడలో నవ్వేవు అమ్మా,
నా అల్లు డొచ్చాడు, నవ్వుచాలించూ
నాగబంధపుచెవుల పోగు లున్నాయీ
యెఱ్ఱ చిన్నావాడు, యెవరల్లుడమ్మా.

* * * *

వెంకటేశుడు మొక్కు, మొక్కుకున్నామూ
దాగళ్ల వడపప్పు, దండిబెల్లాలూ
మండిగల దీపాలు, మరి పానకాలూ
గుడిచుట్టు దీపాలు, గుమ్మాడిపళ్లూ.

* * * *

నా చిన్న అమ్మాయి, నా చిన్న మోమూ
నిండుపున్నమనాటి చంద్రుణ్ని బోలూ
చిన్ని నా అమ్మాయి, చిరిమోము జూచీ
సిగ్గుపడి చంద్రుడు పొడవజాలాడూ
మర్నాడు, అమ్మాయి మాటల్లు వీనీ
మాణిక్యాలతోనూ పొడిచె చంద్రుడూ.

* * * *

---



## గడియారపు గొలుసు

కో. నరసింహాచారి గారు

ఉల్లిన పూవులను చేయుటను గురించి ముందటి వ్యాసములందు చెప్పియుంటిని. ఈ వ్యాసమున ఉల్లిదారముతో గడియారపు గొలుసును చేయుటను గురించి చెప్పెదను.

ఇందుకు కావలసిన పరికరములు, ఒక దారపు బండియు (చిత్రము 1), నాలుగు సన్నని, అరయంగుళపు చీలలును, ఒక పెద్ద సూదియు, ఏదైన, యిష్టమువచ్చిన వర్ణపు ఉల్లిదారమును ఉండవలెను. మొదట నాలుగు చీలలను దారపుబండికి పైభాగమున చిత్రము 1 యందు చూపినరీతిని కొట్టి బిగించవలెను. చీలలు నాలుగును సమచతురముగా నుండవలెను. పిమ్మట కావలసినంత ఉల్లిను దారపు బండికి చిత్రమునందు జూపినరీతిని చుట్టుకొనవలెను. దారముయొక్క రెండవకొనను దారపుబండి యందలి రంధ్రముగుండా చీలల ప్రక్కనుండి క్రిందితట్టుకు తీసికొనవలెను (చిత్రము 1, ప.). బండిని చిత్రము 2 నందు జూపినరీతిని ఎడమచేతిలో పట్టుకొని, క్రింది తట్టుకు తీసికొనబడిన దారపుకొనను చిటికెన వ్రేలితో నదిమిపట్టుకొనవలెను. చీలలప్రక్క నుండు దారమును మొదట నేదైన నొక చీలకు, అనగా చిత్రము 3 నందలి చ అను చీలకు, వెలుపలిప్రక్కగా, దీసికొని పిమ్మట ఆచీలకు వెంబడి నుండు ట అను చీలకు లోప్రక్కగ తీసికొనవలెను. అటుపిమ్మట దారమును ట అను చీలకు ఒకేసారి చుట్టి మరల లోప్రక్కగానే దానివెంబడినుండు త్ర అను చీలకు గూడ లోపలిప్రక్కగా దీసికొని త్ర కు ఒక చుట్టుచుట్టి అదేవిధముగా కడపటిదగు క అను చీలకును చుట్టవలెను (చిత్రము 4 చూడుడు). తర్వాత దారమును మొదటిదగు చ అను చీలకు వెలుపలిప్రక్కగాను, అంతకు పూర్వము వేయబడియుండు ర అను దారపుచుట్టునకు పైప్రక్కగా నుండునట్లును వేసిపట్టుకొనవలెను (చిత్రము 4). పిమ్మట నొక సూదిని ర అను చుట్టులోనికి చిత్రము 5 నందు జూపినరీతిని దూర్చి, ఆచుట్టును పైకెత్తి య అను భాగమునకు పైప్రక్కగా చీలకు లోప్రక్క వేయవలెను. చిత్రము 6 నందలి చుక్కలగీత ర యొక్క పూర్వస్థితిని తెలుపును. ఇదేరీతిని దారమును, వెంబడి నుండు ట అను చీలకు వెలుపలివైపుగా




పూర్వము వేసిన చుట్టునకు పైప్రక్కగా వేసికొనవలెను. పిమ్మట క్రిందనుండు చుట్టును, పైనుండు దారమునకు మీదుగా లాగి చీలకు లోప్రక్క వేయవలెను. అపుడు చిత్రమును 6 నందుండు విధముగ రెండవచీలవద్దగూడ నేర్పడును. ఈవిధముగ ప్రతిచీలకును దారమును వేయుచు అల్లుచు రావలెను. ఒకసారి నాలుగు చీలలకు దారమును ఈవిధముగ జుట్టినవెనుక నదేవిధముగ మరల మరల చ, ట, త, క అను చీలలకు దారమును వేయుచు పోవలెను. ఇట్లు విడువక దారమును వేయుచు పోవునయెడల చిత్రము 7 చూపిన విధముగ నొక యల్లిక దారపుబండియందలి రంధ్రముగుండా క్రిందిప్రక్క వెలువడును. ఇట్లు బండికి చుట్టియుంచిన దారమంతయు నయిపోవువఱకును అల్లుచు రావలెను. దారము అయిపోయినయెడల క్రొత్తదారమును చేర్చి ముడివేసికొని అల్లికను సాగించవలెను. ఇట్లు అల్లబడిన గొలుసును గడియారమును కట్టియుంచుకొనుటకును, గుండీలను కట్టుటకును ఉపయోగించవచ్చును.

---

# శ్రీ ఝాన్సీ రాణి

పి. వి. రామారావు గారు

శ్రీ భారతాగార శోభిత ఝాన్సీరాజ్య గర్భాలయ రత్నకాంతి
ఆసేతుతుహినాచలావనీపక వనీపక మనోభీష్టద పద్మనిలయ
నిఖలహిందూరాజ్య సుఖసాధన ప్రసాధన ధనాదికదాన దైవతమణి
అవనీసుపర్వాన్వయాంభోధిసంభూత శారదపూర్ణిమా చంద్రరేఖ
అప్రతీప ప్రతాప భానుప్రదీప్తి-సకల శరణాగతారి ప్రశాంతిసీమ
లలితగుణలక్ష్మి శ్రీ ఝాన్సి లక్ష్మిబాయి-క్రాంత మహారాష్ట్ర తర్ణక సౌరభేయి
కుటిలశాత్రవ దానకుంభికుంభకుంభ పాటనపాటవ పంచవదన
పటుగర్వ దుర్వార వైరిభూభృద్భూభృద్భోఘ విదార వజ్రోగ్రధార
చటులారిరాజన్యపటల ఘోరాటవీ దహన విజృంభణ దావకీల
కటురిపుష్మాల కటకజ్వాలజ్వాలనోపశాంతిక్రియాటోపవృష్టి
శత్రుకుంతూలహేతి నిశాతహేతి- రాజలక్షణభద్ర! స్వారాజ్యముద్ర!
సరసవాగ్వాణి! వితరణ శస్త్రపాణి!-శత్రువేణు ఘోణిశ్రేణి! ఝాన్సిరాణి!

సకలసద్విద్యా విశారద శారద వగు దగ్రజన్మ జన్మాప్తికతన
లలితసంపత్తి వాల్లభ్యలాలితలక్ష్మి వగుదు భూధరవివాహంబుకలిమి
సర్వమంగళకళాసర్వమంగళ వౌదు గంగాధరునకు నర్ధాంగి వగుట
భీషణద్వేషణ పృథుశిరోధిస్రుత రుధిరనీరధి మగ్నరూక్షమూర్తి
వగుచు బటుశక్తి వగుదు వీ వాదిశక్తి-మువురుమూర్తులు నీమూర్తిమోల నిలుప
జాల రోతల్లి! వీరయోషామతల్లి!-సల్లలితకీర్తి వాసికప్రఫుల్లమల్లి!

అల శిరీషసుమమృద్వంగంబు సైచె నెబ్భంగి ఫరంగి ఫిరంగిగుండ్ల?
నుద్యానవిహారణం బోర్వని నీ వెట్లు 'కాల్పి' కేగితి తురంగంబు నెక్కి?
రాజన్యమకుటాగ్ర రత్నదీప్తాంఘ్రు లెట్లోర్చె మాంసాతతాయోధనోర్వి!
బుష్పాపచయకేళి బాగులు నీ కెట్లబ్బె లసి బూని పగతుర గసిమసంగె?
రాణివాసంబు బాయని రాణి వెట్లు-భరతపౌరుషబీజాలి వైరిరుధిర [కొమ్మ!
మనెడి నీ ర్వెట్టి పోషించి తమ్మ? 'గ్వాలి-యరు' గెలుపుగొమ్మ! గంగాధరార్య
సముదారిలోహిత కమలాకరక్రీడ కమలాకరక్రీడకరణి బరగ
చలితారినృపబల కలకలారావంబు కలకలారావంబు గన కన్నె

వైరిరాట్కరముక్త వరశిలీముఖములు వరశిలీముఖములభాతి నొప్ప
పరభూప శస్త్రాస్త్ర బర్హిసంరంభంబు బర్హిసంరంభంబుభంగి బొలిచె
హరివీరవిహారంబు లందు నీకు-ప్రథితగుణపూత! నుతపరాక్రమ సమేత!
హతవిపక్షవిఘాత! సాహసనిశాత!- శూరకులజాత! ఝాన్సీ వీరమాత!
మాణిక్య గాణిక్య మహితాశ్వవర రథోద్భటభట పటలసంపత్తితోడ
పండితమండలీ మండనోద్దండ కవిప్రకాండ మనోజ్ఞవినుతితోడ
ధాళధళ్యప్రభాధవళితాశాంతరచామరాత్తస్పృహదశ్వంబుతోడ
మహనీయతపనీయ మణిగణస్తవనీయ కంఠహారామల కాంతితోడ
నేపు దీపించు గెంబట్టుటోపితోడ-జెంగి రత్నసింహాసనాసీనవైన
నాటి నీమూర్తి మనముల నాటియుండె-లక్ష్మి! నిర్వక్రవిక్రమోల్లసితలక్ష్మి!
రోజు దా బన్నెండురోజులు ఘోరాజి రోజంగ జేసిన రాజవదన
అధ్వమధ్యంబునం దడ్డిన జౌకరు త్రుళ్లంత ద్రుంచిన తోయజాక్షి
హుస్సూరుదళము లొక్కుమ్మడి జెలరేగ జించి చెండాడిన సింహమధ్య
అల ఫరంగి ఫిరంగు లగ్నుల గురియ హోరాహోరి బోరిన రమణిమిన్న
మా స్వరాజ్య యాత్రోరుసంబలము గాదె-భవదమేయబలం బిల భరతనారి?
మండలాగ్రిక సాహాయ్య ఖండితారి!-ధీసమంచిత భాగీరథీకుమారి!
హరహరమహా దేవటంచు మరాటీలు పటుతరాటోపులై పరిఢవిల్ల
నల్లాహొ యక్బ రటంచు మునల్మాను లాయోధనోత్సాహులై తలిర్ప
బెబ్బులి మీసలం బెనిపెట్టి పెరికెను నాప్షనోద్భటభటు లవఘళింప
.............................. మోహాపంతు పీరుల కేపు జూప
గుటెలద ల్లాజితాకూరు కొంప గూల్చె-ద్రోహి దుగ్ధపానసురక్షితాహి వాడు
లేకయుండిన దల్లి! నీ దాక వశమె?-యరులకైనను మరి కులగిరులకైన.
రవి క్రుంకనేరని రాజ్యంబువా రేడ? రవిరశ్మి నెరుగనిరాణి వేడ?
మారణకారణ మహితయంత్రము లేడ? హస్తిసిమాత్ర సాహాయ్య మేడ?
ఝాన్సీమండలయుగపద్ద్రిసనఘూర్వహు లేడ? స్వల్పఝాన్సీరాజపత్ని వేడ?
ప్రథితసామ్రాజ్యానుభవభారవహు లేడ? పాలు నీ రెరుగని గోల వేడ?
శత్రువీరుల జెనకి పవిత్రవీర-నాకమును జూఱ గొంటి నాళీకవదన!
హైందవబాడీసియా భరతార్క జోస్పి-కీర్తి తాఖ్యాఖిలాశాంతకీర్తి సదన!

# కన్నడిగలు—తెలుగలు

విద్వాన్ కూరిగనూరు నరసింగరావుగారు B. A., L. T

భా. వ. 'సులిదబాళెయ హణ్ణినందది, కళెవసిగురిన కబ్బినందది అళిద ఉష్ణదహాలినందది సులభవాగిర్ద;
లలితపహ కన్నడదనుడియులి, తిళిదుతన్నోళు తన్న మోక్షవ, గళిసికొండరె సాలదే సంస్కృతదలిన్నేను.
—అనుభవామృతము.

కన్నడబాసకును తమిళు తెలుగు మున్నగుబాసలకును గలసంబంధములను కని పెట్టి, కన్నడబాసయే తదితర భాషలకు మూలభాష యని "కర్ణాటభాషా వ్యాకరణరహస్యములు" అను గ్రంథమునందు విస్తరించి నిరూపింపబడునని నుడివితిని. వేదిమి తెలుగురు విశేషముగానుండుస్థలముననే సమస్తాగస్తువు లుద్భవించి పరిపక్వస్థితినిజెంది వ్యాపించు నను అనుభవవేద్య మగు ప్రాపంచిక ప్రాణిశాస్త్ర ప్రబలసిద్ధాంతముల నానావిధములు గాగొని ఆర్యుల ఆర్యేతరుల ఏకత్వమును సాధించుటకును, నానాజలప్రళయముల కోర్చి శ్రీమన్నారాయణుని పునస్సృష్టికిని వస్తుబీజములతో కణజమై వెలసిన కర్ణాటమే కర్ణాటదేశమని స్థాపించుటకును "కర్ణాటకుల తాపకభూమి" అను గ్రంథము వ్రాయబడుననియు బలికితిని. ఇక కర్ణాటవాఙ్మయ వైభవము నింత అవలోకింతము.

కర్ణాటవాఙ్మయవైభవము స్వజాతీయ స్వయంకృషివలననే సంభవించినది. గంగులు, రాష్ట్రకూటులు, చాళుక్యులు, కాకతీయులు, హొయ్సళులు, రట్టులు, శిలాహారులు, కొంగాళ్వులు, చెంగాళ్వులు, తులురాజులు, చోటులు, విజయనగరరాజులు, పాళెగారులు మొదలగువారు తామే స్త్రీ పురుషులు గొందఱు ఉద్గ్రంథములను వ్రాయుటవలనను కవిపుంగవులచేత వ్రాయించుటవలనను కర్ణాటసాహిత్యము నతిశయముగా పోషించి కర్ణాటకుల కృతజ్ఞతకు పాత్రులైయున్నారు. ప్రాచీనకాలమునందే జైనులు, శైవులు, వీరశైవులు, అద్వైతులు, ద్వైతివైష్ణవులు, విశిష్టాద్వైతులు, తదితరులు కర్ణాటభాషలో నుత్తమకావ్యములను పద్య గద్య చంపూరూపముల వ్రాసి ఆచంద్రతారార్కమైన కీర్తిని గడించినారు. ఇట్లుండియు ఆంధ్ర వాఙ్మయ చరిత్రమునొక్క ఉపోద్ఘాతమునందీ క్రింది వాక్యములు కనబడుచున్నవి. 'కన్నడవాఙ్మయము ప్రాచీనమైనది జైనులు వ్రాసినవి కనబడుచున్నమాట సత్యము. కాని, ఆ వాఙ్మయములో ముఖ్యమైనదంతయు నాంధ్రులు రచియించినదని మాత్రము నమ్మదగు.' ఈ వాక్యమున కుపబలముగా కొన్ని గ్రంథకర్తల పేరులు వ్రాయబడినవి. అయ్యవి యేమి వారు తెలుగ లను భ్రాంతిని పొడగట్టుచున్నవి—మైదున రామయ్య, మరుళ దేవ కేతె మహాపద్మరస. ముఖ్యమైనదంతయు నాంధ్రులు రచియించినదని మాత్రము వివేకవం తెట్లు విశ్వసింపగలరు. 'ఇంతమంది యాంధ్రులు కన్నడదేశమునకుబోయి వారి లక్ష్యలక్షణగ్రంథముల వ్రాసి యార్యనాగరికతను కర్ణాటకమున వ్యాపింపజేసి కన్నడులకు మహోపకార మొనరించిరి గదా!' పంపకవి మున్నగువారికిముందే దుర్వినీతమున్నగు వారి గద్యపద్య లక్ష్యగ్రంథములుండి యుండుటంబట్టియు, నృపతుంగమున్నగువారి లక్షణ గ్రంథములుండి యుండుటంబట్టియు, పై వాక్యము వాస్తవమైనది కాదు. 'మనము వారిలిపి నెరువు దెచ్చుకొను నంతటిదీనులమా?' అల్పస్వల్ప భేదములతో నేటివఱకును కన్నడిగల తెలుగల లిపి లేఖనము ఒక్కటియునై యుండుట ఈ వాక్యమున నుపేక్షింపబడినది. 'వీరశైవ మతస్థాపకుడగు బసవన్న తెలుగువాడైనను కర్ణాటకుడైనను బిజ్జలరాజు మంత్రిగానుండి కర్ణాటదేశమున నుండెను. అతని చరిత్రమును వ్రాసినది పాల్కురికి సోమనాథుడు బసవపురాణము తెలుగులో వ్రాసిన పిమ్మటనే కర్ణాటకు లదిని భాషాంతరీకరించుకొనిరి. మనము వారికి గురువులము కామా?' కన్నడదేశస్థుని చరిత్ర

మును లిపిలేని తెలుగువారా ముందు వ్రాయవలసినది? గీటుంచిన వాక్యములనందు విరుద్ధోక్తుల లక్షించునది. పాల్కురికి సోమన్న కర్ణాటకుడని ముందే నుడివితిని. కన్నడవచనముల బలికిన కన్నడిగ బసవన్న సోమనాథుని పరమగురువు. శిష్యుడు పరమగురువునను మరచుట అక్రమము. 'కన్నడ గ్రంథములన్నియు తెలుగునకు విమ్మట బుట్టినవియని నే వాదింపను. భారతభాగవత రామాయణములు మన తెలుగు గ్రంథములకు విమ్మట బుట్టినవి. అంతేకాదు. ఈ మూడు ముఖ్యగ్రంథములను మన తెలుగు వారే కన్నడులకు వ్రాసిపెట్టిరి. తెలుగు వారు వ్రాసిన పిమ్మట కన్నడకవులుకూడ భారతరామాయణములను తిరిగి వ్రాసికొనిరి. ఇది బహుశః తెలుగు వారి భాషాంతరీకరణములకు ప్రతిశేకమై యుండవచ్చును' ఇవియన్నియు విపరీత సిద్ధాంతములు. తెలుగు కావ్యరచన పదునొకండవ శతాబ్దమునుండి విజృంభించినది. పంపని జైన భారత మంతకుముందే కర్ణాటభాషలో వ్రాయబడినది యున్నది. పంపడు తెలుగుడు కాదని ముందే దెలిపినాము. మరియు 'కవివ్యాసనెంబగర్వ మెనగిల్లె' అని పంపడు తనభారతమున నుడివియుండుటం బట్టి యతనికి ముందు బ్రాహ్మణ భారతమొకటి యుండెననియు వ్యాసకథానుసారముగా భారతమును పరివర్తించిన కవివ్యాసుడను నతడొకడుండెననియు దెలియనగు. పంపనితరువాత వ్రాయబడిన భారతభాగవత రామాయణగ్రంథములు జైనభాగవత రామాయణముల పరివర్తనలు కావు. అవ్వాని బ్రాహ్మణ భారతభాగవత రామాయణముల అనువాదములు. అందులో కొన్ని గ్రంథముల కర్తలు, తెలుగు బ్రాహ్మణ గ్రంథముల కర్తలు, సమకాలికులు. కన్నడ తెలుగు బ్రాహ్మణ భారతభాగవత రామాయణములను బోల్చిచూచిన, పోలికలకంటె భేదములే మెండుగా నున్నవి. కర్ణాటకవుల గ్రంథములు విశేషముగా సమవాదములుగాని తు, తప్పని సంస్కృత గ్రంథ భాషాంతర పరివర్తనలు గావు. గ్రంథములు ఆయాదేశములనుండిన మతప్రాశస్త్యానుసారముగా వ్రాసినవి. కర్ణాటభాషలో పురాతన బ్రాహ్మణ భారతము లేదనిన తెలుగున పురాతనజైనభారతము లేదనవలసి వచ్చును. అట్టిపోలిక జూపతగదు. పైజెప్పిన కారణములంబట్టి, ముఖ్యగ్రంథములను తెలుగువారే కన్నడులకు వ్రాసిపెట్టిరనుట అసంభవము. కర్ణాట వాఙ్మయ వైభవమును కనుగొనిన సత్యాంశము స్పష్టముగా దెలియనగును.

వాఙ్మయ స్వరూపములనుబట్టిగాని, కాలమానమును బట్టిగాని రాజ పరంపరలనుబట్టిగాని, కవికులములనుబట్టిగాని, మతావలంబనములనుబట్టిగాని, వాఙ్మయ చరిత్రమును వివిధ విభాగములుజేసి వ్రాయవచ్చును. హైందవులు స్వాభావికముగా మతనిష్ఠగలవారగుటం జేసి, మతదృష్టిని గ్రంథములను, గ్రంథకర్తలను విభజించి వ్రాయుటవలన గ్రంథసృష్టికి కలిగిన కాలదేశపాత్ర ప్రమాణసమష్టియు, తదితర కారణసాధనములును స్పష్టముగా కన్పట్టును. కావున నామార్గమే ఇందు అనుసరింపబడినది. అదిగాక, కర్ణాటవాఙ్మయవృద్ధి యామార్గమువనే కలిగినది. కర్ణాటవాఙ్మయమును, జైనులు వీరశైవులు, అద్వైతులు, ద్వైతవిశిష్టాద్వైత వైష్ణవులు, తదితరులు వ్రాసిపోషించినారు. అందు అనర్ఘములయిన మతశాస్త్రగ్రంథములు మనోహరమైనవి, నీతిమార్గదర్శకములైనవియున్నవి. స్థాలీపులాకన్యాయమున స్థూలముగా కొన్నిటి నిందు పరిశీలించి చూతము.

ఇట్టికావ్యావలోకమునకు ముందు, కర్ణాటదేశమున నిట్టి ప్రాచీనప్రశంసనీయ జైనకావ్యోత్పత్తికి ప్రబలకారణమేమియైయుండునని పరీక్షించి తెలిసికొనవలసినది. కర్ణాటవాఙ్మయము చిరకాలమునుండి వచ్చినది. నృపతుంగుని కవిరాజమార్గమునుండి యతనికి ముందే పద్యగద్య గ్రంథములనేకము లుండెనని దెలిపితిమి. ప్రాచీనకాలమునుండి జైనులు ఉత్తమధ్వనికావ్యములను కర్ణాటజనాంగమునకు వ్రాసిపెట్టిరి. వారిఋణభారమును కర్ణాటకులు ఎన్నటికిని తీర్పజాలరు. అంతయిరత వారి యప్పును దీర్పబూనిన వారి గ్రంథములనాదరించి వానియందలి కావ్యధర్మములను నీతులను అనుసరించుటయే. కర్ణాటకవుల ప్రధానకావ్యములెల్ల జైనకృతములుగానుండుటకును అవ్వానియే పురాతనములుగానుండుటకును కారణములుండవలయును. దక్షిణహిందూదేశమున కర్ణాటప్రదేశమే సమస్త మతములకు జన్మభూమియు శరణాలయమునై యుండె

ననితొలుతనే దెలిసికొంటిమి. అనేకమతములలో జైన మతమొకటి. వైష్ణవము, జైనము, శైవము బహుకాలము నుండి దక్షిణ హిందూదేశమున నుండెనని ప్రాచ్యపాశ్చాత్యపండితులందఱును ఒప్పుకొనియున్నారు. జైనము విషయమున, పాశ్చాత్యులు, ఉత్తరహిందూదేశమే జన్మభూమి యని అభిప్రాయమిచ్చియున్నారు. జినమహావీరుడు అతని పూర్వికులలో కొందఱు ఉత్తరహిందూస్థానమున జన్మమెత్తియుండవచ్చును గాని తీర్థంకరులందఱు నందే పుట్టియుందురని భావించుటకు అవకాశము లేదు. జైనుల తీర్థంకరులలో ఆదితీర్థంకరుడు ఋషభుడు. భాగవతమున విష్ణ్వంశసంభూతుడగు ఋషభచక్రవర్తి చరిత్రమున్నది. భాగవతమున పాషండమతము పేర్కొనబడినది. జైనఋషభునకును భాగవత ఋషభునకును సంబంధమున్నట్లు తోచుచున్నది. జైనులకు కేవలజ్ఞానులందఱు పూజ్యులే. జైన వీరశైవులవలె వారు విష్ణువు నప్రముఖముగా జూచెదరు. వైష్ణవులు, జైనులు, ఋషభునియందు విష్ణ్వంశమును, తీర్థంకరలక్షణములను కనియుందురు. వైష్ణవులు పేర్కొను ఏకవింశత్యవతారములలో ఋషభుని నొకటి. ఈయుదాహరణప్రబలముగా, వేంకటాచలమునకు, కృతయుగమున వృషభాచలమను పేరుండెనని శ్రీనివాసకల్యాణమున జెప్పబడియున్నది. ఋషభచరిత్రమును గురించి జైనవైష్ణవ కథాంశములందు భేదములు కన్పట్టుచుండినను, వేంకటాచలముక్రింద బలరామక్షేత్రముండుటయు, అందు బలరామకృష్ణులుండుటయు, పద్మావతీదేవి యుండుటయు కొండపై క్షేత్రస్వామియగు శ్రీ భూవరాహమూర్తి యుండుటయు అందు శ్రీనివాసమూర్తి పిదపవచ్చి నివాసము చేయుటయు, క్రమేణ వృషభాచలము అంజనాద్రి మొదలగునవి యగుటయు, నేటికిని మ్రొక్కులకై భక్తులు కాషాయముల ధరించి కొండనెక్కుటయు, కేశఖండన మొనరించుటయు, కొండపైన తీర్థప్రసాదములు జాతికులభేదములు లేక నారగింపబడుటయు, మహాంతులు ధర్మకర్తలుగా నుండుటయు, వారు సమాధిని బొందుటయు జైనతీర్థక్షేత్రసంప్రదాయములను దెలుపుచు వైష్ణవాద్వైత సంబంధము లనుగూడ జూపుచున్నవి. వైష్ణవాద్వైతముయొక్క ఏకవింశత్యవతార పురుషులలో నొకడగు కపిలమహాముని యొక్క తీర్థమునందే కొండక్రింద నున్నది. వృషభాసురుని జంపి శ్రీమన్నారాయణుడు అందు నిలిచెనను పురాణోక్తమునుండి తొలుత జైన వైష్ణవ కలహముండి పిదప నయ్యది [illegible] నాస్థలము వైష్ణవపుణ్యక్షేత్రమయ్యెనని సమాధానము నొందవచ్చును. జైనులకు శైవులకు మతవిషయముల మొకటియే యైనను వారివారిలో Protestantand Catholics కు గలభేదము కన్పట్టుచున్నది. అహింసనే పరమధర్మముగను ప్రథమధర్మముగను పరిగ్రహించి వేదప్రమాణమును నిరసించినందుకై పాషండమనిపించుకొను జైనము, ద్వైతాద్వైతములనుండి దగినది. అయిన జైనులు ద్వైతాద్వైతులవలె త్రిమూర్తులను పూజింతురు. శైవము వైష్ణవ వైరమున వీరశైవమై జైనమును నిరసించినది. శ్రీనివాసమూర్తి శివనారాయణ చిహ్నములు కలిగియున్నాడని భక్తులోక్తి. ఇయ్యది శివనారాయణ సంబంధమును సమర్థించుచున్నది. శైవులను వృషభుడు గలడు. అయిన నతనికి గణపతిస్థానము విధింపబడినది. ఇతనిని గురువుగా గొన్నవారు వీరశైవులు. వీరశైవులు జైనులవలె శివనారాయణ సామ్యమునకును అభేదమునకును సమ్మతింపరు, సహింపరు. అందుచే కాబోలు వీరశైవులు వేంకటాద్రికి బోవుటరుదు. ఇప్పుడు వేంకటాద్రి వైష్ణవులచే భూవైకుంఠముగా భావింపబడుచున్నది. దైవానుసంధాన భక్తిశక్తుల భక్తులకు కోరిన కోరిక లబ్బుచున్నవి. పురాతనకాలమునుండి కర్ణాటము జైనసంబంధముగలదియని దెలిసికొనుట కింత జెప్పవలసివచ్చె. ఈకారణము చేతనే యుండవలయు, ఉత్తరహిందూస్థానమున ద్వాదశవర్షక్షామము కలిగినపుడు, భద్రబాహుముని, చంద్రగుప్త చక్రవర్తి మున్నగు శిష్యులతో ఆది జైనజన్మభూమియగు దక్షిణహిందూస్థానమందలి కర్ణాటదేశమునకు వచ్చినది. అందుకే కాబోలు, శ్రవణ బెళగొళ, కారకళ మున్నగు స్థలముల ఉన్నత జైనవిగ్రహములు, కర్ణాటదేశమున కాన్పించుచున్నవి. అందుకే కాబోలు మాతృభాషాభిమానులగు జైనులు తమకెల్లి బాసనే తొలి నాటినుండి కబ్బములను బలికిరి. కర్ణాటమున జైనమత

ప్రాబల్యమునకును జైనకావ్య బాహుళ్యమునకును కొన్ని కారణముల నిట్లు అన్వేషించి జూచితిమి. ఇక జైనవాఙ్మయ మాధుర్యము నింత వరిగోంచము.

జైనకవుల గ్రంథములు వారి మతధర్మములకును కావ్యధర్మములకును ఆదర్శప్రాయములుగా నున్నవి. జైనకవులు సంస్కృతమునను కన్నడమునను సమాన పాండిత్యమును కలిగియుండినందున మనోహరములైన మహాకావ్యములను వ్రాసినారు. తొల్లిటికవులు తల్లిబాస యందలి కూర్మిని కావ్యములందు అచ్చగన్నడబాసను జాతివృత్తములను హెచ్చుగనుపయోగించిరి. అందుకే తరువాతివారు అట్టిబాసను "హళెగన్నడము" అనిరి. వాఙ్మయవాహిని ప్రవహించుచు కాలక్రమమున మార్పు జెందుట సహజము. నిన్నటిబాస నేటికి ప్రాతదిగా వచ్చును. హళగన్నడమనుట అట్టిమార్పునుబట్టియే బలికి నదియని జెప్పనొప్పదు. అట్లుబిలుచుటకు ఏదోయొక భేదమో లక్షణమోయుండవలయు. దక్షిణోత్తరమార్గము లను నృపతుంగుడునుడివినాడు. అయ్యదిదండికావ్యోక్తి పరివర్తనమని కొందఱనిరి. అటులయిన నతడు కర్ణాట భాషలో నుదాహరణముల నేల యొసగెను? అట్లొసగుటకు సాధ్యమెట్లుయుండు? అది దండి కావ్యోక్తిననుసరించియుండిన నుండవచ్చును గాని, కర్ణాట కావ్యములందును అట్టి దక్షిణోత్తరమార్గములు లేకుండిన నతడట్లు వ్రాసియుండడు. ఇదియట్లుండనుండు. నాగవర్మ, వైతాళికమునందు ప్రాచ్య, ఉదీచ్యములని భేదములు గలవని నాడే? దీనికేమి యుత్తరము జెప్పనగును? కావున భేదములనుబట్టియే అట్లు జెప్పియుండును. ఇదిగాక—

౪. 'పొసగన్నడిదింవ్యాప
ణిసువెం సక్కృతియనెందు కన్నడమంచిం
తిసిమాడలాఅదిక్కల్
మిసుకదసక్కదము నిక్కవవనుం కవియే.'
'సక్కదమం పేళ్వొడె నెఱె
సక్కదమం పేళ్గె, శుద్ధకన్నడదోళ్ తం
దిక్కువుదె సక్కదంగళ?
తక్కదెబెరసల్కె ఘృతముమం తైలముమం.'
క్రీ. శ. ౧౧౧౨—నయసేనుడు.

దీనివలన నాటికే అచ్చగన్నడముగాని సంస్కృత మిశ్రోక్తిని హొసగన్నడమని భావించినట్లు దెలియుచున్నది. ఉచ్చారణమొకటియైయుండు రెండక్షరములకు భేదనియమమేలయని హరీశ్వరుడు గొంతువిచ్చిచెప్పి వ్రాసినాడు. కేశిరాజు కాలమునాటికి కన్నడమునకు సమసంస్కృతోక్తి యొకవిశేషలక్షణమై పోయినది. అతడు 'సమసంస్కృతోక్తి యిందరిదత్తె కన్నడం' అని నాడు. అలు, కుళ, క్షుళ ప్రాసనియమమును, సహజ అలునిర్ణయమును, ధాతునిర్ణయమును, ప్రయోగసారమును శబ్దార్థ నిర్ణయమును తనశబ్దమణిదర్పణమను వ్యాకరణమునజేర్చినాడు. నేతిలో నూనెగలసినట్లు అచ్చగన్నడములో సంస్కృతముగలపి యీ పదార్థవర్ణరుచి వాస్తవ్యవాసన స్వరూపములను చెదరజేసినది. అచ్చగన్నడమున గ్రంథములను వ్రాయగాదను వంతఱలకు వచ్చినది. అప్పుడు ఆండయ్య క్రీ. శ. ౧౨౩౫ తన 'కబ్బిగరకావ' అను అచ్చగన్నడగబ్బమును మధురముగాను మనోహరముగాను మహాకవులెల్ల మెచ్చవ్రాసినాడు. కావున, కావ్యము నందుండు అచ్చకర్ణాట సంస్కృతశబ్దస్వరూపసంఖ్యాధిక్యములనుబట్టియే 'హళగన్నడము=Pure ancient Kanarese అనియు, హొసగన్నడము=Mixed (with sanskrit) Modern Kanarese అనియు ఆమాటల కర్థము జెప్పవలయునుగాని, కాలమునుబట్టిగాదు. హళగన్నడమని హొసగన్నడమని దెలిసికొనుటకు పైజెప్పినదియ ప్రధానభేదము. హొసగన్నడమున వ్యాకరణ సూత్రబంధము వదలగుటయు వ్యవహారభాష లోజొచ్చుటయు పైజెప్పిన భేదపరిణామ లక్షణముగా దెలియనగు. వీనింబట్టి క్రీ. శ. ౧౧౬౧ ఉండిన మడివాళమాచయ్య వచనములందలి భాష హొసగన్నడముగుచున్నది. అయ్యది వ్యవహారసిద్ధమైన గ్రామ్యభాషగా కనబడుచున్నది. కాలమునుబట్టిమీదిన అర్థానిని హళగన్నడమని జెప్పవలసియుండును. పైజెప్పిన కారణములనుబట్టి దానినట్లు జెప్పతగదు. మఱియు నాధునిక, అత్యాధునికగ్రంథములగు రామాశ్వమేధము, నీతిమంజరి మొదలగువానియందు ప్రయోగించినభాషను పైజెప్పిన లక్షణములనుబట్టి హళగన్నడమనియేజెప్పనొప్పును. తెలుగునను ఇట్టిస్థితిగలదు లే,

# కేదారనాథ చిత్రములు



౧. గౌరీకుండమునుండి కాన్పించు కేదారనాథ్ దృశ్యము

కన్పట్టుచున్నవి. సంస్కృతవాఙ్మయాధికారమే వ్యాపించియుండి, అప్పుడెనుగునకు తెనుగన్ననాటికి తెల్లవారినది; తిమ్మకవినాటి కయ్యది తేజరిల్లి నేటిభావకవుల అస్త్ర ముల లాస్యమాడుచున్నది. ప్రాచీనకర్ణాటకవులు హళగన్నడమునే ప్రయోగించిరి. కబ్బములనెల్ల తల్లిబాసనే చక్కగా నల్లచాలిరి.

జైనులకావ్యము లెక్కువగా వారి మతతీర్థంకరుల జన్మజన్మాంతర చరిత్రకథనములుగానున్నవి. వీనిని వారు పురాణములందురు. అహింసయే వారి ప్రథమధర్మము పరమధర్మమునగుట నకావ్యములన్నియు శాంత కరుణారసములతోనిండి వాచకుల హృదయములను సదయములుగను సౌమ్యములుగను జేసి సౌఖ్యము నొసంగుచున్నవి. వీరరసము కర్ణాటకులకు సహజమైనది. అయ్యది వారి జాతిరసమని జెప్పవచ్చును. అందు రన్నని వీర రసపోషణ మత్యద్భుతము. దీని ననుభవించి యానందమొందవలయునన్న అక్కవి సాహస భీమవిజయము నాద్యంతము జదువవలయును. ఇందలి భావపోషణము భాసమహాకవి ఊరుభంగములోని భావపోషణమున కెనయగు. రన్ననికి మార్గదర్శకుడైన పంపమహాకవి విక్రమార్జునవిజయమను గ్రంథమునుండి యొక భావప్రదర్శకమైన పద్యమునొకటిని వ్రాసి, రన్ననిపద్యము నొకటి వ్రాసెదను. పంపకవి గంభీరశైలిని సముచితవాక్య సంగ్రహములను తొలుత నొక రెండుపద్యముల గన్గొము. ఇంగు, తెలుగున నొకవీరపత్ని వాక్యములుగా వర్ణింపబడు ప్రసిద్ధచాటుపద్యములోని భావమును పంపడు తరతరములకుముందే తన కావ్యమున వ్రాసినాడు. అయ్యది అంబాలిక సాల్వుని పెండ్లియాడగోరిన సందర్భమున, భీష్మునిచే పరాజితుడైన సాల్వుడనుమాట:—

క. 'బంధన దొళెన్ననొడిసి
కొండొయ్దుం నిన్ననా సరిత్సుత నానం
పెండతియోనాదె వనరిం
పెండిర్ పెండిరొళదంతు బెరసువరబళే.'

విక్రమార్జునవిజయము.

'పగఱకు వెన్నిచ్చినచో
నగరే నీమగతనంబు నాయకులెల్లన్.
మగువాడు వారమైతిమి
వగపేటికి జలకమాడవచ్చినచోటన్.

చాటుధార.

కన్నడ కవిత్వమున అపగునకు నూరుమడి సంస్కృతకవిత్వమున కాళిదాసునకు నాల్గుమడియని చెప్పికొనిన పొన్నని వచన పద్యరచనలకు అతడు శాంతి పురాణమునందు బలదేవ వాసుదేవులను వర్ణించుచోట ఎదివి దెలిసికొననగును.

మ. స్ర.—

'ఉదయక్ష్మాభృత్తటం రంగమ నుడుతతి పుష్పాంజలిక్షేపమం పర్వినుగ్వైప్పంధకారం నవజవనికెయం నాల్కజావంగళుంతప్పదె నాల్కంకంగళం పొత్తుమర్దిరె హిమకృన్నాటికా సూత్రధారా ధ్యానయ ప్రారంభమింద్రాశెయొళె నియొనెచెల్వాయ్తు శీతాంశు బింబం.'

శాంతిపురాణము,

పంపపొన్నలఘక్కి ననుసరించినను రన్నడు—

క. 'రసమం భావముమం కా
శసమం కుణికెయుమనఱిదు కవిమార్గదొళం.
పొసదేసెయనుడిగళొళం
పొసయిపబల్మెగె చతుర్ముఖం కవిరన్నం.'

పై సొగడ్తకు తగిన గద్యపద్యోదాహరణములను గదాయుద్ధ గ్రంథమున గననగును. భారతవీరుల చరిత్రములను సింహావలోకన న్యాయమున సంగ్రహించి గదా యుద్ధ గ్రంథమున దుర్యోధనునినోట బలికించినాడు. అయ్యది రన్నకవి సంగ్రహరచనశక్తిని చాటుచున్నది. ఈపద్యమున దుర్యోధనుని వీరభావ మెంతకొనియాడదగినదిగా జేసినాడో జూడుడు. అభిమన్యుడు సమరభూమి నిదీర్ఘనిద్రను శయనించియుండుటంజూచి వీరదుర్యోధనుడిట్లు ప్రార్థించుచున్నాడు:—

క. 'అసమబల! భవద్విక్రమ
మసంభవం పెఱర్గె నిన్న నానిసిసంప్రా
ర్థిసువె నభిమన్యు నిజసా
హసైకదేశానుమరణ మెమగక్కింగుం'.

గదాయుద్ధము.

మితభావన ప్రమాణముల వ్రాయబడినది. అందుకే కర్ణాటమున వీరకరుణరస ప్రధానములగు కావ్యములే మెండుగానున్నవి. తెలుగున శృంగారకావ్యము లధికముగా నున్నవనవచ్చును. ఇట్టి గతి, జాతిమత మనోభావముల ననుసరించియున్నది. కావ్యరచనయందు జైనకవులు జూపింపనిమార్గమే లేదు. వారు కర్ణాటకవులకును తెలుగుకవులకును పురాణములు వ్రాయుటయందును, పద్య గద్య సంపూర్ణకావ్యరచనచేయుటయందును మాతృభాషనే మనోహరముగా నుపయోగించుట యందును, సమసంస్కృతోక్తిని ప్రయోగించుటయందును, జాతివృత్తముల వాడుటయందును, చిత్రకవిత్వము జేయుటయందును పైబంతి వ్రాసియిచ్చి వాసికెక్కిరి.

వీరశైవగురువగు బసవారాధ్యుడు తాను తన మతతత్త్వమును తన మాతృభాషలోనె వచనరూపమున వ్రాసి, తన ముఖ్య శిష్యులు మతగ్రంథములను కర్ణాటభాషనే లిఖింప మార్గమును జూపిన దెంతయు ప్రశంసనీయమైన మహోపకారముగా నున్నది. బసవారాధ్యుని వచనము లతి మధురములు. అయ్యవి సంగీత సాహిత్య సారములు.

'గిళి యోదిఫలవేను? బెక్కు బాహోదు హేళలరియదు. జగవెల్లకాంబ కణ్ణు తన్న కొంబుగ్గాయ కాణలరియదు. ఇది రసువాద బల్లెనెంబరు అమ్మనుగాద నరియరు. కూడలసంగమదేవా, లోకదడ్డొంక నీవేకిగ్గువిరి? నిమ్మనిమ్మ తనువ సంతైసికొళ్ళి. నిమ్మనిమ్మ మనవ సంతైసికొళ్ళి.'

ఇతని కాలమునను, తరువాతను పలువురు వీరశైవ స్త్రీపురుషులు తమ మతతత్త్వబోధనార్థ గర్భితమైన అచ్చగన్నడమున గద్యపద్యముల వ్రాసినారు. హరీశ్వర రాఘవాంక మొదలగు వీరశైవకవులు సుప్రసిద్ధులు వారినిగురించి వెనుక వ్రాసినాను. విరుపాక్షు పండితుని చెన్న బసవపురాణమందలి సరళశైలి శ్లాఘనీయమైనది.

వా. వ. 'అంజదిరి! సురనికరవంజదిరి! దనుజకట
కంజదిరి! భువనజనవంజదిరి! నాటక
భజంజిసువెనీ కాలకూటమం నానెనుతకరవెత్తి
[బారెనల్కే
అంజువమహా భీతియిందె నిష్ఠురమాద
నం దుగ్దభవనం గైతళ దొళ్ళాత్కణం
మంజుళ కెంపుగళ పరికిసకనంతె శివనిరల్కెకలరుం
[నతియిసిదరు.

విషపాన లీలావర్ణనము.

రాజశేఖరవిలాసము, శబరశంకరవిలాసము వృషభేంద్ర విజయము మున్నగు శ్లేషాలంకృత ప్రఖ్యాతకావ్యములను వ్రాసి కర్ణాటవాఙ్మయమునకు నిరంతర కీర్తిని గడించిన మహాకవులలో నొకడగు షడక్షరి కవికృత పద్యముల నొకదాని నిం దుదహరించెదను.

మ. 'సెరెగెముళ్ళదితె నాచిపంతె నగెతాంగ నారి
[యనాడె బం
దిరు చెన్నం కరదిందెముట్టిదినిజం దోషాకరం
[వక్త్రమం
భరదిం ముచ్చిదె కందినంగళి నాచవ్యాజదిం పేళె
[తా
స్మరె పాదాగ్రదె నూంకిదం ముళిదనం రాశిగా
[ల్పంప్రనం.
రాజశేఖరవిలాసము.

తిరువళ్ళువకవి కురళ్ నీతుల బోలెను, వేమన వేదాంత పద్యముల బోలెను, హరిదాసకూటమువారి స్వమతసార బోధ బోలెను, అసంఖ్యాకములైన త్రిపదులయందు పలు తెరగుల విషయములను బలికిన సర్వజ్ఞమూర్తి కవివాక్యములనుండి రెండు త్రిపదులను వ్రాసెదను.

త్రిపది. 'హాంగిగెరమనెగింత హింగదెయగుడిలేసు
భంగ బట్టుంబ బిడియున్న కింతలూ
తంగళవెలేసు సర్వజ్ఞ'
'తందెయూ గురువియూ ఒందె అంతరవుంటు
తందెతోరువను సద్గురున గురురాయ
బంధనవకళెవ సర్వజ్ఞ'

బ్రాహ్మణ కావ్యయుగమునందు శ్రీమత్తగులును ఉద్గ్రంథములను వ్రాసినారు. క్రమముగా నద్వైత, ద్వైత విశిష్టాద్వైత గ్రంథకర్తలలో నుద్దండకవులను గురించి మాత్రము కొంతపరిశీలించి పసమానంద మొందుదము. చంద్రరాజు, సరసచిత్ర బంధకవిత్వమున తనమదనతిలక మను సద్గ్రంథమును వ్రాసినాడు. అభినవదశకుమార చరిత్రము నతికోమలశైలిని రచించిన చౌండరస యను కవి (౧౩౧౧) 'సుగంధస్ఫుటశబ్దసుందరకిరణ్యాకాన్చంద్రసం చంద్రవం'అని అత్యుచితవాక్యముల నొత్తిపలికినాడు. నాగచంద్రుడు (౧౧౦౫) తన రామాయణమున

క. 'ప్రతికీర్తి త్రిపద్య
ప్రతిరాసువపాండవీయమం విబుధచయ
త్కృతియొనిసగతప్రత్యా
గతదంశ్వర్ధ్వలకీర్తియుం ప్రకటిసిదం'

అని చెప్పెనందున నాటికి జైనులచేత రాఘవపాండవీయమునందు ద్వ్యర్థికావ్యము చేయబడెనదయని జెప్పవగును. కర్ణాటవాఙ్మయ చరిత్రమున చిత్రకవిత్వముకూడ చిరకాలముక్రిందటనే జనించినదియని తెలియుచున్నది. చిత్రకవిత్వముసరసమగుట దుర్లభము. అట్లుండినను రసము చిలుకచిత్రకవిత్వమును చంద్రరాజు ౧౦౨౫ నాటికే మనకు లభింపజేసినాడు. అనేకవృత్తముల నిమిడ్చిన పద్యము నొక్కదాని నిందు ఎత్తివ్రాసెదను.

వనమంజరి:

'అంగన్నృపాయతిశుంగ భుజంకలిసంగిత శిక్షితనింగుయశం, పింగజ దొంగతభృంగశచం కలిమంగళలక్షణయుక్తనిచం, సంగరకేసరి సంగగణా బలి భృంగరదిక్షమ వాయుతేనుం, సంగదసన్మతి సంగపహంస లెభ గియ నీక్షిసిమాచన్నృపం.

ఇదియే ఎడెయక్కరము, కిఱియక్కరము, చౌపది, రెండు సర్పగులు, త్రిపదోన్నతి, పల్లముఖి త్రోటకము, చిత్రపదము, కమళము, చంద్రిక, ఇందుముఖి, మొదలగు ఎనుబదినాల్గువృత్తములు, పాదమురజబంధము, గోమూత్రికయగుననితెలిపినాడు. అట్లు ఉద్ధరింపనగువృత్తములు బంధములు, కన్నడకవిచరిత్రమున విస్తరించివ్రాయబడినవి; జూడనగును. అర్ధపాదగతప్రత్యాగతవిమ చక్రము, ఏకాక్షరి, ద్వ్యక్షరి, త్ర్యక్షరి, పద్యములు; అకారాంత కందము, నిరోష్ఠ్యకందము, ఓకారాంతపద్యము, మున్నగు వానిని సరసముగా వ్రాసియుండుట జూచిన అత్యాశ్చర్యము జనించుచున్నది. జగన్నాథవిజయమను గ్రంథమును వ్రాసిన రుద్రభట్టు కర్ణాటసరసకవి సార్వభౌముడన నొప్పును. తెలుంగుకబ్బములతీపును చక్కగా దెలిసిన నా తెలుగు చెలికాండ్రలో నొకరు నాచేతనున్న అకావ్యమును చదివి యానంద తుందిలమానసులై 'ఏమి యితని శైలి, పెద్దనశైలివలె పెద్దగాపారుచున్నదే!' అని మఱిమఱి పలికి మర్యాదజూపిరి. ఇక కర్ణాటకులకది యెంత ఆనందకారకమో యూహించి యరయునది. ఆమహాకావ్యమునుండి యొకపద్యమును వ్రాసెదను

క. విక్రమమూర్తిగ తాం
చక్రం కటిసూత్రమాగ తత్కటిసూత్రం
చక్రిగె బాల్యక్కనయు
పక్రమవాగ్యోనిని మూర్తినుడెనణియోసనుం.

కృష్ణబాలలీలావర్ణనము

తరువాత నెందరో కవిపుంగవులు కర్ణాటభాషలో ఘనకావ్యములను వ్రాసినారు. అయిన కర్ణాటజాతి వ్యక్తిత్వమును గాని, సాటిలేని, బాదరాయణమహర్షి మతానువాదమగు కర్ణాటభారతము కర్ణాటకావ్యములలో నెల్ల అద్వితీయస్థానమును బడసి పండిత పామరజనాదరమునకు పాత్రమై యున్నది. ఇది గదుగచెంతనుండు కోడివాళమను గ్రామమునకు అధికారియైయుండిన నారాయణప్ప యను బ్రాహ్మణోత్తముడు బలికినది. కవి ఈ కావ్యమును గదుగలోనుండు శ్రీ వీరనారాయణస్వామికి అంకితముగా జెప్పినాడు. నరాంకితములు గాక, నారాయణాది దైవాంకితములగు గ్రంథములే కర్ణాటమున నధికముగా గననగు. ముఖ్యములగు కర్ణాటభారత, భాగవత, రామాయణ జైమినిభారతములెల్ల దైవాంకితములు. నారాయణప్ప, వేదవ్యాస మహర్షి మూలగ్రంథము ననుసరించి, తప్పకుండ పరివర్తించి దానిని నీరసముగాజేయక అందలి కథాసారాంశములను మాత్రము సంగ్రహించి నిరుపమశైలిని నీతిస్వారస్యముల గలిపినాడు. పర్వాంతగద్యమునందు 'ఇతి శ్రీమదచింత్యమహిమ

గదుగు వీరనారాయణ చరణారవింద మకరంద మధు
పానపుష్ట వచష్టప్పదీనికాయ శ్రీమత్కుమారవ్యాస
యోగీంద్ర విరచిత మప్ప కర్ణాటభారత కథామంజరి
యొళ్' అని చెప్పికొనియుండుట వలన గ్రామాధికారి
యై యుండినందున నారాయణప్ప, నియోగి యొక్క
టియే గాక, యోగియు నూతనశబ్దశక్తి ప్రయోగియునై
యుండెనని దెలియవచ్చుచున్నది. యోగీంద్ర శబ్దము
అతని పరమభాగవతశీలమును బలుకుచున్నది. ఈ పరమ
భాగవతుడు శ్రీ పరమాత్ముని పాదములకు భారతకథాకు
సుమమంజరిని భక్తిభావమున సమర్పించినాడు.

౭౦. లలితపదం ప్రసన్నకవితాగుణమిల్లదె పూర్ణదోషదూ
షితకృతిబంధముం బరహకారరక్తె గళకేడు, మణ్ణిన
ప్పళకదకేడు, పేళిసిదొడక్కదకేడెను పేద్దుబీగిసా
ట్టళిసి నెగళ్తె గాటిసువమహ్కనియుం కవియెంబలె
కక్కమే.

అనిపలికి ప్రౌఢశైలిని కావ్యమువ్రాసిన పంపకవి వాగ్ధా
రనుమించి కుమారవ్యాసుడు కబ్బమును బలికినాడు.

భా. ష. 'హలగె బళహుపసిడియదొంద
గ్గళికె, పదవిట్టళుపదొంద
గ్గళికె, పరరొడ్డవదరీతియ హిడియదగ్గళికె
బళసిబరెయలు కంఠపత్రద
ఉలుహు కెడదగ్గళికెయెంబీ
బలుహుసలువుదు వీరనారాయణన కింకరగె.'

అని సుకవి లోకులందఱు నౌనవునన తనప్రతిజ్ఞను పరి
పూర్ణముగా సాధించినాడు. కుమారవ్యాసుని ఆసుధార
వీరకరుణరసద్వయ ధారాసాలంకృతము. అతడు కంఠము
తోగాము కబ్బమును నడపుట, కత్తితో. కర్ణాటకులజాతి
రసము వీరము. అద్దానిని కుమారవ్యాసబిరుదాంచితుడైన
నారాయణప్ప, ఉన్నతహిమవత్పర్వతమునుండి విశాల
సమతటమున కుఱుకుచున్న గంగాంబువులబోలె తననాలు
కనుండి వెడలు భామినీషట్పదీ జీవనధారలను కర్ణాటరసిక
కవిజన జీవనాధారములుగా పారించి వాచకుల హృదయ
ములను పావనముజేసినాడు. ఈమహాకవుని భామినీష
ట్పదులందు మందాకినీ మహావేగమును, మంజుళస్వర
మును మకరందమాధుర్యమును ముప్పిరిగొన్నవి, ఇతని
వీరవాక్యములు పిఱికిపందలను సహితము పౌరుషవంతు
లుగాజేసి వీరావేశమున విజృంభించునట్లు జేయుచున్నవి.
ఇతనికిపూర్వము, వీరరసమును నీరసముజేయక, భీమసే
నోక్తుల, వైశంపాయన సరోవరమున నీటడాగినదుర్యో
ధనుని నేమమున్నైన వెడలజేసి చెనుకుతో బయటికిరాబలి
కిన రన్న కావ్యోక్తులు మాత్రమే యున్నదగినవి. అదే
సందర్భమున కుమారవ్యాసోక్తుల బోల్చిచూడుడు.

భ. ష. 'ఏకుకౌరవరాయ సలిల
వ్యాళనే నీనకటా! జలవాళ
గాడుపరి! కాళొన్నువిన్నలి గిరుఐళీళంతం
కాళగదొళద్దిదె సహొటగ
జాల పుత్రజ్ఞాతి బంధున్న
పాలరను, నీనీగొళడగిట, కష్ట! హోగెంద.'

నారాయణప్ప—
'బణగు కవిగళబగెననేసా
కెణిసదిరు శుకరూపనల్లద
కుణిసినగనే కవి కుమారవ్యాసనుళిదరె'

అని చెప్పినట్లు ఎవ్వరినెగురాపి జేయజాలడు? అందుకే
భాషలనెఱింగిన రసికశిఖామణులు వీరకరుణ రసాస్వా
దమునకు కుమారవ్యాస కర్ణాటభారతమును, భక్తిరస
భావానందము నొందుటకు బమ్మెరపోతన తెలుగుభాగ
వతమును, సద్భక్తిస్వాగస్యమును గనిగొనుటకు కంబతమిళ
రామాయణమును చదువవలెనని స్వానుభవైక్య సిద్ధాంత
మును చాటినారు. కర్ణాటభాషలోను సంస్కృతభాష
లోను అనుపమ పాండిత్యము కలిగి కుమారవ్యాసభారత
శేషమును భవ్యశైలినివ్రాసి, శ్రీవేంకటాచలమూర్తిని
కృష్ణదేవరాయ సత్కవ మూర్తిని మెప్పించిన తిమ్మణ్ణకవీం
ద్రుడు కుమారవ్యాసుని వాక్ప్రవాహమును పరమపావని
యైన అభ్రగంగాఝరికి బోల్చి తన వాక్ప్రవాహమును
యమునకు బోల్చికొన్నాడు. గంగా యమునా సంగమ
మునందు మంగళమహిమ నిది యెంతయు మనోహర
ముగా సూచించుచున్నది. గంగావాహినిబోలె పారు
నారాయణప్ప వాగ్ధోరణికి వ్యాకరణము అందందుపలా

యనమాత్రములకు పఠించినది. ‘ప్రయోగశరణం వ్యాకరణం’ అను శాస్త్రానుభవోక్తికి శరణ్యము చూపవలయునన్న కర్ణాటభారతమునే కనుగొనవలయు. ఈకవిబ్రహ్మ సృష్టించిన శబ్దగణములకై భారతనిఘంటు వను ఒక నూతన కోశము నేర్పరచవలసివచ్చె. కుమారవ్యాసుని కవితాశక్తిని పరదేశకవులతో పోల్చవలసివచ్చిన ఆంగ్లేయభాషలోని షైరను కవితాశక్తికి చెప్పవచ్చును. ఈ వాక్యమునందలి సత్యమును పరీక్షింపవలయునన్న కర్ణాటభారతపర్వసంధి సూచనల సంగ్రహోక్తులనుమాత్రము చదివి చవిజూచిన చాలును. కుమారవ్యాసమహాకవి వీరకరుణరసమాహాత్మ్యములను మనసునకు దెచ్చుకొనవలయునన్న యుద్ధపంచక భాగమును, ద్రౌపదీ మానసంరక్షణకాలమున బలికిన మాటలను స్మరించిన చాలును. కరుణరస నిరూపణమునకై యొక పద్యము వ్రాసెదను.

భా. ష. ‘పతిగళెన్నను మారిమఱ
స్థితియకొంపెరు, భీష్మమొదలా
దతిరథరు పరహితవ బిసుటరువ్యర్థ భీతియలి;
సుతన సిరికదు సొగసలాభూ
పతిగ గాంధారిగె, యనాథెగె
గతియకాణెను, శివశివా యెందొరలిదళు తరళె.’

కుమారవ్యాసకవి తన కావ్యమును నవరసభరితముగా జేసినాడు.

భా. ష. ‘అరసుగళిగిదువీర, ద్విజరిగె
పరమవేదదసార, యోగీ
శ్వరర తత్త్వవిచార, మంత్రిజనక్కె బుద్ధిగుణ;
విరహిగళ శృంగార, విద్యా
పరిణతర సుప్రౌఢి, కావ్యక
గురువెనలు రచిసిద, కుమారవ్యాస భారతవ.’

అని తాను చెప్పికొన్నంత తప్పక జేసినాడు. ‘సారాంశ మేమనిన, కుమారవ్యాసకవి కావ్యము, సప్తవిధ కవిగుణ సారసాగరమని బాగుగా బలుకతగును. రసౌచిత్యము నరసి, వివేకమతిని, అతివ్యాప్తి అవ్యాప్తిదోషములకు పాల్పడక, జాతీయవాగ్జాలములతో భావార్థములకు బాంధవ్యమును బొందించి వీరకథావర్ణనోచితభామినీషట్పదినే వెదికికొని సహజప్రతిభావిశేషమున పారు సరసశైలిని కర్ణాటభారతమను ద్వితీయకావ్యముగా బలికినాడు. ఆ కారణముననే కర్ణాటబ్రాహ్మణ రామాయణమును వ్రాసిన కుమారవాల్మీకి యను బిరుదుగల కవియు అంబికావిజయ మను వీరరసప్రధానమగు కావ్యమును వ్రాసిన బబ్బూరు రంగకవియు తమ శైలికి కుమారవ్యాసకవి శైలియే ఆదర్శమని చెప్పికొని పొంగినారు. కుమారవ్యాసకవిని త్రిమతస్థులును తమ మతస్థునిగా నెన్నికొనుచున్నారు. ఇదియొక్కటియే చాలు అతని వీరవాణికి నిచ్చు కానుక.

కర్ణాటభారతశేషమును వ్రాసిన మహాకవితిమ్మణ్ణ శైలియు కుమారవ్యాసకవిశైలినిబోలి, కలసిపారుచున్నది. నీతికథలను స్వభావోక్తుల నతిమనోహరముగను రసోపకరముగను, నిర్దుష్టముగను వ్రాసినాడు.

భా. ష. ‘బలెయొళగసిక్కి రాత్రియొ
ళళలుతుపవాసదలి కాలన
కళెదె బలువాసివింద, పారణెమాడలెందెన్న
ఒలిదునయదలి కరెవె ఈనుడి
గళను నా నెరెనంబిబహనే
గళపదిఱమోసగొలి, మారియెగెసిలువవనల్ల.’

ఆఖుబిడాలసంవాదము.

‘పద సంపదగళెయలి లిపితిరిగి నోడన బిరుదుగల కుమారవాల్మీకి, తొరవె నరసింహమూర్తి కంకితమిచ్చి బలికిన రామాయణము సర్వజనస్తుత్యమైనది.

‘జానకియే జానకి? జగత్త్రియ
వీరపాతివ్రత్యెయలా! నర
నారియోనై దేహి? నారాయణనపత్నియలా!
శ్రీరమణి చంచలెకణా! కై
వారిదళు నినగెంబ మనద వి
కారవేకె లెయణ్ణ! బిడు జానకియనీనెందు’

రావణ విభీషణసంవాదము.

నిత్యాత్మశుకయోగి విరచిత కర్ణాట భాగవతము నిర్మలశైలిని వ్రాయబడినది. కవి మాతృభాషయందు అత్యధికాభిమానముగలవాడు.

'శొందపగె కొలెతప్పలరివుదె!
తందె! బరిదేబయులమాతిగె
కొందు నీకేళిద నరకక్కెసంబళవగళిసి.
హొందిదపరేమగళె కొలువరు
కొందవర నంతపరక్కై యలి
హొందువరు, హాగెహలవు జన్మాంతరకె బిడదెంద.'

కంసవసుదేవసంవాదము.

కుమారవ్యాసుని కర్ణాటభారతమువలెనే ప్రతి గ్రామమునందు పండితపామరులుచేరి ప్రతినిత్యము చదువు మహాకావ్యము లక్ష్మీశుని కర్ణాట జైమినిభారతము. ఇతనికి 'కవిచూతవనచైత్ర' యను బిరుదుకలదు. ఇతడును వీరకరుణరసభరితంబగు అశ్వమేధపర్వాంతర్గత భారతకథనే గ్రంథవిషయముగా గొన్నాడు. కావ్యమును నరాంకితముజేయక దేవపుర లక్ష్మీరమణునకు సమర్పించినాడు. సాలంకార సార్థశబ్దసంగతమగు వార్ధకమట్పదితో రసవత్కావ్యమును రచించినాడు. సంస్కృత మూలమునకు స్వారస్యమున నేమిటం దక్కువలేదనునట్లు సాధించినాడు. కావ్యము సమస్త రసాలంకారములకు రత్నాకరముగానున్నది. కవిషడ్విధములగు షట్పదులలో వార్ధికమునే కొని వాడినాడు. ఇయ్యది, భక్తి ప్రధానమగు అతని కావ్యమునకు చాల చక్కగా సాగుచున్నది. శృంగారరసమునుకూడ మిగుల వృద్ధిజేసినది. అయిన, వీరరసపోషణమునందు వార్ధకషట్పది వాడియైన శిలీముఖమువలె పారక వీణవలె పాడుచున్నది. కుమారవ్యాసభామినీ షట్పదివలె వీరఘోషముజేసి యుద్రేకమునంతగా నుద్భవింపజేయదు. పౌరుషవర్ణనా సందర్భములందు పరుషశబ్దములుగల ప్రాసవాక్యముల శరణుపొందవలసివచ్చినది. లక్ష్మీరమణుడు వైణికుడై, లక్ష్మీశకవివదనమును వీణగాగొని, జైమినిభారతవాణిని, కర్ణాటభాషను బలికించినాడను ప్రశంసనీయమైన కవివినయోక్తికి ప్రమాణముగానున్నది. అమ్మలు రాగములు దీయుచు యుద్ధభూమిని గ్రమ్ముచున్నవి. ఇకావ్యకథకు సామగానలోలుడును, భారత నాటకసూత్రధారుడునునైన శ్రీ లక్ష్మీరమణుడు నాయకుడగుటచేతనో భక్తభృంగముల వీరవాక్యములు వార్ధకషట్పది శబ్దములై పరలుచున్నవి. సుధన్వ, బభ్రువాహన మున్నగువారి యుద్ధప్రసంగమును, మయూరధ్వజ చంద్రహాస మున్నగు వారి భక్తిప్రసంగమును, శృంగార వీరకరుణరసములతో వెల్లువలై పారుచున్నవి. ఇతనిని సహితము త్రిమతస్థులును తమకవియని సాధింప తమకించుచున్నారు. ఈకవి భావభాషార్థసంపదను జూపుటకై మూడుపద్యముల వ్రాసెదను.

వా. ష. 'నాగేంద్రధనం బిడదొళెవాగి సిత్తమర
నాగేంద్రదనం బుద్ధిగొళియిసితు పురమగ్ద
నాగేంద్రదనం నిందుచెరగాగిసిత్తమలధర్మజనకీర్తిబళిక
నాగేంద్ర శయనాలయవ జడధియెనిసి నుత
నాగేంద్ర వరదాయుధవపొగ్గళెదు మధ
నాగేంద్ర ధరగజాతెయ నిలువుగెడిసిసెరెరాజిసితు
[మాజగదొళు.'

'ఎందొడెలెతాయె కేళ్ చక్రిగె విముఖనాగి
బందనాదొడె నిన్నగర్భదిందుదయిసిద
నందననె? హంసధ్వజనకుమారనె? మేణుహరికింకరనె? వీరనే?.

కొందపెం పార్థనపతాకినియ నవనవట
నందగెడిసువె నిన్న విక్రమోన్నచ్యుతన
ముందెతోరిసువె నినితరమేలె సోలుగెలువదు ప్రణ్యనళెమెందనా.'

'ఇదెతొట్టిల్లాడి సువగిల్ల నిదెగెహోం
దుడిగెయిల్లర నిళెయమిల్ల బిడెదకెవనీ
రుకృడివాల్గళెణ్ణె బెణ్ణెగళిల్ల లాలిసిలినవతందెతాయ్గళిల్ల.
పాడివిపతి కేరళాధీశ్వరం పరకెయొళ్
పడెదనిదకేగనిన్నం నోడువెన్నక
ణ్ణొడె దకటకటెందు బిసుసుయ్దుళల్దుమరుగువళాకె [దినదినదొళు.'

చంద్రహాసుని బాల్యము.

ద్వైతమత వ్యాప్తితో కర్ణాటవాఙ్మయము ఘనముగా వర్ధిల్లినది. మాధ్వులు వీరశైవులుబోలె సులభమును సుందరమునైన తమ మాతృభాషయగు కర్ణాటకమునందే ద్వైతతత్త్వ కావ్యములను నుడివిరి. హరిదాసులో

హిమ్మను మాధ్వుల మతగ్రంథములందు భావకవిత్వము ప్రబలినది. మాధ్వమతప్రచారకులు, మత ప్రచారకులకు నైజమగు సూక్ష్మబుద్ధిని, స్వమతబోధాత్మక సాహిత్యమును సంగీత సమన్వితముగా ప్రయోగించిరి. శైవులు గాని, వీరశైవులు గాని తమతమ మతబోధాత్మక సాహిత్యములనీ సాధనముతో నంతగా సమన్వయము చేయలేదు. సంస్కృతమున నిట్టిగేయములు శ్రీ శంకరాచార్యుల 'భజగోవిందం' జయదేవుని 'గీతగోవిందం' శ్రీ రామానుజాచార్యుల ప్రబంధము శ్రీ మధ్వాచార్యుల 'ద్వాదశ స్తోత్రము' మున్నగువాని రూపముల కొన్ని కన్పట్టుచున్నవి. కర్ణాటభాషలో పాడుంగబ్బమునియొక ప్రత్యేక సాహిత్యభాగమే గలదని ముందే నుడివితిని. అట్టిది సాంగత్యసంగతమై యున్నది. హరిదాసకూటమునకు జేరిన ద్వైతులీ సాహిత్యభాగమును సుళాది, ఉగాభోగ, పాటలరూపమున మఱింతవృద్ధికిని ప్రచారమునకును దెచ్చిరి. నిప్పగావోచు తత్త్వసాహిత్యమును సంగీతసుధనుజేర్చి మధురముగాజేసి పామరజనులకు సేవ్యముగున ట్లొనర్చినారు. ఇట్టి గేయాత్మకమైన సాహిత్యమును మాధ్వు లతిమనోహరముగా నుడివినారు. ఈ దాసకూటకవులకు మార్గదర్శకుడు 'శ్రీమధ్వనామము' ను కన్నడభాషలో వ్రాసి త్రోవజూపిన శ్రీపాదరాయ లనవచ్చును. వారి శిష్యులును విజయనగరసామ్రాజ్య విద్యాపీఠాధ్యక్షులును నగు వ్యాసరాయలు, దానిని మఱింత వెలుగజేసిరి. వారి ముఖ్య శిష్యులలో పురందరదాసులు, వాదిరాజస్వాములు, కనకదాసు మున్నగు కర్ణాటకవులు కర్ణాట మహారాష్ట్రదేశములందు ద్వైతమతబోధను కర్ణాటమాతృభాషను ప్రసిద్ధింపజేసిరి. పురందరదాసపరంపరకుజేరిన విజయదాస ప్రముఖులును జగన్నాథదాస ప్రముఖులును, సారవంతమైన పాటలను, భామినీ షట్పదిలో 'హరికథామృతసారము' అను గ్రంథమును క్రమముగాజెప్పి కృతార్థులైరి. వీరి వ్రాతలలో నొకవిశేషము. పాటలు పద్యములు జాతీయపదములతో నిండియున్నవి. అవ్వాని పామరులకును పండితులకును అర్థమగు ప్రసిద్ధవ్యావహారిక భాషలోనే వ్రాయబడినవి. సంపూర్ణ జీవకళలు గలిగిన సామాన్యమైన వాడుక భాషలో నవి వ్రాయబడియుండుట జనోపకారకములై యున్నవి. సాహిత్యము భావగర్భితముగా, నీతిసుంతముగా, భక్తిరసభరితముగా సంగీత సమన్వితముగా నున్నది. తెలుగు కవియగు త్యాగరాజులు పురందరదాసులనే ఆదర్శముగాగొని ఆచంద్రతారార్కము కీర్తిని ఘటింపచేయజాలు కీర్తనములను జేసిరి. ఆయన కీర్తనములందు సంగీతమే ప్రధానము. హరిదాసకూటమువారి సాహిత్యములందు భావము ప్రధానము. సంగీతమాకర్షణార్థము ఉపయోగించిన సాధనము త్యాగరాజులు ఆత్మోన్నతికై కీర్తనముల దైవప్రార్థన జేసిరి. పురందరదాస ప్రముఖులన్నో పతితజనోద్ధారార్థము శీలస్ఫూర్తిని భక్తినీతులను, పాటలతో బోధించిరి. పురందరదాస, త్యాగరాజ కృతులందు శ్రీ పరమాత్మదాసోహమ్మను సుజ్ఞానము స్పష్టముగా చూపట్టుచున్నది.

రాగం. బ్యాగ్-ఏకతాళము

'దేవు బెల్లదొళిడలేనుఫల ?
నిత్యహోవిగెహోలెర దేనుఫల ?
కుటిలవబిడదిహాకుజనరుమంత్రద
పఠనెయమాడిదరేనుఫల ?
పటియన్నాడువమానుజరు మనదలి
విరనలనెనెదర దేనుఫల ?
కపటతనది వంచిసు వమనుజరు
జపగళమాడిదమురేనుఫల ?
కుపితబుద్ధియను త్యజిసదె నిత్యది
ఉపవాసవిద్దరినేనుఫల ?
మాతాపితరను బళలిసువానుగ
యాత్రెయమాడిదరేనుఫల ?
ఘాతకతనవను బిడదె నిరంతర
నీతియనోదిదరేనుఫల ?
పతియనునిందిసి బాగళునసతియళు
వ్రతగళమాడిదరేనుఫల ?
అతిథిగళెడెయలి భేదంమాడుత
గతియను బయసిదరేనుఫల ?
హీనకృత్యగళమాడుత నడియలి

స్నానవమాడిదరేనుఫల?
శ్రీనిధిపురందరవిఠలన నెనెయదె
మానవమాడిదరేనుఫల ?

పురందరదాసులు.

భా.ష. ఒడలనెళలందదలి హరి న
మ్మొడనెతిరుగు నొందరక్షణ
బిడదె బెంబలవాగి భక్తాధీననెందరిసి
తడెసుకరితోషుగళ, కాముగ,
కొడువ సకలేష్టగళ సంతత
నడెవ నమ్మంపడలి నసుని శేషసన్మహిమః
జగన్నాథదాసు హరికథామృతసారము.

విశిష్టాద్వైత మహాకవులు మైసూరు మహారాజుల సాశ్రయమున మనోహరములైన అనేకగద్యపద్యగ్రంథములను వ్రాసినారు. అందు తిరుమలార్యుడు, చిక్కుపాధ్యాయుడు సుప్రసిద్ధులు. చిక్కుపాధ్యాయుడు రమారమి 30 గ్రంథములు వ్రాసినాడు.

ఉ. 'గాడియసీమె చెల్వాగెవతాణ మలంపినసంతె పెంపుసా, దాడమవభూమి సౌఖ్యదెడె పుణ్యదగొత్తు వినోదసాగరం, మోడియమండపం సిరియపెమ్మెగె గొళ్మని ముక్తికాంతెగె, గూడువబీడు కన్నడద నాడు విరాజిపుదంతు బణ్ణిపెం'

చిక్కుపాధ్యాయుని హస్తిగిరిమహాత్మ్యము.

తరువాతవచ్చిన ముఖ్యగ్రంథము లంతగాలేవు మహమ్మదీయ, క్రైస్తవ, గ్రంథములరుదు. క్రైస్తవుల వేదము కర్ణాటమున పరివర్తనము చెందినది. మంగళూరు ప్రాంతమునం దయ్యది విశేషవ్యాప్తిలో నున్నది.

ఆధునికకవుల గద్యపద్యగ్రంథము లసంఖ్యాకము లు. పాశ్చాత్యసారస్వతమార్గమున, తెలుగులో యతిప్రాసబద్ధములుగాని భావకవిత్వములు బయలుదేరినవి. అట్టి రచన, ప్రాచీన కాలమునందియు స్వతంత్రమతులగు కర్ణాటకులకు క్రొత్తగాదు. యతుల్లంఘన 'జందరిదత్తె కన్నడం' అని తెలిసియే యున్నది. ప్రాసమునూత్రము శ్రుతిశ్రావ్యతకై జ్ఞాపకార్థము వాడుచున్నారు. దానిని సయితము పారదోలి కొందఱు ఆధునిక కర్ణాటకవులు కబ్బముల నల్లుచున్నారు. అయ్యదింకను సర్వజనాదరణీయముకాలేదు. సమకాలికులగు కవులను ఇందు పేర్కొనుట సమంజసముగాదు. అయినను, పాశ్చాత్యవిద్య నభ్యసించి, నాగరికతను బడసియు, ప్రాక్తనవిమర్శన విచక్షణ రావుబహదూర్ ఆర్. నరసింహాచార్యులు M. A. గారు పురాతన శబ్దస్వరూపసంరక్షణార్థమై అక్షరభేదములనుపాటించి నిర్దుష్టమైన సరసశైలిని, హళగన్నడములో నీతిమంజరి యను గ్రంథమును వ్రాసి కర్ణాటసరస్వతికి సమర్పించి ఖ్యాతినిబడసియుండుట కన్నడిగల కందఱకును గౌరవాస్పదముగానున్నది. కీర్తిశేషులైన బి. వెంకటాచార్యులు బంగాలీ భాషనుండి నవలలను కన్నడమునకు పరివర్తించినారు.

పందొమ్మిదవశతాబ్దమున కలిగిన కర్ణాటగ్రంథవిజృంభణమును, తెలుగు గ్రంథవిజృంభణమును, పరస్పర గుణగ్రహణజ్ఞాన పరిణామము లని పలుకవచ్చును. కీర్తిశేషులైన రావుబహదూర్ వీరేశలింగముగారి తెలుగు కవులచరిత్రము రావుబహదూర్ ఆర్. నరసింహాచార్యుల కన్నడకవుల చరిత్రములకు త్రోవజూపినది. కర్ణాట భాషాభిమానులగు రైసుదోరగారు మొదలగువారు కర్ణాట జాతి రాజకీయసాంఘిక మతవిషయిక పరిస్థితులనుబట్టి కావ్యకర్తలకాలదేశపాత్ర గ్రంథవిషయసమష్టినిగూర్చి ఆంగ్లేయభాషలో వ్రాసిన కర్ణాటవాఙ్మయచరిత్రము కీర్తిశేషులైన వంగూరి సుబ్బారావుగారి ఆంధ్రవాఙ్మయచరిత్రమునకు ఆదర్శప్రాయమయ్యెను. ఆంధ్రపరిషత్కార్యపరిశ్రమము, మాసపత్రికా దినపత్రికా ముద్రణము, కర్ణాటక పరిషత్పత్రికాది గ్రంథముల ముద్రింప ప్రోత్సాహపరచెను. కర్ణాటభాషాను శాసనము, ఆంధ్రభాషాను శాసనమును వ్రాయ పురికొల్పెను. శాస్త్రీయ గ్రంథపరివర్తనములందు నిట్టి మార్గమే చూపట్టుచున్నది.

ఇట్లు కర్ణాటవాఙ్మయవైభవము, ప్రాచీనకాలమునుండి జైన, శైవ, వైష్ణవ మహాత్ముల పురాణ రత్నములతోను, దుర్వినీత, నృపతుంగ, ముమ్మడి కృష్ణరాయ మున్నగువారి కావ్యముక్తములతోను, కంతి, బిజ్జలదేవి, మహాదేవియక్క, చెలువాంబ, సంచియహొన్నమ్మ

మహాలక్ష్మి, హాళవకట్టె గిరియమ్మ మొదలగువారి ప్రబంధ ప్రవాహములతోను, తదితర శాస్త్రీయ చరిత్రాత్మక కాల్పనిక గద్య పద్య చంపూ గ్రంథమణులతోను కర్ణాటవసుంధరా పరివేష్టిత సప్తరత్నాకరామూల్యమును, గాంభీర్యమును, వైశాల్యమును గలిగి రంజిల్లుచున్నది అంతియేగాక, కన్నడ తెలుగు భాషలందు, సమాన పాండిత్యము గలిగి అసమానశైలిని సరసకావ్యములు వ్రాసిన నారాయణభట్టు, నన్నెచోడభట్టు, పాల్కురికి సోమనాథుడు, భీమకవి, చక్రపాణి రంగనాథుడు శ్రీనాథుడు, కృష్ణదేవరాయలు, మున్నగు ఉభయభాషా పండితుల ప్రఖ్యాతిభవమై ప్రకాశించినది. ఈకారణముల తెలుగ లకైన పూర్వ జాతిబాంధవ్యమును స్మరించి, స్నేహయోగ్యం బగు గౌరవభావమును కర్ణాటకులయెడ జూపి పరస్పర ప్రేమ నుండుట ఉభయపక్షము వారికి శుభప్రదము.

వ్యాసములాందలి కొన్ని అభిప్రాయములు కొందఱికి అరుచికరములుగా నుండవచ్చును. అయిన వానియందలి సత్యాంశములనమాత్రము సత్యస్వరూపుడైన శ్రీ పరమాత్మ అనంతములైన కాలదేశ పాత్రములచేత నభివృద్ధిచేయించుట కతనికి మ్రొక్కి మహాకవి భవభూతి వాక్యములతో నీ వ్యాసమును ముగింతును.

> ' యేనామకేచిదిహనః ప్రథయంత్యవజ్ఞాం,
> జానంతి తే కిమపి తాన్ ప్రతినైషయత్నః.
> ఉత్పత్స్యతే మమతు కోపి సమానధర్మా
> కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ.
>
> భద్రం! శుభం!! మంగళం!!!

---

# శ్మశానము

కె. అన్నమరాజశర్మగారు

౧

ఆది, యచైతన్యవృత్తియో, హృదయచలిత
భావవేగంబొ, తదవస్థ--పలుకరాదు—
మృత్యుదేవతపిలుపో, భరింప నైతి
ప్రేమజననిని శ్మశానఁ బెట్టినపుడు.

౨

దివ్యజనయిత్రి భౌతికదేహ మచట
ప్రజ్వలించెడి చితిలోన భస్మ మాయె
నాకతోరశ్మశాన మాశోకవాటి
పాఱఁ దెఱచెను నరకకవాటములను.

౩

అపుడు, దుఃఖానుభూతి దయార్ద్రదృష్టి
పాఱఁజూచిన తార లిప్పటికిఁ గూడ
యామినీశాంతి లగ్నరహస్సులందుఁ
గాంచుచున్నవి సహానుకంప నొంది!

౪

ఆవిషాదాంధతమస మాభావ భగ్న
దుర్వ్యథాభారచింతనాందోళనంబు—
వేఁడి కన్నీటి యూటల విరతిఁ గొనక
ఘోష లిడుచుండె నామనఃకుహరమందు.

---

# భారత ప్రభుత్వ ఆదాయవ్యయపట్టిక

చా. వెం. హనుమంతరావుగారు
M. A., F. R. Econ. S.

## ౧

ఇండియా ప్రభుత్వపు ఆర్థికసభ్యుడగు సర్ జార్జి స్కూస్టర్‌గారు తమ మూడవ ఆదాయవ్యయపట్టికను లెజిస్లేటివ్ అసెంబ్లీలో ప్రవేశపెట్టుచు హిందూదేశపు ఆర్థిక పరిస్థితులను గూర్చియు, రాజకీయ వాతావరణమునకును ఆర్థికపరిస్థితులకును గల పరస్పర సంబంధమును గురించియు విపులముగ నుపన్యసించిరి. ఆతని ఉపన్యాసమును చదివినవారికి మన ఆర్థికస్థితి చాల ఘోరముగ నున్నదని తెలియును. బడ్జెట్‌నందు ముఖ్యవిషయము ప్రభుత్వాదాయము ఈ సంవత్సరము చాల తగ్గిపోవుటయు, ఖర్చుమాత్రము హెచ్చుగనే యుండుటయు ఆదాయమునందు కల్గినలోటును పూర్తిచేయుటకు క్రొత్తపన్నులను విధించుటయునై యున్నది.

గత సంవత్సరమంతయు దేశము నావరించియుండిన ఆర్థికవర్తక దుస్థితియే ఈ బడ్జెట్‌లోని లోటునకు చాలవరకు కారణభూతమైనది. ఈ సంవత్సరము ఆదాయము ఖర్చులకన్న 17¼ కోట్లు తక్కువ కాన్పించెను. ఆ లోటును పూర్తిచేయుటకు ఆర్థికసభ్యునికి క్రొత్తపన్నులను విధించుటతప్ప వేరుమార్గము కన్పించలేదు. దేశము దుర్భిక్షస్థితియందున్న సమయములో ఇన్నికోట్ల క్రొత్తపన్నులు విధించుటవలన ప్రజల ఇబ్బందులను ప్రభుత్వమువారు సరిగ గమనించిరా యను సందేహము బయల్వెడలక మానదు. ఈ పరిస్థితులలో దేశముయొక్క ఆర్థికస్థితి "దివాలా" స్థితియందున్నదని ఒకరు చెప్పిన మాటలో నిజము కలదు.

## ౨

సర్ స్కూస్టర్‌గారు ప్రభుత్వపు ఆదాయమునందలి లోటునకు కారణములుగ రెండింటిని వక్కాణించి యున్నారు. 1. దేశమునందు ప్రస్తుతము సాగుచున్న రాజకీయాందోళనము 2. ప్రపంచమందంతటను ప్రబలియున్న ఆర్థికదుస్థితి. కాని ఈ రెండు కారణములవలనను మాత్రమే బడ్జెట్ లోటును సమర్థింపజూచుట దేశస్థుల కన్నులలో దుమ్ముకొట్టుటకు ప్రయత్నించుటయే యగును. ప్రపంచకమునందంతటను వ్యాపించియున్న వర్తకపు మందగింపువలన సుంకముల వలన వచ్చు ఆదాయములో కొంతవరకు తగ్గుదల కాన్పించవచ్చుననియు రాజకీయాందోళనము వలన మన దేశమునకు దిగుమతి యగుచుండిన విదేశబట్టల దిగుమతియందు కొంత తగ్గుదల కాన్పించినదనియు మన మొప్పుకొందుము. కాని మన దేశపు ప్రస్తుతపు దుస్థితికి, వర్తకము పడిపోవుటకు, ధరలు తగ్గిపోవుటకు ముఖ్యకా

రణము ప్రభుత్వమువారి మారకపు, కరెన్సీ (Exchange and Currency Policies)విధానములేయని నొక్కి చెప్పవచ్చును. ప్రభుత్వమువారా విధానములను మార్చుకొనుటకు, దేశముయొక్క దుస్థితిని తగ్గించుటకు కాని తొలగించుటకు కాని ఏమి ప్రయత్నములు చేసియున్నారని మనము ప్రశ్నించి చూచిన ఏమియు లేదని ఒప్పుకొనక తీరదు హిందూదేశముయొక్క విదేశపువర్తకమునుగూర్చి చెప్పుచు సూస్టర్‌గారు దానియం దెక్కువ తగ్గుకల కాన్పింపలేదని చెప్పియున్నారు; కాని వారే హిందూదేశపు ఎగుమతులఖరీదు సుమారు 61 కోట్ల రూపాయిలవరకు తగ్గిపోయినదనియు, దిగుమతులు 56 కోట్ల రూపాయిలు తగ్గినదనియు ఒప్పుకొనుచున్నారు. దానికి కారణముగ హిందూదేశము ఎగుమతిచేయు సరకులు వ్యవసాయమునకు సంబంధించిన వగుటచేతను, ప్రపంచమం దంతటను అసరకులే ఎక్కువగ తయారు అగుటవలనను ఈ పరిస్థితులేర్పాటుకాబడినవని సూచించిరి. కాని హిందూదేశపు వ్యవసాయపుసరకులను (ముఖ్యముగా ప్రత్తి, జనుము మొదలగువాటిని) ఇతరదేశములలో అమ్ముడుపోవునట్లు ప్రభుత్వమువారు చేసిన పను లేవి, వారా పరిశ్రమల కిచ్చిన సహాయ మేమి యను ప్రశ్నలకు ఏవిధమైన సరియగు జవాబును ఈయకయే ప్రభుత్వసభ్యుడు దాటవేసెను. దీనినుండి ఏమినీతిని మనము నేర్చుకొనవలెనో వేరుగ చెప్పనక్కరలేదు. ఇతరదేశములందలి ప్రభుత్వములు తమ తమ దేశీయపరిశ్రమలను అభివృద్ధి పొందించుటకు వర్తకమును హెచ్చుచేయుచున్న ప్రయత్నములను మనము చూచిన ఇండియాప్రభుత్వ మీవిషయములో చాల వెనుకబడియున్నదని చెప్పక తీరదు. ఆర్థికసభ్యుడే హిందూదేశపు ప్రత్తి ప్రపంచమందు హెచ్చుగ వాడుకలోనికి వచ్చుచున్నదని అంగీకరించియుండెను. ప్రస్తుతపు ఆర్థికస్థితిలో దానిని ఎక్కువగ ఇతరదేశములు తెప్పించుకొనునట్లు ప్రభుత్వమువారు కట్టుదిట్టమైన ఏర్పాట్లుచేసిన ఇంకను హెచ్చుగ అసరకు అమ్ముడుపోవునని ఆర్థికసభ్యుడు గ్రహించలేదా ?

౩

బడ్జెట్‌నందలి లోటును పూర్తిచేయుటకు ప్రభుత్వపుఖర్చును తగ్గించుట ఒక ప్రధానమార్గమని సర్ జార్జి సూస్టర్‌గారు అంగీకరించుచున్నారు. కాని నిజముగ వ్యయమును తగ్గించువిషయ మాలోచనకు వచ్చినప్పుడు ఆయన తన సిద్ధాంతమును త్రోసిపుచ్చి పూర్వపుపరిస్థితులను సాగనిచ్చుటకే ఒప్పుకొనెను. ప్రభుత్వవ్యయము తగ్గవలెనన మిలిటరీ సివిల్ శాఖల రెండింటియందును కూడ ఆ తగ్గుదల చేయుటకు అవసరము కలదు. మిలిటరీవ్యయము 55 కోట్లనుండి 50 కోట్లకు తగ్గించినఎడలను, సివిల్‌వ్యయము అన్ని శాఖలలోను వీలగునంతవరకు తగ్గించుటవలనను ప్రస్తుతపు ఆదాయపులోటు నశించు ననుటకు సందేహము లేదు. అట్లు వెంటనే ఖర్చులను తగ్గించుటకు వీలు

లేదనియు, వీలగునంతవరకు త్వరలో ఆవిధానమును అమలునందుంచిన చాలుననియు మన మొప్పుకొనినప్పటికిని, ప్రభుత్వసభ్యుని ఉపన్యాసములో అట్టి ఉద్దేశ్యము ప్రభుత్వమునకు నిశ్చయముగ నున్నట్లు కాన్పించుటలేదు. ఆర్థికమంత్రి ప్రసంగము ప్రకారము ముందు సంవత్సరములో అక్కడక్కడ కొద్ది కొద్ది మార్పులవలనను, తగ్గించుటవలనను 1.75 కోట్లు మిలిటరీవ్యయములోను, 75 లక్షలు సివిల్‌వ్యయమందును కూడిక కాన్పించుచున్నది. అసలు 17 కోట్ల ఆదాయపులోటులోను ఈ $2\frac{1}{2}$ కోట్ల కూడిక పోగా మిగిలిన $14\frac{1}{2}$ కోట్ల లోటునకును పూర్తియగునట్లు క్రొత్తపన్నుల నేర్పాటుచేయుటకు ప్రభుత్వమువారు పూనుకొనియున్నారు.

ఈ క్రొత్తగ విధింపబడినపన్నులు (వీటిని గురించి ముందు కొంతవరకు విపులముగ చర్చించెదము) చిరస్థాయిగ నుండున ట్లేర్పాటు చేయబడినవా, లేక ప్రస్తుతపు కష్టకాలము గట్టెక్కునంతవరకే అమలునందుంచబడి తరువాత తీసివేయబడునా యను ప్రశ్న ఆలోచనీయము. ఎల్లకాలము ఈ పన్నులు ఈ రేట్ల ప్రకారమే అమలునందుంపబడిన, ఎల్లకాలము వాటికి తోడుగ ప్రభుత్వవ్యయము ఏటేట పెరుగుచుండుటకవకాశము లీయబడిన, దేశ మిప్పటికన్నను బీదస్థితికి వచ్చునని వేరుగ చెప్పనక్కరలేదు. కాని ఆర్థికసభ్యుని అభిప్రాయము ప్రకారము ఈ క్రొత్తపన్నులు, అందు ముఖ్యముగ హెచ్చు ఆదాయపుపన్ను రేట్లు, కొలది కాలము మాత్రమే అమలునందుంచబడి తరువాత పరిస్థితులు కొంత సాధారణస్థితికి మారిన యనంతరము తీసివేయబడునని తలంపవలసి యున్నది. ముందు ముందే పన్నులు తీసివేసినను నేటిని తీసివేయకపోయినను, సామాన్య ప్రజలు భరించుటకు కష్టముగా నుండునట్టియు, వారి ఆర్థికపరిస్థితులను ఇంకను ఇప్పటికంటె పాడుచేయునట్టియు పన్నులు వీలగునంత త్వరలో తీసివేయవలెనను సంగతి ప్రభుత్వమువారు గ్రహించుట మంచిది. ఇతరపన్నుల విషయములోకూడ దేశక్షేమమున కడ్డుగ నుండి, పారిశ్రామిక, వ్యావసాయిక, వర్తక, ఆర్థికఅభివృద్ధులకు ఆటంకములుగ నుండునట్టి వాటినికూడ జాగ్రత్తగ విచారించి తగ్గించుటయో తీసివేయుటయో చేయవలసిన ఆవశ్యకత ఎంతేని కలదు. అట్లే, దేశమునందు ప్రజలలోనున్న ఆర్థిక, సాంఘిక విభేదములను, హెచ్చుతగ్గులను వీలగునంతవరకు తగ్గించి ప్రజాబాహుళ్యమునకు హెచ్చు ఆదాయము నిచ్చునట్టి కాని, హెచ్చులాభము నిచ్చు పనులకొరకై వినియోగింపబడుటకు వీలుగ నుండునట్టిగాని పన్నులను విధించుటకూడ అవసరమే. ఈ విషయములు చాల ముఖ్యమైనవి. భావిభారతదేశ ఆర్థికసమస్యలను పరిష్కరించు నుపాయ మేతెంచినపుడు వీటిని మనస్సునందుంచుకొనియే ఏమార్పులనైనను చేయవలసి యుండును.

౪

ప్రభుత్వ ఆర్థికసభ్యుడు ఒక విషయము నందుమాత్రము కొంత ప్రజాభిప్రాయమును గ్రహించి ప్రవర్తించినాడని తలంపవచ్చును. ప్రభుత్వసేవకుల జీతములను తగ్గించువిషయములో ఏయేవిధముగ ఎంతెంత తగ్గుదల చేయవలెనో ఆలోచించి రిపోర్టుచేయుటకు అసెంబ్లీవా రంగీకరించిన ఒక రిట్రెంచ్ మెంటు కమిటీ(Retrenchment Committee)ని ఏర్పాటు చేసెదమని స్కూస్టరుగారు తెల్పిరి. ప్రస్తుత సందర్భములలో ఎంతవరకు రిట్రెంచిమెంటు అవసరమో ఆలోచించుటకే ఈ కమిటీవారికి అధికారము ఉండును. శాశ్వతముగ రిట్రెంచిమెంటును చేసి ప్రభుత్వపుఖర్చును శాశ్వతముగ తగ్గించుట కేర్పాట్లు చేయుటకు వేరుమార్గము లన్వేషింపబడుననియు, దానికి ప్రధానసోపానముగ రాష్ట్రీయ ఆర్థికసభ్యుల సమావేశము త్వరలో పిలిచెదమనియు కూడ స్కూస్టరుగారు వాగ్దానము చేసియున్నారు. పైన విశదపర్చబడిన రెండు సూచనలును ఆమోదపాత్రములే కాని, ఈ కమిటీల నేర్పాటుచేయు పద్ధతివలన తొందరగ పని జరుగుట కవకాశములు తక్కువగ నున్న వనుసంగతి మాత్రము మరచిపోకూడదు. దేశమునకు లాభకరముగ నుండునట్లు ప్రభుత్వసేవకుల జీతములను అన్ని గ్రేడులందును నూటికి 10 వంతున తగ్గించుచు పెద్దయుద్యోగస్థుల జీతములలో, అనగా 500 రూపాయిలు మొదలుకొని 1,000 రూపాయిలవరకు గల జీతములలో నూటికి 15 వంతునను, 1,000 రూపాయిల మొదలుకొని 1,500 రూపాయిలవరకు గల జీతములలో నూటికి 20 వంతునను, అట్లే జీతము లెక్కువ యైనకొలది ఎక్కువవంతు తగ్గించుటకు ఏర్పాట్లు జరిగిన చాల సొమ్ము మిగులు నని చెప్పవచ్చును. ప్రభుత్వసేవకు లందరి జీతములందును 100 కి 10 వంతున తగ్గించుటవలన ఎక్కువలాభ ముండదనియు, అట్లు చేసిన దేశమున కంతకును (కేంద్రరాష్ట్రీయ ప్రభుత్వములన్నింటిని కలిపి) మొత్తము 160 లక్షలు మాత్రము సంవత్సరమునకు తగ్గుననియు, దానిలో కేంద్రప్రభుత్వపు పాలు 38 లక్షలు మాత్రమే యుండుననియు ఆర్థికసభ్యుడు చెప్పియున్నాడు. అది నిజమే అయియుండవచ్చును కాని అందరు ప్రభుత్వసేవకుల జీతములలోను నూటికి 10 వంతున మాత్రమే ఎందుకు తగ్గించవలెనో తెలియదు. పైన సూచించిన విధముగ జీతములు హెచ్చుగ నున్న కొలదిని ఎక్కువతగ్గుదల చేసిన ఇంతకంటె చాల సొమ్ము దేశోపయోగకార్యముల కుపయోగించుటకు మిగులదా? పైగా బీదదేశమగు మన హిందూదేశమునకు ఎంత ప్రభుత్వపుఖర్చు తగ్గిన అంతవరకే లాభముగా పరిగణింపబడవలసి యుండును.

సివిల్ ఖర్చులలో తగ్గించుటవలన ఎక్కువ ఆదాయము కలసిరాదని ప్రభుత్వసభ్యుడు పదే పదే చెప్పును గొప్పజీతములను పుచ్చుకొనుచున్న అధికారులపై వెచ్చింపబడు ఖర్చును సమర్థించెను. హిందూదేశమునందు

చేయబడుచున్న ప్రభుత్వపుఖర్చును ఇతర దేశముల ప్రభుత్వపుఖర్చులతో పోల్చి చూచిన "చాల మితవ్యయమే" ఆ విషయములో చేయబడుచున్నదని స్కూస్టర్ గారి వాదన ఆశ్చర్యమును గొల్పకమానదు "సెక్యూరిటీ సర్వీసస్" అగు I. C. S., I. P. S. మొదలగువాటిలోని ఉద్యోగీయుల జీతములు, ప్రభుత్వసభ్యులు, మంత్రులు, గవర్నరులు, వైస్రాయి మొదలగు పెద్దఅధికారుల కిచ్చుజీతములు, ఆవిధమగు ఉద్యోగీయులకే ఇతర దేశములలో ఇయ్యబడుచున్న జీతములకన్న చాల ఎక్కువగా నున్నవని ఎల్లరకును తెలిసిన దే. స్వరాజ్య ప్రభుత్వము దేశమం దేర్పాటు చేయబడిన తరువాత వారు దేశముయొక్క ఆర్థికస్థితిని గుర్తెరింగి విచారించి ముందు ముందు ప్రభుత్వసేవకులుగా చేరువారి జీతములను నియమింపవలసియుండును. అట్లు చేయునపుడు ఇప్పటికన్న జీతములు చాల తక్కువ యుండుననుటకు సందేహము లేదు. కాని స్వరాజ్య ప్రభుత్వము నిజముగా ఏర్పాటుకాబడక ముందు ప్రస్తుతము ప్రభుత్వమును నడపుచున్న వారు ఆ విషయములో ముందంజవేయుట సమంజసము కాదా? కాని ఆర్థికసభ్యుని విధానమునుబట్టి ఇట్టి ఆలోచన ప్రభుత్వమువారి కున్నట్లు కాన్పించదు.

ఈసందర్భములో జ్ఞాపక ముంచుకోవలసినవిషయ మింకొకటి కలదు. దేశమునకు లాభదాయకముగ ప్రజల సాంఘిక నైతిక జీవిత మభివృద్ధిపొందుటకు వీలుగ నుండునట్లు చేయుటకు సొమ్మును కూడిక చేయవలెననిన సివిల్ ఖర్చులను మాత్రము తగ్గించిన చాలదు. ప్రభుత్వాదాయములో ఎక్కువ భాగమును మ్రింగివేయుచున్న మిలిటరీఖర్చును తగ్గించుట వలననే అట్టికూడిక చేయుటకు వీలుండును. ప్రస్తుతము కేంద్రప్రభుత్వపు ఆదాయములో సగమునకు సగము (సుమారు 55 కోట్ల రూపాయిలు) సైన్యపుఖర్చుక్రింద వినియోగపర్చబడుచున్నది. దానిని కనీసము 50 కోట్ల వరకైన తగ్గించిన దేశమునకు చాలవఱకు లాభమే. మిలిటరీలోని ఉద్యోగస్థులుగా హైందవులను ఏర్పాటు చేయుటవలనను, బ్రిటిష్ సైనికదళములను తగ్గించి జాతీయ సైనికదళములను చేర్చుకొనుటవలనను, ఇతర తగ్గుదలల వలనను 50 కోట్లకంటె కూడ మిలిటరీఖర్చును తగ్గించుటకు వీలగును. సైమన్‌కమీషనుకు ఆర్థిక సహాధికారిగా వచ్చిన సర్ వాల్టర్ లేటన్‌గారు హిందూదేశపు సైన్యపుఖర్చు చాల భరింపరానిదిగా నున్నదనియు, కొన్ని అవసరమగు మార్పులు సైన్యపుఖర్చునందు చేసిన 1940 వ సంవత్సరమునాటికి 48 కోట్లలోనికి దానిని తగ్గించవచ్చుననియు సూచించియున్నారు. కాని ఆర్థికసభ్యుడు మాత్రము రౌండుటేబిల్ సమావేశపు దేశ సంరక్షణోపసంఘము (Defence Sub-Committee of the Round Table Conference) వారు సైన్యమునందు భారతీయులను ఆఫీసర్లుగా తయారుచేయుటకు కాలేజీ నేర్పర్చవలసినదని కావిం

చిన సూచననుమాత్రము పునరుక్తిఁజర్చి తృప్తి నొందిరి.

౫

ఆర్థికసభ్యుఁడు విధింపదలంచుకొన్న క్రొత్త పన్నులు కొంతవరకు ఆమోదజనకముగనే యున్నవి. బీదజనులకు కష్టముగా నుండునట్టి గాని, వారు భరింపరానట్టి కాని పన్నులను విధించుట కాతడు పూనుకొనలేదు. ఏపన్ను విధింపబడినప్పుడు గాని ఆపన్నును ఇచ్చుకొనువారు దానిని భరించుటకు శక్తికల్గియుండునట్లుగా చూచి విధింపవలెను అను పన్నుల విధానపు ప్రధానసూత్రమును బట్టి ఇప్పుడు విధింపబడబోవు పన్నులను విచారించిన, ప్రస్తుత పరిస్థితులలో అవి కొంతవర కాసూత్రమునకు వ్యతిరేకమేయని ఒప్పుకొనవలసి వచ్చును. కాని ముందు ముందు పరిస్థితులు బాగుపడిన తరువాత వాటిలో కొన్నిమైనను న్యాయముగ విధింపబడినవేయని తలంపవలసి యుండును.

క్రొత్తపన్నులను ఒక్కొక్కటిగ తీసుకొని వాటిమంచిచెడ్డల నాలోచింతము:—

I. ఆదాయపు పన్ను రేట్లు హెచ్చించుట.

పన్ను విధించుటకు కనీసపుఆదాయము మొత్తము ఇదివరలో 2,000 రూపాయిలున్నది. దానియందేమియు మార్పు లేదు. కాని 2,000 నుండి 4,999 రూపాయిలవరకు గల ఆదాయములపై పన్ను రూపాయికి 4 పైసల చొప్పున హెచ్చుచేయబడినది. అట్లనే 40,000 రూపాయిల ఆదాయమువరకుకూడ రేటు రూపాయికి 5, 6, 7 పైసల చొప్పున తగురీతిని హెచ్చుచేయబడినవి. ఇట్లు ఆదాయపు పన్ను రేట్లు హెచ్చుచేయుటవలన భారము ధనవంతులైనవారే భరించవలసి యుండును కాని బీదజనులకు నష్టము లేదు. కాని ధనవంతులగువారు తమయొద్దనున్న పనిచేయువారిని తగ్గించి కాని, వారి జీతములను తగ్గించి కాని తమ పన్నులభారమును తగ్గించుకొనజూచిన ఆవిధముగ బీదజనులకు నష్టము సంభవించుటకుకూడ అవకాశము కలదు. మరియు 5,000 రూపాయిలవరకు గల రేటు హెచ్చించుటవలన ఆలోపు ఆదాయము కలవారికి కూడ కొంత కష్టముగా నుండవచ్చును. ఇంకొకవిషయ మేమన, ఇప్పుడు ప్రబలియున్న ఆర్థిక, పారిశ్రామిక దుస్థితివలన వర్తకులకు, పరిశ్రమాధికారులకు లాభములు తగ్గిపోయిన సందర్భములో వారికికూడ హెచ్చు పన్నులు భరించుట కష్టమే. ఈస్థితిగతులలో ఆదాయముపన్ను రేట్లు హెచ్చించుటవలన ప్రభుత్వమున కెక్కువ ఆదాయము చేకూరునా యనునది సందేహాస్పదమే.

ఈ సందర్భములో రెండు ముఖ్యమైన మార్పులు చేయవలసిన అవసర మున్నది:

1. ప్రస్తుతము మన దేశమునందు లాభముల నుపొందుచు ఇతర దేశములయందు వాటిని అనుభవించువారికిని, మన దేశపు సొమ్మును పెన్షనులుగా అనుభవించుచు ఇతర దేశములందున్న వారికిని, మన దేశపు ఆదాయపుపన్ను రూల్సుప్రకారము పన్నును ఇచ్చునట్లుచేయుట

కధికారము లేదు. ఇది చాల అన్యాయమును, దేశమునకు నష్టదాయకమునై యున్నది. అట్టి ఆదాయము లన్నింటిపైనను పన్నును విధించుటకు వీలైన, ఈమార్గమున ప్రభుత్వాదాయము చాలవరకు హెచ్చునని తలంప వచ్చును.

2. మనదేశమునందు ఆదాయపు పన్ను విధించుటలో ప్రతిసంవత్సరపు ఆదాయమును లెక్కకట్టి, ఏసంవత్సరపు ఆదాయముపైన ఆసంవత్సరమే పన్నును వేయుపద్ధతి అమలునందున్నది. రెండుమూడు సంవత్సరముల ఆదాయమును తీసుకొని, "ఏవరేజి" (average) కట్టి, ఆ "ఏవరేజి" ఆదాయముపై పన్ను విధించిన కొంత పన్ను చెల్లించువారికి సౌకర్యముగ నుండును. ఎందువల్ల ననగా ఒక సంవత్సరము నష్టము, ఇంకొక సంవత్సరము లాభము వచ్చిన, మొదటిసంవత్సరము తక్కువ, రెండవసంవత్సరము అంతకు చాల ఎక్కువ, ఇట్లు పన్నును ఇచ్చుకొనుట భారముగా నుండకుండ నుండదు.

ఆర్థికసభ్యుడే రెండుమార్పులను త్వరలో ప్రవేశపెట్టుటకు ప్రయత్నములు చేయవలెను. అతని ఉపన్యాసధోరణినిబట్టి చూచిన ప్రభుత్వమువారుకూడ వాటి విషయమై ఆలోచించుచున్నట్లే కన్పడుచున్నది.

II. సుంకముల నభివృద్ధిచేయుట:—

ఆర్థికసభ్యుడీ విధింపబోవు క్రొత్తపన్నులలో ఎగుమతి దిగుమతి పన్నులను హెచ్చుచేయుట మరొకటై యున్నది. కొన్ని కొన్ని వస్తువుల దిగుమతిపైనను, మరి కొన్నింటి ఎగుమతిపైనను సుంకములు విధింపబడనున్నవి.

1. పంచదార దిగుమతిపైన హండ్రెడ్ వైటుకు రూ 1-4-0 చొప్పున పన్ను హెచ్చింపబడినది. ఈ హెచ్చుపన్నువలన ప్రజలకు, అనగా పంచదార నుపయోగించు బీదజనులకు, కొంతవరకు నష్టమే. కాని ప్రభుత్వసభ్యుని అభిప్రాయముప్రకారము ఇది ఆదాయముకొరకు విధించు పన్నే కాని, రక్షణకొరకు విధింపబడినది కాదు. ప్రభుత్వమువారు త్వరలో పంచదార పరిశ్రమకు రక్షణ నిచ్చుటకు ప్రయత్నములు చేయుచున్నట్లు కూడ ఆర్థికసభ్యుని యుపన్యాసమువలన స్పష్టమగుచున్నది. అట్లు నిజముగా ప్రభుత్వమువారు రక్షణ నీయదలంచుకొనినప్పుడు, దేశీయ పరిశ్రమను అభివృద్ధి పొందించుటకు సహాయము చేయుటకు సంసిద్ధులై యున్నప్పుడు, ప్రజలు హెచ్చుసుంకమును, దానివలన వచ్చు హెచ్చు పంచదారఖరీదును భరించుటకు సిద్ధమై యుండవలసిన న్యాయము కలదు. పంచదార పరిశ్రమను అభివృద్ధిపర్చుటకు ప్రభుత్వమువారు రాబోవు సంవత్సరములో 5 నుండి 10 లక్షల రూపాయిలవరకు సహాయము చేయుటకు పూనుకొనియున్నారు.

2. విదేశములనుండి దిగుమతియగు మత్తుపదార్థములు, త్రాగుడు ద్రావకములు (alcohol and beer) మొదలగు వాటిపై కూడ పన్ను హెచ్చుచేయబడినది. ఇది చాల మంచిదే. ఈపన్ను పూర్తిగ ఆవస్తువుల నుపయోగించు

ధనవంతులపైననే పడును. ఈపన్నును దేశము నం దన్ని పక్షములవారును తప్పక ఆమోదింతురు.

3. వెండి దిగుమతిపన్ను ఔన్సునకు 2 అణాల చొప్పున హెచ్చుచేయబడినది. దేశమునందు తయారగు వెండిపైకూడ ఈ హెచ్చుదల ఆచరణలో నుంచబడును. వెండికొనుట ప్రజలలో కొంతవరకు తగ్గిపోవు ననుటకు సందేహము లేదు; కాని ఆర్థికసభ్యుడు అట్టి తగ్గుదల ఆలోచింపవలసినంత హెచ్చుగా నుండదని తలంచుచున్నాడు.

4. విదేశవస్త్రముల దిగుమతిపై పన్ను నూటికి 15 నుండి 20 వరకు హెచ్చింపబడినది. అట్లే ఇతరవస్తువులపై కూడ పన్ను హెచ్చుచేయబడినది. స్వదేశవస్త్ర పరిశ్రమ కిందుమూలమున కొంత సహాయముగా నుండునని తలంపవచ్చును.

5. చిట్టచివర హెచ్చుదల కిరసనాయిలు, మోటారు స్పిరిట్‌లపై నై యున్నది. కిరసనాయిలుపైన పన్ను గాలనుకు 9 పైసల చొప్పునను, మోటారు స్పిరిట్‌పైన పన్ను గాలనుకు 2 అణాల చొప్పునను హెచ్చింపబడినది. కిరసనాయిలుపై పన్ను బీదజనులకు కష్టమనిపించక తప్పదు. మోటారు స్పిరిట్‌పై పన్ను మోటారుకా ర్లున్నవారికిని, కొంతవరకు, బస్సులపై ప్రయాణము చేయు ప్రజలకునుకూడ బరువుగ తగులును. దేశమందు మోటారుబస్సుల ఉపయోగము క్రమముగ హెచ్చగుచున్న ఈ కాలములో ఇట్టి పన్ను ఆ అభివృద్ధికి నిరోధము కల్గించిన కల్గించవచ్చును.

పైన చెప్పబడిన పన్ను లన్నింటివలనను రాబడి 14.81 కోట్ల రూపాయిలు వచ్చునని వేయబడిన అంచనా నిజమగుచో ప్రభుత్వము వారికి ఆదాయపులోటు పూడిపోను పైగా 31 లక్షలు నిల్వకూడ నుండును.

౬

సర్ జార్జి స్కూస్టర్ గారు మన దేశములో త్వరలో ప్రవేశపెట్టబడనున్న రాజకీయ సంస్కరణములనుగూర్చి విపులముగ ముచ్చటించుచు క్రొత్త అధికారులు (అనగా స్వరాజ్యప్రభుత్వమువారు) తమ కార్యమును కష్టము లేకుండ నిర్వర్తించుటకు సహాయకారిగ నుండునట్టి ఆర్థికవిధానమును తా మేర్పాటుచేయుటకు ప్రయత్నించినామని సెలవిచ్చిరి. అతడు చెప్పినమాటలను కొన్నిటిని క్రింద పొందుపర్చుచున్నాము: "మేము ప్రస్తుతము ఒక విధమైన వర్తకపుసంస్థను నడుపు అధికారులుగా నున్నాము. ఇప్పు డాసంస్థను క్రొత్త అధికారుల యాజమాన్యము క్రిందకు మార్చు విషయమై ఆలోచనలు జరుగుచున్నవి. మన మందరమును ఈమార్పుదల కాలములో జాగ్రత్తగ కలసిమెలసి పనిచేయవలసి యున్నది. నేను చేసిన సూచన లన్నిటిని (అనగా క్రొత్త పన్నులు వేయుట మొదలగు విషయములలో) మన అవసరములను ముందర నుంచుకొనియే

చేసితీరుస్నానను. నాతరువాత వచ్చునట్టి ఆర్థిక మంత్రికి కట్టుదిట్టమైన సంస్థను ఒప్పచెప్పుటయే నా ప్రధానోద్దేశ్యమై యున్నది." ఈ మాటలు భావపూరితముగనే యున్నవి; కాని వాటిప్రకారము ఎంతవరకు స్ట్రాకోస్టరుగారు ప్రవర్తించిరనునదియే కొంతవరకనుమానము. క్రొత్తగా ఏర్పాటుకాబడు స్వరాజ్యప్రభుత్వమువారు మన దేశపరిపాలనను తమ క్రింద కు తీసుకొనినప్పుడు ఒక పెద్ద పన్నుల బరువును, పెద్ద ప్రభుత్వపుఖర్చు బరువును వారి భుజములమీదికి మార్చబడు ఏర్పాట్లు ఆర్థిక సభ్యుడు చేసెనని చెప్పవలసివచ్చుచున్నది. రెండు సంవత్సరములలో సుమారు 20 కోట్ల రూపాయిలవరకు క్రొత్త పన్నులభారమును దేశముపై వైచి, కట్టుదిట్టమైన సంస్థను తనతరువాత వారికి ఒప్పచెప్పుచున్నానని స్ట్రాకోస్టర్ గారు సంతోషించుటలో అంత న్యాయము కాన్పించదు. కాని అతడు కొన్ని అసాధారణపరిస్థితుల నెదుర్కొనవలసి వచ్చెననియు, వాటిని దాటుటకుగాను క్రొత్తపన్నులను విధింపవలసి వచ్చెననియు అంగీకరించవలసి యున్నది. ఆ అసాధారణపరిస్థితులు మారిపోయి సామాన్యపరిస్థితు లేతెంచినతరువాత ఎప్పటి రేట్లకు పన్నులను తగ్గించుటకు వీలుగ నుండిన కొంతవరకు సంతోషదాయకమగు విషయమే యగును.

౭

తమ బడ్జెట్ ఉపన్యాసమునందు స్ట్రాకోస్టర్ గారు ప్రభుత్వపు మారకపురేటు (Exchange) గూర్చియు, కరెన్సీవిధానమును Currency Policy గూర్చియు, ఆర్థికదుస్థితి (Economic depression) గూర్చియు, అప్పులను చేయు విధానమును (Government's Loan Policy) గూర్చియు విపులముగ తెల్పి ప్రభుత్వపు చర్యలను సమర్థింపజూచిరి. మారకపురేటును గూర్చి చెప్పుచు 1926 సంవత్సరములో రూపాయిమారకము 1 షిల్లింగు 6 పెన్సులు కాకుండ 1 షిల్లింగు 4 పెన్సులుగా ఏర్పాటు చేయబడినప్పటికిని ప్రపంచమందంతటను వస్తువుల ధరలు (commodity prices) పడిపోవుటచే, ప్రభుత్వమువారు కరెన్సీని తగ్గించుటకు (Contraction of Currency) అవసరము ఇప్పటివలెనే యుండునని తమ కరెన్సీకంట్రాక్షను పాలిసీని అనుకూల వాతావరణమునందు చూపుటకు ప్రయత్నించిరి. కాని ప్రభుత్వమువారి మారకపు విధానమువలననే దేశమునకు పారిశ్రామికముగ చాల నష్టము కల్గుచున్నదనియు, దేశముయొక్క వర్తకవ్యాపారము, ఎగుమతులు మందగించినవనియు స్ట్రాకోస్టరుగారు అంగీకరించకుండ నుండగలరా? ప్రస్తుత సందర్భములో రెండు పద్ధతులుమాత్రమే యున్నవని అతడు చెప్పెను: (1) 1 షిల్లింగు 6 పెన్సుల రేషియోను స్థిరపరచుట; (2) 1 షిల్లింగు 4 పెన్సుల రేషియోను తిరుగ ప్రవేశపెట్టి, నిలుకడ లేనిదియు, అస్థిరము నగు కరెన్సీవిధానమును మరల దేశములో నెలకొల్పుట. కాని షిల్లింగు ఆరుపెన్సుల మారకమువలన స్థిరమగు కరెన్సీపద్ధతి మన దేశములో ఇప్పుడేర్పా

టుచేయబడినదని స్కూస్టర్ గారైనను చెప్ప సాహసింపలేదు. ఎందువల్ల ననగా, ఆ హెచ్చు మారకపురేటును నిలువబెట్టుటకే ప్రభుత్వము వారు 1926 వ సంవత్సరమునుండి ఇప్పటివరకు సుమారు '40 కోట్ల రూపాయిల విలువగల కరెన్సీని సర్క్యులేషన్‌లో నుండి తగ్గింపవలసి వచ్చినది. ఇంతసొమ్ము వాడుకలోనుండి తగ్గి పోయినప్పుడు కూడ ధరలు ఆ మారకపు రేటునకు సరిపోవునట్లు సర్దుబాటు(అడ్జెస్టు) కాలేదని చెప్పిన, మన దేశపు మారకపువిధానము ఎంత లోపభూయిష్ఠముగ నున్నదియు తేలును.

ఇతర విషయములనుగూర్చి విపులముగ వ్రాయ నవసర మిప్పుడు లేదు. మారకపు రేటును ఏర్పాటుచేయుట పైననే మన దేశపు ఆర్థిక, పారిశ్రామిక, వర్తక అభివృద్ధులు ఆధారపడియున్నవి; అది సరియగుపద్ధతిని నడిపింపబడిన, అప్పుడే ఈ ఇతరవిషయములందు కూడ మార్పు కాన్పించును. క్రొత్త సంస్కరణములను ప్రవేశపెట్టు సందర్భములో హిందూదేశమున కంతకును రిజర్వుబ్యాంకు నొకదాని నేర్పర్చి పైవిషయముల నన్నింటిని నిర్వహించుటకు ఆ బ్యాంకువారికే అధికార ముండునట్లు చేయవలెనను సూచన రౌండుటేబిల్ సభవారు చేసియున్నారు. కాని వాటిపై చివర అధికారము గవర్నరు జనరలుకే యుండవలెనని వారి రిపోర్టునందు వ్రాయబడియున్నది. ఈ సందర్భములలో ఇండియా పార్లమెంటు అభిప్రాయము ప్రకారము మారకపు రేటును మార్చుటకు కాని, కరెన్సీవిధానమును క్రొత్తదానిని ప్రవేశపెట్టుటకు కాని, ఇతర ఆర్థికవిషయములలో కాని సావకాశ ముండునా యను ప్రశ్న చాల ముఖ్యముగ ఆలోచనీయమై యుండును. ముందు జరుగబోవు రౌండుటేబిల్‌సభలో ఈవిషయమై ఆలోచించి దేశమునకు లాభదాయకముగ నుండు విధానమును ప్రవేశపెట్టుటకు తీవ్రప్రయత్నములు చేయవలసియున్నది.

---

# మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భారతి'.

# ఋష్యశృంగ జననము

కోడాలి వెంకట సుబ్బారావుగారు, బి. ఏ.; కామరాజుగడ్డ శివయోగానందరావు గారు

స్నాన మొనరించుచుండె ఉపస్సునందు-పరమవిజ్ఞాని మౌని విభాండకుండు
ఊర్వశియు నచ్చటికి వచ్చుచుంట చూచు-తత్పరతలోన పతితరేతస్కుడతడు

అది గ్రహించిన దూర్వాశి అంతరంగ-మందు ఏవగించిన యది అట్టి నవ్వి
"పుండునకు పుల్లమగ"దన్న పోలికగను-సంయమిని హేళన మొనర్పసాగె నిట్లు.

ఊర్వశి:—

"కట్ట తెగిన మహానదిగతిని మనసు-కొంచెము చలించగా నిగ్రహించలేక
నీరసంపడినావు మునీ యి దేల-శీతలము గ్రమ్మ స్నానము చేయ కింక.

నీతపస్సు విఘ్నము చేయ నిలిచి ఎదుట-ఆడలేదు పాడనులేదు అంతరంగ
హారవిలసనచారుశృంగారములను-వికలచిత్తుని గావింప వేడ్కపడను.

చూచినమాత్రనే సొగసు జారలుగొంటివి. గాలి పెద్దగా
పీచిన తూలిపోదవా? స్రవించునొ శల్యవిశిష్ట రక్తధా
రాచరమాణువుల్ పటుతరంబుగ చిక్కిన దేహవల్లి కాం
తాచలనానిలాణువులు తాకిన తత్తర మేల తాపసీ.

కాల మెరుంగవో? స్థలము గానవొ? లేచిగురాకు కెంపుతో
పోలిక గోరి తెల్లనయి పోవుగడుల్ సరిదిద్దు ఆ యుషః
శ్రీ లలితాంగరాగము గ్రసించు వికర్తనహస్తచాలనా
స్ఫాలన చూడవో? నదిని స్నాన మొనర్చెడి జాడ నెంచవో.

అంత దేహవిస్మృతి నైచ్యమందె కలుగ-తపసు సిద్ధింప ఎంత సంతసము గనెదొ
కామినీకాంచనంబుల గడవలేని-భోగు లెల్ల విరాగు లై పోయినారు.

అగును. మునీ స్వాయంభువు వనంగ శరానలదగ్ధనీతిపా
రగుడు, తనూజయౌవనపరంపర లెప్పటి కడ్డె దోచినా

డుగద? తపస్సులో ప్రథముడున్ గద? నిగ్రహశక్తియింతలే
దు గద? భ్రమల్ వయసుతో సరియే గద దేహజాతముల్.

కోపమహాగ్ని విఘ్నము రగుల్ప తపశ్చ్యుతి భీతి లేకయే
శాపము లిచ్చి నష్టపడి చర్వితచర్వణ మాచరించు నం
తాపమునందు కొందరును తామరసాక్షులచేత కొందరున్
మీపితరుల్ వృథా వృతసమీక్షితదంభవిరాగులే కదా?

కామమో క్రోధమో లేనిసీమము గల-ఋషి. ఎవం డుండె నయ్యా ఈ రెంటి విడుచు
నప్పుడే గద వైరాగ్య సార్థయుక్త-మగుట ముని యన్న పేరును తగుట చెపుమ.

హేమలతాభసోయగము లీడ్చిన విచ్చిన కచ్ఛడాలలో
నీమము నిష్ఠయూ పలుక నేరసబాలురు కామదోహద
స్త్రీమహనీయతారసము తేరనినాటిసునీతి సూత్రులా
యేమి చలింపకుంటకు వహించుటకున్ సిరి లేని పెన్నిధుల్.

వారమొ పక్షమో ఋతువో వత్సరమో యుగభాగమో తపో
భారమునన్ కృశించుచు ప్రపంచకవైఖరు లుజ్జగించి ని
ష్ఠారతి కన్నదమ్ముల వశంబగు తైజసముగ్ధరోచులన్
దూగ మొనర్చి మాకు ప్రణతుల్ పొనరించుటిదేల తాపసీ.

మోహిని బంతిసామున జార్చు పయ్యెదగాలి కూగినవాడు కామవైరి
మేనకనునుమెత్తమేని సంస్పర్శలో కంపమొందినవాడు గాధిసూతి
సహజన్మభార్యవర్చస్సు కన్నుల భ్రామ దిటవు తప్పినవాడు దేవగురువు
గౌతమపత్నిరాగస్ఫూర్తిలో మ్రగ్గి మండినవాడు మార్తండమూర్తి
స్త్రీల నఖరేఖనీడల శిరము మోపు-వీరలు మహాతపస్వులు గారో నీకు
పూర్వులును పూజ్యులుం గద బూటకంపు-యోగులట లోకరక్షణోద్యోగమంట.

తెగుదాకా బిగియించు సామెతకు నీదే గాథ యాదర్శకం
బగు షట్శత్రుల బిగ్గబట్టితివి తత్వాక్షౌడి నాశించి ను
గ్గుగ నిన్నాపి లయింపజేసినవి యోగుల్ నేర్చుకోలేదు బా
గుగ కాంతాజనకర్మమర్మములు గగ్గోలందు నైర్మల్యముల్.

కన్నులు మూసినంతదనుకన్ యుగకోట్లను లెక్కలేక ఆ
త్మోన్నతిలోన చూచుకొనుచుందువు కన్నులు విప్పి యోగ వి
చ్ఛిన్నత నిష్ఠలోనవె రచింతువు ముందున కొక్కగంతు లే
కున్నను గంతు లా శ్వానకకున్ భళి నిగ్రహ మిద్దియా మునీ.

తనువు నిమేషభోగపరతన్ బల మేది చెడున్ గదా తపో
ధనము ప్రతిక్షణాధికముదంబు గదా గుణతారతమ్యభే
దనమున మూఢమైనది గదా ఋషిచిత్తము తుచ్ఛవస్తు వా
సన తెగలేనివారికి వశం బగునే పరమాత్మవైఖరుల్.

తపమున నీవు పొందెడిపదంబున కే గద మోక్షనామమం
త పదవి పొందజాలడు గదా గృహమేధి సదాంగనాజన
త్రప విడలేనివాడయి నిరంతరమున్ పురుషార్థసంగతిన్
నిపుణుడు మోక్షదూరుడు మునీ, చలచిత్తులు మీకు మోక్షముల్.

కామము రక్తవేగపరికల్పితమే గద? అంతరాత్మ శ్రి
ద్ధామతియే గదా అది నితాంతసమున్నతయోగభాగ్యవి
శ్రామములోన తుష్టము విచక్షణ లేని క్షణాల్పభావనో
ద్దామము కామ ముందుకు గదా వృథపుచ్చితివీ తపస్సులన్.

రూపము జూచి ఊరెడికురూపులు రాగ విలాసనేత్రవి
క్షేపములో స్ఖలించు కృతవీర్య విరాగులు కామమంజులా
లాపరసంబునందున కరంగెడి మహానులు దాంభికవ్రతో
ద్యాపన జేసికొంద్రు ప్రమదల్ కనుపించిన తక్షణంబునన్.

విభాండకుడు:—

శీతము వాతమున్ మదముచే మది తప్పి చరించు మానవ
వ్రాతముపాలు మహానులతపస్సుల భంగ మొనర్చి విశ్వవి
ఖ్యాతుల బ్రహ్మతేజుల మహాత్ముల నుద్భవమంద జేయు ప్ర
జ్ఞాతిశయంబు లప్సరస లందినపాలు హిమాంశుహాసినీ.

ఆ దశకంఠకంఠదళనాకృతి విష్ణుమహస్సు భూమిపై
పాదుకొనంగ పంక్తిరథ భావితయాగపురోహితత్వదీ

హొదరణుండు మత్స్ఖలిత మందు జనిచును పోవె "సీరసా"
త్పాదనమే ప్రపంచకవిధాననముద్ధరణంబు భామినీ.

చెడి రక్షింతుము స్వీయనాశము జగచ్ఛ్రీయంబుగా మీకు లో
బడి వర్తింతు మటంచు పొంగెదరు దుర్భావల్ గదా స్త్రీలు మా
కుడుతో లోకము మూసి నారమను భోగుల్ మీకు గ్రాహ్యంబు ల
య్యెడినే బాల యమోఘవీర్య ఋషిమాళీచ్ఛాగతోద్వృత్తముల్.

సృష్టికర్తల మెటుల వర్తింపవలెనో-తెలియును త్రికాలవేదుల చలనములను
లోకములు నిల్చు నశియించు మీకు దాని-గోల యేల సదా కామలాలసలకు.

సావరణీయసృష్టికరణంబున కీవు నిమిత్తమాత్ర వై
నావు తరంగడోలికల నాట్య మొనర్చుచు పోవు తేజమున్
త్రావు నదే పిపాస ఋతుధర్మము నందిన జింకపెంటి స
ద్యోవహగర్భనిర్గతసుతుం డతడే ఋషిశృంగు డంగనా.

అతని మాతృభావమున కర్హత జెందిన పుణ్యరాశి వై
పోతివి నాదుభావరతి పూచినపూతకు గేలి పల్కులో
పాతక మూదుకోవలదు బాలునిచూతము రమ్ము మత్తపః
పాతములో త్రిలోక మనపాయము భావిఫలశ్రుతిన్ చెలీ.

---

## మా చందా దారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందా దారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందా దారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము

మేనేజరు, 'భారతి.'



అలకనందనదిపయి ఇనుపవంతెన

గంట కరువది మైళ్ళవేగమున నక్కడ నది ప్రవహించుచుండును.

# డొమినియను ప్రభుత్వము,* ఆస్ట్రేలియా కామన్వెల్తు

దిగవల్లి వేంకటశివరావుగారు, B.A., B.L.,

ఆస్ట్రేలియా కామన్వెల్తు రాజ్య మొక బ్రిటీషు డొమినియను; అనగా కెనాడా, దక్షిణాఫ్రికా, ఐర్లాండులవలెనె ఇంగ్లాండు దేశముతోపాటు సమాన గౌరవము కలిగి తన ఆంతరంగిక వ్యవహారములందు గాని, పరదేశములతోడి సంబంధములందుగాని ఇంకొక రాజ్యమునకు లోబడకుండగనే బ్రిటీషు రాజును చక్రవర్తిగ అంగీకరించి చేరి, బ్రిటీషు సామ్రాజ్యమున నొక భాగముగ నుండి, సంపూర్ణ బాధ్యతాయుత స్వపరిపాలనము స్వాతంత్ర్యము కల రాజ్యము. బ్రిటీషు సామ్రాజ్య ప్రభుత్వమునకు డొమినియనుల ఆంతరంగిక వ్యవహారములం దెట్టి యధికారములును లేవు. డొమినియనులకు గవర్నరుజనరలును గాని, గవర్నరులనుగాని నియమించుట, డొమినియను పార్లమెంటుల తీర్మానముల నొక్కొక్కప్పు డంగీకరింపకపోవుట, ఇంగ్లాండులోని ప్రీవికవున్సిలు సభవారికి డొమినియను హైకోర్టుల పైన కొన్ని విషయములలో అప్పీలు అభియోగములను తీర్మానించు నధికారముండుట, బ్రిటీషు పార్లమెంటునకు డొమినియనుల పరిస్థితులందు కొన్ని మార్పులను చేయు నధికార ముండుట మాత్రమే బ్రిటిషుసామ్రాజ్యమునకు గల యధికారములు. అయిన నీ యధికారములను బ్రిటీషుసామ్రాజ్యమువారు నిరంకుశముగ చెలాయించుటకు ప్రయత్నింప సాహసించుటలేదు. అట్లు చేసినచో స్వతంత్రుడైన కొమారునివలె తన పెత్తనమును డొమినియను ధిక్కరించి వేరుపడునని బ్రిటీషు సామ్రాజ్యమెఱుగును,

బ్రిటీషుసామ్రాజ్యమున కున్న స్వల్పపుటధికారములుగూడ డొమినియనుల కిష్టముగ లేవని దక్షిణాఫ్రికాలోను, ఐర్లాండులోను ప్రత్యేకపతాకముకొరకు పోరాడువారును, ప్రీవికవున్సిలుయొక్క అప్పీలు హక్కులను తిరస్కరించువారును స్పష్టపరచుచున్నారు.

ఇటీవల డొమినియనుల శాసనాధికారములను గూర్చి విచారించుటకు బ్రిటిషువా రేర్పరచిన కమిటీవారు డొమినియనులకు నిర్నిరోధ ప్రభుత్వాధికారములు కలవని శాసనమూలమున స్పష్టీకరింపవలసిన దనియు, డొమినియనుల శాసనములను బ్రిటీషుసార్వభౌముడు తిరస్కరింప రాదనియు, వానికి దేశాంతరము లందును గౌరవ ముండవలయుననియు, డొమినియనులు తమనౌకా వ్యవస్థలను, వ్యాపారములనుగూర్చిన శాసనములను తము యిచ్చవచ్చిన రీతిని చేసికొనవచ్చుననియు తీర్మానించిరి.

ఆస్ట్రేలియా కామన్వెల్తు కెనాడా రాజ్యమువలె "ఫెడరలు" రాజ్యాంగపద్ధతికి జెందినది. అనగా నిదియు కెనాడావలెనె స్వపరిపాలనము కల రాష్ట్రముల సమ్మేళనము. సమితిప్రభుత్వమునకును, రాష్ట్రీయప్రభుత్వములకును రాజ్యాంగ చట్టమువలన సమాన ప్రభుత్వాధికారము లీయబడినవి. సమితిశాసనసభలకును, రాష్ట్రీయశాసనసభలకును ప్రత్యేకములగు నిర్నిరోధశాసనాధికారములు కలవు. రాజ్యాంగ విధానమున వచ్చు సందియములు, వివాదములును సమితియొక్క ఉన్నతన్యాయస్థానమే పరిష్కరించును. ఈలక్షణములు కల రాజ్యాంగపద్ధతికి ఫెడరల్ ప్రభుత్వమని పేరు.

దక్షిణాఫ్రికా కూడ కొన్ని రాష్ట్రములయొక్క సమ్మేళనమే కాని పైన చెప్పబడినట్లు ప్రభుత్వాధికారము విభజింపబడి యుండలేదు. ప్రభుత్వాధికారము కే

* 'కెనడా రాజ్యాంగము'—శుక్ల సం. మాఘమాస భారతి చూడుడు.

సమితి ప్రభుత్వమునందే యున్నవి. రాజ్యాంగమునందు సమితిశాసనసభకే (పార్లిమెంటు) సర్వాధికారములును కలవు. రాష్ట్రీయప్రభుత్వములు మనస్థానికస్వపరిపాలనా సంస్థలవలె స్థానికవ్యవహారములందుమాత్రమే శాసనములను చేయును. ముఖ్యవ్యవహారములందు సమితిపార్లిమెంటు వారు వీనికిచ్చిన శాసనాధికారము తప్ప ప్రత్యేకాధికారములు లేవు. ఈవిధానమునకు యూనిటరీ (Unitory) లేక ఏకైకప్రభుత్వపద్ధతియని పేరు. ఫెడరలు విధానమునందు రాష్ట్రములకు స్వేచ్ఛాస్వాతంత్ర్యము, నిర్నిరోధాధికారము నుండు ననుమాట నిజమె కాని దానివలన సమితి యొక్క కేంద్రపరిపాలనము బలహీనమైయుండును. అందు ముఖ్యముగ ఫెడరలు రాజ్యాంగమునందు రాజ్యాంగమున సమితికిని, రాష్ట్రములకును ప్రత్యేకింపగా మిగిలిన అనిర్దిష్టప్రభుత్వాధికారములు (Residuary Powers) సమితిప్రభుత్వమునందు గాక రాష్ట్రప్రభుత్వములందు నెలకొల్పబడినచో కేంద్రప్రభుత్వము మఱియు బలహీనమగును.

ఆస్ట్రేలియా మన భరతఖండమునకు ఆగ్నేయమూలగా పసిఫికు మహాసముద్రమున నున్న గొప్పద్వీపము. దీనివిస్తీర్ణము 29,74,581 చదరపుమైళ్లు. ఇందలి జనసంఖ్య రమారమి 50,00,000. ఈద్వీపమును క్రీస్తుశకము 1770 సంవత్సరమునను పాశ్చాత్త్యులు చూచిరి. బ్రిటీషువారు ద్వీపాంతరవాసము ననుభవింపుడని శిక్షించినవారి నెల్లర నిచ్చటికి దిగుమతి చేయసాగిరి. మొదట నీద్వీపమును బ్రిటీషుసేనానులే నిరంకుశముగ బరిపాలించుచుండిరి. కాని తరువాత నొక చిన్నశాసనసభ నేర్పరచి దానిలో కొందఱుసభ్యులను నియమించిరి. ఆస్ట్రేలియా రాజ్యమున న్యూసౌత్ వేల్సు, విక్టోరియా, సౌత్ ఆస్ట్రేలియా, క్వీన్సులాండ్, వెస్ట్రెన్ ఆస్ట్రేలియా, టాస్మానియా అను రాష్ట్రములు కలవు. ఈ రాష్ట్రములభివృద్ధి చెందగా 1860 లో బ్రిటీషుప్రభుత్వమువారు బాధ్యతాయుత స్వపరిపాలనము నొసగిరి. అనగా వీనిప్రభుత్వాధికారము ఒక గవర్నరును, ప్రజాప్రతినిధులు కల శాసనసభలును కలిసిన రాష్ట్రీయ "పార్లిమెంటు"లయందు నెలకొల్పబడినది. శాసనసభలకు బాధ్యులగు పరిపాలకమంత్రులే రాజ్యాంగవ్యవహారములను చక్కబెట్టుచుందురు. కొన్నివత్సరములకీరాష్ట్రము లొకసమితిగ కలిసి ఒక సంయుక్తరాజ్యాంగమును స్థాపింపుకొనుట మంచిదని రాజనీతిజ్ఞులకు తోచెను. దీనినిగూర్చి కార్యాలోచనము జరిగి కొన్నాళ్లకొకచిత్తు రాజ్యాంగచట్టమును తయారుచేసిరి. దానికి బ్రిటీషుపార్లిమెంటువారు 1900 సంవత్సరమున తమ యనుమతినొసగిరి. ఈ సంయుక్తసమితి ప్రభుత్వమునకు "ఆస్ట్రేలియాకామన్వెల్తు" అని పేరు. ఆస్ట్రేలియాలోని వివిధరాష్ట్రములు తమ క్షేమలాభములకొరకు సమితిగా చేరినవే గాని తమవ్యక్తిస్వాతంత్ర్యమును, స్వపరిపాలనాధికారములను గోల్పోవుట కిచ్చగింపలేదు. అందువలన వాని కిదివరకుండిన రాజ్యాంగ స్వపరిపాలనాధికారములెల్ల అట్లే యున్నవి. ఆరాష్ట్రములకు పరిపాలకులను (గవర్నరులను) బ్రిటీషువలస రాజ్యాంగమంత్రియె నియమించును. ఈరాష్ట్రములకెల్ల తమదేశములందు పన్నులు విధించుకొను నధికారము, శాసనములను చేసికొను నధికారమును గలవు. సమితియొక్క శాంతికి క్రమపరిపాలనకు నావశ్యకమగు ప్రభుత్వాధికారమును, శాసనాధికారములును ఈరాష్ట్రములు తమంతటతాము సమితిప్రభుత్వమున కొసగినవి. అట్లొసగబడిన శాసనాధికారము, ప్రభుత్వాధికారములెల్ల రాజ్యాంగచట్టమున వివరింపబడినవి.* ఈ అధికారములు గాక మిగిలిన అనిర్దిష్టములగు శాసనాధికారములెల్ల రాష్ట్రీయశాసనసభలకే గలవు గాని సమితి శాసనసభలకు లేవు కెనడాలో అనిర్దిష్టములగు నధికారములెల్ల సమితి శాసనసభలకే కలవు గాని రాష్ట్రీయశాసనసభలకు లేవు సమితి ప్రభుత్వాధికారము సమితియొక్క ఫెడరల్ పార్లిమెంటు అనగా సార్వభౌమప్రతినిధియగు గవర్నరుజనరలును, ప్రజాప్రతినిధులుగల సెనేటుసభ ప్రజాప్రతినిధులసభ యను శాసనసభలును కలిసిన రాజ్యాంగమున నెలకొల్పబడినది. సెనేటుసభకు ప్రతిరాష్ట్రము నుండి ఆరుగురుసభ్యులకు తక్కువ లేకుండగ బంపుచుందురు. వీరు 6 సంవత్సరము లుందురు. ప్రజాప్రతినిధుల

* అనుబంధము చూడుము.

సభకు (House of Representatives) రాష్ట్రముల లోని జనసంఖ్యనుబట్టి సభ్యుల నంపుదురు. ఎంత తక్కువ జనసంఖ్య యున్నను ౫ గురుకన్న తక్కువ సభ్యులను పంపరు. ఈ రెండు శాసనసభలకును అధ్యక్షుల నెన్నుకొందురు. సభ్యుల కెల్లరకు సాలుకు నాలుగు వందలపౌనుల వేతన మీయబడును. ప్రభుత్వాదాయము యొక్క వ్యయవిధానమునకు గవర్నరు జనరలు తన అంగీకారము నొసగవలయును. శాసనసభల కభిప్రాయ భేదములు కలిగినప్పుడు చేయవలసిన కర్తవ్యముకూడ రాజ్యాంగచట్టమున నిర్ణయింపబడినది. చట్టములెల్ల సార్వభౌముని అంగీకారము బడయవలయునను నియమము కలదు.

పరిపాలనాధికారము (Executive Power) గవర్నరుజనరలును, అతనికి సహాయముగ నుండు పరిపాలక సభయు (ఎక్జిక్యూటివు కవున్సిలు) నిర్వహింతురు. అందలి సభ్యులను గవర్నరు జనరలె నియమించును: సైనిక నావికదళము లతని అధికారముక్రింద నుండును. సమితి మంత్రుల నతడె నియమించును. మంత్రు లెల్లరు పరిపాలకసభలో సభ్యులుగ నుందురు. ఈమంత్రులు శాసనసభలో సభ్యులుగ నుండియుండవలెను లేనిచో; గవర్నరు జనరలు నియమించినది మొదలు 3 నెలలలో సభ్యత్వము సంపాదించుకొనవలయును.

న్యాయపరిపాలనాధికారము హైకోర్టునందును ఇతర సమితి న్యాయస్థానములందును కలదు. తక్కిన సమితి న్యాయస్థానములపైనను, రాష్ట్రీయ సుప్రీము కోర్టులపైనను ఉపర్యభియోగము (అప్పీలు) హైకోర్టుకు చేయుదురు. సమితిపార్లిమెంటువారు చేసిన శాసనముల నుగూర్చిన వ్యాజ్యములను, ఒక రాష్ట్రమున కింకొక రాష్ట్రమునకును గలుగు వ్యాజ్యములను పరదేశ ప్రతినిధులకు సంబంధించిన వ్యాజ్యములను పరిష్కరించు నధికారము హైకోర్టుకే కలదు. హైకోర్టు తీర్పులపైన ప్రీవీ-కవున్సిలు సభాయుతుడగు బ్రిటీషు సార్వభౌమునికి అప్పీలు చేయతగిన విశేష విషయములను నిర్ణయింపబడినవి.

రాష్ట్రముల పరిపాలనక్రిందినుండి సమితి పరిపాలనక్రిందికి మార్పు జెందు[మధ్యకాలమున ఆర్థికవ్యాపార పద్ధతులందు నష్టము సంభవించకుండగ కొన్ని కట్టుదిట్టములు రాజ్యాంగచట్టముననె చేయబడెను. రాజ్యాంగ విధానమునందు మార్పు లేమైన గావలసినచో అట్టి మార్పులకు రాష్ట్రములు లోబడి అందలి ప్రజలు అంగీకరించినచో, అట్టిమార్పులు చేయుటకు సదుపాయములు రాజ్యాంగచట్టమున నిర్ణయింపబడెను.

## అనుబంధము

ఆస్ట్రేలియా రాజ్యాంగవిధానము నిర్ణయింపబడిన ఆస్ట్రేలియా కామన్వెల్తు ఆక్టు ౫౧, ౫౨ సెక్షనులలో సమితి పార్లిమెంటుయొక్క అధికారములు పేర్కొనబడినవి.

౫౧ వ సెక్షను:—ఈ రాజ్యాంగమునకు లోబడి సమితి 'పార్లిమెంటు' సమితియొక్క శాంతికి, క్రమపరిపాలనకు, సత్ప్రభుత్వమునకు వలయునట్లు ఈక్రింది విషయములనుగూర్చి శాసనముల జేయుట కధికారముకలదు:

౧. వర్తకము ఇతర దేశములకును సమితికిని సమితిలోని రాష్ట్రములలో నొకదానికింకొకదానితోను గల వ్యాపారము.

౨. రాష్ట్రములందు గాని రాష్ట్రభాగములందు గాని పక్షపాతబుద్ధి లేకుండ సమితికి కావలసిన పన్నులు విధించుట.

3. పంటలుగాని ఎగుమతులుగాని ప్రోత్సహించుటకు బహుమానముల నిచ్చుట. ఇందు సమితిలోని వివిధభాగములలో హెచ్చుతగ్గు లుండరాదు.

౪. సమితియొక్క పరపతిపైన ఋణములు చేయుట.

౫. తపాలా, తంతివార్తలు, తంతిసంభాషణలు మున్నగు వ్యవహారములు.

౬. నావిక సైనిక వ్యవస్థలు, సమితియొక్కయు, వివిధరాష్ట్రములయొక్కయు సంరక్షణము, సమితియొక్క

శాసనములను నిర్వర్తించుటకు, అమలుచేయుటకు బలములను నడపుట.

౭. దీపస్తంభములు, దీపపుటోడలు, సముద్ర మార్గదర్శక దీపములు, ప్లవములు (buoys).

౮. ఖగోళవాతావరణ పరిస్థితులనుగూర్చిన వ్యవహారములు.

౯. "క్వారంటైన్" అంటురోగము లున్నవని అనుమాన మున్నచో ఓడలను రేవులలో నిరోధించి యుంచుట.

౧౦. ఆస్ట్రేలియా ద్వీపముయొక్క సముద్రతీరమునకు మూడుమైళ్లదూరమున చేపలు పట్టు పరిశ్రమను గూర్చిన విషయములు.

౧౧. జనాభా ప్రజల స్థితిగతులను గూర్చిన వృత్తాంతము అంకెలు (statisties).

౧౨. చెలామణి, నాణెములు, సామాన్య చెలామణి,—అనగా దేశవ్యవహారమందు చెలామణియగునట్లు ప్రభుత్వమువారు నిర్ణయించు ద్రవ్యము.

౧౩. రాష్ట్రీయ బ్యాంకులు గాక ఇతర బ్యాంకి వ్యవహారములు, రాష్ట్రముల పరిహద్దులు మీరి వ్యవహరించు బ్యాంకులు, బ్యాంకులను రిజిష్టరు చేయుట (Incorporation), కాగితపు ద్రవ్యములను ప్రచురించుట.

౧౪. రాష్ట్రీయ భీమావ్యాపారము గాక ఇతర భీమా వ్యాపారము.

౧౫. తూనికరాళ్లు, కొలపాత్రములు.

౧౬. హుండీలు, ప్రామిసరీ నోట్లు.

౧౭. దివాలా.

౧౮. కాపీరైటు హక్కులు, పరిశోధనలందలి హక్కులు, క్రొత్తవస్తువుల స్వరూపస్వభావములందు "పేటెంటు" స్వామ్యములను నిర్ణయించుట.

౧౯. పరదేశీయులు వారికి పౌరస్వత్వముల నొసగు నధికారము.

౨౧. పరదేశీయులయొక్క కంపెనీలు, సమితి హద్దులలో వ్యాపారమును గూర్చి కాని, ఆర్థికవిషయములనుగూర్చి కాని స్థాపింపబడుసంఘములు.

౨౧. వివాహములు.

౨౨. వివాహబంధవిచ్ఛేదనము (Divorce), దానిని గూర్చిన వ్యాజ్యములు, తల్లిదండ్రులహక్కులు, మైనరుల సంరక్షణమునుగూర్చిన హక్కులు

౨౩. ఆపదలు కలిగినవారికి గాని, ముదుసలివారికి గాని ఉపకారవేతనము లొసగుట.

౨౪. రాష్ట్రములయొక్క సివిలు క్రిమినలు న్యాయస్థానములతీర్పులను సమితిహద్దులలో అమలుజరిగించుట, వానిఉత్తరువులను జారీచేయుట.

౨౫. రాష్ట్రముల శాసనములు, వాని ప్రభుత్వ తీర్మానములు, కార్యములు, నిదస్తావేజులు, న్యాయస్థానములతీర్పులనుసమితిహద్దులలో నిల్ల గౌరవింపజేయుట

౨౬. రాష్ట్రములలోని ఆదిమవాసులనుగూర్చి గాక ఇతరజాతులవారి యోగక్షేమములకు వలసిన శాసనములను చేయుట.

౨౭. వలసకు పోవువారిని గూర్చిన విషయములు, వలసవచ్చువారిని గూర్చిన విషయములు.

౨౮. శిక్షితుల సంఖ్యనుగూర్చియు, అభివృద్ధిని గూర్చియు విచారించుట.

౨౯. పరదేశములతోడి వ్యవహారములు.

౩౦. పసిఫికు మహాసముద్రమునగల ఇతరద్వీపములతోడి వ్యవహారములు.

౩౧. రాష్ట్రముల ప్రభుత్వముల దగ్గరనుంచి కాని, దేశములోని ప్రజలవలన గాని, పార్లమెంటువారికి శాసనము చేయుట కధికారము గల పనికొరకు, ఆస్తిని వశము చేసికొనుట (Acquisition of Property).

౩౨. సమితియొక్క నావికదళమును గాని, సైనికదళమును గాని పంపుచుండుటను సమితిలోని రైళ్లపై నధికారము.

౩౩. రాష్ట్రములలోని రైలుదారి యవసరమైనచో నారాష్ట్రములో ఏర్పాటుచేసికొని దానిని వశము చేసికొనుట.

౩౪. ఆయా రాష్ట్రముల యంగీకారముతో రైలు దారిని వృద్ధిచేయుట.

౩౫. రాష్ట్రముల పరిహద్దు దాటి వ్యాపారములను చేయువారి తగవులను తీర్మానించుట, రాకలకు వ్యవస్థలను నియమించుట.

౩౬. పార్లిమెంటువారు మార్చివేయునంత కీ రాజ్యాంగచట్టము నిర్ణయించిన అన్ని విషయములందు సమితి పార్లిమెంటు కధికారము కలుగు.

౩౭. రాష్ట్రముల పార్లిమెంటు సమితి పార్లిమెంటువారికి తీర్మానించుటకొరకంపు విషయములు. అట్టి తీర్మాన మారాష్ట్రములకే వర్తించును.

౩౮. ఈ రాజ్యాంగ నిర్మాణ సమయమునాటికి బ్రిటీషు పార్లిమెంటువారు గాని, ఆస్ట్రేలియా కపున్సిలు మాత్రమె గాని నలాయించుట కధికారము కలిగిన విషయములనుగూర్చి రాష్ట్రములకోరికపైన గాని, అంగీకారముతో గాని సమితి దేశమున చలాయించుట.

౩౯. ఈ రాజ్యాంగమువలన పార్లిమెంటుకు సమితి ప్రభుత్వమునకు నొసగబడిన అధికారములు అసలు జరిగించుటకు వలసిన అధికారములు.

౫౨వ సెక్షను:—సమితిలో నిశాంతికి క్రమ పరిపాలనమునకు, సత్ప్రభుత్వమునకు నీక్రింద విషయములను గూర్చిన శాసనములను జేయుటకు పార్లిమెంటునకు మాత్రమె సంపూర్ణాధికారము కలదు:

(౧) సమితి ప్రభుత్వము యొక్క కేంద్రస్థానము నిర్ణయించుట, సమితి ప్రభుత్వమువారు వశముచేసికొనిన ప్రదేశములు.

(౨) ఈ రాజ్యాంగమువలన సమితి ప్రభుత్వ కార్యనిర్వాహకవర్గమువారి యధికారము క్రింద నుంచబడిన పరిపాలన శాఖలోని ఉద్యోగులను గూర్చిన విషయములు.

(౩) ఈరాజ్యాంగమువలనపార్లిమెంటుకు ప్రత్యేకాధికారము కలదని నిర్ణయింపబడిన ఇతరవిషయములు.

---

# పురాణగాయకుఁడు

బుద్ధవరపు నాగరాజుగారు

ఏవనోజ్జ్వలశుభవసంతాగమముల
నెంత పాడిన నతని గొంతెండ లేదు
జీరవోలేదు; బడలిక చెందలేదు
వాడలేదు మాధుర్యమ్ము వీడలేదు.
చివురులను మెక్కి యెలగొంతు చేవదేర్చి
పికము లపుడే వసంతగీతికలు పాడ
తేటివిరిదేనెఁ దనగొంతు తీపు జేసె
వెల్లివిరిసెను సెలయేట విరులపాట.
అతనిపాటలఁ బారవశ్యమ్మునంది
తరులు గిరులును జడగళత్వమ్ము విడిచి
స్తోత్ర మొనరింప, చిరునవ్వుతో నతండు
ప్రాంతపాటలె పెక్కండ్లు పాడినాఁడు.
ఇప్పు డామని తెలిలిపోయినది, నాటి [X
యళుల ఝంకారములు మాయమయ్యె మూఁగ
వడెనో; కోయిలగొంతు సవ్వడియె లేదు
నిదురవోయెనో; సెలయేరు రొదలు మరచె.
నేఁ డతఁడు చాల ముసలియైనాఁడు, పూర్వ
కాలములయందు, నుత్సాహ కలన మీర
పాడి మించిన కంఠ మీనాఁడె దేమొ
విడని విషదాయ శాపమ్ము పెట్టినట్లు.
గొనుగువడి గొంతుపస యడంగిన కొలంది
పాటపై నాతనికి కోర్కె ప్రబలిపోయె
నడకినను గొంతు బీటలు వారుచున్న
పాడ నుంకించుఁ దుదియూర్పువరకతండు.
అతఁడు తీర్చి దిద్దిన యట్టివారె
యతని త్రోవలఁ బోరిపు, డైనవాని
నాలకించి మహాహ్లాద మంద యతఁడు
ప్రాంత క్రొత్తకుఁ జోటీయవలయు నను.

## వోట్లకొరకు ప్రయత్నం




## వోటర్లు, అభ్యర్థులు



# రౌండు టేబిల్ ఫెడరల్ విధానము

శంకర వేంకటరావుగారు

లండను నగరమున గూడిన రౌండు టేబిలు సభవారు గావించిన సభాఫలితముగా ప్రధానమంత్రి వాగ్దత్తమొనర్చిన ఫెడరల్ విధానమునుగూర్చి సంశయము లొదవుటచే, వారీయదలంచిన ఫెడరల్ విధాన మెంతవఱకీ దేశమున కుపకరించునను విషయము విచారింపవలసి వచ్చినది. ఆ కారణమున నే నీ విషయమునుగూర్చి యీ వ్యాసమును వ్రాయదలంచితిని.

ఫెడరల్ విధానమున రాష్ట్రప్రభుత్వమునకును, కేంద్రప్రభుత్వమునకును సంపూర్ణ స్వాతంత్ర్య మొసంగినం గాని మన దేశమున కనుగుణ్యము కాదనునది మొదటియంశము. ఈ యంశమును సమన్వయదృష్టితో దిలకించి ప్రధానమంత్రిగా రెంతవఱకీయదలంచిరో వివరింతము. రాష్ట్రములకు సంపూర్ణస్వాతంత్ర్య మిచ్చెదమని వారు చెప్పిరి. కాని వీటో (Veto) చేయుటకు గల సంపూర్ణాధికారమును, పరిపాలనా విధానమును, అల్పసంఖ్యాకుల విషయమును గవర్నరు హస్తగతము గావించిరి. ఈ యధికారమును సంపూర్ణముగ గవర్నరు కిచ్చుటకు కారణ మేమి యని యడుగ నితర కేంద్రప్రభుత్వములయందు నీ స్వాతంత్ర్యములు కలవని చెప్పుచున్నారు. ఇతర అధినివేశ స్వాతంత్ర్య దేశములలో గవర్నరు ప్రజానియోజితుడు; ఇచ్చట ప్రభుత్వనియోజితుడు. ఆ కారణమున యీ యధికారములు ప్రభుత్వనియోజితుడగు గవర్నరుచేతియం దుండుట కన్న ప్రజానియోజితములగు శాసన సభాధికారమునకు లోబడియుండినను, లేక గవర్నరు ప్రజానియోజితుడుగ నున్నను బాగుండును. అప్పుడు గాని, సంపూర్ణస్వాతంత్ర్యము రాష్ట్రములకు చేకూరదు. అల్పసంఖ్యాకుల రక్షణ మొకటి యున్నది గదా యన్న, నవ్విషయమున ప్రజలతో సంప్రతించినం గాని రక్షణ విధానము చేపట్టుటకు వీలు లేదు.

ఇక కేంద్రప్రభుత్వ స్వాతంత్ర్యమును గూర్చి యోచింతము. అధికారము లన్నియు ప్రజానియోజితుల కిచ్చినారా లేదా యనునది శంక. విదేశ రాజ్యాంగ విధానము (Foreign Affairs) లం దేమి, సైనికపరిపాలనము (Military Affairs) నం దేమి, సంస్థానముల (States) విషయమునం దేమి, కల స్వాతంత్ర్యమును పూర్తిగ తామే యుంచుకొనిరి. రాజకీయ దృక్పథము ననుసరించి యీ విషయములలో వారే స్వాతంత్ర్యము వహించినను మున్ముందు భారత శాసనసభాధికారమునకు లోబడి యుండినం గాని కేంద్రమున స్వాతంత్ర్య ముండదు. కాలనిర్ణయ మొనర్చి యీ యధికారములు ప్రస్తుతము తమచేతిలో బెట్టుకొనవచ్చును, గాని, యింతకాలమువఱకే మేము వశమొనర్చి కొందుమని చెప్పక తమచేతిలో

బెట్టుకొనుటవలన ప్రజాభీష్టము నెఱవేఱదు. ఇవి గాక, వర్తకము, వ్యవసాయము, పరిశ్రమలు, మారకము (Exchange) మొదలగువాని యందును ప్రజల జోక్యము లేకుండ పోవక, మన మంత్రులకు నిర్ణయాధికారము లుండవలెను. ఇవి లేకున్న దేశముయొక్క యార్థికాభివృద్ధి కేమాత్రము నవకాశ ముండ దని తలంప వచ్చును.

ఇక శాసనసభలలో ప్రజా ప్రాతినిధ్య మెంతవఱ కుండు నది విచారింపవలయును. నిర్ణీత సంఖ్యయందన నైదువంతులలో రెండు వంతులు సంస్థానములనుండి వచ్చిన ప్రతినిధు లుందురట! సంస్థానప్రతినిధు లనగా సంస్థానాధీశు లెన్నుకొనిన ప్రతినిధులు గాని సంస్థాన ప్రజ లెన్నుకొనినవారు కారు. సంస్థానాధీశులు ప్రతినిధుల నెన్నుకొనునపుడు సరియైన ప్రాతినిధ్యము లభించునా లభించదా యనునదియు, ఆ ప్రతినిధులు సంస్థానములందలి ప్రజాభిప్రాయముల సాధకబాధకములు నివేదింపగలవారా యనునదియు ననుమానాస్పదములు. అదియుం గాక, సంస్థాన ప్రజలయొక్కయు, సంస్థానముల యొక్కయు బాగోగులు: భారత శాసనసభ చర్చింప నవకాశము లేకపోవుట విమర్శింపవలసి యున్నది. ఇది యెంతయు హాస్యాస్పదము. సంస్థానములకు సంపూర్ణ స్వాతంత్ర్య ముండి, కేంద్రమునను, రాష్ట్రములందును సంపూర్ణస్వాతంత్ర్య మున్నప్పుడే భారతదేశము సంయుక్తరాష్ట్ర మనిపించుకొనుటకును, అధినివేశ ప్రతిపత్తి యున్న దేశములతో పాటు తల యెత్తి తిరుగుటకును అవకాశ మున్నది కాని లేకున్న సంస్థానములను కేంద్రప్రభుత్వముక్రింద చేర్చుటవలన విశేష ప్రయోజనము గాన్పింపదు. మఱియు సంస్థాన ప్రతినిధులు మాత్రము బ్రిటిషు ఇండియాకు సంబంధించిన కొన్ని విషయములలో, అనగా మంత్రివర్గమునందలి విశ్వాస రాహిత్యము (No-Confidence) మొదలగు తీర్మానములను గావించుపట్టున, వోటుచేయు నధికారము కలిగి యుందురట! ఇది కేవల మసందర్భము. అందుచేత అఖిలభారత దేశవిషయములలో తప్ప సంస్థానప్రతినిధులు తక్కిన బ్రిటిషుయిండియా విషయములలో వోటుచేయుట కధికారము లేకుండజేయుట సమంజసము. ఇక కేంద్రప్రభుత్వమున మంత్రులవిషయమై రాజప్రతినిధి కిచ్చిన యధికారము లసాధారణములైనవి. మంత్రుల నియమించుపట్టున సహజముగా సర్వాధికారము రాజప్రతినిధికే యున్నందున రాజప్రతినిధి కనుసన్నలలో మెలంగువారే మంత్రులుగ నుందు రనుటకు సందియము లేదు. మంత్రులను తొలగించువిషయమున రాజప్రతినిధికి పూర్తియగు నధికారము కలదు. కాని యీవిషయమున శాసనసభయందున్న సభ్యులలో మూడింట రెండువంతుల వారు అంగీకరించిననే గాని శాసనసభకు మంత్రుల తొలగించుటకు వీలు లేదట! శాసన సభయందు గల నిర్ణీతసంఖ్యయందు సంస్థాన ప్రతినిధులు, ప్రత్యేక సంఘప్రతినిధులు, అల్పసంఖ్యాకుల ప్రతినిధులు, ప్రభుత్వనియోజితులు

ప్రభుత్వమువారికి తప్పనిసరిగా లొంగియుండవలెనని తదితర ప్రతినిధులును పోను, సుమారు ఐదవవంతుమాత్రము ప్రజాప్రతినిధు లుందురు. పైప్రాతినిధ్యము ననుసరించి మంత్రుల తొలగించువిషయమున మూడింట రెండువంతుల సభ్యు లంగీకరించుట దుర్ఘటము. ఒకవేళ పొసగినను, రాజప్రతినిధికి విటోయధికార ముండుట వలన మంత్రులను తొలగించువిషయమున, తన కిష్టమగుచో వీలు లేకుండ చేయుటకు తనకు సర్వాధికారము కలదు. దీనినిబట్టి మంత్రులను నియమించుట, తొలగించుట యను విషయములలో నధికారమంతయు రాజప్రతినిధికే గాని శాసనసభకు లేనట్లు కనుపించుచున్నది. ఈ కారణములనుబట్టి మంత్రులు రాజప్రతినిధి చెప్పినట్లు నడచుచు నెల్లప్పుడుగాకపోయినను, కొన్నిసమయములందైనను ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగా వర్తింపక తప్పదు.

కావున ప్రధానమంత్రిగారు ప్రసాదింప దలచిన ఫెడరల్విధానమునందు కేంద్రప్రభుత్వాధికారము వట్టి బూటకమని కొందర నుకొనుట కవకాశ మున్నది. నామమాత్రముగ నున్న యీ యధికారములవలన నిజమైన స్వాతంత్ర్యము కేంద్రమునకు లభింపలేదనియు, నిజమైన స్వాతంత్ర్యము లేని ఫెడరల్ విధానము నెరవేరదనియు వా రభిప్రాయపడుచున్నారు. కనుక నిట్టితరుణముననైనను ప్రభుత్వమువారు దీర్ఘముగ యోచించి భారతప్రజాసామాన్యాభిప్రాయముల ననుసరించి ఫెడరల్విధానమునందు అవసరమగు మార్పుల నొనరించుట ముఖ్యకర్తవ్యమని స్పష్టపడుచున్నది.

---

త్వరపడుడు!                                                    త్వరపడుడు!!

# ఆత్మకథ

(గాంధిమహాత్ముని స్వీయచరిత్రము) శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు తెనిగించినది

క్రౌన్ సైజు, పుటలు ౪౫౦, మేలయిన కాగితము, ముచ్చటలు గూర్పు అచ్చు

ప్రథమ సంపుటము (మూడవకూర్పు)                                                    వెల రూ. ౦-౧౨-౦

**రెండవసంపుటము**                                                    **వెల రూ. ౧-౦-౦**

అమూల్యమైన ఈ గ్రంథభాగములు రెంటికి వెంటనే ఆర్డరులు పంపుడు

తపాలఖర్చులు ప్రత్యేకము

మేనేజరు: **ఆంధ్ర గ్రంథమాల,** నెం. 7, తంబుశెట్టివీధి, జి. టి. మద్రాసు.

# నెమిలి నెలఁత

జి. జాషువగారు

౧

తలపైఁ గల్కితురాయి, కంఠమున నిద్దాతళ్కుఁగ్రొమ్మెఱుఁగు ప
చ్చలహారంబు ధరించి, కౌతుకవిలాసం బొప్ప వాల్గంటి తె
ప్పలఁ నానందము చింద, నర్తితనిజ ప్రాణేశ్వరుం జూచు నె
మ్మెలరాణీ, యిటు చూడవే, సుతశతంబుల్ నీకు, నీభర్తకున్.

౨

పొన్నుం గన్నులు నెత్తి కెక్కఁ, గులికింపుంగంఠగర్వంబునన్
నిన్నుం జేరి చెలికత్తెలం బ్రణయకంధి న్ముంచి తేలింప నీ
సాన్నిధ్యంబున నాట్యమాడు పతిసజ్జం బారవశ్యంబునన్
గన్నుల్ మోడ్పుచు నిచ్చలున్ గనిమిలిచానా! యెంతపుణ్యాత్మవో.

౩

కోరినపాటఁపటోగిరముఁ గూరిచి, నీమది పల్లవింపఁ జి
న్నారి మనోజ్ఞషడ్జమ నినాదములం గ్రొచ్చు బుజ్జగింపు, బం
గారపుఁ గంటికుల్కులమగండు, మహేంద్రుని యంత వాఁడు, నీ
చేరువ నాడెడి న్గనిమిలిచేడియ! నీకుఁ గొఱంత కల్గునే?

౪

ఉరు ముఱిమెం దళుకుఁ మెఱుచున్నది మిం చను మోసకత్తె, యం
బరమున మబ్బు తేలినవి, మంజులకేంకృతు లొప్ప నీమనో
హరుఁ డురుపింఛదీధితుల నారతు లీయఁదొడంగెఁ గేకిసుం
దరి! పొదరిండ్లలోవెపరదాల మఱుంగునఁ జెంగలింపవే!

౫

భర్త హారంబట్టుజిలుఁగుటంబరముఁ దాల్చి – విపినవీథులలోఁ దాండవించు మండఁ
జేయవను నిల్చి, మాసినచీరఁ గట్టి–మురిసికొనుపతివ్రతవు సుందరులలోన.

---

గొంతుకను నులిమివేయుదు' నని యతడు కత్తినంటి శపథము చేసెను.

అమరసింహుని భార్య ఆడుబిడ్డనే కనెను. తండ్రి తనశపథమును వీడువాడు కాడని అమరసింహు డెఱుగును. ఆ యాడుబిడ్డ నతని కత్తివాతి పడకుండ తప్పింప తలచెను. మగబిడ్డ పుట్టెనని తండ్రికి తెలిపెను. రత్నసింహు డుప్పొంగెను. 'నే జెప్పినరీతిని వానిని బెంచి పదునాలుగేండ్ల ప్రాయమున నాకడకు బంపుము' అని కొడుకుతో జెప్పి చంద్రపురమునకు బోయెను.

బిడ్డనుకని అమరసింహుని భార్య మరణించెను. అమరసింహు డాపిల్లను బాలునివలె గారాబముతో, కనుమెలకువతో మగపిల్లవానివలె పెంచుచుండెను. ఆబిడ్డయు క్రమముగ పెరుగుచు పురుషోచిత విద్యాలయం బెల్ల నారితేరెను. పదునాలుగేండ్ల ప్రాయమున కా బాలిక విద్యావతియేకాక మిగుల సౌందర్యశాలినియగు నయ్యెను. విద్యాశాలయందలి బాల బాలికల యాదర గౌరవములకు పాత్రమయ్యెను.

రత్నసింహుని క్రమముగ ముసలితనము పైకొనెను. అవయవబలము క్షీణించెను. కాని కోపము నానాటికి తీవ్రింపజొచ్చెను. చుట్టుపట్టుల తనయీడు జాగీరుదారు లందరు దాటుకొనిరి. పిల్లజాగీరుదారు లీవృద్ధసింహముతో చెరలాడజొచ్చిరి. వారి కదియొక వినోదము. వారిలో విజయసింహుడు ముఖ్యుడు. రత్నసింహుని అనుచరుల నాతడు చూచినచోనెల్ల తిరిమికొట్టువాడు; వారి ఆడువారితో నెకసక్కెము లాడుచు బాధించువాడు; రత్నసింహుని పొలముల నాక్రమించి తాను సాగుబడి చేయుచుండెను. విజయసింహుని దురంతములు పంసుమూనలియగు రత్నసింహుడు ప్రతిఘటింపజాలడయ్యెను. తనకు సాహాయ్యముగా 'మనుమని పంపు' మని కుమారునకు లేఖ వ్రాసెను.



శ్రీ ఇందిరా కుమారి - బిజిలి కథానాయిక
యశ్వంత వైద్య - కథానాయకుడు. ఏకాంత సంభాషణము.

ఉగాది

డఁబడినది. వా రానాటకములో రెండుఘట్టములఁ దీయించుకొన్న ఛాయాచిత్రము లేయిందుండునవి. అందు మొదటిది సలీము తనపడకగదిలోఁ గూర్చుండి పంజరములోనున్న చిలుకను జూచి తనవిరహతాపమును వెలిఁబుచ్చునప్పటి ఘట్టము. రెండవది రాణి యనార్కలీని గొరడాదెబ్బలఁ గొట్టింపఁ బంచెనని తెలిసినప్పుడు; దాసి సోఫియా యడ్డుమాటల నాడుచుండ; సలీము కోపముతో నామెను శిక్షింపుమనప్పటి ఘట్టము.

వింజమూరి వేంకటలక్ష్మీనరసింహారావు.

---

# తిరస్కృతి

వేంకట కాళిదాసకవులుగారు

నీటుగా దువ్వికొనిన యీ నీలికురుల
సంపెగలు వాడిపోయిన సౌరభమ్ము;
లేఁత చెక్కిళ్ల మెడలోనఁ బూఁతవడిన
చందన మ్మింకిపోయిన సౌరభమ్ము.

నుదుటఁ దోఁచిన స్వేదబిందువుల చెలిమి
వలనఁ గరఁగుచుఁ జెరఁగిన తిలకరేఖ;
కన్ను రెప్పల యంచులు కలియు నెడల
నిలుచు సన్నని కాటుక నీలిరేఖ.

తొలివసంతపు లేఁజిగురుల పోలువులు
పూను పెదవుల విడని తాంబూలరక్తి;
సఖు లలంకరణమ్ముగాఁ జరణములకు
రమ్యముగఁ బూసినట్టి పారాణిరక్తి.

నీ తనూ విలసనము శయ్యాతలమున
మోహనము మన్మథుని చేతి పూవువోలె;
చెలియ, ప్రియు నింకఁ గనుఁగొమ్ము వలపుఁగనులఁ;
మానమా ప్రేమదేవతాహ్వానములకు?

నింగి నైల్యమ్ములోనుండి తొంగి తొంగి
చూచుచున్నవి జాలిగాఁ జుక్క లవిగో
శ్యామలాలకములనుండి శయ్యమీఁదఁ
బ్రిదులుచున్నవి పూవులరేకు లివిగో!

పారవశ్యాన నా కరస్పర్శనమునఁ
బులకితమ్మగు నీతనువున మనోజ్ఞ
కోరకమ్ములు నిండునో, తారకమ్ము
లోరగా నోరగాఁ జూచునో, లతాంగి!

దూరపుంజూపునకు నవ్వు తోడునీడ
గా విరియఁజేయు నీ నవకంపుఁ బెదవి
నకట, లే దొక్క మృదుహాస శకలమైన
నీ రహస్యమాగమవేళ నేమొ కాని.

ఓరగా, రహస్యముగ, నన్యోన్యముగ, న
దృష్టముగ, నన్నుఁ జూచిన యన్ని చూపు
లేకరణి దాఁచితివి సుప్తి లేక మూఁత
వడిన తెలిగన్ను రెప్పల యడుగునందు?

ఒక్కొక్కటిగా వచ్చు నూరుపులకుఁ
బాలుపు లెడఁబాయు నీపెదవులు లతాంగి!
ముద్దుగా నొక చుంబనముద్ర యిడుదు
ననిన, నటు త్రిప్పెదే లి నీ యాననంబు?

మౌగ్ధ్యమో, ప్రగాఢత్రపా మధురిమమ్మొ,
నిర్మలప్రేమరూపమో, మర్మ మెఱుఁగ
లేని హృదయవికాసనవీనభరమొ,
యీ తిరస్కారమున కర్థ మేమి చెలియ?

గోచరింపని సిగ్గుమసిగ్గు తెరలోన
దాఁచుకొన నెంతువో హృదంతరము బాల!
సంభ్రమితమైన నీ తిరస్కారమునకు
నిడుదునా కానుకగా నాదు హృదయ మొకటె.

ఈ తిరస్కృతి ప్రేమరసాతిరేక
చిహ్నముగ, నూతనత్రపాశ్రీ శిరీష
పరిమళముగా, మధురముగ్ధ భావబింబ
ముగఁ, గనుంగొందునా చెలీ! * * *





సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు
ఉపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వవిద్యాలయము.



అదృశ్యకిరణము (Invisible Ray)




ఇది దొంగలను పట్టి యిచ్చుటకు సాధన మగు నొక క్రొత్త యంత్రము. ప్రతిగదియందును ప్రతిద్వారమువద్దను ఇట్టి యంత్రముల నుంచబడును. ప్రధానయంత్రమున నొకమరను నొక్కినచో నిశ్శబ్దముగా భిన్న భిన్న స్థలములనున్న యీ యంత్రములనుండి కిరణములు వెలువడి ఇంట దొంగలుజొరబడుటను దెలుపుటయేకాక, వారెచ్చట దూరబడియున్నదియు తెలుపును. ఈయంత్రములకు విద్యుచ్ఛక్తిరాకుండ నెవరయిన నడ్డుపెట్టజూచినను, వెంటనే తెలియజేయును. ఈ యంత్రములు పర్షియను కళాప్రదర్శనమున రిజాఖాను పహ్లావీగారి అమూల్య సంపదను వేయికన్నుల కాపాడి ప్రసిద్ధిగాంచినవి.

(E. N. P. వారి ఫోటో)

---

## శ్రీరంగపట్టణము

మైసూరు రాజ్యమునందున్న పట్టణములలో శ్రీరంగపట్టణము చరిత్రాత్మకముగ మిగుల ప్రాముఖ్యము వహించినది. 18వ శతాబ్దమునందు దీనిని ముఖ్యపట్టణముగా జేసుకొని హైదరాలీ, అతని అనంతరమున టిప్పూసుల్తాను రాజ్యపరిపాలన చేసియుండిరి. ఈపట్టణము కావేరీనదియందు ఏకద్వీపముపై కట్టబడినది. పట్టణము చుట్టును కావేరి త్రివ్వనికందకమై యొప్పారుచున్నది. టిప్పూసుల్తాను రాజ్యపరిపాలనమందీపట్టణ మేడు ప్రాకారములతోను, అనేక హిందూదేవాలయములతోను, మహమ్మదీయమసీదులతోను, ఉద్యానవనములతోను శోభాయమానమై మహదైశ్వర్యమును వహించియుండెను. కాని 1799 వ సంవత్సరములో ఇంగ్లీషువారికిని టిప్పూసుల్తానుకును జరిగిన యుద్ధములందు నీపట్టణపుగోడలు పగులగొట్టబడినవని ప్రసిద్ధి. ఇప్పటికిని ఇంగ్లీషువారు ఫిరంగీలు నిలిపినస్థలములును, పట్టణపుకోటగోడలలో ఫిరంగీగుండ్లు పాటుచేసిన కలిగిన పగుళ్లును చూడనగును. ఒకప్పుడు రాజధానియై సకలసంపదలు కాకరమైన పట్టణము నేడు కళావిహీనమై యొక గొప్పగ్రామముగ మారినది.

పట్టణపు ప్రాకారములకు వెలుపల కావేరీనది పాయ యొకటి యుత్తరవాహిని యనుపేర ప్రవహించుచున్నది. ఇందు పౌరప్రజలకు స్నానపానాదులకనుకూలమై యొప్పెడి ఘట్టము నొకటి కలదు. అచటికనతిదూరముననే వైష్ణవులచే నిర్మింపబడిన సంతెనయొకటి చూడనగును.

పట్టణ మెంత శిథిలమై యున్నను ప్రాకారములు, ద్వారములుమాత్రము చూపరులకు కొంత యాశ్చర్యజనకములు కాక మానవు. ప్రాకారము చుట్టు ప్రాకారము. ఈరీతి నగరు ప్రాకారసప్తకపరివేష్టితమై యుండెడిదని వాడుక. కాని ప్రస్తుతము మూడుప్రాకారములు మాత్రము నిలిచియున్నవి. ప్రథమప్రాకారద్వారములు సుమారు 30 అడుగులయెత్తు, 20 అడుగుల వెడల్పు గలిగి, శిలానిర్మితములై మిగుల బలిష్ఠములై యున్నవి. సుమారు 200 సంవత్సరముల క్రిందటనే శత్రువులదాడికి లోనయ్యును నేటివరకు నివి చెక్కుచెదరక యున్నవి.

ప్రాకారములు గడచినవెంటనే టిప్పూసుల్తానుచే నిర్మింపబడిన మసీదు గోచరమగును. అటువెనుక నొక శివాలయమును, దానికి కొలదిదూరముననే విష్ణ్వాలయమును, తదితర దేవాలయములును కలవు.

టిప్పూసుల్తాను మరణముతో శ్రీరంగపట్టణ వైభవముకూడ నంతరించినది. కాని ప్రస్తుత మచటి భవనములను శిథిలముకాకుండ ప్రభుత్వమువారు కాపాడుచున్నారు. ఒకప్పుడు మహదైశ్వర్యములతో తులతూగిన పట్టణమునుచే రాజభవనములు చూడదగియున్నవి. భవనమునకు ముందర ఉద్యానవనసంపత్తి నయనానందదాయకము కాకపోదు. భవనములో గల చిత్రశిల్పచాతుర్యము ప్రాయశ వలదికాదు. టిప్పూసుల్తాను రాజ్యపాలనమందు జరిగిన యుద్ధములన్నియు వివిధములైన రూపవర్ణములతో భవనములోపలి కుడ్యముల (Palace interior walls) పై చిత్రింపబడియున్నవి. అయ్యవి చూడగనినంతనే పురాతనచిత్రకళావైపుణ్యము చూపరులకు గోచరింపక మానదు.

సుప్రసిద్ధరాజధాని యగుటచే నందలి యుద్యానవనశ్రేణి విషయమై వేరుగ ప్రాయ నవసరము లేదు. పూర్వమందు హిందూమహమ్మదీయ ప్రభువులు తమనగరములచుట్టును, రాజమందిరముల చుట్టును విహారార్థమై యుద్యానవనములను బహుశ్రద్ధతో పెంచెడివారు. అట్లే యీపురమునను సుందరోద్యానములు గలవు. ఇందలి వృక్షలతాపంక్తులును, అందములయిన కేళీమందిరములును, విహారార్థము నిర్మింపబడిన బాటలును కళాకౌశలమును చాటుచుండును. చూచి యానందింపవలసిన యీయుద్యానవనములను గూర్చి యిట వర్ణించుటకు సాధ్యము కాజాలదు.

పట్టణమందు చూడదగిన విశేషములు పెక్కు కలవు. వానిలో ముఖ్యముగా పట్టణమధ్యమందు జయపతాక మందగస్థలి నాట్యమాడునట్లు కట్టుట కొక పెద్దధ్వజము (flag staff) లకడు ఇంతవరకును నది శిథిలముకాకుండ నిలుచుట యాశ్చర్యకరమయిన సంగతి. దీని కనతిదూరముననే యొక ఫ్రెంచి యింజనీరుచే నిర్మిం













## శ్రీరంగపట్టణము చిత్రములు

టిప్పుసుల్తానుకోట ప్రాకారములు, ద్వారములు.
కావేరి-ఉత్తరవాహిని.
టిప్పుసుల్తాను సమాధి.
శ్రీరంగపట్టణము యుద్ధమున నిహతులయిన యోధుల స్మారక చిహ్నము.
టిప్పుసుల్తాను నగల్లు.
నగల్లచెంత ఉద్యానము.
నగల్లలోని శిల్పకళావిధానము.



ఛాయాచిత్రములు వ్యాసకర్తవి.

సంగీతము గాక మఱి యెదేని యితరకళ విషయమున వారెపుడేని ఏమేని చెప్పిరేమో మే మెఱుఁగము. ఆశ్రమమునందలి మందిరములలోఁ గాని, వారు కట్టించిన గుజరాతు విద్యాపీఠము తాలూకు కట్టడములలోఁ గాని, కళాస్వరూప మేవిధముగాను కనుపడుట లేదు. వారి యాత్మకథలో ఎక్కడను కళావిషయక మయిన చర్చ కనుపడ లేదు.

గాంధిగారియందు టాల్‌స్టాయిగారి ప్రభావము సద్రూపముననే ప్రసరించినది. వారు సత్పురుషు లయినారు. కళాకారులుగ కాలేదు. ఏతత్సంబంధమున మేము శ్రీ రవీంద్రనాథ టాకురుగారితో వారిని పోల్చిచేయఁ గలము. గాంధిగారును, కవి టాకురుగారును వర్తమాన ప్రపంచమున రెండు గొప్పవ్యక్తులు. వారిద్దఱిలోను ఒకరిని మేము గొప్ప సత్పురుషునిరూపమునను, రెండవ వారిని కళాకారుని రూపమునను గ్రహింపఁ జాలుదుము.

గాంధిగారిని గుఱించి చెప్పునప్పుడు వారికి కళాక్షేత్రమున విహరించుటకు తగినసమయము చిక్కలేదేమో అనికూడ అనుకొనఁగలము. వారి మనోవృత్తియంతయును స్వరాజ్య సంబంధమునందే లగ్నమయి, తన్మయ మగుటం జేసి వారిటువైపు దృష్టిపాతముచేయ లేకపోయినారేమో?

నేనా లేఖను చదివితిని. కనుక నామనసులో కళావిషయమున గాంధిగారి యుద్దేశము తెలిసికొందు మన్న యిచ్ఛ కలిగినది. కాఁబట్టి గతించిన డిసెంబరు 15-వ తేదిని ఎఱవాడ మందిరమునకు పోవు మెయిలులో నేను వారి కొక్కసారిగానే కళావిషయమున కొన్ని ప్రశ్నములు వ్రాసి పంపితిని. 25-వ డిసెంబరునందు "చట్టిలో సముద్రము" అను నామెతను సార్థకము చేయునగ బాపూజీ (గాంధీ)గారి పత్త్రిము లభించినది. అందు వారు కళావిషయమున ప్రకటించిన సందర్భము ప్రతి వ్యక్తికిని మనన యోగ్యము. ఇందు ప్రశ్నోత్తరములు రెండును ప్రకటితములు.—

కళ తాలూకు స్థానము, రూపము.

ప్రశ్న—"మనుష్య జీవనమున కళకు ఎట్లు, ఏరూపమున స్థాన మున్నది? లేక ఉండవలయును? నిజమయిన కళ యెందున్నది? ప్రస్తుతము బాజారులయందు లభించు సాహిత్యమునందును, చిత్రకళయందును కళ యను పేరను చెప్పఁబడుచున్నదాని నిజమయిన కళ యెంత యున్నది? టాల్‌స్టాయి మహర్షి తాలూకు కళావిషయకవిచారమునందు తమ యభిప్రాయ మేమి?

సంగీతకళకు జీవనములో మహత్త్వపూర్ణ మయిన స్థాన మున్నది. అట్టి స్థితిలో దానికొఱకు ప్రత్యేకముగ పాఠశాల, విద్యాలయము, మహా విద్యాలయము, విశ్వవిద్యాలయము—అనువానిలో స్థాన మెందులకు లభింపఁగూడదు? ఒకవేళ లభించు టావశ్యక మగుచో నేరూపమున?

సినిమా మొదలగువానిలో వేశ్యాస్త్రీలు నటించుచున్న వారి యభినయమును చూచుచున్నాచో వారి మర్యాద యేమయి యుండవలెను? ప్రకృతము వారి యభినయమునందు విశిష్టమయిన కళ యున్నదని చెప్పవీలు లేదు. నిజముగ పేదలకు నిత్యగ్రాసము, కూలీలు, నౌకరీ వృత్తి గలవారును పగలంతయును పరిశ్రమ చేసిన తరువాత నేమి చేయవలెను? దేనివలన వారి జీవితము సుఖమయము, కళామయము కావలయును?

'కర్మసు కౌశలం' మ్మనునదే కళ.

ఉత్తరము— కళావిహీనుఁడగు మనుజుఁడు పశుప్రాయుఁడు. కాని కళ యనఁగా నేమి? 'యోగః కర్మసు కౌశలమ్' గీత మూఁడవ అధ్యాయమునందలి యోగము. ఇది సంపూర్ణకళ. ఈసంగతియే బాహ్యకళయందు సయితము సంబంధించును. కోట్లకొలఁది జనులు దీనిని గ్రహింపఁజాలరో అది కళ కాదు. కాని స్వాతంత్ర్యమునకు యోగమగును. ఇట్లుండఁగా ఆకళ కంఠమున కావచ్చును, వస్త్రమున కావచ్చును, లేక రాతిని కావచ్చును. కోట్లకొలఁది జనుల యైకకంఠ్యముతో రామస్మరణము చలాయించుట కళ. అది ఆవశ్యకముకూడ. ఎన్నో మందిరములు కళామయములు. అందలి కళను కోట్లకొలఁది జనులు గ్రహింపఁగలుగుదురు. మందిరములయందు పూజాపాఠాదుల యావశ్యకము ననుసరించి శ్రద్ధాపూర్వకముగ జరిగించుట కళకు దృష్టాంతము. ఇట్లే యొచ్చట నయితే

సమయము, క్షేత్రము, సంయోగము తాలూకు ప్రమాణము, గుర్తు ఉంచఁబడునో అచ్చట కళయున్నది. ఫిలుము నాకిష్టమయినదిగాదు. నేనెప్పుడును సినీమాలకు పోయి యెఱుఁగను.

విచారపూర్వకముగా పని చేయుటవలన అందునుండి రసము ప్రభవించియే తీఱును. అనఁగా, విచారపూర్వకముగా చేయఁబడిన కార్యము కళామయముగ నగునన్నమాట. నిజమయినకళ సదారసమయము. కళ యేరసము—అనిమాఁట జెప్పఁగలము.

యజ్ఞమయజీవనము కళకు పరమావధి. నిజమయినరస మందే యున్నది. అందునుండియే నిత్యనూతనమయిన దీనితాలూకు ప్రవాహము ప్రవహించుచుండును. దానిని త్రాగుచుండు మనుజుఁ డలసిపోఁడు. ఆప్రవాహ మెన్నటికిని ఎండిపోదు. ఏయజ్ఞమయితే భారరూపముగ నుండునో అది యజ్ఞమేకాదు. త్యాగము చేసి యనుభూనపడినట్లయితే అది త్యాగమే అనిపించుకోదు. భోగముతాలూకు పరిణామము నాశము. త్యాగము తాలూకు పరిణామ మమరత్వము. రసము స్వతంత్రవస్తువుకాదు. రసము మనవృత్తియందున్నది. ఒకనికి నాటకము తాలూకు పరదాలలో మజా లభించును. మఱొకని కాకాశమునందు నిత్యనూతనమయిన యేపరివర్తనము కలుగుచుండునో దానియం దానందము కలుగుచుండును. రస మెప్పుడును అభ్యాసమునకు విషయము. బాల్యమున రసముతాలూకు స్వరూపమున నెవరికయితే అభ్యాస మలవడుచుండునో, రస స్వరూపమున నెవరి యభ్యాసమును జనసముదాయము కైకొనుచుండునో వారు రసము నంగీకరింతురు. ఒకరాష్ట్రమునకుఁగాని, ప్రజకుఁగాని యేది రసమయముగ తోఁచుచుండునో అదియే యింకొకరాష్ట్రమునకుఁగాని, ప్రజకుఁగాని రసహీనముగ తోఁచును.

సేవయందుమాత్రము పదునాఱు విధములయిన శృంగార మలంకరింపఁబడుచుండును. తమ సమస్త కళయు నందు దిమ్మరించుటకూడ జరగుచుండును. అది మొదటవస్తువు. తరువాతను తమ సేవ యగును.

ప్రశ్న-సంగీతమును, చిత్రకళను నేర్చుకొనుటవలన ఏయే గుణములవికాసము కలుఁగును? విద్యార్థికి వీని పరిచయ మెంతవఱకావశ్యకము?

ఉత్తరము—సంగీతమువలన ఈశ్వరధ్యానము సుకరముగ చేయఁబడఁగలదు. సంగీతము, చిత్రకళ సమస్త విశ్వము తాలూకు ఒక భాషయగును. సంగీతమువలన విశేషించి కంఠము విడును. చిత్రకళవలన చేయిలేక కన్ను విడును. భక్తిపరాయణత్వము నేర్చుకొనుటకు చాలినంత వీని పరిచయ మావశ్యకము.

ఈప్రశ్నోత్తరముతే కాక గంధర్వవిద్యాలయము తాలూకు "సంగీతపత్రిక" యందు సంగీతమును గుఱించి యిట్లువ్రాసిరి! సంగీతజ్ఞానశూన్యుఁడగు మనిషి యోగికాని పక్షమున పశుసముఁడు—అని యొకశ్లోకము వందు చెప్పఁబడినది. నిజమడిగినట్లయితే యోగికూడ సంగీతము వినాగా తనపని చలాయించుకోలేఁడు. వానిసంగీతము హృదయవీణయందుండి బయలుదేఱును. ఆకారణముచేతను మనము దానిని వినఁజాలకున్నాము. యోగి తనహృదయము ద్వారా భగవంతుని భజించుచుండును. మనము కంఠముద్వారా ఆయనను భజించుచుండవలెను. మరియు నితరు లెవరయితే యిట్లు ఆయనను భజించుచుందురో దానిని వినవలెను. ఇట్లు చేయుచు మనము మన హృదయములయందు నిరంతరము ప్రతిధ్వనించుచున్న సంగీతమును వినుటకు మొదలిడుదుము."

—'విశాలభారత' కళాంకమునుండి.

## ఊఁరబిచ్చుక

కలువలపల్లి రంగనాథశాస్త్రి గారు

పవలున్ రేయియు మానవ-భవననివాసంబు మఱఁగి పలుమఱుఁ గూయున్
శ్రవణారుంతుదముగఁ బల్-కవలుగఁ జెలరేఁగి పిచ్చుకలు సతతంబున్.

చూలుఁ దాల్చిన యూరఁ బిచ్చుకలు జనుల-యిండ్ల వీలుఁ జా లెఱుఁగక యిరవు గాని
చోట నేచెత్తయో సుంతసుంత తెచ్చి-గూడు లెటులనో నిర్మించి గ్రుడ్లు పెట్టు.
తమ పురాభవకృత దురితంబువలన-గూటినుండి నేలం గూలుఁ గొన్నిగ్రుడ్లు
కూలినంతనె యవిసి యాగ్రుడ్లు పొలియు-గ్రుడ్లు పొదిగినఁగ మనుఁ గొన్ని రూపుఁ గాంచి
తనదుముక్కున నెర యేదొ తల్లి తెచ్చి-ప్రేమ మీఱఁ బిల్లల నోటఁ బెట్టి పెనుపఁ
గొన్నినాళ్ళకు నయ్యవి కూఁత లిడుచు-వింత ఱెక్కలు రాఁ గూడు విడిచిపోవు.

దినదిన మేవో గింజలు-గొనకొని యూడాడ నేఱికొని తిని మనుచున్
తనుయాత్ర గడుపు పిచ్చిక-ల నెఱుంగరొ, కనరొ, యవి మెలంగెడు విధముల్.

సజ్జనుల్ రోయ, విచ్చలవిడి ప్రియతోడ సారెకుఁ మరుపనుల్ సల్పు నొకటి
తనకామినిం గూడి తనియులాతినిఁ బట్టి మచ్చరంబున మచ్చ మాపు నొకటి
వినుగు పుట్టించుచు వీనులు వ్రయ్యఁగా వామెత్తి కిచకిచ కూయు నొకటి
కడుపుఁగక్కుఱితి నెక్కడనైన నెర లభించిన మానఁగాఁ బోక తినుట యొకటి
అబ్బెనే కాని, గుణలేశ మరయ సున్న-అఖిలదోషైక భాజన మగుచు బ్రదుకు
పిచ్చిక నభిజ్ఞు లెపుడైనఁ బెద్దఁ జేసి-సన్నుతింతురె? కటకటా జడులమాడ్కి.

గండుఁగోయిలభంగిఁ గర్ణపేయంబుగాఁ బంచమ రాగంబుఁ బాడఁగలదె
రాచిల్క చందాన వాచామృదుత్త్వంబు పెంపు మీఱంగ భాషింపఁగలదె
పావురాకైవడి భావంబుఁ దనిపెడి యింపు చొప్పడ గుబాళింపఁగలదె
నెమ్మిపోలిక నిసర్గమ్మగు షడ్జంబుసొంపు వెలారించి చూపఁగలదె
ద్రిమ్మరితనాన నటునిటుఁ దిరుగు చెపుడు-గంతు వైచుచు నిల్కడఁ గాంచఁ బోక
ఊఁరబిచ్చిక శ్రోత్రవిదారణముగఁ-జెలఁగి కిచకిచధ్వానముల్ సేయుఁ గాని.

కంఠమున నల్లనగుచాఱ గలుగుమాత్ర-నీలకంఠాఖ్య తన కబ్బె నిక్కమనుచు
నిక్కుఁ గాక తా శివుఁడౌనె నీచవృత్తి-మనెడు పిచ్చిక యెన్నిజన్మములకైన.

పిచ్చుక నీలకంఠమను పేరు గడించి మెలంగు జో మొదన్
మచ్చ యొకండు సాజమయి నల్లఁగ నుండుటఁజేసి గొప్పపే
ర్వచ్చునె యంతమాత్రఁ? గడు రమ్యపులాస్యము షడ్జనాదమున్
మెచ్చి తనర్చ బుధుల్ వొగడ మించు మయూరముసాటిఁ గాంచు నే.

అమృతకుంభాహరణార్థంబు దివి కేఁగి త్రోటితో సురనదీతోయములను
గొని పోయి ప్రజ్వలద్ఘోరాగ్నిఁ జల్లార్చి గీర్వాణయుత గంధర్వాలోలిఁ
దలఁపడి పోరాడ, బలవిక్రమంబులు వెలయ వ్రేల్మిడి వారి గెలిచి, యాత్త
పీయూషకలశుఁడై వెడలుచోఁ దనమీఁద బలభేదివజ్రంబు వైవ సరకు
గొనక, జితవజ్రియై సరగున, నిజాల-యంబునకు వచ్చి కద్రువ కమృతఘటము
నిచ్చి, జనని దాస్యము మాన్పి, యెసఁగువినత-సుతునియెదుట నిల్వంగఁ బిచ్చుకకుఁ దలమె

కమలానేత్రకుఁ గేతనంబు రథముంగా మించుచున్ యుద్ధరం
గముల వైరుల రూపు మాపి, జయముం గైకొంచు దుర్దాంతవి
క్రమతేజోబలశాలి యన్ ప్రథఁ గడుం గన్నట్టి పక్షీంద్రు చం
దమున్ నీచపుఁ బ్రాణి పిచ్చిక యెటుల్ దాఁ గాంచు శౌర్యాదులన్.

కుంకుమారుణసర్వాంగ కుందచంద్ర-పాండురానన శ్రీనాథవాహ నీకుఁ
గేలుమోడ్పులు మాకిమ్ము క్షేమమనుచుఁ-జదలగరుడునిఁజూచి మ్రొక్కుదురు బుధులు.

నమ్యుఁడైన ఖగేశ్వరు న్గాంచి ప్రణతి-సేయకే యవివేకి పిచ్చికకు మ్రొక్కుఁ
గృతకముం జూచి వ్యామోహమతిని భ్రమసి-సత్యమని యెంచి వర్ణించుజనులువోలె.

దమితాశీవిషు నాగభక్షకు గరుత్మంతున్ సుపర్ణున్ విహం
గమరాజుం గని సర్పదష్టులు నతుల్ గావించి సౌపర్ణ మం
త్రము నిష్ఠన్ జపియింతురేని విషబాధల్ తగ్గుఁ జేకూరుఁ క్షే
మము నారోగ్యము నూరఁబిచ్చుకకుఁ దన్మాహాత్మ్య మెట్లబ్బెడున్.

ఎఱకలు గలవుగా యెగురనేరనొ యంచు నెగురు నెట్లో మీఁది కెగిరి యలసి
ఏ చెట్లమీఁదనో ఏయిండ్లపైననో వ్రాలి కూటంబు జొచ్చి బ్రదుకు గ్రామ
చటకంబు పదునాల్గు జగముల నిజకుక్షిగోళంబునన్ నెలకొల్పి తనరు
విష్ణుదేవుని మోఁచి వినువీథి నలయక యెంతదవ్వైనియు నేఁగుదట్ట
తనము గడియించి, విష్ణువాహన మనంగ-మంచిపేరును బెంపును గాంచి తార్క్ష్య
వైనతేయనాగాంతకప్రభృతినామ-ములను బడసిన గరుడుఁడై వెలయఁబోద.

---

# సత్యాగ్రహులు

పురిపండా అప్పలస్వామి (కవితాసమితి)

చిరపరాధీన శృంఖలాచ్ఛేదమునకు
జీవితసుమాలె ధారవోసితిరి మీరు
కురియదే నేడు స్వర్గీయ కుసుమ వృష్టి
శ్రీ విరాజిల్లు మీ యోధశిరములందు.

బాధలే భాగ్యముగ నోర్చిబట్ట జాలు
భారతాశ్రమ తరుణతాపసులు మీరు
ఏ నిరంకుశు లేని బంధింపనిండు
నిగళముల త్రెంచుకొనెడు సైనికులు మీరు.

స్వార్థ లవ మేని లేని మీ త్యాగగరిమ
ప్రాకిపోయెను ఖండాంతరాల దాటి
ఇదె స్వరాజ్యరమా నవాభ్యుదయవేళ
నభమె నినదించె విజయదుందుభుల మ్రోత.

# నగర విద్యార్థిని

సిరిపి ఆంజనేయులుగారు

కాలంపువిలువ చక్కఁగఁ బాటిసేసి, విద్యార్జవమ్మున నెప్డు నడరుచుంట
శోధనమ్మునకుఁగాఁ జూడక, విజ్ఞాన జిజ్ఞాసఁగళలఁ జర్చించుచుంట,
దూషణ భూషణాదులకుఁ బొల్పడక, నిష్కపట భావమ్మునఁ గ్రాలుచుంట,
కానిచేఁతలకు మార్గముచూపు చెడుగులఁ గడకంటనేనియుఁ గానకుంట,
తనకుమాలిన చెయిదిని దడవకుంట, భక్తియును గార్యశక్తియుఁ బట్టుదలయుఁ
గల్గి, యెల్లెడ విజయమ్మె కాంచుచుంట, నగరవిద్యార్థినుల కెందుఁ దగు పథమ్ము.

# విత్తులేకుండ ఫలము లభింపదుగద!

పండిత, పురాణం సూర్యనారాయణతీర్థులుగారు

మేలు గూర్పఁ దలంచు మిత్త్రరత్నముఁబోలె నలసత మాన్పి కార్యములఁ జొన్పు
ప్రేమ గల్గిన దాసిరీతిగా మెయి వంచి పరిశుభ్రముగ నింటిపనులు సేయు
లావణ్యవతి మహాలక్ష్మిలాగే వేళఁ గలకల మొగముతోఁ గానిపించు
కష్టసుఖముల నొక్కవిధమ్ముగా నెంచి భూదేవివలె నోర్పు పూనియుండు
కన్నతల్లిని మించి కడు నాదరమ్మెంచి షడ్రసోపేతభోజనము నిడు
ప్రక్కఁ జేరిన మంచిపణ్యాంగనను మించి మది కనుత్సాహంబు మానిపించు
నిట్టిషాడ్గుణ్యయుక్త యైనట్టి భార్య, గాని పంచలకారయౌ కాంత గాని
దొడ్డపున్నెమ్ము లే కెట్లు దొరకు? నౌను, విత్తు లేకుండ ఫలము లభింపదుగద!



4/193

## చమత్కారచాటుపద్యములు

ఈపుస్తకము శ్రీ దాసరి లక్ష్మణస్వామిగారిచే సమకూర్పఁబడినది. దీనివెల ౦-౬-౦ లు. వారిచేతనే ముద్రితము, ప్రకటితము—పిఠాపురము.

ఇందుఁ బురాతనములు, అధునాతనములు నగు పద్యము లించుమించుగా మూఁడువందలు గలవు. వాని యందు ప్రతిపద్యమునందును ఏదోయొకచమత్కారముం డుటచేతను, అవి చాటువు లగుటచేతను దీనికీపేరు తగియున్నది. పద్యములు పలుచోట్లనుండి సంగ్రహించి యేకత్రి కూర్పఁబడినవి. విచిత్రవివాహము, వైదికులు, నియోగులు, పాగాలు, సస్యము, ఇత్యాదివిషయములనుగూర్చి వినోదార్థము రచింపఁబడిన పద్యములును, నీతిపద్యములును, సమస్యలు, వానిపూరణములు మొదలయినవి గలవు. ప్రతివారును జదువఁదగిన పుస్తకము. వెలయును వారు గ్రంథప్రకాశకులకు వ్రాయునది.

తీర్థులు.

---

## నీతిపద్యరత్నాకరము

ఇదియును శ్రీ దాసరి లక్ష్మణస్వామిగారిచేతనే సమకూర్పఁబడినది. ఇది క్రౌను ౧౬ పుటల పైగా నూటయిరువది పుటల పొత్తము. ఇందు వీరు భారతాదులగు గ్రంథములయందలి నీతిపద్యరత్నములను ప్రతివారును కంఠపాఠముగఁ జేయఁదగినవాని నేర్చి కూర్చి యాంధ్రబాలుర కెంతయు నుపకరించులాగునఁ జేసిరి. దీనిని ప్రతిగృహస్థుఁడును తమ బాలబాలికలచేఁ దప్పక చదివింపించి యీతద్గ్రంథసంధాతపరిశ్రమను సార్థక మొనరింతురుగాక. అనూల్యపద్యరత్నపేటికయగు దీనివెల ౦-౬-౦ లు మాత్రమే.

తీర్థులు.

---

## ఉమర్ ఖయ్యామ్

గ్రంథకర్త: డాక్టరు దీపాల పిల్లహరి నారాయణరావు గారు

ఈ తెనుగుకావ్యము సుప్రసిద్ధపారసీకకవి ఉమార్ గారి రుబాయత్ వృత్తసంపుటమునకు అనువాదము. పారసీక మాతృకనుండి గాక, ఆంగ్లానువాదమగు ఫిట్జు జెరాల్డుగారి కావ్యమునుండి పరివర్తితము.

పారసీక మాతృకయందలి మాధుర్యము ఆభాష నెఱిగినవారికే అనుభవయోగ్యము కాని ఆంగ్లకావ్యము నైతము అద్భుతమైన భావగాంభీర్యమును, ప్రతిపదార్థప్రయోజనమును గల్గి భాసిల్లుచున్నది. నారాయణరావు గారి షట్పదులు కావ్యగుణము లన్నింటను ఆంగ్లమునకు కడుంగడు తీసిపోవునవై యున్నవి.

స్థాలీపులాకన్యాయముగా నొక్కటి యుదాహరణము.—

And, as the cock crew,those who stood before The Tavern shouted—"Open then the dcor You know how little while we have to stay, And,once departed,may return no more". Fitz. III.

ఈడె మే ముండేటి కాలము  
దాటిపోతున్నాది మఱి అది  
దాటిపోతే తిరిగి వచ్చే  
మాట యేమొకదా

కొక్కొరో అని కోడి కూసెను
కొట్టు "తలుపును తీయవే" మని
కూడియుండినవారు నాత్రము
తోడ నార్వగను.

చి॥ నా॥ 3.

రెంటికింగల వ్యత్యాసమును, అంతరమును విజ్ఞులు గ్రహింతురుగాక !

కా. వెం. సు.

---

## సుధ – 'వార్షిక సంచిక'

సంపుటము ౧. సంచిక ౧౨. సంపాదకులు: కుటుంబరావుగారు, యస్. వి. ఆచార్యగారు. ఏలూరునుండి వెలువడే మాసపత్రిక 'సుధ ప్రయాణములోని మొదటి మైలురాయి దాటినసురుసుగా వార్షిక సంచిక వెలువడింది' అని 'మున్నుడి' (సాలు కొక మైలు అనుకుంటే). ఫెదరువెయిటు కాగితముతో, రాయలు సైజున ౯౬ పుటలవఱకు గలిగి అందముగా ఉన్నది యీ సంచిక.

శ్రీ విశ్వనాథ కవిరాజుగారి 'ఆంధ్రరంగస్థలమున సంస్కృత నాటకములు' అన్నది ఉద్ధృతిమైన ఆంగ్ల వాక్యావళితో బిగిసిఉన్నా, పాశ్చాత్యాభిరుచి ననుసరించి సహా సంస్కృత నాటకకళ యెంత ఉత్తమమైనదిగా ఒప్పుదల అయినదీ నిరూపిస్తూ, ఆంధ్రరంగముమీద సంస్కృత నాటకాల ప్రయోగములని ప్రయోజనాన్ని, దాని ఆవశ్యకతను అవిరుణీయంగా సూచిస్తూ ఉన్నది. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారి 'ఆయుర్వేదము: అప్పుడు—ఇప్పుడు' అనేది పూర్వకాలం మన దేశంలో ఆయుర్వేదము ప్రభువుల ఆదరణ పొందుతూ, 'సిద్ధాంతపరముగను, అనుభవపరముగను' ఎట్టి అభివృద్ధితో విలసిల్లేదీ, ఏపద్ధతుల మీద జీవితానికి ఉపయోగపడుచు బడేదీ మొదలైన విలువగల భోగట్టాలు నిదర్శించే శాసనగత వాఙ్మయము కొంత ఉద్ధరించి మాపుతూ నేటి అవస్థాభేదాన్ని సూచిస్తూ ఉన్న ఉత్కృష్టమైన చారిత్రకవ్యాసము.

శ్రీ విశ్వనాథ వెంకటేశ్వరులుగారి 'అభిరుచి' అనే వ్యాసం ప్రతిభాకలితమై భావుకముగా ఉన్నది. శ్రీ కవికొండల వెంకటరావుగారు 'పెనుమంచిలి జైనుదేవుడు' అనే సరళమైన కథలో చూపిన అనుభవ మర్మజ్ఞత వారికళకు తీరని మెఱుగు పెట్టుతున్నది. శ్రీ వెంపటి నాగభూషణంగారి 'పాటకచ్చేరి' అనేకథ సున్నితంగా ఉన్నది. శ్రీ గుడిపాటి వెంకటాచలంగారి 'అమీనా' అనే కథ వారి విలక్షణమైన ఆశయాలకు కట్టుపడ్డదై, మనసంఘము మనస్సుకే కాక అభిరుచిపక్వమైన కళాహృదయానికి సహా వెగటు గూర్చుతూ, వారి మెలకువగల సహజరచనావైదగ్ధ్యం మెప్పును దీనం చేస్తూ ఉన్నది. సంకుచితమైన, కూర్పు కురానివికలరాగశకలాలలో ఆత్మవికాసం ముడిచిపెట్టజూచేతత్పరత ఏభూభాగంలోనూ శాశ్వతవాణి కాజాలదు. నైష్యగత్న, పండిత డి. గోపాలాచార్యులుగారి 'దీర్ఘజీవనసాధనము' చాలా విజ్ఞానదాయకమైన వ్యాసము. శ్రీ సహదేవ సూర్యప్రకాశరావుగారి 'పకుళమాల', శ్రీ కొండాలి వెంకటసుబ్బారావు, కామరాజుగడ్డ శివయోగానందరావుగార్ల 'భక్తి-ప్రేమ' స్వతంత్రములైన చక్కని భావకావ్యాలు. ఇంకా శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారి 'శ్రీసుధాసంభవము', శ్రీపురిపండా అప్పలస్వామిగారి 'అనార్కలీ', శ్రీ ఉమర్ అలీషాగారి 'రాధ' మొదలైన అందమైన వ్యాసాలున్నవి.

రెండు మూడు సాధారణ చిత్రాలున్నవి. అట్ట, స్వాగత బొమ్మలు బాగానే ఉన్నా, వెయ్యడం చాలా సాధారణంగా ఉంది. సంచిక చివరభాగంలో గ్రంథం తోపాటు ప్రకటనలుకూడా కలగలపడం 'అభిరుచి'కి తగిన వ్యవహారం కాదనిపిస్తుంది.

'సుధ' ముందుముందు దాటబోయే 'మైలురాళ్ల' 'గురుతులు' ఇంకా కావ్యసంపద, సారస్వతాది వ్యాససంపద పెంపుకొని జనాదరపాత్ర మయేటట్టు సంపాదకులు పూనికతో ప్రయత్నిస్తారుగాక !

విలాసము: 'సుధ', పోస్టుబాక్సు నెం. ౨౦౭, మదరాసు.

---

### మణిమంజూష

గ్రంథకర్త: శిష్టా వేంకటసుబ్బయ్యగారు. ప్రకాశకులు: సాహితీనికేతనమువారు, నరసాపురము, ప. గోదావరి. క్రౌనుసైజు, ౧౦౩ పుటలు. వెల ౧౪ అ.

ఇది కొన్ని కథల సంపుటము. కథలు చాలవఱకు పౌరాణికములు; 'రైతుబిడ్డ రాజగుట' అనునది **'Earthly Paradise'** నుండి అనుకరించినది. శైలి కృతకము గాక, చాలవరకు సరళమై, సహజమైయున్నది. పౌరాణికకథలు చదువదగు విద్యార్థిలోకమున కిది చదువదగినదే. స్త్రీలకు నుపయోగపడును.

---

### గ్రామజన దర్పణము

గ్రంథకర్త: సురవరము ప్రతాపరెడ్డిగారు, బి.ఏ., బి. యల్. గోలకొండ పత్రికాముద్రాశాల, త్రూపు బజారు, హైదరాబాదు-నందు ముద్రితము. రాయలు ౧౬ సైజు, ౩౭ పుటలు. వెల ౩ అ. ౬ పై. గ్రంథాలయములు, పంచాయతులు, సహకారము మున్నగు విషయములగూర్చి కొండగుర్తులు గాతెగనంత క్లుప్తముగ వాక్యావళితో తెలిపినారు.

---

### హైందవ స్త్రీలు

స్వామి వివేకానందుని ఒక ఉపన్యాసమునకు తెలుగు నేత. ఇది తెనాలి, ఉత్తమగ్రంథమాలిక ప్రథమపుష్పము. సంపాదకులు: వేంకటరత్నముగారు. క్రౌనుసైజు, ౨౩ పుటలు. వెల ౨ అ. శైలి సరళము. పెద్దసంపుటములుగా ఇట్టి సారస్వతము ప్రకటించుటకు గ్రంథమాలవారు పూనుకున్న బాగుండును.

---

### The Crisis and the Truce
### By "Chronicler"

ది న్యూ ఇపాక్ పబ్లిషర్స్, మద్రాసు. క్రౌను ౯౦ పుటలు. వెల ౧౦ అ.

1927 లో సైమన్ కమిషను నియమింపబడినది మొదలు 1931 లో గాంధి-ఇర్విన్ ఒడంబడిక జరిగినంతవరకును గల స్థితిగతులను వర్ణించుట ఈ గ్రంథము యొక్క యభిప్రాయము. సైమనుకమిషను; శాసనోల్లంఘనము; సప్రూ జయకర్ రాయబారములు; రౌండ్ టేబిల్ సభ; గాంధి - ఇర్విన్ ఒడంబడిక—ఇవియే యీ గ్రంథమున నుదాహరింపబడిన యంశములు. వీనిని గూర్చిన వివరము లిందు క్లుప్తముగ వర్ణింపబడినవి. జరిగినసంగతులను ఉన్నవున్నట్లుగ పూస గ్రుచ్చినట్లు గ్రంథస్థము చేయుటయే బహుశః గ్రంథకర్త యభిప్రాయమై యుండవచ్చును. కాబట్టియే ఆయా యంశములను గూర్చి తన స్వాభిప్రాయములను గ్రంథకర్త వెలిబుచ్చియుండలేదు.

కాని ఒక్కటి. ఒడంబడిక విషయమున ఇర్విన్ ప్రభువు మహోదారత జూపెనని గ్రంథకర్త యభిప్రాయము. ఈ యౌదార్యము బ్రిటిష్ ప్రభుత్వమువారి దనిమనము భావించుకొనవలెనో లేక ఇర్విన్ ప్రభువు వ్యక్తికి చెందినదిగానే భావించుకొనవలయునో తెలియుట లేదు. కాని, ఇది యెట్లయినను, ఒడంబడికలో బ్రిటిషుప్రభుత్వమువారు గాని, ఇర్విన్ ప్రభువు స్వయముగనే కాని చూపిన యౌదార్యమేమో యింతవరకును బోధపడకున్నది.

ఇంక చారిత్రాంశములకు సంబంధించినవర కవి చక్కగ వివరింపబడినవి. సందర్భానుసారముగ, నాయా ప్రముఖుల యుపన్యాసములు మున్నగువానినిగూడ గ్రంథకర్త యుదాహరించెను. 1927-1929 కాంగ్రెసు సమావేశముల చరిత్రను, అఖిలపక్షమహాసభ చరిత్రను, ముస్లిం లీగ్, హిందూమహాసభల చరిత్రనుగూడ క్లుప్తముగ వివరించినచో గ్రంథము మరింత సమగ్రముగ నుండెడిది.

ప్ర. రం.

---

### ప్రేమచందుకథలు

హిందీవాఙ్మయమున ప్రేమచందుకథలు పేరెన్నిక గన్నవి. విశ్వకల్యాణసంధాయకములగు ధర్మము, నీతి, దయ, ప్రేమ మొదలగు నుత్తమతత్త్వముల కథా

రూపమున బోధింపగల నేర్పు ప్రేమచందునకు గలదు. వీరు సృష్టించుపాత్రములు జీవకళ నిండారి పాఠకుల యెదుట సాక్షాత్కరించు చున్నట్లుండును. పాత్రముల యొక్క భిన్నములగు మనఃప్రవృత్తుల సంఘర్షణ మద్భుత రీతిని చిత్రితమయియుండును. పుక్కిటిపురాణములవలె గాక ప్రేమచందుకథలు పాఠకులహృదయముల నత్యు త్సాహోత్సాహమును గలిగించుచుండును. కథనము న్యూ నాధిక్యములు లేక క్రుద్దినట్లమరియుండును. ఎల్లవిధముల ప్రేమచందుకథ లుత్తమశ్రేణికి జెందినవని విశేషించి చెప్పబని లేదు.

వాఙ్మయమున పెద్దపాళ్లలో నొకపాలు కథలది. సంఘమును దిద్దితీర్చి తము యేలుబడిలోనికి దచ్చికొని దానిని పెంపొందించేయుటకు మంచికథ లుపకరించును.

ఆంధ్రదేశమునను పలువురు కథకులు కథలను రచియించి యాంధ్రులకు సమర్పించుచున్నారు. వానిలో నుత్తమములగునవియు గలవు. వానివలన సంఘమున నించుక పరివర్తనము గలుగుచున్నది. కాని యితర వాఙ్మయములయందువలె నాంధ్రవాఙ్మయమున మంచి కథ లెక్కువగ నింకను వెలువడవలెను. కావున కథా రచయితలకు మార్గదర్శకములుగ అన్యభాషలనున్న మంచికథల యనువాదములు నైతము నావశ్యకములు. ఇట్టి తరి శ్రీ దినవహి సత్యనారాయణగారు ప్రేమచందుకథల నాంధ్రీకరించి తెలిగించి యాంధ్రదేశమున కర్పించి యస్యవాదముల కర్తలయినారు. ఆంధ్రకథావాఙ్మయాభివృద్ధి నాకాంక్షించువారెల్లరు శ్రీ సత్యనారాయణగారి నభినందింపదగుదురు. వీరి తెలిగింపు ఇంచుక ముదుకగ నున్నను భాషాప్రకటనమున కనువైనదిగ, సుగమముగ ఉన్నది.

వీనికి బహుళప్రచారములను గలిగించి వీనివలని ప్రయోజనమును బడయవలసినభార మాంధ్రలోకముపై నున్నది. శ్రీ సత్యనారాయణగారును, సమర్థులగు నితరులును ఇంకను ఇతరభాషలయందుగల మంచికథల ననువదించి యాంధ్రకథావాఙ్మయమును పెంపొందింపదగుదురు. విలాసము: సరస్వతీ గ్రంథమాల, కాకరపఱ్ఱు, తణుకుతాలూకా, ప॥ గోదావరి.

---

## కాదంబరీ కథాసారము

వివిధ విధములగు వర్ణనములతో, శబ్దార్థాలంకారములతో నిండియున్న సంస్కృతగద్యకావ్యమగు కాదంబరియందలి యితివృత్తము రెండుమూడు మారులు జదివినగాని పాఠకుని తలకెక్కుట యసాధ్యము. కావున నందలి వర్ణనభాగములను దొలగించి కథ సులభముగ తెలియునట్లు భీమరాజు సత్యనారాయణరావుగారు దీని నిట్లు తెలిగించినారు. ఇది పూర్వభాగముమాత్రము. అచ్చటచ్చట మూలగ్రంథమునందలి వర్ణనములవాసనయొకింత కానవచ్చుచున్నను ఇతివృత్తము సుబోధముగా నున్నది. రచనము నిర్దుష్టముగను, సరళముగను నున్నది. మాధ్యమికపాఠశాలల విద్యార్థులు చదువదగినది. వెల ౦-౧౦-౦.

విలాసము: శ్రీ జే. కృష్ణస్వామి శర్మగారు, ఒంగోలు, గుంటూరుజిల్లా.

---

## బాణగద్యకావ్యకథలు

బాణకృతములగు కాదంబరీ హర్షచరితముల యందలి యితివృత్తములను సుబోధమగునట్లు శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగా రిట్లు తెలుగున రచియించిరి. ఇందు మూలగ్రంథములయందలి వర్ణనములు, ఇతివృత్తావబోధమున కడ్డుదగులునవి, ఉజ్జగింపబడినవి. రచనము మృదుమధురముగ, నిర్దుష్టముగ నున్నది. భాషాపరిచయ మత్యల్పముగా నున్నవారికిగూడ తెలియునట్లు శ్రీశాస్త్రిగారు దీనిని రచియించినారు. ఇది మాధ్యమికపాఠశాలల బాలురు చదువదగినది.

విలాసము: శ్రీపాద శాస్త్రి అండు కో., పిఠాపురము, తూర్పుగోదావరి.

---

## వర్ణనరత్నాకరము

౩-౪ భాగములుగల రెండవసంపుటము. గ్రంథసంధాత: దాసరి లక్ష్మణస్వామిగారు, పిఠాపురము, తూర్పుగోదావరిజిల్లా. ఇది డెమ్మీ ౮ పేజీల సైజున ౬౦౦ పుటల గ్రంథము. వీ రిదివఱలో దీని ౧,౨ భాగముల

నొక సంపుటముగాఁ బ్రకటించినారు. ఇప్పుడీరెండవసంపుటమున ౧౧-వ శతాబ్దిమొదలు ౧౯-వ శతాబ్దివఱకును గల కవీశ్వరుల గ్రంథములనుండి వర్ణనలతోఁ గూడిన పద్యములను సుమారు ౫ వేలకుఁ బైఁగా నిందు సమావేశపఱిచినారు. భారతము మొదలయిన యాంధ్రగ్రంథములయందలివి సకలజనోపయుక్తములయిన పద్యములను విషయవిభాగపూర్వకముగా నేకత్ర సమావేశపఱుచుటచే నిది యాంధ్రుల కందఱకును చాల నుపయోగకారిగా నుండును. ఇట్టి మహోద్యమమునకుఁ బూనుకొన్న గ్రంథసంధాత యాంధ్రులయభినందనముల కర్హుఁడని చెప్పకతప్పదు. ఆంధ్రభారతాది యావదాంధ్రపద్యసారస్వత సారస్వత వర్ణనరత్నములెల్ల నొక్కచోఁ లభించునట్లుచేసిన వీరియీ ఘనకార్యము మిగులఁ గొనియాడఁదగినది. దీనివెల రు ౩-౮-౦. చమత్కారచాటుపద్యములను పుస్తకము దీనియందలి చివరభాగమే వేఱుగ నొక పుస్తకముగా ప్రకటింపఁబడినది. దీనిని గొన్నవారికి దానిని గొన నక్కఱ యుండదు.

తీర్థులు.

---

## ఆంధ్రదేశ చరిత్రకథలు

ఆంధ్రదేశచరిత్రము బాలురకు సులభముగ బోధపడుట కనుకూలములగు పుస్తకములు తెలుగున చాల తక్కువ. లేవనియే చెప్పవచ్చును. అట్టి పుస్తకములు కొల్లలుగ వెలువడుటావశ్యకము. అట్టివానిలో నిది మొదటిదనదగును.

దీనిని శ్రీమామిడిపూడి వెంకటరంగయ్య (యం. ఏ.)గారు రచియించిరి. ఆంధ్రదేశచరిత్రయందు, పురాణములయందు ప్రసిద్ధిగన్న మహారాజులయు, మహాపురుషులయు జీవితములను, స్థలములచరిత్రములను ఆధారముగా గొని అల్లినకథలు ముప్పదిరెండిందు గలవు. నేటివఱకు ప్రకటితములయిన శాసనములవలన నుపలబ్ధములగు విషయములు, నానుడికథలు నీకథలయందు వలసినపట్టుల ననుసంధింపబడినవి. వీనిని చదువు తెలుగుబాలురకు తమ దేశముయొక్క చరిత్రయం దభిరుచిగలుగుట నిస్సంశయము. మఱియు నిందుగల ప్రాచీనములగు శిల్పచిత్రములయు, వర్ణచిత్రములయు సుందరప్రతికృతులు పదునెనిమిది బాలురయభిరుచిని పెంపొందించుట కుపకరించును. ఇట్టిగ్రంథమును రచియించిన గ్రంథకర్త నాంధ్రు లభినందింపవలయును.

ఇందు కొన్ని చిన్నలోపములును గాన్పించుచున్నవి. గ్రంథముపేరు "ఆంధ్రదేశకథలు": ఇందు శ్రీరామాయణము, పాండవవిజయము అను కథలకు తావు కనపడదు.

విశ్వామిత్రుని కొడుకులే ఆంధ్రులు. "విశ్వామిత్రుని కొడుకులు ఆంధ్రదేశమునకువచ్చి............" అని ఇందుగలదు. (86)

"ఆంధ్రరాజు లందరు ఋషులకు విధేయులు"

—పు. ౧౮.

"ఆంధ్రరాజుకూడ అట్లే వచ్చి తగిన కానుకలను ఇచ్చెను."—పు. ౨౧. ఈ యాంధ్రరాజు లెవ్వరో!

"ఆంధ్రరాజులుకూడ ఏదో ఒకపక్షమున చేరవలసివచ్చెను."—పు. ౨౧. ఈయాంధ్రరాజు లెవ్వరు? ఎవ రెవరిపక్షమున జేరిరి?

"అయ్యా, మేము నిషాదులము; కిరాతులనికూడ మాకు పేరుగలదు."

—పు. ౮.

"ఆ ఆశ్రమమునకు కొంతదూరమున నిషాదు, కిరాతులు, నాగులు, వారివారి పల్లెలలో నివసించుచుండిరి."

—పు. ౧౨.

మొదటివాక్యము నిషాదులు కిరాతులు నొకజాతివారుగను, రెండవవాక్యము భిన్నజాతులవారుగను తెలుపుచున్నవి.

కృష్ణదేవరాయలు అనుకథయందు కృష్ణదేవరాయల విద్యాపరిపోషణము, కవిపండితగోష్ఠులు మొదలగువానిని గుఱించి యొకింతయైన లేమి కథకు లేమి-యయ్యెను.

అజికర్తుడు (పు. ౫)—అజగర్తు డందురు. వశిష్ఠపుత్రుడు (పు. ౩౨)—వాసిష్ఠీపుత్రు డందురు. కంపనకుమారుడు (పు. ౮౫)—కంపకుమారుడు, కంపడు, కంపరాయలు అందురు. (పు. ౧౦౪)—అహోబిలము-అహోబలము అనబడును. తాళి కోట-తల్లికోట యందురు.

రచనము సుగమముగనే యున్నను వ్యవస్థ లేకున్నది. అపశబ్దప్రయోగములు కలవు.

ఇట్టిలోపములు గ్రంథకరణమున సావధానత కొరవడుటచే సంభవించునని. పునర్ముద్రణమున వీనిని గ్రంథకర్త తొలగింతురుగాక! బాలుర యుపయోగార్థము మరియు నిట్టిగ్రంథములను పెక్కిటిని రచియించి శ్రీ వేంకటరంగయ్యగారు బాలుర హృదయక్షేత్రముల ఆంధ్రదేశచరిత్రాంకురములు తామనతంపరగ పెరిగి వారికి ప్రాచీనదేశౌన్నత్యాదులను చక్కగా దెలియుటకు మంచి అవకాశమును గలిగింపదగుదురు.

---

## సన్మార్గదర్శిని (మూడుభాగములు)

శ్రీయుతులు గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు తెలుగుసామెతల అర్థమును వివరించుకథలను రచియించి యిట్లు ప్రకటించినారు. ఏ సామెతను వివరించుకథకు ఆసామెతనే పేరుగ నియమించినారు. మొదటిభాగమున ౭౮, రెండవభాగమున ౨౩, కథలునుమూడవభాగమున ౨౧ కథలునుగలవు. మొదటిభాగము నందలి యొకొక్కకథ యొకొక్కపుటకు, రెండవదానియందు రెండుపుటలకు, మూడవదానియందు మూడుపుటలకు సరిపోవునట్లు పెంచినారు. ఈపద్ధతి చాలబాగుగనున్నది. కథనము మధురముగను సుబోధముగను నున్నది. రచనము రెండుమూడు భాగముల నిర్దుష్టముగ నున్నది; మొదటిభాగమున నొకింత సంస్కారము నపేక్షించుచున్నది. ఇట్టికథలను చదువు బాలబాలికలకు భాషాజ్ఞానముతోపాటు లోకజ్ఞానమును పెంపొందును. కావున నీకథలను ప్రాథమికపాఠశాలలలో పై రెండుతరగతుల జదువు బాలబాలికలకు పాఠ్యగ్రంథముగా నియమింపదగును. వెల ౧ భాగము 3 అ., ౨ భాగము ౪ అ., 3 భాగము ౫ అ.

విలాసము: మేనేజరు, విద్యావినోదినీగ్రంథమాల, చిత్తూరు.

---

# గ్రంథస్వీకారము

## శ్రీ మదహోబిల చరిత్రము

గ్రంథకర్త: పాలపర్తి సూర్యనారాయణగారు. పలయువారికి: సుంకు వెంకటరామయ్యశ్రేష్ఠి, చాగలమఱ్ఱి, కర్నూలు జిల్లా. క్రౌనుసైజు, ౪౧ పుటలు. వెల ౪ అ.

---

## ౧. శ్రీవేణుగోపాల సీస తారావళి

వెల 3 పైసలు.

## ౨. హనుమత్సమావళి

వెల ౧ అ. ౬ పై.

పైరెండింటికి కర్త: బ్రహ్మభొట్ల పట్టాభిరామయ్యగారు, గుడివాడ.

---

## జానకీ శతకము

గ్రంథకర్త: కొవ్వలి వేంకట రాజేశ్వరరావుగారు, కల్లికోట. వెల ౪ అ. శైలి ధారాళముగ నున్నది.

---

## ౧. లింగార్చన తత్త్వము

త్రిలిఙ్గ పత్రికనుండి పునర్ముద్రణము. గద్యవ్యాసము.

## ౨. నావిబుధలోక సందర్శనము

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికనుండి పునర్ముద్రణము. పద్యవ్యాసము. రచయిత: విమర్శకాగ్రేసర, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, కాకినాడ.

---

## మొగలాయీ దర్బారు

ప్రథమభాగము. (ఇంతకు ముందు రెండు మూడు నాలుగు భాగములు చేరినట్లు తెలిపియుంటిమి). డెమ్మీసైజు. 3౨౪ పుటలు. వెల రు. ౧-౮-౦. గ్రంథకర్త: మొసలికంటి సంజీవరావుగారు. విలాసము: సరస్వతీ గ్రంథమాల, రాజమహేంద్రవరము.

---

Printed and Published by G. Subbaramayya, at the Andhra PatrikaPress, No.7,Thambu Chetty St., Madras

# తీర్మానములు: ౪౫-వ భారత జాతీయ మహాసభ, కరాచి—౧౯౩౧

## ౧

### పరమపదించిన దేశ భక్తులు

పండిత మోతీలాలు నెహ్రూ, మౌలానా మహమ్మదాలీ, మౌల్వీ మజ్హరుల్‌హక్, రేవాశంకరు జగజ్జీవను గార్లును, కడచిన జాతీయ సంగ్రామమున ప్రాణముల నర్పించిన వీర యోగి యోగినీ జనములును పరమపదించినందులకు కాంగ్రెసువారు విషాదమును వెల్లడించుచు వారి కుటుంబములకు వారితోపాటు దేశీయు లెల్లరు దుఃఖించుచున్నారని తెలియబరచుచున్నారు.

## ౨

### కాన్పూరు అల్లరులు

కాన్పూరులో హిందూ మహమ్మదీయులకు కొట్లాటలు కలిగి యనేకులు మరణించుటకు మరి యనేకులకు గాయములు తగులుటకును కారణ మైనందులకు కాంగ్రెసువారు దుఃఖించుచు, మృతులైన వారి కుటుంబములకును, గాయములు తగిలినవారి కుటుంబములకును సమ సానుభూతిని దెలుపుచున్నారు.

ఈ యల్లరులలో సంయుక్తరాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులును, దేశ సేవకులలో నెల్ల స్వార్థరహితు లని పేరొందినవారును, మతవైషమ్య బుద్ధి యింతయేని లేక సర్వమతస్థుల హృదయములకు నెక్కినవారును నగు శ్రీ గణేశశంకర విద్యార్థిగారి మరణవార్తకు కాంగ్రెసువారు దుఃఖించుచున్నారు. శ్రీ గణేశ శంకరుల దారపుత్రాదులకు కాంగ్రెసువారు తమ సానుభూతిని దెలియజేయుచు, దేశ సేవకులలో ప్రథమ గణ్యులైన యట్టి మహనీయు లొకరు, సోదర దేశీయుల యున్మాదమును, కొట్లాటలను మాన్పి, శాంతిని, సమచిత్తమును సంస్థాపించి, యార్తుల సంరక్షించుటకై తమ యమూల్య ప్రాణముల నర్పించినందులకు కాంగ్రెసువారు గర్వపడుచున్నారు.

మహనీయ త్యాగమును వైషమ్య శాంతి సాధనము గావించి, ప్రతిక్రియాబుద్ధి మానవలయునని కాన్పూరులో నీ కొట్లాటలకు సంబంధించిన వారెల్లరిని కాంగ్రెసువారు ప్రార్థించుచున్నారు. ఈ కొట్లాటకు మూలకారణము లరసి హిందూ మహమ్మదీయుల వైషమ్యమును శాంతపఱచి, యీవిషజ్వాల యన్యపట్టణములకు ప్రాకకుండ జేయుటకై కాంగ్రెసువారికమిటీవారిని నియమించుచున్నారు. అధ్యక్షులు:- డాక్టరు భగవాన్దాసుగారు. సభ్యులు:- పురుషోత్తమదాసు టాండను, ఖ్వాజా మయీన్, టి. ఎ. కె. షేర్వాణీ, జఫరుల్ ముల్కు; పండిత సుందరలాల్,

## ౩

### రాజకీయ ఖైదీల విడుదల

గవర్న్మెంటువారు, కాంగ్రెసు వారితో గావించుకొనిన యొడంబడికకు, ఇంగ్లాండు ఇండియా దేశములకు స్నేహ సద్భావములను పెంపొందించుటయే లక్ష్యమైనయెడల, ఆయొడంబడికను బ్రిటిషువారు తమ యధికారమును వదలుకొనుటకు నిశ్చయించుకొని మనఃపూర్వకముగనే చేసికొని యుండిన యెడల, యొడంబడికలో లేని రాజకీయ ఖైదీల నందరిని వెంటనే విడుదలచేసి, గవర్న్మెంటువారు దేశీయులలో కొందరి రాజకీయాభిప్రాయముల కొరకు వారికి విధించిన రాజకీయ ప్రతిషేధముల నెల్ల తొలగింప వలసియుండునని కాంగ్రెసువారు హెచ్చరించుచున్నారు.

గవర్న్మెంటువా రీతీర్మానము ననుసరించి ప్రవర్తించినచో, లాహోరు ఉరిశిక్షల వలన ప్రజలలో జనించిన వైరస్యమును కొంతకుకొంత చల్లార్చినవారగుదురని యీ కాంగ్రెసు వారు గవర్న్మెంటు వారికి దెలియ జెప్పుచున్నారు.

8. 4. 23 ౯ ౭౫

## ౪

## లాహోరు ఉరిశిక్షలు

ఈ కాంగ్రెసు వారికి, రాజకీయ ప్రయోజనములను సాధించుటకై దౌర్జన్యము నవలంబించు పద్ధతితో నెట్టి సంబంధమును లేదు. సర్వ విధముల దౌర్జన్యమును కాంగ్రెసువారు ఖండించుచున్నారు. కాని కీర్తిశేషులైన భగత్సింగు, సుఖదేవ్, రాజగురుల ధైర్యస్థైర్యములను, వారి త్యాగ గౌరవమును కాంగ్రెసువారి మెప్పుదలకు పాత్రమైనవి. వారి బంధుమిత్రులకు కాంగ్రెసువారు తమ సానుభూతిని దెలుపుచున్నారు.

ఈ ముగ్గురియురిశిక్షయు కేవలము నిస్సంకోచమైన ప్రతీక్రియాబుద్ధితో గావింపబడినదనియు, నిది యురిశిక్షను దప్పింపవలయునని గగ్గోలుపెట్టిన యావత్ప్రజాభిమతమును త్రోసిపుచ్చుటయనియు కాంగ్రెసువారభిప్రాయపడుచున్నారు.

ఈ యుభయ జాతుల మధ్య సద్భావమును పెంపొందింపవలసియున్న యిట్టి క్లిష్ట సందర్భమున, తత్సహాయకమైన యీ మహావకాశమును కోల్పోవుటయేగాక, విశ్వాసము నశించి దౌర్జన్య కృత్యములు కావించుచుండిన పక్షమును శాంతి మార్గమునకు ద్రిప్పుకొను నవకాశమును గూడ గవర్నమెంటువారు కోలుపోయిరని కాంగ్రెసు వారు నమ్ముచున్నారు.

## ౫

## గాంధి-ఇర్విను ఒడంబడిక

వర్కింగు కమిటీ వారికిని, గవర్నమెంటువారికిని జరిగిన తాత్కాలికపు టొడంబడిక నీకాంగ్రెసువారు పరిశీలించి యంగీకరించుచు కాంగ్రెసుయొక్క పూర్ణ స్వరాజ్య లక్ష్యము యథాపూర్వముగనే యున్నదని విశదపరచుచున్నారు.

కాంగ్రెసు వారు రౌండుటేబిలు మహాసభయందు పాల్గొనుటకు సరియైన మార్గ మేర్పడినచో, ఆసభయందు కాంగ్రెసు ప్రతినిధులీ లక్ష్యముకొఱకే పోరాడుదురు అందుకు ముఖ్యముగ సైన్యము, విదేశవ్యవహారములు, కోశము, ఎగుమతి దిగుమతి పన్నులు, ఆర్థిక వ్యవహారములు అను వీనిపై దేశీయులకు పూర్ణాధికారము గలుగజేయుటకును, ఇండియా ప్రభుత్వము వారి కున్న ఋణములలో న్యాయప్రకారము భారతీయులును, ఆంగ్లేయులును పంచుకొనవలసిన మొత్తములను నిర్ణయించుటకై నిష్పక్షపాతమైన విచారణచేయించుటకును, నీయుభయ దేశముల వారును పరస్పర సంబంధమును స్వేచ్ఛానుసారముగ విడుచుకొన గలిగిన హక్కును పొందుటకును కాంగ్రెసు ప్రతినిధులు ప్రయత్నము గావింతురు.

అయితే, భారతదేశక్షేమమున కవసరములని తోచిన రక్షణములను, మినహాయింపులను అంగీకరించుటకు కాంగ్రెసు ప్రతినిధుల కధికారమున్నది.

రౌండుటేబిలుసభ కేగెడు కాంగ్రెసు ప్రతినిధి సంఘమునకు మహాత్ముని నాయకునిగా నియమించి, యాయనతో సభకు వెళ్లదగిన ప్రతినిధులను నియమించుటకు వర్కింగు కమిటీవారి కధికార మొసగబడినది.

## ౬

## శాసనోల్లంఘనము

గత శాసనోల్లంఘనోద్యమమున పాల్గొని, కారాగృహవాసము, తుపాకిగుండ్లు, బయొనెట్టులు, లాఠీలు మున్నగువానికి గురియై, స్వగృహములు వదలిపెట్టి ప్రవాసమునకు బోయి, యాస్తులను ప్రభుత్వమువారి పరముచేసిన సత్యాగ్రహుల నెల్లరను నీ కాంగ్రెసువారభినందించుచున్నారు. ఈ యుద్యమములో సమయమునకు దోడ్పడి వేలకొలది సత్యాగ్రహ దళములందు జేరిన నారీమణుల నెల్లర నభినందించుచు, వోట్ల హక్కుల విషయములో స్త్రీ పురుషులకు భేదము చూపునే రాజ్యాంగ విధానమును తమకు సమ్మతము కాజాలదని కాంగ్రెసువారు ప్రకటించుచున్నారు.

## ౭

## మద్యపాననిషేధము

కడచిన పంద్రెండు మాసములందును మత్తుమాదక పదార్థముల నిషేధమున దేశములో జరిగిన యభివృద్ధికై

కాంగ్రెసువారు సంతృప్తిని దెలుపుచు నికముందుగూడ కాంగ్రెసుసంస్థలవా రెల్లరును మద్యనిషేధప్రచారమును మఱింత యుత్సాహముతో గావించు చుండవలయు నని కోరుచున్నారు. దేశీయ నారీజనములుగూడ, త్రాగుబోతుల శరీరాత్మలను నాశనమొనర్చి, పంసుకంటి సంసారములను పాడొనర్చు నీదురభ్యాసమును మాన్పుటకు బ్రయత్నింపవలయునని కాంగ్రెసువారు హెచ్చరించు చున్నారు.

## ౮

## విదేశవస్త్ర బహిష్కరణము

కడచిన పదియేండ్లనుండియును సంఘములోని పల్లెటూళ్లలో గావించిన ప్రచారము వలన, వ్యవసాయకులకు విశ్రాంతి సమయములకు దగిన సహాయ పరిశ్రమ లేదియును లేకపోవుటచేత నానాటికి దారిద్ర్యము మితిమీరి పోవుచున్నదనియు, రాట్నములుమాత్రమే యీ దారిద్ర్యమును బాపగలవనియు దెలిసినదై.

ప్రజలు రాట్నమును, దానితో కద్దరు వస్త్రములను బరిగ్రహించి, విదేశవస్త్రములను గాని లేక స్వదేశపు మిల్లు నద్దలనగాని కొనుచున్నారు. అందుచేత పనిలేక పోవు నష్టమును, ధన నష్టమునుగూడ నుభయత్ర సంభవించు చున్నవి.

ఈ నష్టము, విదేశి వస్త్రములను, విదేశి నూలును బహిష్కరించి, కద్దరును జేపట్టి, యావశ్యకమగు స్వదేశిమిల్లుబట్టలను గొనుటవలననే తీరగలదు.

కావున భారతీయులు విదేశవస్త్రములను గొన మానవలయు ననియు విదేశిబట్ట, విదేశినూలు వర్తకులు దేశములో లక్షలకొలది బీదజనుల కనువుపడి ఱోట్టు కొట్టుచున్న యీ వర్తకమును మానివేయ వలయుననియు కాంగ్రెసువారు హెచ్చరించు చున్నారు.

కాంగ్రెసు సంస్థలవారును, తదితర సహాయ సంస్థలవారును, కద్దరు ప్రచారము ద్వారా, విదేశవస్త్ర బహిష్కరణము తీవ్రముగా జేయింపవలయు నని కాంగ్రెసువారు హెచ్చరించు చున్నారు.

సంస్థానాధిపతులు గూడ నీ నిర్మాణక్రమమున దోడ్పడి, విదేశవస్త్రములను, విదేశి నూలును తమ రాజ్యములలోనికి బ్రవేశింపకుండ జేయవలయు నని కాంగ్రెసువారు ప్రార్థించు చున్నారు.

స్వదేశి మిల్లులవారు దేశముయొక్క యార్థికాభ్యుదయ నిర్మాణ కారకమైన యీ యుద్యమమునకు విధముగ దోడ్పడుచుండ వలయునని కాంగ్రెసువారు కోరుచున్నారు. (1) వారు స్వయముగా కద్దరును ధరించి దేశీయ పరిశ్రమకు సహాయకరమైన యీ కద్దరు ఉద్యమము నభిమానింపవల యును. (2) కద్దరుతో పోటిపడవలసిన వస్త్రములను నిర్మించుట మాని, అఖిల భారత చరఖా సంఘమువారికి దోడ్పడుచుండ వలయును. (3) తమ మిల్లు బట్టలను సాధ్యమైనంత తక్కువ ధరల కమ్ముచుండ వలయును. (4) వారు మిల్లులలో విదేశి నూలును, పట్టును, రేయను పట్టును వాడకుండ వలయును. (5) దేశములోని విదేశవస్త్ర వ్యాపారులయొద్ద నున్న విదేశి గుడ్డ నంతయు దీసికొని, దానికి బదులుగా తమ మిల్లువస్త్రములనిచ్చి తద్ద్వారమున దేశములో స్వదేశవస్త్ర వ్యాపారమును ప్రోత్సహించి, యట్లు గైకొనిన విదేశిబట్టల సరకును విదేశముల కెగుమతి చేయవలయును. (6) కాంగ్రెసు కేవలము బీదజనుల యభ్యుదయమునకై ప్రయత్నించునది యగుటచే మిల్లు యజమానులు మిల్లు పనివాండ్ర సంపదభివృద్ధికై సహాయము చేయుచు, తమ వేతనములలో వారితో భాగస్వాముల మనుమాట స్మరించుచుండ వలయును.

ఇక విదేశవర్తకు లెల్లరును కాంగ్రెసువారి విదేశ వస్త్ర బహిష్కారోద్యమము యొక్క యావశ్యకమును, న్యాయ్యమును గుర్తెరిగి, భారతదేశములో విదేశవస్త్ర వ్యాపారమును మాని భారతప్రజల యార్థిక సంపత్తి చెడకుండ నిలిపి, యిక ముందీ వ్యాపారమును తమ స్వార్థమును బట్టి చేయుటమాని యితర దేశముల యావసరానవసరములను బట్టి చేయుచుండినచో నంతర్జాతీయ మైత్రిని సంస్థాపించి, వాణిజ్య ధర్మమునకు దోడ్పడినవా రగుదురని కాంగ్రెసువారు హెచ్చరించు చున్నారు.

## ౯

## సరిహద్దు రాష్ట్రములు

కాంగ్రెసువారికి సరిహద్దు రాష్ట్రములపై నే మాత్రము నభిమానము లేదని ప్రచారము సాగుచుండి నట్లు తెలియవచ్చుచున్నది కావున, నీ యవమానమును బాపుటకై, భారత దేశమునకు నిర్ణయింపబడ నున్న రాజ్యాంగమునందు పశ్చిమోత్తరపు సరిహద్దురాష్ట్రమునకు దక్కిన రాష్ట్రములతో పాటు సమాన రాజకీయ ప్రతిపత్తి నొసగక పోయినయెడల కాంగ్రెసు వారికి సంతృప్తి యుండదని ప్రకటించుచున్నారు.

## ౧౦

## ఆఫ్రికా భారతీయులు.

దక్షిణాఫ్రికా, తూర్పు ఆఫ్రికాలలోని భారతీయుల వ్యవహారములో నావేశములందు జరుగుచున్న సందర్భములయెడ కాంగ్రెసు వారు మహోత్సుకత చెందుచున్నారు. దక్షిణాఫ్రికాలో నిదివర కొసంగిన వాగ్దానములకు భంగముగ జేయబడుచున్న శాసనములు సహజములైన హక్కులనుగూడ దొలగించుచున్నవి. కాని భారతదేశ మింకను పారతంత్ర్య శృంఖలల యందు చిక్కుకొని యుండుటచే, కాంగ్రెసువారు, తమ నిస్సహాయతను దలచుకొని సానుభూతిని జూపుటకు మించిన యెట్టి సహాయము నాచరింప జాలమని ప్రకటించుచున్నారు.

అయినను భారతీయులువలస పోయిన యా యా ప్రభుత్వములవారు స్వతంత్ర భారతదేశములో తమ దేశీయులు వసించు చుండినచో నెట్టి యాదరము బడయ వలయునని కోరుదురో యట్టి యాదరమునే యిప్పుడు భారతదేశీయులకు గూడ జూపవలయునని కాంగ్రెసు వారు కోరుచున్నారు.

## ౧౧

## మత కలహములు

కాశీ, మిర్జపూరు, ఆగ్రా, కాన్పూరు మున్నగు పట్టణములలో జరిగిన మత కలహములు, కొట్లాటలు భారత జాతీయోద్యమమున కరిష్టదాయకములని ప్రకటించుచు, నిట్టి కొట్లాటలకు కారకులైన వారును, కొట్లాటలకయి యసత్య వార్తలను ప్రకటించిన వారును గావించెడు నిట్టి చర్యలు పూర్ణముగ ధిక్కరణీయములని కాంగ్రెసువారు తెలియజేయుచున్నారు.

ఈ కొట్లాటలలో నెందరియాస్తియో నష్టమైనది. ఎందరో మృతినొందిరి. తుదకు స్త్రీలును, పసిపిల్లలును గూడ మృతినొందిరి. ఈ దురంతములకు కాంగ్రెసువారు దుఃఖము నొందుచు, మృతులైనవారి కుటుంబములకును, నిట్టి బన్నములు పడి జీవించియున్నవారికిని దమ సానుభూతిని దెలియపరచుచున్నారు.

## ౧౨

## బర్మా విభజనము

బర్మాదేశీయులు భారతదేశమునుండి విడిపోవుటకు, లేక స్వతంత్ర భారతదేశములో, స్వతంత్ర రాష్ట్రముగ నుండి యిష్టమువచ్చినప్పుడు విడిపోవుటకు సర్వవిధములైన హక్కును గలదు.

కాని బ్రిటిషు గవర్నమెంటువారు బర్మాదేశీయుల యభిప్రాయములను పూర్ణముగ స్వీకరించుట కవకాశ మొసగకుండ బర్మా ప్రజా ప్రతినిధుల యభిమతమునకు విరుద్ధముగను, నిర్బంధముగ నా రాష్ట్రమును భారతదేశమునుండి విభజించుటకు గావించుచున్న ప్రయత్నముల నీ సభవారు ఖండించుచున్నారు. ఈ ప్రయత్నము, బర్మాలో బ్రిటిషు అధికారమును శాశ్వత మొనర్చుటకు నచ్చటి నూనెబావులకొరకును, సైన్య కేంద్రముగ నేర్పరచుటకు బర్మాను సింగపూరును నేకముచేసి ప్రాచ్య ఖండములలో బ్రిటిషు సామ్రాజ్యమునకు బెట్టని కోటగా జేయుటకును ప్రయత్నించుచున్నారని కాంగ్రెసువా రభిప్రాయపడుచున్నారు.

బర్మాను బ్రిటిషుడి పెండెన్సీగా జేసి, యా రాష్ట్ర సంపదనెల్ల బ్రిటిషుసామ్రాజ్యప్రాబల్యమునకు వినియోగించి, ప్రాచ్యదేశముల కపాయమును దేగల భయస్థానముగ జేయుట దగదని కాంగ్రెసువారు హెచ్చరించుచున్నారు.

బర్మాగవర్నమెంటువారికీయబడిన అదనపు అధికారములను, వారు బర్మాలోని ప్రధానసంఘములనెల్ల నక్రమసంస్థలుగా పరిగణించిన యాజ్ఞలను నుపసంహరింపజేసి, శాంతపరిస్థితుల నేర్పరచి బర్మాయొక్క భావిస్థితినిగూర్చి బర్మాదేశీయులు శాంతముగను నిరభ్యంతరముగను చర్చించుటకును, బర్మాప్రజల యభిమతమే నెగ్గుటకును నవకాశము కలుగచేయవలయునని కాంగ్రెసువారు కోరుచున్నారు.

## ౧౩
## ఆఫ్రిడీల రాజ్యము

భారతదేశపు సరిహద్దులందున్న దేశములతో భారతీయుల కెట్టి విరోధమును లేదనియు, వారితో స్నేహసద్భావములతో నుండుటయే సమ్మతమునియు కాంగ్రెసువారు ప్రకటించుచున్నారు.

గవర్నమెంటువారు సరిహద్దురాష్ట్రములలో నవలంబించుచున్న ఉత్సాహపద్ధతిని, సరిహద్దుల నున్నవారి స్వాతంత్ర్యమును, నపహరించుటకు జేయుచున్న సర్వ ప్రయత్నములను నీసభవారు ఖండించుచున్నారు.

ఈ యుత్సాహపద్ధతిని ప్రబలీకరించుటకై భారతదేశసైన్యమును ధనమును నుపయోగింపకూడదనియు, సరిహద్దులనున్న ఆఫ్రిడీలు మున్నగువారి రాజ్యమునుండి సైన్యములను తొలగింపవలె ననియు కాంగ్రెసువారు హెచ్చరించుచున్నారు.

## ౧౪
## స్వరాజ్య నిర్వచనము

కాంగ్రెసువారి భావములో స్వరాజ్య స్వరూపమెట్టిదో సామాన్యజనులకు సరిగా తెలియుటకుగాను, వారికి సులభముగా నర్థమగునట్లని కాంగ్రెసువారి యాశయమును ప్రకటించుట యావసరము.

కావున కాంగ్రెసువారితరఫున నంగీకరింపబడు రాజ్యాంగవిధానములో స్వరాజ్యప్రభుత్వమువారికి క్రిందివిధమున దేశీయుల ప్రధానహక్కులను ప్రకటించుట కధికార ముండవలయును. (ఎ) సమావేశసుమ స్వాతంత్ర్యము. (బి) వాగ్రచనా స్వాతంత్ర్యము. (సి) అంతరంగ స్వాతంత్ర్యము. మతాచరణస్వేచ్ఛ. కాని యిది సక్రమ ప్రజాజీవనమునకు, నీతికి భంగకరమై యుండగూడదు. (డి) మైనారిటీల సభ్యత, భాష, లిపుల సంరక్షణము. (ఇ) స్త్రీ పురుష భేదములేక పౌరు లెల్లరికి సమానములైన స్వత్వములు, ధర్మములు నుండుట. (యఫ్) ఉద్యోగ, బిరుద, అధికారములయందుగాని, వృత్తి, వాణిజ్యములందుగాని, కుల, జాతి మతము లెట్టి లోపమును సమకూర్చ కుండుట. (జి) పబ్లికు-బావులు, రోడ్లు, సర్వప్రజలకు జెందిన తక్కిన యన్నిసంస్థలను వాడుకొనుటకు సర్వపౌరులకు సమానమైన హక్కు. (హెచ్) సర్వజనులకు నాయుధధారణ స్వాతంత్ర్యము. ఈ విషయములో కొన్ని నిషేధము లుండవచ్చును.

(౧) న్యాయమునకును విరుద్ధముగ నెవ్వరి స్వాతంత్ర్యమునకు భంగము గలుగ జేయగూడదు. ఎవ్వరి యింటను, బ్రవేశింప గూడదు, ఎవ్వరి యాస్తిని స్వాధీనము చేసికొన గూడదు.

(౨) గవర్నమెంటు వారు మతముల విషయములలో తటస్థభావము వహింప వలయును.

(౩) పరిశ్రమల పనివాండ్రకు జీవనమునకు తగిన భృతి; పనిచేయు కాలనిర్ణయమును, ఆరోగ్యము చెడని రీతి పని; వార్ధక్యము, వ్యాధి, నిరుద్యోగము సంభవించినప్పుడు తగిన యాదరువు మొదలగుట.

(౪) పనివాండ్రను బానిసతనమును తత్సంబంధమైన పరిస్థితులను తొలగించుట.

(౫) ఆడుకూలీలకు సరియైన రక్షణము; ప్రసవ సమయములలో ప్రత్యేక సదుపాయములు.

(౬) చదువుకొనదగిన యీడులోనున్న బాలురను ఫ్యాక్టరీలలో నియమింప కుండచేయుట.

(౭) లేబరు సంఘముల నేర్పరచుకొను స్వాతంత్ర్యము; లేబరు తగాదాలను దీర్చుకొనుటకు దగిన మధ్యవర్తి సంఘముల యేర్పాటు.

వెలువడినది!        త్వరపడుడు!!        వెలువడినది!!!

# ప్రజోత్పత్తి సంవత్సరాది సంచిక

## వెనుకటిసంచికలకంటె నెల్లవిధముల నుత్కృష్టమైనది

## సర్వాంగసుందరమై క్రొత్తతీరున నున్నది

ఆంధ్రమహాజను లనుగ్రహించిన వ్యాసరాజములతో ఒప్పియున్నది. విషయవిభజనము గావింపబడినది. దళసరి గ్లేజు కాగితములపై ముద్దులొలుకునట్లు ముద్రింపబడినది. మూడురంగుల చిత్రములు అయున్నవి. ఆంధ్ర సత్యాగ్రహుల చిత్రములు, ఇతరాంధ్ర దేశ సంఘములయు, మహాజనులయు చిత్రములును వెలయుచున్నవి. రౌండు టేబిల్ మహాసభకు పోయిన భారత దేశపు ప్రతినిధుల చిత్రములు నున్నవి.

ఇందలి వ్యాసములు తెల్లకిరణములు నాంధ్రుల విజ్ఞానాభివృద్ధికి దోహదపడగలవు. ఆంధ్రమహాశయులు తెల్లుగ నీ సంచికను స్వీకరించి గొనినంత ప్రయోజనమును బడయ దగుదురు.

ఆంధ్రపత్రిక దినపత్రికకు సంవత్సర చందాదారులకు రు. 1-0-0 కు, వారపత్రిక చందాదారులకు రు. 1 0-0 కు, ఇతరులకు రు 2-0-0 లకు నీసంచిక లభింపగలదు. కొలదిప్రతులుమాత్రమే ముద్రితములైనవి. కావలసినవారు త్వరగా మాకు వ్రాసి తెప్పించుకొనవలయును. తపాలు ఖర్చు ప్రత్యేకము

## మేనేజరు, ఆంధ్రపత్రికా కార్యాలయము

7, తంబుశెట్టివీధి, మద్రాసు.

ఈ రెండును నసాధ్యములు గావు. లోకమాన్య తిలకుగా రవలంబించిన సిద్ధాంతమునకు గాంధి మహాత్ముడు విశేషవ్యాపకమును గలుగజేసి స్వరాజ్య ప్రచారమును స్వరాజ్యసంపాదన సాధ్యము చేయగలిగెను. లోకమాన్య తిలకు మహాశయుడు నిరంతరము దేశసేవాపరాయణుడై నిర్బంధములు స్వీకరించిన విధానమునె గాంధిమహాత్ముడు ప్రజాహృదయమునందు వ్యాపకము చేసెను. తిలకు స్వరాజ్యనిధి కోటినుందనభ్యులు, ఖద్దరు, ప్రజాహృదయమునందు స్వరాజ్యవ్యాపనమునకు నిదర్శనములైనవి.

*       *       *

సహాయనిరాకరణోద్యమము

ప్రపంచమునందు స్వాతంత్ర్యమునకై పరితపించెడివారలకును స్వాతంత్ర్యమును నిరోధించెడివారలకును సహకారసాహచర్యము లసంభవములు. ప్రజాహృదయమునందు భయభ్రాంతులను వ్యామోహమును గలుగజేసెడి అధికారమునకు నిరాకరణ నిరసనములు స్వరాజ్య సంకల్పమునకు బీజములుగ నున్నవి. అధికారదుర్గములైన శాసనసభలను, న్యాయస్థానములను, విద్యాలయములను బహిష్కరించుట, యధికార వ్యామోహమును శిథిలము చేయుటకు సాధనముగ నిర్ణయింపబడినది. ఆ సమయమును సఫలము చేయుటకు వందల కొలది న్యాయవాదులు, విద్యార్థులు స్వీయ వృత్తులను విసర్జించి అధికార వ్యామోహమును శిథిలము చేసిరి. దేశబంధు చిత్తరంజన దాసు, పండిత మోతీలాలు నెహ్రూ, బాబు రాజేంద్రప్రసాదు, నారాయణరాజు, కాశేశ్వర రావు, సీతారామశాస్త్రి, రాజగోపాలాచార్యులుగారులు మొదలగు న్యాయవాదులనేకులు చూపినమహాత్యాగ మధికార వ్యామోహమును శిథిలము చేయుటకు వినియోగపడినది. దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగా రాంధ్రోద్యమ ప్రారంభమునందే న్యాయవాదివృత్తిని విసర్జించి దేశారాధకులకు మార్గదర్శకులైరి. సుప్రసిద్ధులైన దేశబంధు దాసు, మోతీలాలు నెహ్రూగారులు సహాయ నిరాకరణోద్యమమునకు ప్రాబల్యమును గడించి గాంధి మహాత్ముని విశ్వాసమునకు పాత్రులైరి. సహాయ నిరాకరణోద్యమమునందు గాంధిమహాత్ముని నామముతో దాసు నెహ్రూగారల నామములు విరాజిల్లినను నిరాకరణ ధర్మమునందు స్థిరప్రతిష్ఠను బడయజాలవు.

దాసునెహ్రూగార్లు స్వరాజ్యపక్షమును గల్పించి శాసనసభాప్రవేశమును జేసి సహాయనిరాకరణ శిబిరమునందు విభజనమును గలుగజేసి అధికారవ్యామోహమును పునరుద్ధరణ చేసిరి. దాసుగారి నిర్యాణము శాసనసభల యనుభవము సహాయనిరాకరణోద్యమమును పునరుద్ధరించినవి. మోతీలాలుగారి నిర్యాణము సహాయనిరాకరణోద్యమమునకు నవీనలక్ష్యమును ప్రతిపాదించినది. తండ్రికొడుకుల గౌరవస్థానములు జవాహరిలాలునెహ్రూగారికి సంక్రమించినవి. గాంధిమహాత్మునకు మోతీలాలు, జవహరిలాలు నెహ్రూగారల మీదను గలవిశ్వాసము జవా

హరిలాలుగారి మీదను లగ్నమైనది. గాంధి మహాత్మునకు స్వరాజ్యాదర్శముపట్లగల సందియము లన్నియును విచ్ఛిన్నములైనవి. స్వరాజ్యము పూర్ణస్వరాజ్యముగను లాహోరునందు బరిణమించినది. పూర్ణస్వరాజ్యము సాంఘిక ప్రజాస్వామిక స్వరాజ్యభావమును కరాచి యందువహించినది. గన్యస్థాన మెవ్వు డేరీతిని భారతీయులు చేరునదియును భగవదధీనమునందు గలదు.

*          *          *

కరాచికాంగ్రెసు

కరాచి కాంగ్రెసునకు గాంధి కాంగ్రెసు అని నామకరణమును జేయుట సముచితముగ నున్నది కాంగ్రెసు వ్యవహారములందు నాగపురమునందు ప్రారంభమైన గాంధిమహాత్ముని ప్రతిభ కరాచియందుచ్చదశ నధిష్ఠించినది. కరాచినగరము, హరిశ్చంద్రరాయ నగరము, కాంగ్రెసు శిబిరములు, స్వచ్ఛంద సేవక సేవికల శిబిరములు, కాంగ్రెసుమంటపము, విషయనిర్ధారణసభామంటపము, కార్యనిర్వాహక సంఘ మంటపము, సభాధిపతి మంటపము, సకలమును గాంధివిజయఘోషముతో నిండి పోయినవి. ప్రజలకేర్పాటుచేసిన మహాసభకు 60,000, విషయనిర్ధారణసభకు 3,000 మంది యును హాజరైరి టిక్కట్లమూలమునను రూ 50,000 లు వసూళ్లయినవి కాంగ్రెసుమహాసభయందు ప్రతినిధులమూలమునను రూ. 22,000, ప్రేక్షకుల మూలమునను రూ. 80,000 మొత్తము షుమారు లక్షరూప్యములు వసూళ్లయినవి. గాంధిసమాజప్రార్థనలకు ప్రొద్దున సాయంత్రమునను వేలకొలది హాజరయి గాంధిజీని సందర్శించి ఆనందించుచుండిరి. హరిశ్చంద్రరాయ నగరమంతయును గాంధిమయమై వెలసినది. కరాచికాంగ్రెసు యథార్థముగను గాంధి కాంగ్రెసుగను పరిణమించినది. నవజీవన భారతీయులు కాంగ్రెసు వ్యవహారములం దభ్యంతరములను గలుగ జేయుటకు సంకల్పించియును విరమించుట సముచితముగ నున్నది.

*          *          *

గాంధి విజయము

కరాచి కాంగ్రెసువ్యవహారములు గాంధి విజయమును హృద్యముగను వ్యక్తము చేయుచున్నవి. గాంధివిజయము ధర్మవిజయము; సత్యవిజయము; అహింసావిజయము; ఆత్మవిజయము. రక్తాంబరధారు లు చూపినధిక్కారతిరస్కారభావములను కేవలము మందహాస నిగ్రహములతో గాంధిమహాత్ముడు పరాభవించి ఆత్మబలమును వ్యక్తముచేసెను. నవయువజన నాయకుడు శ్రీయుత సుభాసుచంద్రబోసు గారు గాంధిఇర్విను ఒడంబడికకు ప్రతిఘటనము విరమించి గాంధి విజయమునకు దోడ్పడుట మిత్రులకును, శత్రువులకును విస్మయమును గలుగజేసినది. వీర భగతుసింగు వధవలనను, నిరంకుశవర్గము గలుగజేయ దలచిన విభేదన తంత్రము విఫలమైనది. యువజన హృదయమునందును, ప్రజాహృదయమునందును కోపోద్రేకమునకు గారణంబులున్నను

...ము చేయుచున్నది. గణేశశంకర విద్యార్థి గారి ప్రాణత్యాగము రాగద్వేష పరముగాకను, ప్రేమమయమై సర్వజనామోదమును బడయుచున్నది. గణేశశంకర విద్యార్థిగారు ఆపన్నులను రక్షించుటకై అభయము నొసంగుచు ప్రాణములను సమర్పించి అమరత్వమును బడయ గలిగిరి. కరాచి కాంగ్రెసు గణేశశంకరవిద్యార్థిగారి త్యాగమును ప్రశంసించుచు జాతిమత ద్వేషములను నివారించుటకై జనులందరును వారిమార్గము నవలంబించవలయునని తీర్మానించినది. ఈరెండు తీర్మానములందును గల ధర్మసూక్ష్మమును గ్రహింపగల యధికారము గాంధిమహాత్మునకు మాత్రము గలదు. పురుషార్థసిద్ధికి ఆత్మత్యాగమునకు గల ప్రతిభ పరపీడనమునకు లేదని తీర్మానములు విశదము చేయుచున్నవి; అహింసాధర్మవిజయమును ప్రతిపాదించుచున్నవి. కరాచికాంగ్రెసు ప్రతిపాదించిన ధర్మవిజయము ప్రజోత్పత్తి సంవత్సరమందు సత్యాగ్రహుల కాదరణీయమై గాంధిమహాత్ముడు పూనగల స్వరాజ్యప్రస్థానమునకు సాధకీభూతమగు గాత! సత్యాగ్రహులు [illegible] సాధనమైన కనుహూపమైన ఫలమును [illegible] ధర్మము. స్వరాజ్య యోధు[illegible] ముఖ్యమునను నవయువజనులు ఈ పరమ [illegible] గ్రహించుట దేశకళ్యాణమునకును [illegible] ప్రయోజనకరము.

* * *

[illegible]రాజ్యము-యువజన[illegible]

[illegible]స్వరాజ్య సంపాదనమునందు [illegible] వేశమును జూపుట సహజము. యువజనోద్రేకమునకు కారణము నిరంకుశప్రభుత్వమువల్ల జనులకుగలిగిన నిరాశయని విశదమగుచున్నది. ప్రపంచమంతయు నవజీవనముతో సంచలించుచున్నపుడు మహాచైతన్యము గల భరత ఖండము జీవరహితమై యుండజాలదు. గాంధిమహాత్మునకు రక్తాంబరధారు లొసంగిన స్వాగతము రోషావేశపూరితమైనను భారత యువకునకు సహజమైన నిగ్రహమును విశదము చేయుచున్నది. నవజీవనసభయందు పూజ్యులైన పండిత మదనమోహన మాళవ్యగారికి యువజనులు చూపిన యవజ్ఞ భగతసింగు గారి ఉరివలనను గలిగినను నసహ్యముగ నున్నది. మాళవ్యగారి నాహ్వానించిన సుభాసు చంద్రబోసు గారును నివారింపజాలక పోవుట యువజనాగ్రహమునకు నిదర్శనమై భావి శుభస్థితికి ప్రతిబంధకమగుచున్నది. కరాచి మున్సిపాలిటిఅధ్యక్షుడు జేమ్సెడ్ మెహతా గారు యువజనోద్రేకము విషయమై 'పార్శిసంసారము' నందు వ్రాసిన విషయము గాంధిమహాత్ముని నాకర్షించినది. గతవారపు యంగుఇండియా పత్రికయందు మెహతాగారి హితబోధల విషయమై గాంధిమహాత్ముడు వ్రాసిన యభిప్రాయములు ధర్మాత్ముల లక్ష్యము నాకర్షింపదగి యున్నవి. సర్వత్ర నేటికిమాటికి సత్యాగ్రహ ప్రమాణములు చెలరేగుచున్నవి. ద్వేష గీతములు దిగంతములందును వ్యాపకమును గాంచుచున్నవి. బలవంతము నిర్బంధము పరిపాటి యగుచున్నవి. వర్తకులు, ఉద్యోగస్థులు, ప్రతి